ఓం

# కూచిపూడి
# కళాసాగరము
## (నృత్యశాస్త్రము)



అంకితము

శ్రీ రాజరాజేశ్వరిదేవి పాదపద్మములకు

ప్రాప్తిస్థానము :

**శ్రీరాజరాజేశ్వరి కూచిపూడి నృత్య కళాశాల**

D. No. 12-5-2, ఆర్యాపురం

**రాజమండ్రి-4**

ప్రథమ ముద్రణ :
ప్రజోత్పత్తినామ సంవత్సర
సంక్రాంతి

మూల్యము :
**రు. 116-00**

ప్రతులకు :
శ్రీరాజరాజేశ్వరి కూచిపూడి నృత్య కళాశాల
కొండేపూడివారి వీధి
D. No. 12-5-2, ఆర్యాపురం
రాజమండ్రి-4

ముద్రణ :
శ్రీ కొండపల్లి బుక్ హౌస్
మెయిన్‌రోడ్
రాజమండ్రి-1

ఓం

శ్రీ పరదేవతాయైనమః

## రచయిత



రచయిత

నాట్యాచార్య, నాట్యశాస్త్రధురీణ, నాట్యరత్న,

నాట్యకళావిశారద, నాట్యకళా పితామహ,

పండిత

# వేదాంతం చిదంబరదీక్షితులు

కూచిపూడి.

ఓం

రచయిత తండ్రిగారు



శ్రీ॥ వే॥ హేమాద్రి వెంకటేశ్వర్లుగారు

కూచిపూడి

ఓం
శ్రీ రాజరాజేశ్వర్యై నమః

# ఆశీస్సులు

ఈ కూచిపూడి కళాసాగరము రచయితయైన దీక్షితులు తండ్రి వెంకటేశ్వర్లుగారు, 1891 సం॥రం॥లో జన్మించారు. బాల్యము నుంచి కూచిపూడి యక్షగానకీర్తులను, వీరియొక్క మామగారైన, వేదాంతం సాంబయ్య గారివద్ద కూలంకషముగా అభ్యసించిరి. బాల్యమునందే ప్రహ్లాద, లోహితాస్య, కుశలవులు, ఇత్యాది వేషములు ధరించియుండిరి.

యవ్వన ప్రాదుర్భావముతో, భామ, గొల్ల, దాదిన, కలాపములుయైన స్త్రీ పాత్రలను, కృష్ణ, సుంకరకొండ, కర్ణకరుడు, ఇత్యాది పురుష వేషములు ధరించి నాటి పండిత పామరులచే అనేక మన్ననలు పతకములు పొంది, యుండిరి. ఇవిగాక ప్రధానపాత్రలు, హరిశ్చంద్రుడు, లక్ష్మణుడు, అనిరుద్ధుడు, అభిమన్యుడు, ఇత్యాది వేషధారణలు సల్పి, సమర్థవంతముగా నిర్వహించి ఆనాటి ప్రేక్షక. పండిత పామరులను మెప్పించి, 1941 సం॥రం॥లో వీరు స్వర్గస్థులైరి. వీరికి ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. ఈ గ్రంథ రచయితయైన, హేమాద్రి చిదంబరదీక్షితులు తృతీయ కుమారులు, 1931 సం॥రంలో జన్మించిరి. వీరికి 10, 11 సం॥రంలో, తండ్రిగారు గతించారు అప్పటినుంచి, అన్నగారైన, శివరామకృష్ణశర్మగారే పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించి, వివాహముచేసి, వారు నటించే వేదాంతంవారి మేళములో ప్రదర్శన లిప్పించి, 1952 సం॥రం॥లో, గుడివాడలో నాట్యోపాధ్యాయునిగా నిలబెట్టిరి.

నాటినుండి నేటివరకును శతాధికములుగా, శిష్య ప్రశిష్యులను తయారుచేసి, అనేకచోట్ల వారి శిష్య బృందములచే నాట్య ప్రదర్శ

నలు ఇప్పించి యుండెను. అఖిలభారత నృత్య పోటీలు (హైదరాబాద్)లో, 1964 నుండి 1987 వరకు, పాల్గొని, సబ్ జూనియర్, సీనియర్ శ్రేణులలో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు పొంది, పండిత పామరులచేత మన్ననల పొందియుండెను. వీరు 1964 సం॥ నుండి, నర్సాపురము, తాడేపల్లిగూడెము, కొవ్వూరు, ఇత్యాది పట్టణములలో పిల్లలకు నాట్యవిద్య నేర్పించి, కళలకు కాణాచియైన రాజమహేంద్రవరములో చేరి, శ్రీ దుర్గా కూచిపూడి నాట్య కళాశాల, శ్రీ వరలక్ష్మి కూచిపూడి నాట్య కళాశాల, శ్రీ లలితా కూచిపూడి నాట్య కళాశాల, శ్రీ రాజరాజేశ్వరి కూచిపూడి నృత్య కళాశాల నాట్య భారతి మున్నగునవి నిర్మించి, శతాధిక విద్యార్థి-విద్యార్థినులను తయారుచేసి, నాట్య రంగమునకు ఎనలేని కీర్తిని తెచ్చుచు, పండిత-పామరులచే మెప్పులను పొందుచు, రాష్ట్ర, రాష్ట్రేతరములలోను, పర్యటించియుండిరి. వీరు రాజమహేంద్రవరములో స్థిరపడియుండిరి. వీరికి శ్రీ రాజరాజేశ్వరిదేవి. ఆయురారోగ్య ఐశ్వర్యములు ఇచ్చి సదా కాపాడమని కోరుచున్నాను.

ఇట్లు ఆశీర్వాదములతో

కూచిపూడి | నీ అన్నయ్య

12-10-83 | హేమాద్రి శివరామకృష్ణశర్మ.



# కూచిపూడి

# కళాసాగరము

## (నాట్యశాస్త్రము)



నాట్యబాల

చిరంజీవి **విస్సాప్రగడ ఉష.** (అయ్యప్పస్వామి మహాత్యం)

శ్రీ విశ్వేశ్వరరావు - శ్రీమతి సీత దంపతుల పుత్రిక

రాజమండ్రి.

శ్లో॥ నతత్ జ్ఞానం నతచ్ఛిల్పం । నసావిద్యా నసాకళా,
నాస్తేయోగే నతత్కర్మ । నాట్యేస్మిన్ యన్నదృశ్యతే॥

తా :- నాట్యములో జ్ఞానం, శిల్పం, విద్య, కళ, యోగం' కర్మ, మొదలైన సప్తవిధములుగా కలిగియున్నది. అందువల్ల నాట్యం' సంపూర్ణం, సమగ్రమము, సమాహార కళయని యర్థము.



శ్లో॥ పుంఖానుపుంఖ విషయేక్షణతత్పరోపి
బ్రహ్మావలోకనధియంన జహాతియోగి
సంగీత తాళలయవాద్య వశంగతాపి
మౌళిస్థకుంభ పరిరక్షణ ధీర్నటీవ॥

గమనిక :- నర్తకునకు, యోగికి, సామ్యం చెప్పబడినది.

# నా మాట

"కంఠేనాలంబయేద్గీతం, హస్తేనార్థం ప్రదర్శయేత్
చక్షుభ్యాం దర్శయేద్భావం, పాదాభ్యాం తాళమాచరేత్.

తా :- నోటితో పాట పాడుచు, హస్తములతో గీతార్థముల చూపుచు
పాదములతో తాళము చూపు నాట్యము. ఇది కూచిపూడి
నృత్యసంప్రదాయమైనది.

కూచిపూడి నాట్యము దాక్షిణాత్య నాట్యములలోకెల్ల ప్రాచీన మైనది, సమగ్రమైనది, సర్వరస భరితమైనది. సంప్రదాయబద్ధమైన కూచిపూడి నాట్యము భారతదేశ మందేగాక ప్రపంచమంతయు వ్యాప్తి చెందియున్నది. చెందుచున్నది.

ఈ నాట్య సంప్రదాయం, నృత్త, నృత్య, నాట్య. సమ్మేళనమై, భావ, రాగ, తాళ, బద్ధమై అంగిక, వాచిక, సాత్విక, ఆహార్య, చతుర్విధాభినయములు, సశాస్త్రీయముగా నిందు గాన్పించును. ఈ కూచిపూడి నాట్యములో, వాచికాభినయము ప్రత్యేకత. (నటులు పాడుచు నాట్యము చేయుట) ఇది ఏ ఇతర నాట్య సంప్రదాయముల యందును లేదు.

ఇంక అంగాభినయనములో, హస్త, పాద, దృష్టి, గ్రీవ, శిరో, కటి, భ్రూ, భేదములు చూపుచు, ప్రదర్శింతురు, ప్రతి పాటకును, 'జతులు' జెప్పించి చతురస్ర, మిశ్ర, తిశ్ర, ఖండ, సంకీర్ణజాతులలో పలువిధములైన అడవులు (అడుగులు) ప్రదర్శింతురు. ఇదిగాక, కొన్ని గోలు (అనగా నోటితో జతి నుచ్చరించుట.) వేయుచు ఆడుట కూచిపూడి నృత్యనముకు ఒక ప్రత్యేకత. వాచికాభినయముతో బాలు

సాత్వికాభినయము కూడా ఇందు చేరియుండుటచే, కూచిపూడి నాట్యము చతుర్విధాభినయములు కలిగిన, సమగ్రనాట్య స్వరూప ముగా చెప్పబడినది.

యక్షగానములు, కలాపములు కూడా కూచిపూడివారి ప్రదర్శన లలో చాలా కలవు. భక్తప్రహ్లాద, ఉషాపరిణయము, మోహిని రుక్మాంగద, మోహినిభస్మాసుర, భక్తమార్కండేయ, మహిషాసుర మర్దని, ఇత్యాది యక్షగానములు, గిరిజా కల్యాణము, అర్ధనారీశ్వర, విప్రనారాయణ, కృష్ణలీలలు, అయ్యప్ప జననం, కందుకూరి వీరేశ లింగంగారి చరిత్ర, ఇత్యాది నృత్య నాటికలు భామ, గొల్ల, దాదిన, బాలింత, రాధ, ఇత్యాది కలాపములు ఎన్నో గలవు.

ఈ కూచిపూడి సాంప్రదాయానుబద్ధమైన నృత్యమును, ఈనాడు ప్రభుత్వమువారు చక్కని సిలబస్ ఏర్పాటు చేసి, 4 - 6 సం॥రముల కోర్సు నిర్ణయించి, ప్రాక్టికల్-థీరి, లలో పరీక్షలు నిర్ణయించి జరి పించుచుండిరి. ఈ నృత్యాంశములు అనేక గ్రంథములలో సేకరించి ఆ మూలాగ్రముగ సిలబస్ తయారుచేసినను విద్యార్థి - విద్యార్థినులకు అందుబాటులో గ్రంథములు లేనికారణముతో వాటన్నింటిని సేకరించి ఒక గ్రంథ రూపముచేసి కొన్ని సొంతముగ జతపరచి చక్కనిశైలిలో పండిత పామరులకు అర్థమయ్యే బాణిలో, తాళాధ్యాయము, హస్తా ధ్యాయము, ప్రశ్నలు, ప్రాథమికశిక్షణ ముప్పదిమూడు తాళజతులు, శిరో, దృష్టి, గ్రీవ తార, కటి, పక్ష, కపోల, నాసా, పార్శ్వ, ఊరు, జంఘ, అంగ, ప్రత్యంగ, ఉపాంగ, భ్రూ, పుట, దంత, మణిబంధ, పాత్ర, అపాత్ర, పాత్రదేవతాత్వ, నర్తక, నర్తకి, నట, నటి, ఆచార్య, బహిఃప్రాణ, అంతఃప్రాణ, రంగపూజ, నాట్యకర్త, నాట్యభేద, పాద భ్రమణనిషేధ, నీచనాట్య, నాట్యోత్పత్తి, ఊరూకంచుక, ద్వాదశ హస్తప్రాణ, షోడశబాహుభేద, పంచమాలాలంకరణ, నాట్యోపకరణ,

లోకధర్మి. నాట్యధర్మి, నృత్త, నృత్య, నాట్య, లాస్య, తాండవ, చతుర్విధాభినయ, పృష్టోదర, జఠర, జాను, స్వీయ, పరకీయ, నవరస, వృత్తి. ప్రవృత్తి. నాయిక, నాయక, భావ, విభావ, అనుభావ, సంచారీ, వ్యభిచారీ, చేష్ట, అలంకృతి, తటస్థ, శిద్ధి, శేష, రస, స్థాయి, సంచారీనృష్టులు, అలంకార భేదములు, అంగజవికారములు, కరణములు పిండబంధములు. అంగాహారములు, వర్ధమానక, కామము-శృంగారము, స్త్రీ శీలభేద, ఉపచారములు, ఇత్యాది అంశములు, భక్త మార్కండేయ, స్వామిఅయ్యప్ప జననము, మున్నగు యక్షగానములు కూచిపూడి నాట్యకళాకోవిదుల జీవిత చరిత్రలు, ఇత్యాది అంశములు రచించి, సేకరించి ఒకే పుస్తకములో ఉండునట్లు చేయు అభిలాషతో, ఈ చిన్ని సంపుటమును. "కూచిపూడి కళాసాగరము" అనే పేరుతో విద్యార్థినీ, విద్యార్థులకు, నాట్యాచార్యులకు. అర్థమయ్యేరీతిలో కూచిపూడి అడవలు (అడుగులు) ఆచరణయోగ్యమైనరీతిలో వ్రాసి అచ్చొత్తించితిమి. డాన్సు పరీక్షల కెళ్ళువారికి కూడా డాన్సు సిలబస్‌లో గల, తీరి, ప్రాక్టికల్ కూడా ఇందులో పొందుపరచియుంటిమి, ఈ గ్రంథము ఒకసారి ఆమూలాగ్రముగ చూచి, చదివినచో అన్నియు అర్థమగును, గవర్నమెంటు సర్టిఫికట్ కోర్సు పరీక్షకు కావలసిన సిలబస్ అంతయు చేర్చియుంటిమి, ఈ అపూర్వమైన గ్రంథము కూచిపూడి నృత్య బాణిలో, ఇప్పటివరకు సంభవము కాలేదనే చెప్పవచ్చును. కొన్ని దశాబ్దాలనాటి ఈ కూచిపూడి నృత్యము, యొక్క అంశములు, తాళ గ్రంథములలో నుండుటవల్లను, అనోటానోటనుబడి, అక్షర స్ఖలితములగుటవల్లను, సమగ్ర నాట్య స్వరూపాంశములకై, పలు ప్రయాసలకోర్చి కూచిపూడి నాట్యము సమగ్రరూపముకై, అనేక వాసితపసితులను తాళ గ్రంథములను, సంస్కృత గ్రంథములను శేకరించి, ఒక పాఠ్యగ్రంథముగా, 1961 సం॥లో సంకల్పించి, 1989 నాటికి గ్రంథస్వరూప మేర్పరిచితిమి.

నేను అడుగగానే ఈ గ్రంథము ఆమూలాగ్రముగ చదివి నాకు అభిప్రాయములు వ్రాసి యిచ్చిన, ప్రఖ్యాత కూచిపూడి నాట్యకళాకారులు, "భరత కళా ప్రపూర్ణ" "కాళిదాసు అవార్డు గ్రహీత" "పద్మశ్రీ" వేదాంతం సత్యనారాయణశర్మగారికి, అదేవిధంగా అడగగానే ప్రముఖ రచయిత, విమర్శకులు, శ్రీ రాజ్యలక్ష్మి ఉమన్స్ కళాశాల, ఇంగ్లీషు లెక్చెరర్, M. V నారాయణాచార్యుల వారికి నా అగ్రజుడు, శ్రీ హేమాద్రి శివరామకృష్ణశర్మగారికి నా హృదయపూర్వక నమస్కారములు అర్పించుకొనుచుంటిని.

కూచిపూడి నాట్యకళయందు గల అభిరుచితో నేను అడగగానే కాదనకుండా ఈ పుస్తకమునకు అయ్యే ప్రింటింగ్ ఖర్చులు అన్నియు తామే భరించి ప్రింటు చేయించినవారు, పంజాబ్ నేషనల్ బ్యాంకు మేనేజరుగారు శ్రీ కోచ్చర్లకోట వెంకటరామారావుగారు, రాజమండ్రి వారికి (పంజాబ్ నేషనల్ బ్యాంకు). శ్రీ వి. విశ్వేశ్వర రావుగారు, రాజమండ్రి వారికి, ఎన్నో ప్రయాసలకోర్చి ఒకటికి రెండు సార్లు ప్రూఫులు దిద్ది సరిచేసి అచ్చొత్తించిన, శ్రీ కొండపల్లి కుమార్ గారికి, వారి ప్రెస్ సిబ్బందికి, నా హృదయపూర్వక నాట్య సుమాంజలులు. ఈ నాట్య గ్రంథములో ఏబదిరెండు హస్త ముద్రలు పట్టి చూపించిన, చి॥ ఉష కు (విశ్వేశ్వరరావు గారుగారి పుత్రిక) నా హృదయపూర్వక దీవెనలు.

వీరందరికి, శ్రీ రాజరాజేశ్వరీదేవి ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి సదా కాపాడవలయునని ప్రార్థించుచుంటిని.

ఇట్లు విధేయుడు,

రచయిత

నాట్యశాస్త్ర ధురీణ, నాట్యకళా పితామహ, నాట్యకళా విశారద,

నాట్యరత్న, పండిత, నాట్యాచార్య,

**హేమాద్రి చిదంబర దీక్షితులు, కూచిపూడి.**

ఓం

# చరిత్రపుటల్లో

## కూచిపూడి సిద్ధేంద్రుని కాలము

తెలుగుదేశపు నృత్యకళలను, చరిత్రను, రెండు భాగములుగా విభజింపవచ్చును. మొదటి భాగము కూచిపూడి భామాకలాపమునకు పూర్వయుగము. రెండవది కూచిపూడి యుగము.

హాలునిగా సప్తశతినిబట్టి, క్రీస్తుశకమునకు, పూర్వమే ఆంధ్ర దేశములో నృత్యనాటకములు, వీణాది వాద్యములును, ప్రచార మందున్నవని స్పష్టమగుచున్నది. తెలుగు గడ్డమీద, రచింపబడిన ప్రథమ గ్రంథములలో నొకటి ఈ గాథాసప్తశతి.

క్రీ॥ పూ॥ 200 క్రీ॥ శ॥ 200 లు మధ్యకాలములో రచింప బడినదిగా చెప్పబడుచున్న నాట్యశాస్త్రమందు, ఆంధ్రుల ప్రశంస కలదు. ఆంధ్రుల "గీతప్రియత్వము" స్పష్టముకాగలదు. (చూ॥ పాణింగి వారి నాట్యశాస్త్రం, పుటలు 377, 486, 771.)

నేటి భారతీయ నృత్య సంప్రదాయములకెల్ల, ప్రమాణ గ్రంథములగు, అభినయదర్పణ, భరతార్ణవములను, రచించిన నందికేశ్వరుడు ఆంధ్రుడని విశ్వసింపబడుచున్నది. నందికేశ్వరుని నాటినుండి, 11వ శతాబ్ది వరకును, అంతగా ఆనాటి నృత్య - సంగీత - నాటక, చరిత్ర మనకు తెలియుటలేదు. సిద్ధేంద్రుడు, శాలివాహనశకం, 1102, క్రీ॥ శ॥ 1180 అనియు సిద్ధేంద్రుడు 12వ శతాబ్దివాడని కూచిపూడి నృత్యాచార్య వేదాంతం పార్వతీశమ్‌గారు, స్పష్టముగా తమ భామా కలాపపూరిత గ్రంథములో. తమవద్దనున్న, సనదునుబట్టివారు తెలుపుచుండిరి. (సనదు పరిశీలించుటవసరము.)

క్రీ॥ శ॥ 1232 కూచిపూడివారి నృత్యం ప్రియంగా, గోల్కొండ నవాబుగారు నాంచి (తానీషా?) కూచిపూడి అగ్రహారంగా ఇచ్చినట్లు సనదులు వ్రాసి ఇచ్చినట్లు శ్రీ పార్వతీశంగారు తెలుపుచున్నారు. ఆకాలంలో వున్న గోల్కొండ నవాబు తానీషా, నారాయణతీర్థులు "కన్నడ సంకీర్తనకర్త" "పురందరదాసు", "అభినవ భరతాచార్య". "స్వరమేళ కళానిధికర్త" "శ్రీరామామాత్యుడు" "రాగ విబోధ లక్షణకర్త" "శ్రీ సోమనాథ పండితుడు" ఇందుమించు, క్రీ॥ శ॥ 15వ శతాబ్ధి, ఉత్తరార్ధం. లేక 16వ శతాబ్దికి చెందినవారే - కావున సిద్ధేంద్రుడుకూడా ఆనాటివాడు కావచ్చు. (సనదు పరిశీలించవలయును). పరిశీలకులు పరిశీలింపగలరని మనవి.

## ఆంధ్రదేశమందలి శాస్త్రీయ నృత్యము.

| 1. నట్టువ మేళము. | 2. నాట్య మేళము. |
|---|---|
| దేవదాసి సంప్రదాయం | కూచిపూడివారి భామాకలాపము (ఏక పాత్ర ప్రధానం) |
| రాజనర్తకీ సంప్రదాయం | నృత్యనాటకములు (కథా ప్రధానములు) |
| ఆరాధనా నృత్యములు | భగవత్సంబంధ (రాజసంబంధి) |
| పూజానృత్యములు(స్వామి సన్నిధి) | భాగవత మేళములు |

శైవ సంబంధి, వైష్ణవ సంబంధి.

1. తెలుగువారి సంగీతనృత్య, నాటక, సంప్రదాయములు అతి ప్రాచీనములు.

2. 12వ శతాబ్దమునాటికే నృత్యము, నాటకము వేరువేరుగా అభివృద్ధి చెందినట్లు స్పష్టమగుచున్నది.

3. తక్కిన నృత్య సాంప్రదాయములు క్రీ॥ శ॥ 1575-1650 నాటి కథాకళి, క్రీ॥శ॥ 1614-1633 రఘునాథనాయకుని కాలమున, కూచిపూడివారి నాట్యము, దేవదాసి, రాజనర్తకీ సంప్రదాయములు కూడా కలవని స్పష్టమగుచున్నవి.

4. క్రీ॥శ॥ 1798-1832 ప్రాంతములో తంజావూరి రాజగు శరభోజి ఆస్థానమున రూపొందినట్లు తెలియుచున్నది.

5. పాల్కురికి సోమనాథుడు, "పండితారాధ్య చరిత్ర" "బసవపురాణం" అనే గ్రంథాలు వ్రాసినారు. అందు మార్గ, దేశీయ, నృత్యాలు ప్రజలకు ఆనందాన్నిస్తున్నాయని తెలిపిరి. దీనిని బట్టి 12, 13 శతాబాలకే నాట్యకళ వృద్ధిపొందినదని తెలియవచ్చుచున్నది.

6. విజయనగరంలో, వీధి నాటక ప్రదర్శనాన్ని భారతదేశానికి క్రీ॥శ॥ 1443లో రాయభారిగా వచ్చిన "అబ్దుల్ రజాక్" చూచినట్లుగా, "ఇలియట్సు-ఇండియా" అనే గ్రంథములో తెలియుచున్నది.

7. క్రీ॥శ॥ 1505, 1509, వీరనరసింహరాయలు విజయనగరము పాలించిరి. వారి సమక్షములో కూచిపూడివారు "కేళిక" జరిపి సమ్మెట గురవరాజు చేయు దారుణ కృత్యములను వీర నరసింహ రాయలవారి దృష్టికి తెచ్చినట్లుగను, సమ్మెట గురవరాజును శిక్షింప చేయించినట్లుగాను, మాచుపల్లికైఫీయత్ నందు తెలియుచున్నది. దీనినిబట్టి 1505 నాటికే కూచిపూడివారు భరత విద్యావేత్తలుగా ప్రసిద్ధి చెందినట్లు తెలుస్తోంది.

8. కృష్ణదేవరాయలు, 15-16, శతాబ్దాలలో శ్రీకాకుళం, (కృష్ణాజిల్లా) వచ్చినపుడు, కూచిపూడి నృత్యం గాంచి ఎంతో ఆనందించి, కొంతమంది కళాకారులను తీసుకువెళ్ళి "హంపి"లో వారి చేత నాటకము ఆడించుకొన్నట్లుగా "హంపి" చరిత్రయందు పేర్కొనబడినది.

9. కృష్ణదేవరాయలు కాలమున కూచిపూడి వారిని సత్కరించినట్లుగా, "తాయికొండ" నాటక ప్రదర్శనమునకై చేయబడిన దానశాసనము కూడా తెలుపుచున్నది. అందువల్లనే నేమో, కృష్ణదేవరాయలు తనరచనయైన, "అముక్తమాల్యద"లో, "భ్రకుంసులు" అను పదమును ప్రయోగించెను.

భ్రకుంసులు = స్త్రీ వేషములు వేసి ఆడెడి పురుషులు, యని తెలియుచున్నది. కూచిపూడి నాట్యమేళములుగా పురుషులు, స్త్రీ వేషం ధరించు సంప్రదాయం కలదుగాన, కృష్ణదేవరాయలు పేర్కొనబడిన "భ్రకుంసులు" కూచిపూడి వారగుట స్పష్టం.

క్రీ॥ శ॥ 1565 లో విజయనగర సామ్రాజ్యం పతనమైన తరువాత, తంజావూరి నాయక రాజుల పాలన ఆరంభమైనది. నాయక రాజుల ఆస్థానాలు లలితకళలకు అగ్రస్థానాలుగా నిలిచాయి. అచ్యుతప్పనాయకుని కాలంలో, కూచిపూడి నుండి కళాకారులు కొందరు వెళ్ళి రాజాశ్రయం పొందినట్లు తెలియుచున్నది. అట్లు రాజాశ్రయం పొంది అచ్చట రాజుగారి ఆశ్రయంలో స్థిరనివాసం ఏర్పరచుకొనిరి. అట్టివారిలో, అచ్యుతప్పనాయకుని తమ నాట్యకళా కౌశల్యముచే మెప్పించి, "మేలట్టూరు"ను అగ్రహారముగా పొందిరి. వారి రచనలలో, ప్రహ్లాద పట్టాభిషేకమునందు, "అచ్యుతాపురములో" అని మకుటము కూడా ఏర్పరిచి వారు రచించిరి. అదే నేడు "మేలట్టూరు",

"మేళాలవూరు" అట్టి మేలట్టూరు నందుండిన మేలత్తూరు, వెంకట్రామ శాస్త్రి, అచ్చట స్థిరనివాస మేర్పరచుకొనెను. 1750 - 1755 ప్రాంతములో వారు కొన్ని యక్షగానములు రచించి అచ్చట దేవాలయములలో ప్రదర్శించిరని యందురు.

11. క్రీ॥ శ॥ 1700 - 1750 ప్రాంతములో రాయలసీమలో గల "బనగానపల్లి" నవాబుగారు కూచిపూడి కళాకోవిదులను పిలిపించి, వారిలో కొందరికి "కోరుకొండ" "కపట్రాల" వద్ద, కొన్ని భూములు ఇచ్చి కర్నూలు జిల్లాలో వారిచేత నాట్య ప్రదర్శనలు చేయించినట్లు తెలియుచున్నది. అట్టివారిలో "చల్లావారు" ఒకరు వీరు వెలనాటి బ్రాహ్మణులు. అలా కొందరు కళాకారులు, తంజావూరు, కర్నూలు మండలాలకు వలసవెళ్ళి స్థిరపడిరి. ఈవిధంగా నలుమూలలు జగజ్జేగీయమానముగా వెలుగొందుచున్న ఈ కూచిపూడి నృత్యకళ అతిప్రాచీనమైనది. సంపూర్ణమైనది. సమగ్రమైనది. సర్వరసభరితమైనది.

ఇట్లు
విధేయుడు,
**హేమాద్రి చిదంబరదీక్షితులు,**
ప్రిన్సిపాల్ } శ్రీరాజరాజేశ్వరి కూచిపూడి నృత్య కళాశాల,
వ్యవస్థాపకులు } ఆర్యాపురం, రాజమండ్రి-4,
గాంధిపురం, రాజమండ్రి.



# అభిప్రాయము

నాట్యాచార్యులు, వేదాంతం చిదంబరదీక్షితులుగారు, "కూచిపూడి కళాసాగరము" అను గ్రంథము నాకు బంపిరి. దీనిని ఆమూలాగ్రముగా చదివిన పిమ్మట, ఇది యదార్థముగా కళాసాగరమే యని అనిపించినది.

భరతముని నాట్యశాస్త్రము, నందికేశ్వరుని అభినయ దర్పణము, జాయపసేనాని నృత్యరత్నావళి, భరతకల్పలతామంజరి, మృదంగతత్వము మొదలైన శాస్త్రగ్రంథముల యొక్క సారాంశమంతయు, ఈ కళాసాగరములో నిక్షిప్తమైయున్నది.

బహుకాలముగ అనేక నాట్యశాస్త్ర గ్రంథాలను పరిశోధించి, తన అనుభవమును కూడా జోడించి వ్రాసిన ఈ కళాసాగరమును నృత్యగ్రంథము, భావితరాలవారికి ఎంతగానో ఉపయోగపడగలదు.

కూచిపూడి నాట్య పరీక్షలకు ఈ గ్రంథము మిక్కిలి ఉపయోగకరమైనది. పరీక్షల విధానమంతా, ఈ గ్రంథములో ఉండుట చేత, ప్రతి విద్యార్థి - తప్పనిసరిగ, చదవక తప్పదు. అన్ని శాస్త్రముల సారమే ఈ కళాసాగరం, ప్రతి విద్యాలయాలలోను, గ్రంథాలయాలలోను, విధిగా ఉంచతగిన గ్రంథము.

దీక్షితులుగారు బాల్యములో వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి గారివద్ద, కూచిపూడి నాట్యశిక్షణ క్రమమంత సంపూర్ణంగా అభ్యసించారు. సత్యభామ మొదలగు ప్రధానపాత్రలు పోషించారు. తదుపరి గురుస్థానం వహించి, పానుగంటి పద్మ మొదలైన నటునటి అనేక నృత్య విద్యార్థినీ, విద్యార్థులకు శిక్షణ లిస్తూ, తన జీవితమును కూచిపూడి నృత్యకళకు అంకితము చేయుచున్నారు.

తన అనుభవమును, శాస్త్రములో జోడించి "కూచిపూడి కళా సాగరం" బను ఉద్గ్రంథము మన కందించిన హేమాద్రి చిదంబర దీక్షితులుగారు, అభివందనీయులు.

ఇటువంటి గ్రంథములు అనేకములుగా, అనంతముగా ఈ దీక్షితులుగారి ద్వారా ఇంకా వెలుగులోకి రావాలని కోరుతూ శలవు తీసుకుంటున్నాను.

ఇట్లు,

కూ చి పూ డి
12-10-1989

పద్మశ్రీ - భరత కళాప్రపూర్ణ,
వేదాంతం సత్యనారాయణశర్మ.



# యజ్ఞఫలం



కూచిపూడి గ్రామములో నిత్య నృత్యోపాసకుల వంశంలో జననమంది నాట్యాచార్యులు వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, లక్ష్మీనరసింహం, ప్రహ్లాదశర్మ గార్ల వద్ద సుశిక్షితులై - గోదావరి మండలానికి తరలివచ్చి పావన గౌతమికి అద్దరిని ఇద్దరిని గల కొవ్వూరు-రాజమహేంద్రి పట్టణాలకు కూచిపూడి గ్రామపు నాటి ప్రాశస్త్యాన్ని సంతరించిపెట్టడానికి ముఖ్యకారకులైన నాట్యాచార్యులు బ్రహ్మశ్రీ హేమాద్రి చిదంబర దీక్షితుల ప్రణీతమైన ఈ బృహద్గ్రంధాన్ని బేరీజు వేయడం నా తరమా? "Fools enter where angels fear to tread" అనే నానుడి అనుసరణీయమే కనుక "ఈ పని కొప్పుకొంటి."

నృత్యశిక్షణకు శాస్త్రపరిజ్ఞానం అవసరం. కాని శాస్త్రపరిజ్ఞానం ఉన్నవారందరూ ఉత్తమ శిక్షకులు కాలేరు. విద్యను కరతలామలకంగా - సులభంగా రంగరించి శిష్యకోటికి అందించడం అసిధారావ్రతం. అది చిదంబర దీక్షితులు గారికి వెన్నతో పెట్టిన విద్య అనేది వారివద్ద శిక్షణ పొందిన, పొందుతున్న శిష్యగణానికి, ప్రత్యక్షంగా వారి శిక్షణా విధానాన్ని గమనించే మాబోట్లకు తెలిసిన విషయమే- అయితే శాస్త్రపరిజ్ఞానంలో ఆయన "హేమాద్రి" అన్న విషయం మాత్రం భవదీయుడికి ఈ గ్రంధ పరిశీలన చేసిన తరువాత మాత్రమే తెలిసివచ్చింది, "గొప్పవారిగా ప్రఖ్యాతులైనవారు మనకు తెలిసిన దానికన్న ఎన్నోరెట్లు గొప్పవారైయుంటారు. కారణం ఆ సందుకుంపల నుండి పైకి పొంగిన గొప్పతనాన్నే మనం చూడగలుగుతాం కనుక" అన్నది నాకు నేనుగా కల్పించుకొన్న - ఒక సిద్ధాంతం. అది హేమాద్రి చిదంబరదీక్షితులుగారి, ప్రతిభపట్ల కూడా నాకు ఋజువైంది. ఆయన నిరాడంబర, నిశ్శబ్ద సేవకుడు, నాట్య తరగతులు నిర్వహిస్తూ శిష్య ప్రశిష్య పరంపరను రాసిలో వాసిలో పెంపొందింప

చేసుకుంటూ అవిశ్రాంతంగా జీవిత సమస్యలతో పోరాడుతూ – (మరి ఎప్పుడు ఆయనకు ఈ గ్రంథ రచనకు తీరిక సమయమో అర్థం కాదు.)

ఈ బృహద్గ్రంథాన్ని రూపించారంటే మహదాశ్చర్యకరమైన విషయమే. ఆయన ఇరువది ముప్పది సంవత్సరాలుగా ఈ కృషిలో నిమగ్నులై యున్నారని విన్ననాకు సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. ఇది ఒక గ్రంథం కాదు. అనుభవాన్ని పిండిన సారం తపఃఫలం... యజ్ఞఫలం.

ఇది చాలా వివరంగా...సులభశైలిలో...నాట్యాన్ని స్వయంగా అభ్యసించదలచిన వారికి...ఇదివరకే ప్రాక్టికల్‌గా నాట్యకారులైన వారికి శాస్త్రీయపరిజ్ఞానం కలిగించటానికి నాట్యాచార్యులు కాదలచిన వారికి ఎంతో ఉపయుక్తమైన గ్రంథం. ఈ గ్రంథ రచనవల్ల దీక్షితులు వారికి మేలుకంటే కీడే కలిగె అవకాశం లేకపోలేదు. ఈ గ్రంథం తెరచిచూచిన నాబోంట్లకు దీక్షితులవారి నాట్యాలయానికి పోటీగా మరో నాట్యాలయాన్ని పెట్టాలని అనిపించినా అనిపించవచ్చు. అయితే గ్రంథకర్తగా ఆయన చిరస్థాయికాగలరు. అది ఆయనకు శాశ్వితయశః కారి కాగలదు మనిషిని శాశ్వితంగా బ్రతికింపచేసేవి గ్రంథాలేగదా

ఇక ఈ గ్రంథములో విషయాల గురించి దీక్షితుల వారే అంగీకరించినట్లు ఇది నాట్యశాస్త్రసారము. అనేక గ్రంథాలను చిలికి తీసిన సారము. ఇది ఒక "కంపెండియం"గా కనిపించినా దీని వైశిష్ట్యం విలక్షణం దీనికి ఉన్నవి. విడిగాపడివున్న చెకుముకిరాళ్ళను ఒకచోట చేర్చి తాకిస్తేకదా అగ్నికణం పుట్టేది. నెగిటివ్–పాజిటివ్ కలిపితేకదా విద్యుత్ మెరిసేది? ఇది కూచిపూడి నాట్యరీతుల్ని ఆమూలాగ్రం పరిచయముచేసే గ్రంథం. వినాయక, సరస్వతి, అంబ ప్రార్థనలతో ప్రారంభమై ప్రాథమికశిక్షణగా తాళాధ్యాయము తాళ ములుజతులు–లక్షణములు, తాళశబ్దోత్పత్తి- తాళావశ్యకత – హస్త

లక్షణములు—శిరోభేదములు తారా, కటిభేదములు. అంగ, ప్రత్యంగ, ఉపాంగలక్షణములు. భ్రూ భేదలక్షణములు. నర్తకుల లక్షణములు - రంగపూజా లక్షణములు. నాట్యభేదములు - సభా లక్షణములు - నాట్యోత్పత్తి - పంచవిధ మాలాలంకారములు - భూషణ విశేషణములు - ఆభరణవిధులు. నృత్త - నృత్య - నాట్య - లాస్య - తాండవ లక్షణములు. వస్త్రధారణ విధానక్రమము. శివ-మోహిని యక్షగానము, భక్తమార్కండేయ యక్షగానము, కూచిపూడి కళాకారుల జీవితచరిత్రలు విశదీకరిస్తూ "అరిటిపండు వలచిపెట్టినట్లు" కదళీపాకముగా సాగింది ఈ రచన.

శాస్త్రగ్రంథము కనుక "అబ్బాయిలూ – అమ్మాయిలూ చేతులు ఇలా తిప్పాలి...కళ్ళు అలా తిప్పాలి....చూశారా డ్యాన్సు చెయ్యటమంటే ఎంత తేలికో" లాంటి చేలసమైన భాష వాడబడలేదు. రశ్కిన్ మహాశయుడు అన్నట్లు వజ్రాలు, వైడూర్యాలు గులకరాళ్ళలా భూమిపై పొరలలో లభించవు. లోతుగా త్రవ్వుకుంటూ పోవాలి... ఒకప్పుడు ఎంతో లోతుగా త్రవ్వినా ఒకటో రెండు లభించవచ్చు. మరి వాటి విలువ క్వారీ రాళ్ళ విలువా ఒకటేనా ?

తరతరాలుగా రచయితలను బ్రతికించేవి పుస్తకాలే ననే విశ్వాసం ఉన్న నేను దీక్షితులుగారు శాశ్వత యశఃకాయులు ఈ ప్రయత్నం ద్వారా అయినందుకు అభినందిస్తున్నాను. నాకే తెలియకుండా నేను ఒకవిధంగా "అసూయ" కూడా పడుతున్నానేమో ! నాట్యాభిమానులు, నాట్యాచార్యులు ఈ గ్రంథాన్ని ఆహ్వానించి లబ్ధిపొందెదరుగాక.

**యం. వి. నారాయణాచార్య,**
ఆంగ్లోపన్యాసకుడు,
శ్రీమతి కందుకూరి రాజ్యలక్ష్మి స్త్రీల కళాశాల,
రాజమహేంద్రి.

# విషయసూచిక

పేజీలు

—0—

ఓం

## వినాయక ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥

## సరస్వతి ప్రార్థన

శ్లో॥ సరస్వతి త్వియం దృష్టా వీణాపుస్తకధారిణీ
హంసవాహన సమాయుక్తా విద్యాదాన కరీమమ
ప్రథమంభారతి నామ ద్వితీయంచ సరస్వతి
తృతీయం శారదాదేవి చతుర్థం హంసవాహన.
పంచమం జగతి ఖ్యాతం షష్టం వాగీశ్వరి తథా
కౌమారిసప్తమంప్రోక్తం మష్టమం బ్రహ్మచారిణి.
నవమంబుద్ధి ధాత్రీచ దశమం వరదాయిని
ఎకాదశంక్షుద్రఘంటాద్వాదశం భువనేశ్వరి
బ్రాహ్మీద్వాదశనామాన్విత సంధ్యంయః పఠేన్నరః
సర్వసిద్ధికరీ తస్య ప్రసన్న పరమేశ్వరీ
సామేవసతు జిహ్వాగ్రే బ్రహ్మరూపాసరస్వతి॥

## ఈశ్వర ప్రార్థన

శ్లో॥ కైలాసాచలవాసాయ కుందేందు ధవళాయచ
నాట్యశాస్త్ర ప్రవక్త్రాయ - మహాదేవాయతే నమః

## నందికేశ్వర ప్రార్థన

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం - శివశక్తి పరాయణ
నాట్యశాస్త్ర తత్వజ్ఞ ప్రసాదం కురుసర్వదా.

## భూదేవి ప్రార్థన

శ్లో॥ విష్ణు శక్తిసముత్పన్నే-చిత్రవర్ణే మహీతలే
అనేకరత్న సంపన్నే భూమిదేవి నమోస్తుతే॥

శ్లో॥ సముద్రవసనే దేవి. పర్వత స్తనమండలే,
నాట్యం కరిష్యే భూదేవి, పాదతాడనక్షమస్వమే.

## నటరాజ ప్రార్థన

శ్లో॥ నమోస్తు నటరాజాయ, గౌరీ సౌందర్యరూపిణే,
బ్రహ్మోః కృపవిహారాయ, ఆనందజలజాయతే॥

## శివ స్తుతి

ఆఙ్గికం, భువనం, యస్య, వాచికం సర్వవాఙ్మయమ్.
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికం శివమ్॥

## సభావందనం

శ్లో॥ విద్వాంసః కవిరేఖజ్ఞాగాయకాః పరిహాసకః
ఇతిహాసపురాణజ్ఞా తత్ప్రిభాయై నమో నమః

తా॥ విద్వాంసులు, కవులు, చిత్రకారులు, గాయకులు, పరిహాసకులు, ఇతిహాసములు తెలిపినవారు, పురాణములు తెలిసినవారు, కలిగిన ఈ సభకు నమస్కారములు.

# దేవి ప్రార్థన

కాంభోజిరాగం ఆది. తాళం.

రావే విజయపురి కనకదుర్గాంబ
రావమ్మ మము బ్రోవ ఓ శ్యామలాంబ,

ఓంకారి హ్రీంకారి, క్లీంకారి, ఓం శక్తి
శూలాయుధపాణి పాశాంకుశధరి ॥రా॥

మందార సుమప్రియ రక్తాంబరధారి
రాజీవలోచని రాజరాజేశ్వరి ॥రా॥

భండదైత్యహారి ఐం, క్లీం, సౌః, యని నిన్ను
ఆరాధింతును ఆదరింపగ వేగ ॥రా॥

కామితార్థదాయి కౌమారి కల్యాణి,
కదలిరావేమమ్మ కాదంబవననాసి ॥రా॥

అనవరతము నిన్ను ఆం, హ్రీం, క్రోం, యని బిల్వ
ఆవలోకించవ ఆదిశక్తి నీవు ॥రా॥

దర్శనమివ్వవె దనుజ సంహారిణి
దాసానదాసుని దీక్షితు బ్రోవను ॥రా॥

# స్వామి, సిద్ధేంద్ర, గురుస్తుతి

షణ్ముఖప్రియ, ఆది. తాళం.

ప : వందన మందుకో, యోగీంద్రా...మా
కూచిపూడి పుర సిద్ధేంద్రా ॥వం॥

అ: భరతము, వేదము, బహుశాస్త్రంబుల
దండిపండితుడవు నీవేనయగా ||వం||

1. కృష్ణ దాసుడను నిష్ఠాత్ముడవై
ఆత్మసన్యాసివై తిరుగగా
కృష్ణ కథాసుధ యక్షగానముల
భామ కలాపము నేర్పిన దేవా ||వం||

2. భాసురమతి భాగవతవరయా
భరతము నీ ప్రదుల సాటివైయా
సత్యము. శౌచము, ధర్మము, శాంతికి
చదువులు నేర్పిన నాజ్ఞవయా ||వం||

3. రాగభావలయ విన్యాసంబుల
నర్తనమూర్తివి నీవేనయ్యా
భరతశాస్త్ర సంస్కృతి దిశదిశలను
వెదజల్లిన మావేల్పువయా ||వం||

4. దీక్షబూనియును నృత్య సరళి మా
బుడుతలకు నేర్పిన త్వష్టవయా
క్షమదమాది సకలగుణ సన్నుత
ఆర్తుని దీక్షితు హృదయాం జలువివె ||వం||

## భరత సూత్రము

శ్లో॥ శృంగారరస సందోహం, శ్రితకల్ప మహీరుహమ్,
శ్రయే శ్రీ నాథమేవాహం, శ్రాంతలోక సుఖావహమ్॥

తా॥ శృంగార వ్యాపారముల కూటమియును, స్వాశ్రితజనుల కోరిక లీడేర్చు కల్ప వృక్షమును, సంసారాదితా పత్రయశ్రాంతులగు జనులకు, శాశ్వత బ్రహ్మానంద మొసంగువాడునగు, లక్ష్మీవల్లభుని నామనోరథ సంపూర్తి కొరకు నాశ్రయించెదను.

## నాట్యప్రధానములు

శ్లో॥ కంఠేనాలంబయేద్గీతం, హస్తేనార్థం ప్రదర్శయేత్,
చక్షుర్భ్యాం దర్శయేద్భావం, పాదాభ్యాం తాళమాచరేత్.

తా॥ నటనముచేయునట్టి నర్తకిగాని, నర్తకుడుగాని, మొదట గీతమును గానమునుచేసి, యాపలగీతార్థములను హస్తాభినయములచే తెలుపవలయును, నేత్రములచే భావములను తెలుపవలయును పాదములచే తాళమును నాచరింపవలయును.

శ్లో॥ యతోహస్త స్తతోదృష్టిర్యతో దృష్టి స్తతో మనః ।
యతో మన స్తతోభావోయతో భావ స్తతోరసః ॥

తా॥ ఎచ్చట హస్తము చూపబడుచున్నదో, అచ్చట దృష్టినుంచవలయును దృష్టియున్నచోట మనస్సు నుంచవలయును, మనస్సున్నచోట భావముంచవల యును. ఎచ్చట-ఈ నాల్గు కేంద్రీకృతమైయున్నవో అచ్చట రసము కల్గుచున్నది.

## పాదభేదములు, లక్షణములు, వినియోగములు

**1** సమము **2** అంచితము **3** కుంచితము 4 సూచి **5** అగ్రతలసంచారము 6 ఉద్ఘట్టితము 7 ఏకపాదము 8 వివర్తితము 9 గతాగతము **10** వళితము **11** వైశాఖమండలము, **12** త్రిభంగి **13** అగ్రగము **14** మర్దితము **15** పార్ష్ణిగము **16** ఘట్టితము **17** ఘట్టితోత్సేదము **18** తాడితము **19** తార్క్ష్యగముయని పాదిభేదములు పంధొమ్మిది విధములు.

## సమపాద లక్షణము - వినియోగము

భూమిపైన సమముగా నిలిపినపాదము "సమపాద"మనబడును. ఇది స్వభావాభినయమందు వినియోగించుదురు.

## అంచితపాదలక్షణం - వినియోగము

మడమలను నేలపైనుంచి, అంగుళులను కొంచెము వంచించి, అంగుష్ఠమును నూర్ధ్వముగా నెత్తినచో "అంచితపాద"మగును. అతిక్రమరకాదులకు వర్తించును. కాలితో తన్నుట, త్రిప్పుట, తిరుగుట, మొదలగు వాటికి వర్తించును.

## కుంచిత పాదలక్షణము - వినియోగము

కాళ్ళవేళ్ళు ముడిచి కాలియొక్క మడమలను యెత్తి మధ్య ముడిచినచో "కుంచితపాద"మగును. ఇది చాలాదూరము నడచుటవల్ల కలిగిన శ్రమగలవాని యొక్క నడకయందు, ఎత్తైన వస్తువులను గ్రహించుటయందు, వినియోగించును.

"అతిక్రాంతక్రమే" అని పాఠాంతరము. అతిక్రాంతచారియందు వర్తించును.

## సూచిపాదలక్షణము - వినియోగము

ఎడమపాదము స్వాభావికముగానుంచి, కుడిపాదముయొక్క బొటనవ్రేలు భూమియందు మోపి మిగిలిన పాదమంతయు నెత్తియుంచినచో "సూచీపాద"మగును. ఇది నూపురము. (కాలి అందెను) ధరించుటయందు చెల్లును.

## అగ్రతల సంచరపాదలక్షణము - వినియోగము

కాలియొక్క మడమును యెత్తి బొటనవ్రేలును చాచి మిగిలినవ్రేళ్ళను ముడిచియుంచినచో నది "అగ్రతల" సంచర "పాదమగును. ఇది ప్రేరేపించుట యందును, స్థానమందు, పీడనము భూమియందున్న వానిని తట్టుటయందు, లేక భూమిని తన్నుటయందును, భూమిపైనున్న వస్తువులను తొలగించుటయందును, రేచికము, (కదలించుట)యందు, తిరుగుటయందు, మొదలగువానియందును ఈ "అగ్రతల సంచరపాదము" వినియోగించును.

## ఉద్ఘట్టితపాదలక్షణము, వినియోగము

పాదాగ్రముచేత నిలచి, మడమను ఒకసారి లేక చాలాసార్లు భూమిపై తట్టినచో "ఉద్ఘట్టితపాద" మగును. దీనికి (ఒంటిపెట్టడవు) అని పేరుగలదు.

## ఏకపాదలక్షణము, వినియోగము

నాట్య విశేషణాదులయందు ఒకపాదము నేలపై మోపి నిలచుట.

## వినివర్తితము పాదలక్షణము, వినియోగము

అనగా పాదములు మార్చుట

గతాగతపాదలక్షణము, వినియోగము

అనగా ముందు వెనుకకు బోవుచు వచ్చుట

వళితము

అనగా తిరుగుట

వైశాఖ మండలము

అనగా నిరుప్రక్కలకు తిరుగుట

త్రిభంగి

పాత్రరేఖా ప్రమాణముమీద నిలుచునప్పుడు, నడుము, రొమ్ము, శిరస్సు, నివి వంపుగా నిలపుట.

## అగ్రగము

ఇది మునివ్రేళ్ళ మోపు మీదనొక పాదముకంటె నొకపాదమును ముందు ముందుగా వడివడిగా నుంచుట.

## మర్ధితము

నిది నిలచినచోటనే పాదముతో తట్టుట.

## పార్ష్ణిగము

నిది మునవ్రేళ్ళ మోపి, మడమలెత్తియుండి, తిరుగామడమలు ఆన్చి, మునవ్రేళ్ళ యెత్తుట.

## ఘట్టితము

అనగా మడమలతో తట్టుట.

## ఘట్టితోత్క్షేపము

అనగా అరికాళ్ళు నేల తగలకుండా ముడుచుకొని మడమలు, కాలివ్రేళ్ళు భూమిని తట్టుట.

## తాడితము

అనగా మడమలపై నిలచి, మునిపాదములు పైకెత్తి ఆ మునిపాదములతో భూమిని తట్టుట.

## పార్శ్వగము

అనగా పాదములయొక్క వ్రేళ్ళ ప్రక్కలు నేలనాన్చి, లోప్రక్కలు తగలకుండా నిల్చి, అలాగే ముందుకు అడుగులు నుంచుచు, యుండుట.

## కూచిపూడి, పాదచలన భేదములు

1 తాంతై, తైహిత్త। తాతై హిహిందా॥

(నడుముకు ముష్టిహస్తములుంచి, కుంగుట, మరల లేచుట, ఆ విధముగా త్రికాలములు చేయవలెను.)

2 తాంతైతైహిత్త। తాతై హిహిందా।

(కుడిపాదముతో ఒక ఘాత. (అనగా దెబ్బ) ఎడమపాదము జరుపుట అట్లు త్రికాలములు)

3 తైహిహిందాత్తాం। తతై తైహిత్తతా॥

(చేతులతో పతాకహస్తములు భుజములకు సమానముగాబట్టి కుడికాలి మడమతో ఒక దెబ్బ మరల అదే కాలితో పాదమంతయు నేలమీద తట్టుట.) ఆ విధముగా రెండవకాలుకూడా, చేయవలయును. చేతులుకూడా, కుడికాలి మొదటి మడమ దెబ్బకు చెయ్యి వెల్లకిలవేయుట, రెండవదెబ్బకు బోర్లవేయుట, అట్లే రెండవకాలు కూడా చేయవలయును.) (త్రికాలము)

4 తాం దిగిదిగి దిగిదిగి దిగిదిగి । దిగిదిగి దిగిదిగి దిగిదిగి తా॥

(అగ్రగముపాదముతో, మునివ్రేళ్ళపై నిలబడి ఒకకాలికంటె మరియొక కాలు మునివ్రేళ్ళతోనే నేలపై కొట్టుచు నడచుట)

5 దిగిదిగి దిగిదిగి దిగిదిగి దిగిదిగి ।

దిగిదిగి దిగిదిగి దిగిదిగి త్రై ॥

(ఘట్టితపాదముతో మడమలు నేలపై కాన్చి వెనుకకు బోవుట).

6 ధాకిట కిటతక, కిటకిట తక ।

ఝె కిట కిటతక, కిటకిట తక ॥

(రెండు చేతులతో పద్మకోశహస్తములు అభిముఖములుగాబట్టి, వక్షస్థలము దగ్గరవుంచి కుడికాలితో ఒక ఘాత, మరల మూడు అగ్రగమపాదములు, మరల రెండవకాలితో ఒకఘాత రెండవకాలుతో మూడు అగ్రగమపాదములు. (త్రికాలములు.) (ప్రతిపాదఘాతకు ఆవైపు చెయ్యికూడా క్రిందకు-వచ్చి మరల యథాస్థానమునకు వెళ్ళుచుండవలెను.)

7 తోధిమ్మి తోధిమ్మి । తా తదీంతక్క ॥

(హంసాశ్యములు భుజముల సమానంగావుంచి కుడికాలితో మునివ్రేళ్ళపై ఒక ఘాత, మరల ఆ కాలికే పాదమంతయు ఒక ఘాత, ఆవిధముగా రెండవకాలు కూడా ఆచరించవలయును.) చేతులు హంసాశ్యములు గావించి, "చలమణి"బంధములు" గావించుచుండవలెను.)

8 తోదిమ్మి తోధిమ్మి । తా తదీంతక్క ॥

(మృగశీర్షహస్తము ముఖమువద్దనుంచి, అగ్రగము, ఘట్టితములు, వరుసగా ఆచరించవలయును )

9 తోధిమ్మి తోధిమ్మి । తా తదీంతక్క ॥

(రెండుచేతులతో కటకాముఖములుబట్టి, కుడిప్రక్కకు దుమికి మరల యెడమ ప్రక్కకు దుముకుట, పాదములు మునివ్రేళ్ళపై నుంచుచుండవలయును. చేతులు చాచినపుడు పద్మకోశహస్తము వినియోగించవలెను.)

10 తోం తోం తాధ, తోం తోం నద్ది ॥

(రెండుకాళ్ళతో రెండుదెబ్బలు ఒకేసారి యెగిరి నేలనుతట్టి కుడిచెయ్యి కుడి చెయ్యి కుడికాలు ప్రక్కకు చాచుట, ముందుకు ముడుచునపుడు హస్తము, చాచి నప్పుడు చాచిన చెయ్యి పద్మకోశము అదేవిధంగా రెండవవారికిగూడా ఆచరించ వలయును )

11 తై తాకిట తక తత్తై హిత్తత్తో । తా తా కిటతక తత్తై హిత్తత్తో ॥

(ఇవి నాల్గింటికములు) పాదములు, తొడుసంగతులు, మున్నగువాటితో, 4×3=12 రకములుగా నున్నవి) అడుగు నెం 1.

12 తై తాకిటతక తత్తై హిత్తత్తో । తా తా కిటతక తత్తై హిత్తత్తో ॥

(కుడికాలితో ఒక ఘాతకొట్టి, ఎడమకాలు ప్రక్కకు కొంచెము దూరము వేసుకొని, మరల కుడికాలుతో ప్రక్కపైనకొట్టి అదేవిధంగా రెండవసారి చేయ వలయును. అట్లే మొదటనెడమకాలితో ఒకదెబ్బకొట్టి కుడికాలు జరిపి, మరల ఎడమ కాలు కుడికాలిపక్కకు చేర్చి అదేవిధంగా రెండవసారిచేయుట). రెండుచేతులు పతాకహస్తములు ఛాతి సమముగా నిలుపవలయును.)

13 తై తాకిటతక తత్తై హిత్తత్తో । తా తా కిటతక తత్తై హిత్తత్తో ॥

(పై అడుగువిధముగానే పాదముతో దెబ్బలుకొట్టుట, చేతులుమాత్రం శిఖర హస్తములతో, కుడిప్రక్కకు చేర్చునపుడు, కుడిహస్తము, ఎడమకు చేర్చు నపుడు ఎడమ హస్తముతో చూపవలయును.)

14 తై తాకిటతక తత్తై హిత్తత్తో । తా తా కిటతక తత్తై హిత్తత్తో ॥

(రెండుచేతులు కటకాముఖములుపట్టి పైవిధముగా అడుగులు వేయుచు, రెండుచేతులు ఒకేసారి పైకెత్తుట, మరల ఒకేసారి క్రిందకు దించుట.)

15 తై తాకిట తక తత్తై హిత్తత్తో । తా తా కిటతక తత్తై హిత్తత్తో ॥

(పైన వ్రాసిన అడుగుల ప్రకారం అడుగులువేయుచు కటకాముఖహస్త ముతో ఒకే చెయ్యి పైకెత్తి మరల దించుట,)

(పైనచెప్పిన విధముగా అడుగులు నాల్గురకములకు, తితైతై ల అడుగులు తోతుమంగ అడుగెలు కూడా జతచేసినచో, 4×3=12 రకములు తై తాకిటతకలు అడుగులు వచ్చును )

16 తాం తత్త దింద - తత్తదింద । తాం తత్త దింద - తత్త దింద॥

(ఇవికూడా నాల్గురకములు, 4×3=12 రకములు.)

దిద్దితైలు, తోతుమంగలు, కలసి 12 రకములు.

అడుగు నెం. 1

హస్తములు కటకాముఖములుబట్టి, ఎగిరి మునివ్రేళ్ళపై కూర్చుని ఉసిలో లేచి, కుడికాలు ప్రక్కకు మడమపై నుంచి, కుడిచెయ్యికూడా కాలికి సూటిగా చందంశహస్తములోచాచి, ఎడమచెయ్యి చందంశముతో పైకి ఎత్తి ఉంచుట, అదేవిధంబుగా, రెండవపైపుకుకూడా ఆచరించవలెను.) దిద్దితైలు, తోతుమంగలు కలిపిన 3 రకములు అడుగులు వచ్చును.)

అడుగు నెం. 2

(హస్తములు కటకాముఖముబట్టి. ఎగిరి మునివ్రేళ్ళపై కూర్చుని ఉసిలో లేచి కుడికాలు వెనుకకు పోనిచ్చి, అదేచెయ్యి పైకెత్తి, మృగశీర్షంగా ఉంచుట.) తోతుమంగలు, దిద్దితైలుతో, 4×3=12 రకములు.

అడుగు నెం. 3

(హస్తములు కటకాముఖములుచేసి, ఎగిరి మునివ్రేళ్ళపై కూర్చుని,ఉసిలో లేచి, ఒకకాలు ప్రక్కకు పొడవుగా చాచుట. మరల ఎగిరి మండిపై కూర్చుని, రెండవకాలు చాచుట, చేతులు, ముందు కటకాముఖములుబట్టి, తదుపరి చందంశములు చేయవలయును.) 4×3=12 రకములు.)

అడుగు నెం. 4

(హస్తములు కటకాముఖములుచేసి, మండిపై ఎగిరి కూర్చుని, మరల ఉసిలో లేచి రెండుకాళ్ళు ఒకేసారి ఎగిరి మడమలపై నిలబడవలయును.) 4×3=12 రకములు.

17 దిద్దిత్తై దిద్దిత్తై దిద్దిత్తై -దిత్తై।దిద్దిత్తై దిద్దిత్తై దిద్దిత్తై దిద్దిత్తై॥

(హస్తములు కటకాముఖములు చేసి రొమ్ముకెదురుగాబట్టి కుడికాలుతో మడమపెట్టి, మరల ఎడమకాలు పాదమంతా ఒకపెట్టి, మరల కుడికాలు పాదమంతా ఒకపెట్టి చేతులుకూడా, కుడిచెయ్యి) అన్నప్పుడు చంద్రకళహస్తముతో చాచుట. (ద్ది) అన్నప్పుడు ఎడమచెయ్యి కటకాముఖముతో రొమ్ముదగ్గరే ఉంచుట (త్తై) అన్నప్పుడు కుడిచెయ్యి మరల రొమ్ముదగ్గరకుచేర్చి కటకాముఖము చేయుట, అదేమాదిరి రెండవ వైపుగా ఆచరించవలయును.)

దిద్దిత్తైలు, (మరియొకపద్ధతి)

(ముందు చెప్పినరీతిగా అడుగులు వేయుచు. హస్తములుమాత్రం పతాకములు చూపవలయును.)

చుట్టడుగులు

18 తాం తత్తై హైహిత్త । తాత్తై హీహిందా॥

(హస్తములు పతాకములుచేసి, కుడికాలు మడమతో ఒకపెట్టి, అదే పాదమును పూర్తిపాదం పెట్టి, ఎడమకాలు వ్రేళ్ళపై పెట్టి, మరల కుడికాలు పూర్తి పెట్టి, ఈ విధంగా రెండు పాదములతో ఆచరించవలయును) చంద్రకళము లతో ఒకటి, అలపద్మహస్తములతో ఒకటి, కటకాముఖములతో చేతులు వెనుకకు త్రిప్పుచు ఒకటి, వరుసగా ఆచరించవచ్చును. (4 రకములు.)

కత్తెరనాట్య నడనలు

19 తాంత్తై । హైహిత్త । తాంత్తై హీహిందా॥

(హస్తములు పద్మకోశంబట్టి కుడికాలుతో ఒక ఘాత, ఎడమకాలు ప్రక్కకు జరిపి ఒక ఘాత, మరల కుడికాలు వ్రేళ్ళపై ఒకపెట్టి, రెండు కాళ్ళు ఒకపెట్టి, అదేవిధంగా రెండవవైపున కూడా ఆచరించవలయును) పై విధంగా, ఒకటి పద్మకోశహస్తముతోను, 2] చంద్రకళముపైకి బట్టుచును, 3] మృగశీర్ష హస్తము, ఫాలభాగమున ఉంచియు, 4] కటిప్రదేశమునందు ముష్టిహస్తము లుంచి ఆచరించవలెను. (4 రకములు)

వెనుకనాటు వరసలు

తాం తత్తై తైహిత్త। తాత్తైహి హిదా॥

కుడికాలు ముందుపుంచి, యెడమకాలు కుడికాలివెనుకన (వేళ్ళ) మీాద ఉంచి, కుడికాలితో ఒక ఘాత, ఎడమకాలి(వేళ్ళ)తో ఒకఘాత.

జారడుగు వరసలు

తాం తత్తై తైహిత్త తాత్తై హిహిదా॥

(రెండుపాదములు సమముగా ఉంచి, కుడికాలితో ఒక దెబ్బ, యెడమకాలు జరుపుట)

(అరావృత తీర్మానములు, ఆదితాళం)

త ది గి ణ త 3 సార్లు

త క త ది గి ణ త 3 సార్లు

కి ట త క త ది గి ణ త 3 సార్లు

ది గి ణ త 3 సార్లు

గి ణ త 3 సార్లు

కిటతక తదిగిణత – తకతదిగిణత

తదిగిణత – దిగిణత. గిణత

(ఐదుజాతుల ముక్తాయి)

(ఇట్లీవిధముగా పాదభేదములనుబట్టి నాట్యాచార్యుల ఊహాపోహాలనుబట్టి వృద్ధి పొందినవి. అట్లు వృద్ధిపొందిన అడుగులు, శతాధికములుగా నున్నవి. (గ్రంథ విస్తరణభీతిచే (వ్రాయలేదు.)

తీర్మానములు — జతులు ఆదితాళం

4 అక్షరములు నడక

1. తదణా తఝ్ఝణా తధిమిా తకిట।
 తళంగు తకధిమి తకతది గిణతోం। } 3 సార్లు

2. ధిత్తా ధిమితా కిటతక । 
తళంగు తధిమి తకతదిగి కణాన్ ॥ 2
ధిత్తా ధిమితా ధిమితా కిటతక 3
తకా ధికీ ఝుణు తదిగిణతోం.

3. తళంగుతోం, తకతది గిణతోం 2
తళంగుతోం 2
తకాధికీ తక తదిగిణతోం 3

4. తత్త ధిమిత ధిమిత ఝుణుతక । 
తైతా కిటతక తత్తై హంత్తతో ॥ } 2 సార్లు
తత్త ధిమిత ధిమిత ఝుణుతక 2
దొద్దో దీందా దొదుదో దీందా
తొంగు తక ధికితక, తదిగిణత ॥ 3

5. తాకిట్ట్రత్తొ డిండదింద ధీతో ధిక్కితక్క ।
తద్దిక్కిత్తొ డింద దిండధీ తో ధిక్కితక్క ॥
తాత్కిత్తో డింద డింద
తద్దిక్కిత్తొ డింద డింద
తధణా, తఝుణు, ధికతక తళంగుతక ధికితక తదిగిణత 2
తద్దణ తఝుణు తద్దిమి ధికతక, తత్తరికిటతక, తత్తరికిటతక
తత్తరికిటతక

6. తకతోం దికతోం దిగి దిగి తకతోం తత్తళంగుధిత్తా తేఝం. 2
తకతోం దికతోం దిగి దిగి తకతోం 2
దొద్దో దీందా దొదుదో దీందా
తొంగు తక్క ధిక్కి తక్క —తదిగిణత 3

7\. ధిత్తక ణంతక ణంతక ఝంతక ।
ధిత్తళంగుతోం తక తదిగిణత ॥ —

8\. ధిత్తక తాతక ఝంఝరి కిటతక ।
ఝేం ఝేం ఝుక్కుట ధిత్తళంగుతక ॥
తళంగు ధిత్తక ణంతరి కిటతక ।
తక ధికి తకతోం — తక తదిగిణతోం ॥

9\. తోంగా తోంతోంగా । తోంతోంగత్తో ధిక్కుతక్కు ॥
దోడ్డో దోహడ్డో దింద । ధీ, త్తైహింద త్తతాం ॥
ధాకిటఝాం తతకిటఝాం తకతక ధికితక ధికిటకతక దదిగిణత ॥

10\. తాముడు తుంగ ధిక్కుతక్కు కిణ్ణఝుకుడు ఝుకుడు కిటతక ।
ఝుంతారి కుందారి కుక్కుడగ కిణ్ణకుక్కు ॥ ధిత్తా, త్తై, తత్తహ
త్తత్తై । తాతాం ద్రుగుడు దాంతత్తోం గిట కిట దరి ॥ కిట
ధిమికిటధీ, — తకదది గిణత । — తకతదిగిణత ॥

11\. తాకిటతకత్తోం త తకిటతకతో । తది, తది, తది, తదిగిణత ॥

12\. తాతంకిట తాంతకిటతో । ఝుంతకిట ఝుంతకిటతో ॥
తఝుంతతో తదిద్ధితో । తకాధికీ ఝెణు — తదిగిణత ॥

13\. తాత్తై తత్తత్తైతో దిగి తత్త దిగదాత్తై ।
దిద్దిత్తైత దిద్దిత్తై త త్తై త ॥
దిద్దిత్తైత దిగిదిగితో దిగితత్త దిగతా దిగి దిగి
తా, దిగదా దిగిదిగితా తోగిదితత్త దిగదా దిగిదిగి ॥

14. తతరి ధణాంధణ తాంహా త్త కిటతకఝుం । తకతకఝుం ద్ధిత్తకుం
తరికుధణ । ధణ ధణాతఝుం ఝుంతక్కమి । తాకిట తకతా
ధితదిగిణత ॥

15. తద్ధిత్తా - ధిత్తా । తా - తకధతదిగిణత ॥

16. కిటతక ఝుంతక్కిట తకుంధరికిటధిమి ।
ధణాతఝుం తధిమి తకధిమితా ॥
తకుందరి కిటతక తదిగిణత ।
తక తదిగిణత తదిగిణత దిగిణత గిణత ।

17. తాకుధణకుఝుంతా-। కిటతక తదితదితదితది తదిదింధక్కతోం.॥
ధణకు కిణకు ఝుంతా, - । కిటతక తది తది తది తది తది దిం
దక్కతోం ॥
తాకు ధణకుఝుంతా. తఝుంతరి। ధణకు కిణకు ఝుంతా తఝుంతరి॥
తాకుధణకు ఝుంధణకు కిణకుఝుం । - తదిగిణత - తదిగిణత -
తదిగిణత ॥

18. తగణాతరి తగజగణాం తతకిట । తఝుంకిణాం తరిధణా, ధణా ॥
తఝుంత, తరూంత, గఢింత, రితాంత । తదిగిణత, తదిగిణత,
తదిగిణత ॥

19. తాకుధణకుఝుం తరికిటతక తరికిటతకతోం । తదింగిణతతోం
తదీం గిణతతోం ॥
ధణకు కిణకుతోం తరికిటతక తరికిటతకతోం । తదింగిణతతోం
తదింగిణతతోం ॥
తాకు ధణకు ఝుంకుతోంతఝుంతరి । ధణకు కిణకుఝుంకుతోం
తఝుంతరి॥ తాకుధణఝుం ధణకు కిణకుఝుం। త త్తరికిటతకత త్తరి
కిటతక త త్తరికిటతక ॥

20. తాకుకు ఝేకుకు ఝేకుకు ఝెణకుకు । ఝేఝేఝెణ కుక్కుండరి
కిటతక ॥ కుకుం తరుంతరుంతకా । -తకిటతక తా-, తకధితదిగిణత॥

21. తక తక తఝెంత తకతకతఝెంత । తకతఝెంత తకతఝెంత
తఝెంత ॥ తాకిటతక తదీంగిణత తకతక । తదీంగిణత, తకధిమి
తదీంగిణత ॥

22. తాతా తదిందా తాతాతదిందా । తాతదిందా తాతదిందా తదిందా ॥ ధిత్త
ధిత్త తదిందా ధిత్త ధిత్త తదిందా । ధిత్తదిందాధిత్తదిందా తదిందా॥
ధిత్తోంకిటతక ధిత్తోంకిటతక ధిత్తోంకిటతక తదిగిణతోం - తగిగిణత
తదిగిణత తదిగిణత ॥

23. తత్తోంతకతోం తకుందరికిటతక । తో, దీ, తతైహి త్తతో ॥
తత్తోంతకతోం తకుందరికిటతక । తా, తై. తధిమితతో ॥
తఝెం తకఝెంత కుందరికిటతక । తత్తోంతకతోం తకుందరికిటతక॥
తరికిటతకతా తరికిటతకతై కిటదరికిటతక ।-, తదిగిణత, తదిగిణత,
తదిగిణత ॥

24. ధిత్తాం, తత్తోం, తకతై । -, తరికిటతకతా తరికిటతకతా - తరికిట
తకతా ॥ 2

ధింధిం తత్తాం ప్లాంప్లాం తతై । ధింత త్తాం ప్లాంతతై తరికిటత ।
ధింధింత ప్లాంప్లాంత తరికిటతా । ధింధింతప్లాంప్లాంత తరికిటత- తరి
కిటత తరికిటత ॥

25. ధింత ధింత తధింత ధింతతక । ధింత ధింత తధింత ధింతతక ॥
తాకుదినతక్క, దిన్నతక్క । తాకుదినతక, తకుదినత, తకుదినత
తకుదినత ॥ 2

30. తక్కిణాంతకిణ్ణ త్తఝెుం। తా కిటతక ఝెు కిటతక త్తా కిటతక ఝెుం॥ తా కిటతట ఝెు ఝెుం కిటతక ఝెుం। తాం త త్తాధిమితఘేం గిణతతా॥ తాం త త్తాధిమితదీంగిణతతా। తాంత త్తాధిమితదీంగిణతతా॥

## జతిసంపుటీకరణాక్షరములు :-

శ్లో॥ తాళశబ్దేనజాతాస్తుపంచత్రింశతివర్ణకాః,
తాటతోథై దధీధూధే డఢీఢూఢే ఘఘే
ణణే కకి గూగే రిరూరారే విలూవేలామ
యూయ శా హహ్వోనుస్వార యుక్తంచ
భరతశ్చేతి లక్షణమ్ ॥

త, ట తోథై, ద, ది, దు, దే, డా ఢి. ఢూ, ఢే. ఝు,
ఝెు, ణ, ణే. క, గి. గూ, గే. రె, రూ, ర. రే, వి, లూ. వే.
లా, మ. యూ. య, శ, హ, హం;—ను,
ఈ ముప్పది అయిదు శబ్దములును, వీని దీర్ఘములును, వీనికి వ్యాకరణ ప్రకారముగా గలుగు, అభేదాక్షరములును, తదనుగుణ్యమైన యెత్తులును, సంధులును, జతిప్రాణములైన శబ్దము లగుచున్నవి. ఇట్టి శబ్దములతో శ్రావ్యమైన జతులు కూర్చియు, కల్పించియు. శబ్దోచ్చారణ గావించుచు కొలిపించవలయును. (ఈ విధముగా నాట్యాచార్యులు స్వకల్పనలుచేసి వేనవేలుగా జతులు కల్పించి ఆడుదురు. దీనినే మనోదండి విద్యయని కూచిపూడివారు చెప్పుదురు.) (జతి సంపుటీకరణాక్షరములతో విశేషముగా జతులు కల్పించవచ్చును. నాట్యాచార్యులు, ఊహాపోహ సమర్థుడు మంచి తాళలయ జ్ఞానము కలవాడు. యైయుండవలయును.)

ధృవతాళం. అక్షరములు 14. అంగములు 4.

అంగసౌంజ్ఞ
1-0-1-1
ల-దృ-ల-ల

అనుకరణ : వేలికి ఒక అక్షరక చొప్పున.

జతి/. తకఝెణు । తక । తధిమిత । కిటతక

2. -: మఠ్యతాళ లక్షణము :- మఠ్యతాళము

శ్లో॥ లఘుధృతో లఘుశ్చైవ । మఠ్యతాళ ప్రకీర్తితః
సోమవారే అస్తరుక్షే । మఠ్యతాళ సముద్భవః ।
శ్యామవర్ణో మహాకాయే । నానాభరణ భూషితః ॥
రక్తవస్త్రంధరం చైవాభరద్వాజ । ఋషిస్వయం వీరసస్య ।
బ్రుహచ్ఛందో । మహేశ్వరీ తథా ॥
అయం ॥ ప్లక్షద్వీపవాసి, లఘుధృత లఘుస్తథా ।
స్వమతి యస్తుతంతాలం అశ్వమేధఫలం భవేత్ ॥

తా:- పది అక్షరములు, లఘువు. ధృతము, లఘువు, మఠ్యతాళ స్వరూపముగా నున్నది. సోమవారం అస్తమీ నక్షత్రమున బుట్టెను. పచ్చని వర్ణము గలది. పెద్దశరీరము గలది. అనేక ఆభరణములు గలది, యర్రని వస్త్రములు ధరించినది. భారద్వాజఋషి స్వయముగా చేసినది, వీరరసము గలది. బృహతీయను ఛందస్సు కలది. మహేశ్వరి అధిదేవత. పక్షద్వీప మందు నివాసము. లఘువు. దృతము. లఘువు కలది. బుద్ధిమంతుడు ఈ తాళమును వాయించితే అశ్వమేధ యాగము చేసినంత పుణ్యము వచ్చును.

## జంపెతాళ లక్షణమ్ :-

శ్లో॥ బుధవారే పుష్యరుక్షేజంపెతాళ సముద్భవః ।
హరిర్వర్ణోచిత్ర వస్త్రో । ముక్తమాలాయశోభితః ।
నీలవక్త్రో పంకజాక్షీ । జామదగ్ని ఋషి స్వయం ।
హాస్యరస సుప్రతిష్టాత్, చందోమైషాధి దేవత ॥
అయం ॥ కుశద్వీపవాసి । లఘుఅనుధృత ధృతస్తథా ।
ఇదం లోకహితార్ధాయు భరతజ్ఞో ప్రయుజ్యతే ॥

తా:- బుధవారం పుష్యమి నక్షత్రమున జంపెతాళము పుట్టెను. పచ్చని వర్ణము రంగు వస్త్రము గల్గినది. ముత్యాలహారము గలిగినది. నల్లని ముఖము గలది. పద్మములువంటి నేత్రములు కలది. జమదగ్ని ప్రోక్తమైనది. హాస్యరసము కల్గినది. సుప్రతిష్టిత ఛందస్సు. మైష మను నది అధిదేవత. కుశద్వీపమందు నివాసము. లఘు, అరధృతము, ధృతము గల ఈ జంపెతాళము, లోకహితవు కొరకు శాస్త్రజ్ఞులచే చెప్పబడినది.

జంపెతాళం. అక్షరములు 10. అంగములు 3. అంగసౌజ్ఞ

| | |
|---|---|
| వేలికి అక్షరం చొప్పున | 1-ᑌ-0 |
| జతి / చకిటతకఝెణు । త । కతై ॥ | ల-అ-దృ |
| | 7-1-2 |

## త్రిపుట తాళ లక్షణమ్ :- త్రిపుట

శ్లో॥ గురువారే రుద్రరుషే । త్రిపుటస్య సముద్భవః ।
శ్వేతవర్ణో పింగళాక్షో । పుష్పమాలా యశోభితః ॥
పట్టువస్త్రధరంచైవా । కశ్చపశ్చ ఋషిస్వయం ।
భీభత్సరసఃప్రుష్టి । చ్ఛందోకౌమారి దేవతా ॥

పట్టువస్త్రములు ధరించినది. మృగాళిని (పార్వతి) అధిదేవత. శాకుంతల ద్వీపమందు నివాసము. కశ్యపఋషి ప్రోక్తము. రెండు లఘువులు. రెండు ధృతాలు గలది. దీనిని అటతాళమని చెప్పబడినది.

అటతాళం. అక్షరములు 12. అంగములు 4

అంగసౌంజ్ఞ 1-1-0-0

ల-ల-దృ-దృ

4-4-2-2

(రెండక్షరముల నడక)

జతి / తా, కిటకిటతొం । తత్త, కిటకిటతొం । తకఝెణు । తకఝెణు ॥

## ఏకతాళ లక్షణమ్ :- (ఏకతాళము)

శ్లో॥ శనివారే స్వాతిరుక్షే ఏకతాళ సముధ్భవః ।
నీలవర్ణో రక్తనేత్రి రక్తమాలా విభూషితః ॥
పరపీతాంబరధరం । భారత్యామధి దేవతా ।
అయం ॥ శంబద్వీపవాసి వసిష్టఋషి న్వయం ఏక ।
తాలలఘుచైవా । తాలజ్ఞాన వినోదినః ॥

తా॥ శనివారము స్వాతి నక్షత్రమున, ఏకతాళం పుట్టినది. నల్లని వర్ణము కలిగినది యఱ్ఱని కన్నులు, యఱ్ఱని పుష్పమాలిక, శ్రేష్టమైన పట్టువస్త్రము ధరించినది. సరస్వతీదేవి అధిదేవత, శంబద్వీపమందు నివాసము, వసిష్టప్రోక్తము, ఏకతాళమునకు ఒక లఘువు తాళజ్ఞానము తెలిసిన వారు చెప్పుతున్నారు.

## తాళశబ్ద నిర్వచనము :-

శ్లో॥ తకారం శంకరప్రోక్తం । లకారం శక్తిరుచ్యతే ।
శివశక్తి సమాయోగ । దాలనాబిదియ్యతే ॥

తా॥ తకారం (త) అనే అక్షరం శంకరప్రోక్తం. శంకరునివల్ల పుట్టబడెను. "లకారం, శక్తిరుచ్యతే" లకారం (ల) అనే అక్షరం "శక్తి రుచ్యతే" శక్తి పార్వతివల్ల పుట్టిషది. శివశక్తి శివునివల్లను. పార్వతి వల్లను కలసిగల్గెను.

శ్లో॥ శివశక్త్యాత్మకం పుణ్యం । యశస్యం భుక్తిముక్తిదమ్ ।
దశప్రాణాత్మికం తాళం, యోజానాతిసతత్వవిత్ ॥

తా॥ శివశక్త్యాత్మకమైన ఈ తాళము, పుణ్యము, యశస్సు, భుక్తి ముక్తిప్రదమై వెలయుచున్నది. ధీని నెరింగినవారు తత్త్వవేత్త యనబడును.

### తాళదశ ప్రాణములు

శ్లో॥ కాలమార్గ క్రియాంగాని. గ్రహజాతి కళాలయాః॥ ।
యతిః. ప్రస్థారకశ్చేతి, తాళప్రాణదశస్మృతాః ॥

తా॥ కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము. జాతి, కళ. లయ, యతి, ప్రస్థారము ఈ పదియును తాళంబునకు ప్రాణములుగా నున్నవి.

### కాలము - లక్షణము :

తాళముయొక్క అంగముల కాలప్రమాణమును నిర్ధారణగా చెప్పెడి యంశము, కాలప్రాణ మనబడుచున్నధని చెప్పవచ్చును. ఇది సూక్ష్మకాల

మనియు, స్థూలకాలమనియు, రెండు విధములు. నూరు తామరరేకులను ఒకదానిపై నొకటిచేర్చి ఒక సూదితో ఆ రేకులపై గుచ్చినప్పుడు ఆ రేకులలో ఒకరేకు ఎంతకాలములో సూదిదిగునో, ఆ కాలము ఒక క్షణమగును

| | | |
|---|---|---|
| అటువంటి, 8 క్షణముల కాలము | — | 1 లవము |
| 8 లవముల కాలము | — | 1 కాష్ట |
| 8 కాష్టల కాలము | — | 1 నిమిషము |
| 8 నిమిషముల కాలము | — | 1 కళ |
| 2 కళల కాలము | — | 1 చతుర్భాగము |
| 2 చతుర్భాగముల కాలము | — | 1 అనుధృతము |
| 2 అనుధృతముల కాలము | — | 1 ధృతము |
| 2 ధృతముల కాలము | — | 1 లఘువు |
| 2 లఘువుల కాలము | — | 1 గురువు |
| 3 లఘువుల కాలము | — | 1 ప్లుతము |
| 4 లఘువుల కాలము | — | 1 కాకపాదము |

యని యనబడును. 1 క్షణము, 2 లవము, 3 కాష్ట. 4 నిమిషము. 5 కళ, 6 చతుర్భాగము యనుయారును, సూక్ష్మకాలములనియు, 1 అనుధృతము, 2 ధృతము, 3 లఘువు, 4 గురువు, 5 ప్లుతము, 6 కాకపాదము అను ఆరును స్థూలకాలములనియును అనబడును.

మార్గము :- ఒకతాళమునందు గానముయొక్క గమన క్రమము "మార్గము" యని చెప్పవచ్చును. ఇది ప్రస్తుతము 1 దక్షిణ. 2 వార్తిక, 3 చిత్ర. 4 చిత్రతర, 5 చిత్రతమ, 6 అతిచిత్రతమ యవి ఆరు విధములుగ చెప్పబడుచున్నది. మరియు ఈ ఆరును షణ్మార్గములని కూడా చెప్పబడుచున్నవి. ఈ ఆరింటిలో మొదటి మూడును, కృతి, కీర్తనాది ప్రబంధ గానమునందు అనుసరింపబడుచున్నవి.

1. దక్షిణమార్గ మనగా, ఒక్కొక్క తాళాక్షరమునకు యెనిమిది మాత్రలతో నడచుట.
2. వార్తికమనగా — 4 మాత్రలతో నడచుట.
3. చిత్రమార్గ మనగా — 2 మాత్రలతో నడచుట.
4. చిత్రతమ మార్గమనగా — 1 మాత్రతో నడచుట.
5. చిత్రతరు మనగా — అర మాత్రతో నడచుట.
6. అతిచిత్రతమ యనగా — పావు మాత్రతో నడచుట.

క్రియ :— కాలమును యెంచెడి విధానము "క్రియ" యనబడును. ఘాతవేయుట, వ్రేళ్ళను యెంచుట, చేతిని వెనుకకు విసరుట మొదలైనవి క్రియలనబడును. కొన్ని క్రియలుచేరి ఒక అంగమగును.

మార్గక్రియలనియు, దేశ్యక్రియలనియు రెండు విధములు. ఆరెండు విధములగు క్రియలు, తిరిగి సశ్శబ్ద క్రియలనియు. నిశ్శబ్ద క్రియలనియు రెండు రకములు. తాళాంగములు వాడునప్పుడు, శబ్దముతో కూడినవి సశ్శబ్ద క్రియలనియు. శబ్దరహితములైనవి, నిశ్శబ్ద క్రియలనియు అనబడును.

ఘాత, చిటిక మొదలైనవి సశ్శబ్ద క్రియలు, వ్రేళ్ళను యెంచుట, చెయ్యి వెనుకకు విసరుట మొదలైనవి నిశ్శబ్ద క్రియలు.

మార్గక్రియలు :— ధ్రువము, శమ్యము. తాళము. సన్నిపాతము అను నాలుగు సశ్శబ్ద క్రియలును. ఆవాపము, విక్షేపము, నిష్క్రమము, ప్రవేశము అను నాలుగు నిశ్శబ్ద క్రియలును మార్గక్రియ లనబడును.

సశ్శబ్ద క్రియలు :— 1, ధ్రువము — శబ్దపూర్వకమగు చిటిక.

2, శమ్యము:— కుడి హస్తమునందు, ఏడమ హస్తముతో ఘాత వేయుట.

3. తాళము :- ఎడమ హస్తమునందు కుడి హస్తముతో ఘాతవేయుట.

4. సన్నిపాతము :- రెండు హస్తములతో సమముగా ఘాతవేయుట.

నిశ్శబ్ద క్రియలు :- 1, ఆవాపము - ఎత్తబడిన చేయియొక్క నాలుగు వ్రేళ్ళను ముణుచుట.

2. విక్షేపము :- అటుల ముడువబడిన వ్రేళ్ళను విప్పుట.

3. నిష్క్రామము :- హస్తము కుడివైపుకు విసరుట.

4. ప్రవేశము :- ఆ హస్తమును అప్రదక్షణముగ ముందరకు తీసు కొనుట.

దేశ్యక్రియలు :- ధృవకయను సశ్శబ్ద క్రియయును, సర్పిణి. కృష్య, పద్మిని, విసర్జితము, విక్షిప్తము, పతాకము, పతిత యను నిశ్శబ్ద క్రియలును, దేశ్యక్రియ లనబడును.

సశ్శబ్దక్రియ :- ధృవక - శబ్దముతో కూడిన కుడిహస్తముయొక్క ఘాత, లేక చిటిక

నిశ్శబ్ద క్రియ :-

1. సర్పిణి :- చేతిని యెడమవైపుప విసరుట.
2. కృష్య :- ఏడమవైపున ఉన్న చేతిని కుడివైపుకు విసరుట.
3. పద్మిని :- అరచేయిని క్రిందుగాచేసి అధోముఖముగా చేయి జాచుట.
4. విసర్జితము :- పైన చెప్పబడిన అధోముఖ హస్తమును, వెలుప లికి విసరుట.
5. విక్షిప్తము :- అటుల విసరబడిన హస్తము యొక్క వ్రేళ్ళను ముణుచుట.
6. చేతిని పైకి విసరుట .- పతాకము.

7. పతిత :- పైకి విసరబడిన చేతిని క్రిందకు తెచ్చుట.

(ధృవక యనునది నిశ్శబ్ద క్రియయని అభిప్రాయ భేదము గలదు.)

అంగము :- తాళముయొక్క భాగములు అంగము లనబడును. ఆయా తాళములయం దాయా అంగములు వచ్చుటచేతనే ఆయా తాళములు మొత్తము లయస్వరూపమునందు భేదములు చెందుటయు, తద్రీత్యా ఆయా తాళములు ఒకదానితో మరియొకటి భేదించుటయు తటస్థించుచున్నది. ఆయా తాళములం దేర్పడిన అంగములవలననే, ఆయా తాళములను యెంచుటకు, వీలగుచున్నది. ఇందువలన అంగములు మారినప్పుడు మాత్రమే తాళములు ఒకదానితో మరియొకటి భేదించును. అనుధృతము. ధృతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అని ఆరు అంగములు గలవు. ఈ ఆరు అంగములే "షడంగముల"ని చెప్పబడుచున్నవి.

## షడంగముల పట్టిక

| అంగముల పేర్లు | గుర్తులు | అక్షరకాలం | మాత్రకాలము |
|---|---|---|---|
| అనుధృతము | U | 1 | ¼ |
| ధృతము | O | 2 | ½ |
| లఘువు | I | 4 | 1 |
| గురువు | S | 8 | 2 |
| ప్లుతము | 3 | 12 | 3 |
| కాకపాదము | + | 16 | 4 |

# షడంగముల వివరము :-

అనుధృతము :- ఇది ధృవక యను సశ్శబ్ద క్రియచేత వాడబడు చున్నది. అనగా ఒక ఘాతవేయుట. ఒక అక్షరకాలము గలది. అర్ధ చంద్రము. వ్యంజనము, అనునాశికము. అవ్యక్తము, విరామము, అను ధృతము. అను ఆరును దీని పేర్లు. దీనికి గుర్తు U. ఇది $\frac{1}{4}$ మాత్ర కాలము కల్గియుండును.

ధృతము :- ఇది ధృవకయను, సశ్శబ్ద క్రియచేతను. "విసర్జిత" యను నిశ్శబ్ద క్రియచేతను వాడబడుచున్నది. అనగా, ఒక ఘాతవేసి, పిమ్మట ఒక ఉసిని, (చేతిని వెనుకకు విసరుట) వేయుట. రెండక్షరముల కాలము గల్గియుండును. అర్ధమాత్రవ్యోమము. బిందుకము, వలయము. ధృతము అని పేర్లు. దీనకి గుర్తు O. ఇధి $\frac{1}{2}$ మాత్రకాలమున గల్గి యుండును.

లఘువు :- ఇది ధృవక, విక్షిప్త, అనుసశబ్ద, నిశ్శబ్ద క్రియలచేత వాడబడుచున్నది. అనగా ఘాతవేసిన తరువాత చిటికెనవ్రేలు మొదలు వ్రేళ్ళను లెక్కించుట. నాల్గు యక్షరముల కాలము గల్గియుండును. దేశ్య తాళములగు ధృవాది సప్తతాళముల సందర్భములో ఘాతయును, యెంచ బడిన వ్రేళ్ళ సంఖ్యయును గలసి లఘువుయొక్క మొత్తం అక్షరకాలపు మగుచున్నది, మాత్ర, సరళము, హ్రస్యము, కళ, లఘువు, అని దీనికి పేర్లు గలవు. దీనికి గుర్తు I. ఇది ఒక మాత్రకాలము కలిగియుండును.

గురువు :- ఇది ధృవక, విక్షిప్త, పతిత యను క్రియలచేత వాడ బడినది. అనగా ఘాతవేసి తదుపరి మూడువేళ్ళను యెంచి. పిమ్మట ఆ కుడిచేతిని యెడమచేతి మీదుగా నాలుగు అక్షరముల కాలము విసరుట.

ఒక ఘాతవేసి పిమ్మట ఏడు వ్రేళ్ళను ఎంచవలయునను అభిప్రాయభేద ముండినటుల గోచరించుచున్నది. ఎనిమిది అక్షరముల కాలము గలిగి యున్నది, ద్విమాత్రకము, వక్రకము, కాణము, యమళము, దీర్ఘము, గురువు అని దీనికి పేర్లు. దీనికి గుర్తు 8. ఇది రెండు మాత్రలకాలము కలిగియుండును.

ప్లుతము :- ఇది ధృవక, విక్షిప్త సర్పిణి, కృష్య, అను నాలుగు క్రియలచే వాడబడవలయును. అనగా ఘాతవేసి, మూడు వ్రేళ్ళను యెంచి, ఆ చేతిని నాల్గు అక్షరముల కాలము కుడివైపుకు విసరుట, ఇది పన్నెండు అక్షరముల కాలము గల్గియుండును. సమోద్భవము దీప్తము త్రియంగము త్రిమాత్రకము ప్లుతము అని దీనికి పేర్లు గలవు. దీనికి గుర్తు 3. ఇది మూడు మాత్రల కాలము కల్గియుండును.

కాకపాదము :- ఇది సర్పిణి, కృష్య, పతాక, పతిత యను క్రియ లచే వాడవలయును. అనగా చేతికి నాలుగు అక్షరముల కాలము చొప్పున ఎడమ వైపునకును, కుడివైపునకును విసరి పిమ్మట నాల్గు అక్షరముల కాలములో ఆ చేతిని క్రిందకు తెచ్చుకొనుట, ఇది పదియారు అక్షరముల కాలము కలిగియుండును. హంసపాదము నిశ్శబ్దము చతుర్లఘువు కాక పాదము అని దీనికి పేర్లు గలవు. దీనికి గుర్తు +. ఇది నాల్గు మాత్ర కాలము కలిగియుండును. ఈ అంగమునకు అన్నియు నిశ్శబ్ద క్రియలే.

# షోడశాంగ ప్రస్తారము

| | అంగముల పేర్లు | గుర్తులు | అక్షరకాలం |
|---|---|---|---|
| 1 | అనుధృతము | U | 1 |
| 2 | ధృతము | O | 2 |
| 3 | ధృత విరామము | U O | 3 |
| 4 | లఘువు | I | 4 |
| 5 | లఘు విరామము | U I | 5 |
| 6 | లఘుధృతము | O I | 6 |
| 7 | లఘుధృత విరామము | U O I | 7 |
| 8 | గురువు | S | 8 |
| 9 | గురువు విరామము | U S | 9 |
| 10 | గురుధృతము | O S | 10 |
| 11 | గురుధృత విరామము | U O S | 11 |
| 12 | ప్లుతము | 3 | 12 |
| 13 | ప్లుతవిరామము | U 3 | 13 |
| 14 | ప్లుతధృతము | O 3 | 14 |
| 15 | ప్లుతధృత విరామము | U O 3 | 15 |
| 16 | కాకపాదము | + | 16 |

# గ్రహ లక్షణమ్ :-

శ్లో॥ అతీత నాగతశ్చైవ । సమస్య విషమోపిచః ।
గ్రహశ్చతుర్విధోప్రోక్తం । తత్వరూప నిరూప్యతే ॥

తా॥ అతీతమనిన్నీ, అనాగతమనిన్ని. సమమనిన్ని, విషమమనిన్ని, ఈ నాలుగు గ్రహములు భరత శాస్త్రజ్ఞులచేత చెప్పబడియున్నది.

# వీని లక్షణములు

శ్లో॥ దితాతితే ద్వితీయశ్యా । తాలాదీతేత్వరాగతః ।
సమే సమగ్రహప్రోక్తం, విషమే విషమస్తథా ॥

తా॥ గీతాతితే, గీతము. "అతీతే," ముందునడచి. తాలమును వెనుక నడచినట్లయితే "గీతాతీత" మనంబడును. "తాలాతీతే" తాలము ముందు నడచి గీతము వెనుకనడచినట్లయితే, "తాలాతీత" మనంబడును. సమే సమగ్రహప్రోక్తం, సమె. తాళము, గీతము, సమముగా నడచినట్లయితె, సమగ్రహప్రోక్తమనబడును. విషమే విషమస్థథ, తాళము, మధ్య గీతము నడచినట్లయితే విషమస్థథ, "విషమ" మనబడును.

# యతి లక్షణము

శ్లో॥ సమశ్రోత్రోపహాభ్యాయో, గోపుశ్చేపిపీలికః ।
మృదంగికాంశ విషమం. యతియోషడ్విధశ్రృతిః ॥

తా॥ సమ. సమయతిన్ని, శోత, యతినిన్నీ, గోపుళ్ళ, గోపుశ్చేయతినిన్ని, పిపీలిక యతినిన్నీ, మృదంగిక. మృదంగయతినిన్ని. విషము, విషమయనిన్ని ఈ ఆరున్ను యతులకు పేర్లు.

# జాతుల లక్షణము

శ్లో॥ అనుధృతంచ. చతురశ్రం । తత్రయుక్తంచ ముచ్యతే ।
మిశ్రజాతి సప్తకంప్రోక్తం । ఖండతః పంచకస్తథా । నవాను
ధృతకశ్చైవ । సంకీర్ణకథ్యతేబుధః ॥

తా॥ అనుధృతంచ చతురశ్రం, చతురశ్రజాతిని, తత్రయుక్తంచ. ముద్యతే, తిశ్రజాతిన్ని, మిశ్రజాతి సప్తకః. మిశ్రజాతిన్ని, ఖండతః, పంఛకస్తథా, ఖండజాతిన్ని, నవానుధృతకశ్చైవ, నవసంకీర్ణజాతిన్ని, కథ్యతే అనబడుచున్నది. బుదః. పెద్దలచే చెప్పబడినది.

-: ఆది, అనుధృతము, బిందువు, చాపు తాళము :-

శ్లో॥ నకారం ప్రాణనామానం. దకారంమనలంవిదుః ।
జాతాః ప్రాణాగ్ని సంయోగ । తైనసాదో అనుధృతం ॥

తా॥ నాదమను రెండక్షరములు యేజంత్రముకైననూ, నాభిస్థానమందు నాదం పుట్టెను. (న) అక్షరము ప్రాణమని. గుహ్యాస్థానము మనస్సని ప్రసిద్ధమైయుండును. (ద) యను అక్షరము అగ్నిస్వరూపమని చెప్ప బడెను, మణిపూరకం నాభిస్థానమున, ఈ ప్రాణాగ్నులయొక్క సంయో గమువలన నాదము శబ్దమయ్యేను. అదియే అనుధృతం. అదియే కుంభకం, కుంభకమే నాదము. రెండుచేతుల సందడే అనుధృతమని, అదియే శబ్దమై సర్వాంతర్యామి అయ్యేను, అక్షరము ఇదియె.

-: ఆదిగురువు యెనిమిది అక్షరములు :-

శ్లో॥ లఘుర్వేకోధృతద్వయం । ఆదితాళే లఘుస్థుఠితః ॥

తా॥ ఒక్కలఘువు రెండు ధృతములు కలసి ఒక్కగురువు అదియే తెలుగులో ఒక అవృతమని పేరు. ఆది యెనిమిది అనుధృతములవుటచే

ఒక్క గురుస్వరూపమాయెను. అదియే చతురశ్రజాతి. రెండు లఘువుల చేరికవల్ల రెండు ఏకతాళముల సంయోగము వలన గురుతాళ మేర్పడెను.

-: జుల్వతాళ లక్షణ క్రమము :-

శ్లో॥ త్రిమాత్రకం, తధాత్యంగం । జుల్వతాళ సముద్భవం ॥

తా॥ మూడు విరామములు ఒక్క కాకపాదమైనందున మూడు విరామము లవుటచే తిశ్రజాతి చాపుతాళమని జుల్వతాళమని చెప్పబడెను.

శ్లో॥ లఘుధృత, ద్విలఘుంచ । ధృవతాళాంగమేవచ ॥

తా॥ ధృవతాళమునకు. వక్కలఘువు, ధృతము, రెండు లఘువులు మొత్తము పదునాల్గు విరామములు. ఆవృతమైనందున పదునాల్గు అక్షరములు కల్గినందున అది ధృవతాళమని పేరుకల్గెను.

-: తాళస్వరూపము తెలియకున్న కలుగు నష్టములు :-

శ్లో॥ తౌర్యత్రికం తాళహీనంచాలయోత్పురుషాధమః ।
నపాపి నరకం ఘోరమాగచ్ఛతిసాన్వయః ॥

తా॥ ఎవరైననూ నృత్యము, అభినయము, పాటకచ్చేరి. హాస్యం, హరికథ, తీరిక, ముక్తాయి, వాద్యము చేయునపుడు తాళానుగుణములేక కొలిపించునో వాడు పురుషులలో అధముడనియు, పాపాత్ముడనియు, వంశములోకూడ ఘోరనరకమును శీఘ్రముగా హోందును యని తాత్పర్యము. శ్రద్ధ, భక్తి, నిధి, ధ్యానము గలిగి తాళమును యెవరు మంనిగా వేయుదురో వారు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కలిగి భగవంతునిలో ఐక్యము బొందుదురని సిద్ధాంతము.

-: తాళస్వరూపము తెలియుటవల్ల ఉపాసించుటవల్ల గలుగు ఫలము :-

శ్లో॥ తౌర్యత్రికనిదానంచ । తాళం కాలస్వరూపిణి
దశప్రాణ సమోపేత, యోజనాతి సతత్వవిత్ ॥

తా॥ నృత్య. గీత, వాద్య. అభినయము, ఆదికారణమైనదియు, దశప్రాణములతో కూడుకొనియుండు. పరమాత్మయను తాళస్వరూపమును, యెవరు తెలుసుకొందురో, వారు సర్వేశ్వర స్వరూపమును తెలిసినవారగుదురు. స్వరూపము రెండుచేతుల సంజ్ఞవంటిది, తీరిక, ముక్తాయి. పాట, గాత్రము, వాద్యము చేయునప్పుడు *అవులయ" గా వేయుదురు, ఘోర నరకమును పొందుదురు.

శ్లో॥ శివశక్తి ఆత్మపుణ్యం । యశశ్యం భుక్తిముక్తదం ।
ధశప్రాణాత్మకం తాళం । యోజనాతి సతత్వవిత్॥

తా॥ శృతిర్మాతా, శృతి తల్లివంటిది. నాదము తెలుసుకున్నందున శివ అనగా శక్తి స్వరూపము. కీర్తికరంబును భుక్తి ముక్తి ప్రదంబును దశప్రాణ సహితంబునుయగు తాళమును యెవరు తెలియుదురో వారు బాల స్వరూపమగు సర్వేశ్వరుని స్వరూపము చూడగలుగుదురు. గాన తాళస్వరూపమును యెవరు తేలుసుకొందురో వార్కి అనంతపుణ్యమని భరతజ్ఞుడు వాల్మీకి చెప్పెను.

-: దేవధాసీయని నాయకీపుణ్యం :-

శ్లో॥ లోకేదేవేచ వచసాం । పాదయోర్గతిరుక్తహా ।
తాళేసై వినాతేసస్కలనంతేషు దశ్యతే ॥

తా॥ లౌకికము, వైదీక, వాక్కుల. పాదము, సంకల్పము. ఈ అయిదింటిచే స్వరూపమాయెను. అదియే పృథ్వి. అప్పు, తేజస్సు, వాయువు,

ఆకాశము. ఈ అయిదును మనోమయం, అన్నమయం. విజ్ఞానమయం, ఆనందమయం. జాతామయం. ఈ మొత్తముచే స్థూలమై శరీరము అవయవములు కలిగినందున పంచేంద్రియములు పుణ్యమని చెప్పబడెను. ఇవియే పంచేంద్రియముల పుణ్యం.

-: తా ళ శ బ్దో త్ప త్తి :-

శ్లో॥ తాళస్తల ప్రతిష్టాయా. మితిధాతో ప్రయోగతః ।
నృత్తగీతం తథావాద్యం, యతస్తాలే ప్రతిష్టితం ॥

తా॥ తలప్రతిష్టాయాం, అనుధాతువునకు ఘ, ఞ ప్రత్యయిమువచ్చి, తధృర్ధి తాళ, శబ్దము పుట్టెను, ఈ ధాతువు ప్రతిష్టార్ధకముగ నున్నది. ఇందు గీత, వాద్య, నృత్తములు నెలకొనియుండును, (మరియు)

—: తా ళా వ శ్య క త :—

శ్లో॥ గీత ప్రధానం ప్రవధంతి, నృత్తం; నృత్తప్రదానం ।
ప్రవదంతివాద్యం, నృత్తగీత వాద్యచయప్రధానం ।
తత్తాళమాద్యం ప్రణమామినిత్యం ॥

తా॥ అనగా, నృత్తగీత వాద్యములకు తాళము ప్రధానమనియు తాళమేలేకున్న నృత్తగీత, వాద్యములులేవని తెలియపలయును.

—: తాళ. నృత్తగీత, వాద్యోత్పత్తి క్రమము :—

శ్లో॥ వాగ్దేవిధృతపల్లకీ శతముఖోవేణుం, దధత్పద్మజ ।
స్థాలోనిద్రకరో, రమాభగవతి గేయప్రయోగాన్విత ॥
విష్ణుస్సాంద్ర మృదంగవాదనపటరేవాసమంతాస్థితా ।
స్సేవంతేతమనుప్రదోషసమయే, దేవంమృడానీపతిం॥

తా॥ శివతాండవ సమయమున పార్వతి పరమేశ్వరాత్మకముగా తాళము పుట్టెననియు, దానిని బ్రహ్మదేవుడు ప్రయోగింపగా విష్ణువు ప్రస్థరించెననియు, అప్పుడీ నృత్యగీతాదులు పుట్టెనని తెలియుచున్నది.

అట్లు బ్రహ్మదేవునిచే ప్రతిష్టింపబడి ప్రస్థరింపబడిన తాళమే, సప్త తాళములై నూటొక్కతాళంబు లయ్యెనని తెలియవలయును.

—: తాళ మెరుంగుటవల్ల ఫలములు :—

శ్లో॥ శివశక్త్యాత్మకం పుణ్యం యశస్యం, భుక్తిముక్తిదం।
దశప్రాణాత్మకం తాళం, యోజనాతినతత్వవిత్ ॥

తా॥ పార్వతి పరమేశ్వర స్వరూపంబును. పుణ్యఫల స్వరూపంబును. కీర్తి, ముక్తి, భుక్తి ప్రదంబును, దశప్రాణయుక్తంబును అగు తాళము నెవ్వరెరింగి నృత్త, గీత వాద్యంబులు నడుపునో వారు జగదీశ్వరుని నెరిగినవా రగుదురని తెలియవలయును.

## తాళము తెలియకున్న దోషములు :-

శ్లో॥ గీత, వాద్యం, చ నృత్యంచ, తాళహీనం నరాజితే ।
త్రైర్యత్రికం, చాలయేత్పురుషాధమః ॥

తా॥ తాళహీనముగా నొనరించిన గీత వాద్య నృత్యములు ప్రకాశింపకపోవుటయేగాక ఆ విధముగ నొనర్చిన మనుజుడు వంశపరంపరముగ ఘోర నరకమును పొందును.

## చతురశ్రజాతి ధృవతాళం (సప్తతాళ లక్షణములు)

అంగసౌంజ్ఞ 1-0-1-1
అంగములు 4. ల-దృ-ల-ల
అక్షరములు 14. 4-2-4-4 = 14 అ॥

జతి :- తాతాదీం ధీకితక తాతాహ త్తదీందా
ధిమితధీం ధికితక ధిమికహ త్తదీకదా

జతి:- లాధింతకఝెణు । తకధిమి । తకిట తకిటఝెం
తకిటతకిటఝెం । తరికిటతక తరికిటతకతొం । తరికిటతక
తరికిటతకతొం ॥

చతురశ్రజాతి - మఠ్యతాళము

అంగసౌంజ్ఞ 1-0-1
అంగములు ల-దృ-ల
అక్షరములు 4-2-4 = 10 అ॥

జతి :- తై, తైందత్త, తై కిటతక తాతైందత్త, తై, తై,
జతి :- తా, ది, న్నాతత్తొం, తాదిన్నతాదిన్నతత్తొం, తాదిన్నతాదిన్నతత్తొం
తాదిన్న తాదిన్న తత్తొం ॥

చతురశ్రజాతి రూపక తాళము :

అంగసౌంజ్ఞ 0-1
అంగములు దృ-ల
అక్షరములు 2-4 = 6 అక్షరములు

జతి :- తాతాధీం దికితక తా తదీంతా
ధిమితధీం దికితక ధిమి తదీందా

జతి :- తాధింధిన్నా తకధిం దింన్నా తరికిటతక తరికిటతకతొం ।
తాధింధిన్నా తరికిటతక తరికిటతకతొం తరికిటతక తరికిటతకతొం॥
తాదిందిన్నా । తరికిటతకతొం - తరికిటతకతొం - తరికిటకకతొం

-: మిశ్రజాతి జంపెతాళము :-

ఆంగసొంజ్ఞ 1-U-0

అంగములు ల-అను-దృ

అక్షరములు 7-1-2 = 10 అం॥

జతి :- తద్ధిం దద్దో కిటత త్త హతై, తై ।
త త్త త్త తై కిటత త్త హతై. తై ॥

జతి :- తాకిటతకడెగ తకతళంగుతొం ।
త త్త కిటతకడెగ తకతళంగుతొం ॥
తళంగుతొం, తళంగు తళంగుతొం ।
తళంగుతొం, తళంగు తళంగుతొం ॥
తళంగు త త్తకిటతక, తళంగు త త్తకిటతక ।
తళంగు త త్తకిటద దిగిణతొం ॥

జతి :- తాదృగుడు జంణగజం తధిమితతా ।
త త్తదృగుడుజంణగజం తధిమితతా ॥
తధిమితతా. తధిమిత, తధిమితతా ।
తధిమితతా, తధిమిత తకత దిగిణతొం ॥

-: తిశ్రజాతి త్రిపుట తాళము :-

అంగసొంజ్ఞ 1-0-0

అంగములు ల-ధృ-ధృ

అక్షరములు 3-2-2

జతి :- ధీం ధికితక దొద్దో దీందా ।
దిందాకిట దొద్దో దందా ॥

జతి :- తకిట తకిట తకుం దరికిటతక ।
తకధికతక తక తదిగిణతోం ॥

జతి :- దృగుడు తాతాకిట కతతోం తత్తోం 2 సార్లు
దృగుడు దాదా కిటతక దాధా కిటతక నన్నం కిటతక
తోంగుడు దిద్ధి కిటతక తక తదిదిణతోం ॥

జతి :- ధీకుణాంగు తాంహ త్త కిటతక ।
ధి త్తళాంగు ధి త్తళాంగుతోం ॥
తరికుణాంగు తాంహ త్త కిటతక
తరికుణాంగు తరికుణాంగుతోం ॥
ధీకుణాంగు తాంహ త్త కిటతక
తరికుణాంగు తాంహ త్త కిటతక ।
ధీకుణాంగు తరికుణాంగుతోం ॥ 3 సార్లు

జతి :- దాద్దా దీందాం. దాద్దాద్దా దీందాం
తద్ధికితక తాంహ త్త కిటతక
తకధికితక తకత దిగిణతోం
కిటతక తదిగిణత, తక తదిగిణత
తదిగిణత, దిగిణత. గిణత.

-: మిశ్రచాపు జతులు :-

జతి :- తకిటతక తక తకిటతోం 2 సార్లు
తకిట తకతక తకిట తకతక
తద్దితా తాధితా తదిగిణతోం

తాం తదిగిణతోం తై తదిగిణతోం

జతి :- ధాకిటతక ధాకిట కిటతక

ఝె కిటతక ఝే కిటతక

తరికిటతక త త్తరికిటతక

తతతతఝేం, తతతతఝోం, తతతతఝెం ॥

జతి :- ధిమిత ధిమిత తకధిమితఫీ

ధిమిత ధిమిత కధిమితఫీ

ధిమిత ధిమిత కధిమిత ధిమితక

ధిమిత తా తకధిమిత తదిగిణతోం 3 సార్లు

-: ఆది, తిశ్రనడక జతులు :-

జతి :- తాం త త్తఝొణు తకధికి త త్తఝొణు 2 సార్లు

తకదికి త త్తదిందతాం 3 సార్లు

జతి :- తాదిన్న తకదిన్న తకదిన్నతొంతొ 2 సార్లు

తాదిన్న తకదిన్న తకదిన్న తాదిన్న

తాదిన్న కిటతక ఝెంత. కిటతక ఝెం తఝెం ॥ 3 సార్లు

-: ఆది, ఖండనడక జతులు :-

జతి :- తాంతతై । తైహి త్త । త త్తతై తాతైత ।

తతై హితతా, తతై హి త్తతా, తతై హి త్తతా ॥

జతి :- తఝొణుత । తకధిమిత । తకుందరిత తత్తొం । 2 సార్లు

తఝొణుత తకధిమిత । తకుంధరిత । తకధిమిత ।

తఝొణుత । తకఝొణుత । తద్దింగిణ్ణాత । 3 సార్లు

## ముప్పదియైదు తాళములు, జతులు :-

1. చతురశ్ర ధృవతాళం 14 అ. శ్రీకర తాళం

జతి :- తా ధిం తకఝొణు । తకధిమి । తకిట తకిటఝొం.

తకిట తకిటఝొం తరికిటతక తరికిటతక తొం

తరికిటతక తరికిటతక తొం లు-దృ-లు-లు

1-0-1-1

2. తిశ్రధృవ తాళం : 11 అ. లు-దృ-లు-లు మణితాళం.

1-0-1-1

జతి :- ఘీం తత ఘీం తత ఘీంతత ఘీం ఘీం ఘీం తత

ఘీంత, ఘీంత ఘీంతత్తొ, ఘీంత ఘీంత ఘీంతత్తొం.

మిశ్ర ధృవతాళం 23 అ. లు-దృ-లు-లు పూర్ణతాళం

1-0-1-1

జతి :- జాగధిగఘేంత, జాజాగధేంత, జాగధేంత. జాగధేంత

గధేంత గధేంత ।

కిటతక తదిగిణతొం కిటతక కిటతక తదిగిణతొం

కిటతక తదిగిణతొం కిటతక కిటతక తదిదిణతొం

కిటతక తదిగిణతొం కిటతక కిటతక తదిగిణతొం

కిటతక తదిగిణతొం కిటతక కిటతత తదిగిణతొం

ఖండ ధృవతాళం :- 17 అ. లు-దృ-లు-లు ప్రమాణతాళం.

1-0-1-1

జతి :- దోహంతొ దొంగిన దొంగి దొంగిన. దొంగి దొంగిన

ధోం ధోం । ధోంత ధోంతధోం।

దోహంతో దొంగిన తకిట కకిట తఝెం, తకఝెం.
తక్కిట తకతఝెంత, తక్కిట తకతఝెంత.
సంకీర్ణ ధృవతాళం : 29 అ. ల-దృ4ల-ల ఘువనతాళం.

జతి :- తా-దీ-నా-దీ-నా-తా-దిం-దీ-నా-త, ఝెం (మొదటికాలం)
తాదీనదినతాదిందీన. తదినదిసతదిందీన (రెండవకాలం)
తదినదిన తదిందిన, తదినదినతదిందిన, తదినదిన తదిందిన, తదిన
దిన తదిందిన (మూడవకాలం)

చతురశ్ర మఠ్యతాళం :- 10 అ. ల-దృ-ల సమతాళం.
1-0-1

జతి :- తా. ధి, న్నా తత్తాం. తాధిన తాధినతత్తాం. తాధినతాధినతత్తాం,
తాదిన్న తాదిన్న తత్తాం ॥

తిశ్ర మఠ్యతాళం :- 8 అ. ల-దృ-ల సారతాళం.
1-0-1

జతి :- దీం ధీం త, ధీం ధీం తతోం ధీం ధీం తత్తోం, ధీం, తకిట
తత్తోం తోం ॥

మిశ్రమఠ్య తాళం :- 16 అ. ల-దృ-ల దీర్ణతాళం
1-0-1

జతి :- కిటతకఝెం, తకిటతదిగిణతోం కిటతకఝెం, తకిట తదిగిణతోం
తదీంగిణతతోం. తా కిటతక తదీంగిణత తత్తోం తాకిటతక
తదీంగిణత తత్తోం.

ఖండమత్య తాళం :- 12. ల-ద్రు-ల ఉదయతాళం.
1-0-1

జతి :- ధాడధాఘిణ్ణ ఘిణ్ణ, తాగె తిరికిట ధిణ్ణ ఘిణ్ణ, తిరికిట తిరికిట
ధిణ్ణ ఘిణ్ణ. ధాగె తిరికిట ధిణగిణ్ణధా, ధాగె తిరికిట ధిణ్ణఘిణ్ణధా.

సంకీర్ణ మత్యతాళం :- 20 అ. ల-ద్రు-ల రావతాళం.
1-0-1

జతి :- దాం దాం ధికితక దం దం దాం ధికితక, దాం ధికితక.
దాం దికితక తత్తొంతొంతోం, తద్దిం, గిణాత, దాందాంధికితకతత్తొం
దాందాంధికితక తత్తొం. దాందాంధికితకతత్తొం.

చతురశ్ర రూపకం :- 6 అ. ద్రు-ల పత్తితాళం
0-1

జతి :- తాధిందిన్నా తకధికదిన్నా తరికిటతక తరికిటతకతొం
తాధిందిన్నా తరికిటతక తరికిటతకితొం తరికిటతక తరికిటతకతొం
తాదిందిన్నా. తరికిటతకతొం-తరికిటతకతొం- తరికిటతకతొం

తిశ్ర రూపకం :- 5 అ. ధ్రు-ల చక్రతాళం
0-1

జతి :- జాగధి గధిధిం. జాజాగధీంత తత్తొం, జాగధీంతతత్తొం,
జాగధీంత తత్తొం,

ఖండ రూపకం :- 7 అ. ద్రు-ల రాజతాళం
0-1

జతి :- తద్ధిత్తా ధిత్తా తా తదిగిణతొం (3 సార్లు)

మిశ్ర రూపకం :- 9 అ. దృ-ల కులతాళం.
0-1

జతి :- తకతదిగిణత, తత్తోంత తకతదిగిణతతత్తోంత
తకతదిగిణత తత్తోంత ॥

సంకర్ణ రూపకం -: 11 అ. దృ-ల బాదుతాళం.
0-1

జతి :- తఝెంతకఝెం, తకుందరి కిటతకతత్తోం, తకుందరికిట
తకతత్తోం, తరికిటఝెం. తరికిటఝెం. తరికిటఝెం.

చతురశ్ర జంపె :- 7 అ. ల-అను-దృ మధుకరతాళం.
1-U-0

జతి :- ధీంత ధీంత, తధీంత ధీంతతక, ధీంత, ధీం తధీం తత్తోం.

మిశ్రజంపె :- 10 అ. ల-అను-దృ సురతాళం.
1. -0

జతి :- తా, కిటతక ఢెదతక తళంగుతోం. త త్తకిటతక ఢెగతక
తళంగుతోం. తళంగుతోం. తళంగుత త్త కిటతక.
తళంగుత త్తకిటతక తకతదిగిణతోం ॥

తిశ్ర జంపె :- 6 అ. ల-అను-దృ కదంబ తాళం.
1-U-0

జతి :- తాం తాం త తకఝెణు, తధిమి । తిఝెంతతక. తదీద్దితక ॥
తకుందరి కిటతక. తకఝెణు ।
తదిగిణత, తదిగిణతతోం ॥

ఖండ జంపె :- 8 అ. ల-అను-దృ చరాతాళం.
1-u-0

జతి :- తాదిగిదిగి తాదిగిదిగి తాదిగిదిగితాఆ, తత్తది దిగి
తత్త దిగిదిగి తత్త దిగిదిగిత్తైఇ। తత్త దిగిదిగిత్తైఇ 2
-తదిగిణత, తదిగిణత, తదిగిణత.

సంకీర్ణ జంపె :- 12 అ. ల-అను-దృ కరతాళం.
1-u-0

జతి :- తాకుధణకుఝ్ఝోం తరికిటతక తరికిటతకతోం తదీంగిణ తతోం.
ధణకుకిణకుఝ్ఝోం తరికిటతక తరికిటతకతోం
తదీంగిణత తతోం। తాకుధణకుఝ్ఝోం తాతఝ్ఝోంతరి
ధణకుకిణకుఝ్ఝోం తాతాఝ్ఝోం తాతఝ్ఝోం తరి
తాకుధణకుఝ్ఝోం, ధణకు కిణకుఝ్ఝోం।
తాతాతాతది, తదితాద్ధి త్తాతాతాతది
తదితాద్ధి। తాకిటతకతోం, తత్త కిటతకతోం, తదిగిణతోం.

చతురశ్ర త్రిపుట :- 8 అ. ల-దృ-దృ ఆదితాళం.
1-0-0

జతి :- తఝ్ఝోణుతకఝ్ఝోణు తకధిమిత। తకుందరికిటతకత
తఝ్ఝోణుత। ధిమిధిమితధిమిత. ధిమిధిమితధిమిత।
-తదిగిణత. తదిగిణత. తదిగిణత.

తిశ్రతిపుట :- 7 అ. ల-దృ-దృ శంఖతాళం.
1-0-0

జతి/ ధేంధికె తకదొద్దాదీందా దిందాకిట దొద్దోదీందా
కెటతక తదిగిణత, తకతదిగిణత. తదిగిణత, దిగిణతగిణత.

మిశ్ర త్రిపుట :- 11 అ. ల-దృ-దృ లీలతాళం.
1-0-0

జతి/ దీంధీంత,తకతత్తొంత, దీందీంత, తకతత్తొంత ॥
ధేం ధీం తతొం, ధీం ధీం తతొం, ధేం ధీం తత్తొం ॥

ఖండ త్రిపుటః :- 9 అ, ల-దృ-దృ దుష్కరతాళం.
1-0-0

జతి/ తద్ధిత్తా హతఝెంతరి తకుందరి కిటతక - తదిగిణత - తదిగిణత.
తదిగిణత,

సంకీర్ణ త్రిపుట :- 13 అ. ల-దృ-దృ భోగతాళం.
1-0-0

జతి/ తా ధిగ్ ధిగ్ ధాదా, తిటిగధగధిఘెనదా, తిటిగధ
గధిఘెనదా, తిటిగధ దధిఘెనదా.

చతురశ్ర అట :- 12 అ. ల-ల-దృ-దృ శేఖతాళం.
1-1-0-0

జతి/ తఝెణు తకఝెణు తకధిమితా, తకుందరి
కిటతక తకధిమిత । ధిమిధిమిత ధిమిత
తకతక తఝెంత తకతక తఝెంత తక తఝెంత తక తఝెంత
తఝెంత, తదిగిణత, తదిగిణత, తదిగిణత.

తిశ్ర అట :- 10 అ. ల-ల-ద్రు-ద్రు గుప్తతాళం.
1-1-0-0

జతి/ తా, ఝొంత తికతఝొం । తతద్ధిమ్మి, తాఝొంతతక
తకా ధికి ఝెణు తదిగిణతొం ॥

మిశ్ర అట :- 18 అ. ల-ల-ద్రు-ద్రు లోయతాళం.
1-1-0-0

జతి/ తద్ధిత్తరిత్త ఝెణు తద్ధిత్తా, తళాంగుతొం. తరికిటతొం.
తకది తరిత్తఝెణు తద్ధిత్తై, తళాంగుతొం, తళాంగుతొం
తద్ధిత్త రిత్తఝెణుత, తకధిత రిత్తఝెణుత్తై ।
తద్ధిత్త రిత్తఝెణు, తకద్ధిత్త రిత్తఝెణు. తరిత్తఝెణు.
తరిత్తఝెణు, తదీంగిణత, తకతదీంగిణత.
తకధికు తదీంగిణత తదిగిణత. తదిగిణత, తదిగిణత.

ఖండ అట :- 14 అ. ల-ల-ద్రు-ద్రు విదళతాళం.
1-1-0-0

ధాధా ధింధా కిటధాధింధా కిటతక
ధాడధాఘిణ్ణఘిణ్ణ. ధాడధాఘిణ్ణఘిణ్ణ
ధాఘే తిరికిట ధిణ్ణఘిణ్ణధా, దాఘే తిరికిట ధిణ్ణఘిణ్ణధా
దాగె తిరికిట ధిణ్ణఘిణ్ణ, తద్దీంగిణత, తద్దీంగిణత, తద్దీంగిణత ॥

సంకీర అట :- 22 అ, ల-ల-ద్రు-ద్రు దీరతాళం.
1-1-0-0

జతి/ తగణం తరితగజగణం త తకిట తఝ్ఝకిణం తరి
ధణా ధణా । తఝ్ఝంత । ధణాంత గధింత
రితాంత. తకాధికీఝ్ఝణు తధిగిణతొం,
తద్దింగిణత, తద్దింగిణత. తద్దింగణత ॥

చతురశ్ర ఏకతాళం :- 4 అ. ల మానతాళం.
1

జతి/ ధిగిణత.

తిశ్ర ఏక .: 3 అ. ల సుధాతాళం.
1

జతి/ గిణత.

మిశ్ర, ఏక :- 7 అ. ల రాగతాళం.
1

జతి/ తక తదిగిణత.

ఖండ ఏక :- 5 అ. ల రతితాళం.
1

జతి/ త్రకతకిట.

సంకీర్ణ ఏక :- 9 అ. ల వసుతాళం.
1

జతి/ కిటతక త్రదిగిణత్ర.

# ముప్పదియైదు తాళముల, అంగ, సంజ్ఞల పట్టిక

| తాళములు | అక్షరములు | అంగములు | అంగసంజ్ఞ | అంగవిభాగము |
|---|---|---|---|---|
| చతుర-దృవ | 14 | ల-దృ-ల-ల | 1-0-1-1 | 4-2-4-4 |
| త్రిశ్ర-ధృవ | 11 | ల-దృ-ల-ల | 1-0-1-1 | 3-2-3-3 |
| మిశ్ర-ధృవ | 23 | ల-దృ-ల-ల | 1-0-1-1 | 7-2-7-7 |
| ఖండ-దృవ | 17 | ల-దృ-ల-ల | 1-0-1-1 | 5-2-5-5 |
| సంకీర్ణ-దృవ | 29 | ల-దృ-ల-ల | 1-0-1-1 | 9-2-9-9 |
| చతుర-మఠ్య | 10 | ల-దృ-ల | 1-0-1 | 4-2-4 |
| త్రిశ్ర-మఠ్య | 8 | ల-ధృ-ల | 1-0-1 | 3-2-3 |
| మిశ్ర-మఠ్య | 16 | ల-దృ-ల | 1-0-1 | 7-2-7 |
| ఖండ-మఠ్య | 12 | ల-దృ-ల | 1-0-1 | 5-2-5 |
| సంకీర్ణ-మఠ్య | 20 | ల-దృ-ల | 1-0-1 | 9-2-9 |
| చతుర-రూపక | 6 | ల-దృ | 1-0 | 4-2 |
| త్రిశ్ర-రూపక | 5 | ల-దృ | 1-0 | 3-2 |
| మిశ్ర-రూపక | 9 | ల-ధృ | 1-0 | 7-2 |
| ఖండ-రూపక | 7 | ల-దృ | 1-0 | 5-2 |
| సంకీర్ణ-రూపక | 11 | ల-దృ | 1-0 | 9-2 |
| చతుర-జంపె | 7 | ల-అను-దృ | 1-U-0 | 4-1-2 |
| త్రిశ్ర-జంపె | 6 | ల-అను-దృ | 1-U-0 | 3-1-2 |
| మిశ్ర-జంపె | 10 | ల-అను-దృ | 1-U-0 | 7-1-2 |
| ఖండ-జంపె | 8 | ల-అను-దృ | 1-U-0 | 5-1-2 |
| సంకీర్ణ-జంపె | 12 | ల-అను-దృ | 1-U-0 | 9-1-2 |
| చతుర-త్రిపుట | 8 | ల-దృ-దృ | 1-0-0 | 4-2-2 |
| త్రిశ్ర-త్రిపుట | 7 | ల-దృ-దృ | 1-0-0 | 3-2-2 |
| మిశ్ర-త్రిపుట | 11 | ల-దృ-దృ | 1-0-0 | 7-2-2 |
| ఖండ-త్రిపుట | 9 | ల-దృ-దృ | 1-0-0 | 5-2-2 |
| సంకీర్ణ-త్రిపుట | 13 | ల-దృ-దృ | 1-0-0 | 9-2-2 |
| చతురశ్ర-అట | 12 | ల-ల-దృ-దృ | 1-1-0-0 | 4-4-2-2 |
| త్రిశ్ర-అట | 10 | ల-ల-దృ-దృ | 1-1-0-0 | 3-3-2-2 |

| తాళములు | అక్షరములు | అంగములు | అంగసౌజ్ఞ | అంగవిభాగము |
|---|---|---|---|---|
| మిశ్ర-అట | 18 | ల-ల-దృ-దృ | 1-1-0-0 | 7-7-2-2 |
| ఖండ-అట | 14 | ల-ల-దృ-దృ | 1-1-0-0 | 5-5-2-2 |
| సంకీర్ణ-అట | 22 | ల-ల-దృ-దృ | 1-1-0-0 | 9-9-2-2 |
| చతుర-ఏక | 4 | - ల- | - 1- | - 4- |
| తిశ్ర-ఏక | 3 | - ల- | - 1- | - 3- |
| మిశ్ర-ఏక | 7 | - ల- | - 1- | - 7- |
| ఖండ-ఏక | 5 | - ల- | - 1- | - 5- |
| సంకీర్ణ-ఏక | 9 | - ల- | - 1- | - 9- |

## ముప్పదియైదు తాళముల నామములు, అక్షరములు

| తాళములు | పేర్లు | పేర్లు | పేర్లు |
|---|---|---|---|
| చతుర-ధృవ | శ్రీరక | వటి | వరాహవీణ |
| తిశ్ర-ధృవ | మణి | పిక | గణేశవీణ |
| ఖండ-ధృవ | ప్రమాణ | సక | మహేశవీణ |
| మిశ్ర-ధృవ | పూర్ణ | లర | సురేశవీణ |
| సంకీర్ణ-ధృవ | భువన | ధర | ధాత్రీశరీణ |
| మిశ్ర-మత్య | సార | హీన | గోదావరీ |
| చతుర-మత్య | సమ | నట | వినోదినీ |
| ఖండ-మత్య | ఉదయ | రిపు | మనోదినీ |
| తిశ్ర-మత్య | ఉదీర్ణ | తప | సౌదామిని |
| సంకీర్ణ-మత్య | రావ | నర | ధీశాలినీ |
| తిశ్ర-రూపక | చక్ర | బాణ | గౌతమీ |
| చతుర-రూపక | పత్తి | ఋతు | భారతీ |
| ఖండ-రూపక | రాజ | తురంగ | మహతీ |
| మిశ్ర-రూపక | కుల | నిధి | సుదతీ |
| సంకీర్ణ-రూపక | బిందు | హర | దరిత్రి |

| తాళములు | పేర్లు | పేర్లు | పేర్లు |
|---|---|---|---|
| తిశ్ర-జంపె | కదంబ | ఋతు | లీలాంగ |
| చతుర-జంపె | మధుర | హయ | వేదాంగ |
| ఖండ-జంపె | చణ | వసు | శుభాంగ |
| మిశ్ర-జంపె | సుర | దిక్ | ఛాయాంక |
| సంకీర్ణ-జంపె | కర | రవి | ఝుషాంక |
| తిశ్ర-త్రిపుట | శంఖ | తురంగ | గీతానుగ |
| చతుర-త్రిపుట | ఆది | మాతంగ | వర్ణానుగత |
| ఖండ-త్రిపుట | దుష్కర | నిధి | మహీధర |
| మిశ్ర-త్రిపుట | లీల | ఈశ | సుధానిధి |
| సంకీర్ణ-త్రిపుట | భోగ | విశ్వ | ధాత్రీధర |
| తిశ్ర-అట | గుప్త | నట | లక్ష్మీనాయక |
| చతుర-అట | లేఖ | రటి | వాణీనాయక |
| ఖండ-అట | విదళ | వటి | శచీనాయక |
| మిశ్ర-అట | లోయ | జటి | సతీనాయక |
| సంకీర్ణ-అట | ధీర | కర | ధాత్రీనాయక |
| తిశ్ర-ఏక | సుధ | అనల | లక్ష్మీతాళము |
| చతుర-ఏక | మాన | అబ్ధి | వాణీ |
| ఖండ-ఏక | రత | శర | శచి |
| మిశ్ర-ఏక | రాగ | అశ్వ | సతీ |
| సంకీర్ణ-ఏక | వసు | నిధి | ధాత్రీ |

— ⁝ —

## హస్తాధ్యాయము :-

శ్లో॥ అథేధానీంతు హస్తానాం, లక్షణాని యథాక్రమమ్ ।
అసంయుతాస్సంయుతాశ్చ నృత్యహస్తాస్త్రిధామతాః ॥

తా॥ హస్తములు అసంయుతములని, సంయుతములని నృత్తహస్తములని మూడు విధములు.

## అసంయుత హస్తములు :-

పతాకస్త్రి పతాకొఽర్ధ పతాకః కర్తరీముఖః
మయూరశ్చార్ధ చంద్రశ్చా, ప్యరాళ శుకతుండకః
ముష్టిశ్శిఖర సూచ్యాస్యః, కటకాముఖః
బాణస్సర్పశిరః, పద్మకోశో మృగశిరస్తథా
లాంగూల స్సింహవదనశ్చ. తురశ్చాలపల్లవః
హంసాస్యో భ్రమరోహం సపక్షశ్సందంశ ఇత్యపి

ముకుళస్తామ్రచూడశ్చా, సంయుతాః కధితాః కరాః ॥
ఏతేసప్త వింశతిర సంయుతహస్తాః. పూర్యచార్యోదితాః
తేషాం లక్షణ వినియోగౌకధ్యతే ॥

తా॥ 1 పతాక, 2 త్రిపతాక, 3 అర్ధపతాక. 4 కర్తరీముఖ, 5 మయూర, 6 అర్ధచంద్ర. 7 అరాళ. 8 శుకతుండ. 9 ముష్టి, 10 శిఖర. 11 కపిధ్ధ, 12 సూచ్యాస్య. 13 కటకాముఖ, 14 బాణ, 15 సర్పశిర. 16 పద్మకోశ. 17 మృగశిర, 18 లాంగూల, 19 శింహముఖ, 20 చతుర. 21 అలపల్లవ. 22 హంసాశ్య, 23 భ్రమర. 24 హంసపక్ష, 25 సందంశ. 26 ముకుళ, 27 తామ్రచూడము అని ఇరువది ఏడు అసంయుత హస్తములు నాట్యాచార్యులుచేత చెప్పబడియున్నవి. ఇంక లక్షణ వియోగములు తెల్పుదును.

# పతాక హస్త లక్షణము :-

పతాకః కుంచితాంగుష్ఠోథవేత్సంప్రసృతాంగుళిః ।
ధాతురన్య జనిర్జాతిః బ్రాహ్మీవర్ణస్తుపాండురః ।
హరిద్దైవం ఋషిశ్శూలి, వినియోగోనిగద్యతే ॥

తా॥ హస్తముయొక్క వ్రేళ్ళన్నియు చాచిపట్టి బొటనవ్రేలును ముడిచినగో (వంచిన) పతాకహస్తమగును. ఇది బ్రహ్మవల్ల జన్మించినది. బ్రాహ్మణజాతి. తెలుపు వర్ణము. విష్ణువు దైవము. శివుడు ఋషి.

వి ని యో గ ము లు :-

నాట్యారంభము, పండితుడు. మార్దవము, రాత్రి. కుచస్థలం. వనము, గుజ్జము. తరంగము. దేవతా సమూహము, వాయువు, ప్రయాణమగుట. ప్రతాపము, శయనము, ఎండ, శుభము, వెన్నెల, మేడ. సప్తవిభక్తులు, తటాకము. జయము. భయము, విసయము, నిర్భయము, చీల్చివేయుట, సముద్రము, తలుపువేయుట, సైన్యము, కప్పుకొనుట, రక్షించుట. భూమి, తళతళమను మెరుగు. సూర్య చంద్రుడు. అగ్ని. సౌందర్యములు, తొందర. మెల్లన, యుద్ధము, గొడుగు. సమూహము, ధిక్కారము, అహంకారము. మనోవికారములు, కత్తి, తొండము,రాళ్ళు, వాద్యము, పాదరసము, సంతోషము, ధ్యానము, నీరాజనము, వారము, అయినము (దక్షిణాయన ఉత్తరాయణములు), నెలలు, సంవత్సరము, జలపానము. దిక్కులు, పాపపుణ్యములు, విరోధము, కపోలము, నడుము, గోడ, పరబ్రహ్మ. ప్రవాహము, దట్టము, పాలు, గంధము పూయుట, వక్షస్థలము, క్షమించుట, విద్య. ఓర్పు, కౌగిలి దేవలోకము, దయ, కొంచెమను-అర్ధము. ఉద్యానవనము, సభ, యోగ్యము, దుఃఖము, నమస్కారము, నీడ, వెండినాణెము, ద్వీపము. చల్లదనము, పాదము, నుదురు. తిథులు, దేవత, శుక్రవారము, ఓదార్చుట,



1. పతాకము



2. త్రిపతాకము



3. అర్ధపతాకము



4. కర్తరీముఖము



5. మయూరము



6. అర్ధచంద్రము



**7.** అరాళము



**8.** శుకతుండము



**9.** ముష్టి



**10.** శిఖరము



**11.** కపిద్థము



**12.** సూచ్యాస్యము



**13.** కటక ముఖము



**14.** బాణహస్తము



**15.** సర్పశీర్షము



**16.** పద్మకోశము



**17.** మృగశీర్షము



**18.** లాంగూలము



**19.** సింహముఖము



**20.** చతురము



21. అలపల్లవము



22. హంసాస్యము



23. భ్రమరము



24. హంసపక్షము



26. సదంశము



25. ముకుళము



27. తామ్రచూడము

వెతుకుట, ఆశీర్వాదము వీనియందు ఈ పతాకహ_స్తము వినియోగించునని పండితులు చెప్పియున్నారు.

-: త్రిపతాక హ_స్త లక్షణ వినియోగములు :-

పతాకస్త్రి పతాకస్స్యాత్కుంచితా౽నామికాయది ।
హరేరస్య జనిర్దైవం హరోజాతి స్తుబాహుజా ।
ఋషిర్గుహో౽రుణోవర్ణో వినియోగ స్తుకథ్యతే ॥

తా॥ పతాక హ_స్తమందు అనామికను సగమువరకు వంచిబట్టిన త్రిపతాక హ_స్తమగును. ఇది ఇంద్రునివల్ల పుట్టినది. దైవము శివుడు. జాతి క్షత్రియ. ఋషి గుహుడు. ఎర్రని రంగుకలది.

వి ని యో గ ము లు :-

నెరసిన వెంట్రుకలు, కిరీటము, వృక్షము, దేవేంద్రుడు, మొగలి పువ్వు, దీపిక, అగ్నిజ్వాలలు, చక్రము, విష్ణువు, పరాజయము, కోపము. అరణ్యము. భయము, వీరరసము, శయనము, సంధేహములు, అద్దము, శిరము, బొట్టు. చెంప, కేశసమూహము, చిగురుటాకులు, దంతము, మనో వికారము, క్రిందిపెదవి, బాణము, రాజు, అరటిచెట్టు. మకరికాపత్రము, మెరుపువర్ణము, ఊర్ధ్వపుండ్రము, తరుణిభాష్పము, వంశము. వాహనము' పఃగ. స్థాణువు, నిష్టురము, వర్షము. సంతానము, దేవతలు, శాపము, చేప. తుమ్మ, కడగంటి చూపులు. తాపము. ఉద్దీపనము, వ్రాయుట. చెప్పుట, వస్తువులను తాకుట, మంగళవారం, ప్రతీపమను అర్థాలంకారము, కాటుక, అంకుశము, ఓడ. ముక్కు, గోళ్ళు, చెక్కిలి, నుదురు, నడుము, రాగి వీనియందు ఈ త్రిపతాక హ_స్తము వినియోగించును.

-: అర్ధపతాక హస్తలక్షణ వినియోగములు :-

సఏవార్ధ పతాకస్స్యాత్కనిష్టా వక్రితాయది ।
భృగోరస్య జనిర్వర్ణః పీతఈశౌహరీశ్వరౌ ।
ఋషిర్భృగుః క్షత్రజాతి ర్వినియోగోస్యకథ్యతే ॥

తా॥ త్రిపతాక హస్తమందలి చిటికెన వ్రేలిని వంచిపట్టిన అర్ధపతాక హస్తమగును. ఈ హస్తము భృగువువల్ల పుట్టినది. బంగారు వర్ణము కలది. శివకేశవులు అధిదేవతలు. భృగువు ఋషి, క్షత్రియ జాతి.

వి ని యో గ ము లు :-

ఇద్దరనుటయు. చిగురుటాకు. ఫాలము, రంపము, పలక, ఒడ్డు, ధ్వజము, గోపురము, కొమ్ము, చాకు, అధరము, గోమేధిక రత్నము, బాణము, నదియొక్క ఉభయతీరములు, యుక్తి వీనియందు ఈ హస్తము చెల్లును. వినియోగించును.

-: కర్తరీముఖ హస్తలక్షణ వినియోగములు :-

తర్జనీ మధ్యమే తిర్యగ్వక్రితే కర్తరీముఖః ।
హారదస్య జనిర్వర్ణోఽరుణశ్శ్రీశోఽధిదేవతా ।
నృజాతిశ్చాస్యపర్జన్య ఋషిః కృత్యంనిగద్యతే ॥

తా॥ త్రిపతాక హస్తమందలి చూపుడువ్రేలు, నిడిమివ్రేలు వెలియగునట్లు త్రిప్పిపట్టిన కర్తరీముఖ హస్తమగును. [ "త్రిపతాకాయాంవా అర్ధపతాకాయాంవా-తశ్మిన్నితిశేషః" ] అని వ్యాఖ్యానము. [ అనగా కర్తరీ ముఖహస్తము. త్రిపతాక అర్ధపతాకలనుంచి గ్రహింపదగునని భావము. కనుక త్రిపతాకమునుండి కర్తరీముఖము గ్రహించుట ప్రసిద్ధమైనదియైనను నూతనహస్త సంపాదనార్థము. అర్ధపతాకమునుండియు గ్రహింపబడినది.

ముద్రిక యివ్వబడినది.] ఇది శివునివల్ల జన్మించినది. రక్తవర్ణము. అధి దేవత శ్రీమహావిష్ణువు. క్షత్రజాతి. పర్జన్యుడు ఋషి.

వి ని యో గ ము లు :-

విపరాస్యము, దాంపత్యవియోగము, ఆబోతు, ఏకశయ్యా వియోగము (చెరివకవైపు పరుండుట), జింక, చమరీమృగము, కారెనుబోతు. మొసలి, మెరుపు, చక్రము, గోపురము, వృక్షములు, కపటము, మనోవికారము, వేగము, భయము, పర్వతము, దొంగిలించుట, మరణము, నింద, లత్తుక పూసుకొనుట, వెంట్రుకలు, వేగిరపాటు, శ్రీమహావిష్ణువు, ఖడ్గము, నాటకాభినయము, కిరీటము, పక్షులు. భీభత్సరసము, చదువుట వీనియందు వినియోగము.

-: మయూర హస్తలక్షణమ్ :-

శ్లో॥ అస్మిన్ననామికాంగుష్ఠౌ । శిష్టౌచాన్యే ప్రసారితాః ।
మయూరహస్తః కథితస్తస్య లక్షణముచ్యతే ॥

తా॥ కర్తరీముఖ హస్తమందలి అనామికాంగుష్ఠములను చేర్చిపట్టి, ఇతర అంగుళులను చాచిపట్టినచో మయూరహస్త మగును,

వి ని యో గ ము లు :-

నెమలి, ముఖము, తీగె, పక్షి, వమనము, ముంగురులు దిద్దుట. లలాటము, తిలకము, కన్నీటిని హరింపచేయుట, శాస్త్రవాదము, హారము, ఇంద్రనీలమణి, విద్యాధరకులము వీనియందు వినియోగించును. ఇది విష్ణువల్ల పుట్టినది. నీలమైన వర్ణముగలది. ఋషి శుకుడు. ఇంద్రుడు అధిదేవత.

-: అర్ధచంద్ర హస్త లక్షణమ్ :-

శ్లో॥ అర్ధచంద్ర కరస్సోఽయం పతాకేఽంగుష్ఠసారణాత్ ॥

తా॥ పతాక హస్తమందలి అంగుష్ఠమును పొడవుగా చాచిపట్టిన అర్ధ చంద్రమగును. చంద్రునివల్ల పుట్టినది. ఇది ధూమ్రవర్ణము, వైశ్యజాతి, ఈశ్వరుడు దైవము. అత్రిమహాముని ఋషి.

వినియోగములు :-

కృష్ణాష్టమి చంద్రుడు, మెడపట్టి త్రోయుట. భల్లాయుధము. దేవతా భిషేకము, భోజనపాత్ర, పుట్టుయందు, కటిప్రదేశము, చింతించుట. "నేను" యనుట, ధ్యానము, ప్రార్థించుట, అంగస్పర్శ. ప్రాకృతజనుల నమస్కారములు, కంకణము, విస్మయము, కంఠము, అంకుశము, కనుబొమ్మలు, వెన్నెల-కాముకుడు, అవయవములను పిసుకుట, చెక్కిలి, నుదురు, వీపు, జగడము, చెవులు, తిరస్కారము. అరటిచెట్టు, అపరాధ నిరోధనము, పాదము, గరుత్మంతుడు, నగము, మృగము, శత్రువు, కుండలములు, చంద్రకాంతము, పిరుదులు, జడ, చంకలు, మోకాలు, అంకురము (మొలక), సిగముడి. పరిశుభ్రము, అద్దము, ఏమి? అను అర్థము, చెంపదెబ్బ వీని యందు ఈ హస్తము వినియోగించును.

-: ఆరాళహస్త లక్షణము :-

శ్లో॥ అరాళ స్తర్జనీ వక్రాప్రతాకే చేద్భవేత్కరః।
ఋషిః పితాఽస్యచాగస్త్యః । శ్వేతవర్ణోపతిర్హరిః ॥
జాతిర్మిశ్రాచ కధితా వివియోగోస్యకధ్యతే ॥

తా॥ పతాక హస్తమందలి చూపుడువ్రేలు వంచిపట్టినచో అరాళహస్తమగును. దీనికి తండ్రియు, ఋషియు - అగస్త్యుడు. తెలుపు వర్ణము. విష్ణువు అధిదేవత.

వి ని యో గ ము లు :-

విషము త్రాగుట, అమృతము త్రాగుట. ఉదకము త్రాగుట, శౌర్యము, సైన్యము, ప్రదక్షిణము, ప్రాంతనృత్యము, దేశీనాట్యము,

వాసనచూచుట, యోగము లాలించుట, మౌనము, వంటచేయుట, ముఖమందలి చెమట తుడుచుట, ఆశీర్వచనము. కంకణము, త్రిపుండ్రము. సుడిగాలి, బొమముడి, ప్రతిబింబము, నడుము, చేయదగిన పని, ధైర్యము, మదము, సంతోషము, అందము, విటుడు, గట్టిమాట, తొందర, తాంబూలము, రుచులు, యుద్ధము, గడియారము (కలశం), భుజశక్తి, జుట్టుపట్టుకొనుట, ఆపోశనము, కూచిమారుడను నాయకుడు (శృంగార నాయకులలో ఒకరు), భూమి-చివరిభాగము, ఛండమారుతము, గాంభీర్యము మొదలగు వాటికి ఈ హస్తము వినియోగించును.

-: శుకతుండ హస్త లక్షణము :-

శ్లో॥ అరాళేఽనామికావక్రాశుకతుండో భవేద్యది ।
దుర్గాయాజనిరరుణోవర్ణో మహేశ్వరకులంచర్షిః ।
దూర్వాశాశ్చమరీచిర్దైవం వినియోగఉచ్యతేచాస్య ॥

తా॥ అరాళ హస్తమందలి అనామికను వంచినచో శుకతుండమగును. ఇది దుర్గవల్ల పుట్టినది. ఎరుపు వర్ణము. మహేశ్వర కులము, మరీచి దైవము, దూర్వాసుడు ఋషి.

వి ని యో గ ము లు :-

తొందరమాటలు, ఈటె, చిలుక, మర్మముగా మాట్లాడుట. ఖడ్గము ఎరుపురంగు, మౌనము, బ్రహ్మాస్త్రము, కొంతి, బాణము. ధ్యానము, పక్షి, తిరస్కారము, భూమి, సంభోగము. గోరువంక పిట్ట. మేఘము. భయము తీర్చుట. కోపగించుట, నీవు, నేను యని యనుట, తాబేలు, ముఖస్తుతి, ఆత్మస్తుతి, మధ్యమ, ఉత్తమ, అధములమాటలు, జూదము. పాచికలు ఆడుట, కోరిక, తపస్సుచేయుట. భయము. వంశము, దేవతాల, రౌద్ర రసము, తామరతూడు, భవిష్యధర్మము, ఆలోచన, పూలుకోయుట, వ్యాళీ నాట్యము (నాట్యభేదము), ప్రారంభించుట. నాట్యము ముగించుట, పంచమ

స్వరము, పాంచాల పురుషుడను శృంగారనాయకుడు, బాణప్రయోగమునందు కుంతాయుధము, మర్మప్రసంగము, ఉగ్రము ఈ హస్తము వినియోగించును.

-: ముష్టిహస్త లక్షణము :-

శ్లో॥ అంగుష్ఠాధఃకరే కుంచితాంగుళిర్ముష్టిరుచ్యతే ।
ఋషిరుగ్రోజనిర్విష్ణుర్వీరభద్రోఽధిదేవతా ।
వర్ణోనీలశ్శూద్రజాతిర్వినియోగస్య కథ్యతే ॥

తా॥ బొటనవ్రేలి క్రిందికి మిగిలిన వ్రేళ్ళన్నియు ముడిచిపట్టిన ముష్టిహస్తమగును. దీనికి ఋషి ఉగ్రుడు. విష్ణువువల్ల పుట్టినది. అధి దేవత వీరభద్రుడు. వర్ణము నీలము. శూద్రజాతి.

వి ని యో గ ము లు :-

సిరత్వము. స్థైర్యము, మల్లయుద్ధము. ఘంటను పట్టుకొనుట. శీఘ్ర గమనము, తొడలు పిసుకుట, తేలిక (అవమానము). ఆకర్షించుట, డాలు, ఖడ్గము, కుంతము మొదలగు ఆయుధములు ధరించుట, భద్రుడను శృంగార నాయకుడు. నడుము, క్రోధము, చిహ్నము. త్రాసు. మూఢుడు, మూర్ఛనమ స్కారము, లోహము. గడ్డము, పూలగుత్తి, కచగ్రహణము, తాండవకాది నాట్యము వీనియందు ఈ హస్తము చెల్లును.

-: శిఖరహస్త లక్షణమ్ :-

శ్లో॥ ముష్టిశ్చేదున్నతాంగుష్ఠశ్శిఖరః పరికీర్తితః ।
శివార్జునిరుచిర్లీలో మన్మథోదైవమర్జునః ।
ఋషిర్జాతిస్తు గాంధర్వో వినియోగస్య ఉచ్యతే ॥

తా॥ ముష్టి హస్తమందలి బొటనవ్రేలిని ఊర్ధ్వముఖముగా చాచి పట్టిన శిఖరహస్తమగును. ఇది శివునివల్ల పుట్టినది. నీలవర్ణము. మన్మధుడు దైవము. అర్జునుడు ఋషి. గాంధర్వజాతి.

వి ని యో గ ము లు :-

తాను. నిశ్చయము. కాదనుట. స్తంభము. ఘంట, మన్మధుడు, ధనస్సు. స్థిరత్వము. శిఖరము. అర్ధచంద్రుడు. బొట్టు, దత్తుడను శృంగార నాయకుడు. వినాయకుడు. ముని, ఈశ్వరుడు. యముడు. బోయవాడు. ధ్వజము. గంభీరము. నాట్యారంభము. సుందరి, మంచిమాటలు, విలాసములుగల స్త్రీ (వేశ్య). సిగ్గు, సంతోషము. దుఃఖము. గుజ్జుపు కళ్ళెము, గృహము. శాఖము. ఇంద్రుడు. రాయి. భల్లము, గుద్దలి, శక్త్యాయుధము. సరసము. నిశ్చలము. ఓడ. మృధుత్వము. పితృతర్పణము. మొక్కపోవుట. నాల్గు యను సంఖ్య. కపటము. కృశించుట. ఇష్టము. గౌరి, కుటుంబ పోషణము. అప్పుడు. ఏమి : అనుట. కొంచెమనుట. పగడము, వృషభజాతి. బృహస్పతి. గురువారము వీనియందు ఈ హస్తము వినియోగించునని భరతులు చెప్పియుండిరి.

-: కపిద్ధ హస్తము లక్షణము :-

శ్లో॥ అంగుష్ఠేఽత్రిశ్రితావక్రాకపిద్ధస్సర్జపీ భవేత్ ।
కులమార్షంఽజనిశ్శోరేగ్గౌరోవర్ణోఽధిదేవతా ।
విరించిర్నారదఋషిః వినియోగోఽస్య కధ్యతే ॥

తా॥ శిఖర హస్తముయొక్క బొటనవ్రేలియందు చూపుడు వ్రేలును వంచిపట్టిన కపిద్ధహస్తమగును. ఇది ఋషిజాతి. విష్ణువునుండి పుట్టినది. గౌరవర్ణము. బ్రహ్మ అధిదేవత. నారదుడు ఋషి.

వి ని యో గ ము లు :-

పార్వతి. లక్ష్మి, సరస్వతి, ధూప, దీప, పూజలు. గద, అంకుశము, అస్త్రము. చక్రము. జపమాలిక, వజ్రాయుధధారియగు ఇంద్రుడు, పుచ్చుకొనుట. నిశ్చలముగా నుండుట, కవ్వపుత్రాడు లాగుట, నటుడు, తాళము పట్టుకొనుట, వడవ, ఓర్పు. పమిటచెంగు పట్టుకొనుట మోహము, విసరివేయుట (ఎగురవేయుట), వాసన చూచుట, మునీశ్వరుడు. పుట్టుక, మేఘము, గౌరవర్ణము, సంతాపము వీనియందు ఈ కపిద్థహస్తము చెల్లును.

-: సూచీముఖ హస్తలక్షణము :-

శ్లో॥ కుంచితానామంగుళీనామగ్రేంగుష్ఠం నివేశయేత్ ।
ప్రసారయేత్తర్జనీంచబుధస్సూచీముఖః కరః ॥
ఋషిస్సూర్యః పితాబ్రహ్మ విశ్వకర్మాఽధిదేవతా ।
వర్ణశ్వేతో దేవజాతిః, వినియోగస్తుకథ్యతే ॥

తా॥ ముడిచిన వ్రేళ్ళ చివరి భాగమును. బొటనవ్రేలినుంచి చూపుడు వ్రేలు చాచిపట్టిన సూచిముఖ హస్తము వచ్చును. దీనికి ఋషి సూర్యుడు. బ్రహ్మవల్ల పుట్టినది. అధిదేవత విశ్వకర్మ. తెలుపు వర్ణము. దేవజాతి.

వి ని యో గ ము లు :-

ఏకసంఖ్య, బాణము, సూర్యుడు, పరబ్రహ్మ, బ్రహ్మదేవుడు, పట్టణము, లోకము, అలాగేయను అర్థము. ఏదియో అదియను అర్థము. భయపెట్టుట దిక్కులు, ఉదయము. అస్తమయము, చక్రము త్రిప్పుట (తిరుగుట). రక్షించుట, సత్యవాక్కు, వెయ్యి (సంఖ్య). విరహము, నూరు (సంఖ్య), కోపము భూమి. నాశనము, శలాక, వ్రాయుట, సూది, కృశించుట. తామరతూడు, చిత్రము, నూగారు. నిర్ణయము, మనస్సూచిన, నీచులను చూపుట, వినుట, మోసము, లెక్కపెట్టుట. ఒకానొక లోహము, బుద్ధి, గుణము. కనుబొమలు, ఘటిక (ఘడియ), నాభి వీనియందు ఈ సూచిముఖ హస్తము చెల్లును.

-: ఖటకాముఖ హస్త లక్షణమ్ :-

శ్లో॥ శ్లిష్టాకపిత్థేంగుష్ఠాగ్రే తర్జనీఖటకాముఖః ।
ఋషిః పార్థో జనిశ్శుక్రాత్పీతవర్ణోఽధిదేవతా.
రాఘవోఽమరజాతిశ్చ వినియోగో నిగద్యతే॥

కపిద్ధ హస్తమందలి చూపుడువ్రేలిని, బొటనవ్రేలి యందు నొక్కి పట్టిన, కటకాముఖ హస్తమగును. దీనికి అర్జునుడు ఋషి, శుక్రుని వల్ల పుట్టినది. బంగారువర్ణము. శ్రీరాముడు అధిదేవత, దేవజాతి. (గ్రంథాంతరములందు, అంగుష్టాగ్రమున, తర్జనీమధ్యమాంగుళి సంయోగము కనబడుచున్నది. సంప్రదాయముకూడ నట్లే యున్నది. వినియోగముకూడ సమానముగనే యున్నది. గాన రెండురకముల ముద్రలు చూపవచ్చును.

వి ని యో గ ము లు :-

గుఱ్ఱపు కళ్ళెము పట్టుకొనుట. పండ్లు తోముకొనుట. అభిషేచనము. వింజామరము, విసనికర్ర, గొడుగు, గంధము, హారము, పూలమాల, అద్దము. వీనిని ధరించుట, తాంబూలమిచ్చుట. ఆట, ప్రదేశము-(క్రీడా విశేషము). నృత్యాంతము, బాణము సంధించుట, ఇంద్రనీలమణి. పూవులు కోయుట, భేరివాయించుట. మర్యాద, వీనియందు ఈ కటకాముఖ హస్తము వినియోగించునని భరితాదుల మతము.

-: బాణహస్త లక్షణము :-

శ్లో॥ కుంచితానామంగుళీ నామగ్రేఽం గుష్టం నివేశయేత్ ।
ప్రసారయేత్కనిష్ఠాంచ బాణేభరతకోవిదః

స్కంధః పితాచదైవంచ జాతిర్బ్రాహ్మ ఋషిశ్శివః
వర్ణోఽశితాస్య సంప్రోక్తో వినియోగో నిగద్యతే ॥

చేతి వ్రేళ్ళన్నియు ముడిచి, వానిమీద బొటనవ్రేలుంచి చిటికెన వ్రేలు చాచిపట్టిన బాణహస్తమగును. ఇది కుమారస్వామి వల్ల పుట్టినది. కుమారస్వామియే దైవము. బ్రాహ్మణజాతి శివుడు ఋషి, వర్ణము నలుపు.

వి ని యో గ ము లు :-

వెంట్రుకలు దిద్దుట, సంధి నృత్తమను నాట్య విశేషము. నాగలి ధరించుట. ఆరు అను సంఖ్య. కొంటెవానితనము గొడుగు. నఖక్షతము. చెమటతీయుట. పర్వతమెత్తుట. వీనియందు ఈ హస్తము వినియోగించును.

:- సర్పశిరహస్త లక్షణము :-

శ్లో॥ పతాకస్సర్పశీర్షస్స్యాన్నిమ్నకరతలేయది.
పీతవర్ణోజ నిర్విష్ణోశ్శివో దైవ మృషిర్వృషా.
దేవజాతి ప్రయోగోస్యకథ్యతేఽభినయోచితః ॥

పతాకహస్తము యొక్క అరచేయి నిమ్నముగ చేసిన సర్పశీర్ష హస్తము వచ్చును. ఇది పసుపురంగు. విష్ణువు నుండి పుట్టినది. శివుడు దైవము. దేవజాతి. ఇంద్రుడు ఋషి.

వి ని యో గ ము లు :-

గంధము. నమస్కారము. పాము. పొట్టివాడు. బురద. కుంకుమను కుస్తీపట్టుట. మంచిమాటలు, కచ్చతీర్చుకొను మాటలు. ఏనుగు మొదలగు

నవి త్రాగుట. దేవ-ఋషి- తర్పణములు ఇల్లు. యాచించుట. లాలించుట. కన్నీరు తుడుచుకొనుట. ముఖము కడుగుకొనుట. పసిబిడ్డ. కొంచెము. శీఘ్ర, శోషణము. (వేగించుట) వంగుట. జుట్టు ముడివేయుట. దోషములెన్నుట. గూఢార్థము. అయ్యోయనుట. చిత్రము. అశ్వాదులమీద చేతితో తట్టుట. బొమ్మ, నూగారు. గంధపుపొడి చల్లుట, వీనియందు ఈ సర్పశీర్ష హస్తము వినియోగించబడును.

:- పద్మకోశహస్త లక్షణము :-

శ్లో॥ విరాహాః కించిదంగుష్యః కుంచితాః పద్మకుట్మలః
ఋషిర్విధిర్జ సిర్విష్ణో శ్వేతవర్ణశ్చ భార్గవః ।
అధిదైవం యక్షజాతి ర్వినియోగోఽస్య కధ్యతే ॥

చేతిత్రేళ్ళన్నియు కొంచెము ఎడముగా పట్టిన. పద్మకోశహస్తము వచ్చును. ఈపద్మకోశమునకు ఋషిబ్రహ్మ. విష్ణువువల్ల పుట్టినది. తెలుపు వర్ణము, అధిదేవత భార్గవుడు. యక్షజాతి.

వి ని యో గ ము లు :-

పాము. పుట్ట. కమలము. ఘంట. బంతి. అద్దము. చకోరము.కొప్పు గుండ్రనివస్తువు. రథచక్రము. (చక్రవాకము) వికాసము. మామిడిపండు. పూలవర్షము. చెంబు, కొబ్బరిబొండము మొదలగునవి. పూమొగ్గ, కొండ గోగు తీగెలు మొదలైనవి వంచుట కారణము, శృంగారము. స్తనములు. వీనియందు హస్తము చెల్లును.

:- మృగశీర్షహస్త లక్షణము :-

శ్లో॥ సర్పశీర్షే కనిష్ఠాంగుష్ఠోన్నత్యా మృగశీర్షకః ।
గౌర్యాజనిర్హరోదైవ, మృషిర్మార్కండ ఉచ్యతే,
మునిజాతి శ్వేతవర్ణో, వినియోగోఽస్య కధ్యతే ॥

సర్పశీర్షహస్తమందలి కనిష్టికాం గుష్టములను, చాచిపట్టిన మృగశీర్ష హస్తము వచ్చును. నిది పార్వతివల్ల పుట్టినది. శివుడు దైవము. మార్కండేయుడు ఋషి. ముని జాతి. తెలుపు వర్ణము.

వి ని యో గ ము లు :-

పసిపిల్లలు. స్త్రీ. వాదము. సంతోషము. ప్రత్యక్షముచేయుట. అవుట, చెమట తుడుచుకొనుట. వస్త్రము. శరీరము. గొడుగుపట్టుకొనుట. గుఱ్ఱము. పైరు. గృహము. పక్షిముక్కు. గంధము మొదలగునవి పూయుట.సోపానములు. శాంతము. సమానము. గోడ, పుణ్యము, మృగముఖము. సిగ్గు, చమత్కారము, సంజ్ఞ. రంగవల్లి, (ముగ్గు) ఇష్టము. శివలింగము. నేను అనుఅర్థము. కన్యక, ఎద్దు. ( "స రి గ మ ప ద ని" ) యను సప్తస్వరముల యందలి "గ" యనుస్వరము. గాంధారము, శిశ్నము, తెరపించుట, బవ-బాలవాదికరణములు లేక త్రికరణములు. చింత, ఓనియందు సమయోచితముగ మృగ శీర్షహస్తము వినియోగించుచున్నది.

-: లాంగూలహస్త లక్షణము :-

శ్లో॥ పద్మకోశేఽనామికాచేల్లాంగూలః కుంచితాభవేత్
ఋషిరగ్నిర్జని శ్శంభో, ర్గౌరోవర్ణోఽధి దేవతా.

లక్ష్మినాధశ్శిద్ధజాతి, ర్వినియోగోఽస్యకథ్యతే ॥

పద్మకోశమందలి అనామికను అరచేతిలోకి వంచిన లాంగూల హస్త మగును. అగ్నిహోత్రుడు, ఋషి ఈశ్వరునివలన పుట్టినది. గౌరవరణము, అధిదేవతలక్ష్మినాధుడు. శిద్ధజాతి.

వి ని యో గ ము లు :-

పూగుత్తి. పండు. గజ్జె. (కింకిణి) గుండ్రనివస్తువు (గోలి). చాతక పక్షి. చకోరపక్షి. వక్క. నిమ్మ. నేరేడు. ద్రాక్షపండు. వడగండ్లు. కర క్కాయ. సీసము. మితభోజనము. పగడము. గడ్డము పట్టుకొనుట, రుద్రాక్ష పుష్యరాగమణి. నక్షత్ర సముదాయము, ప్రశస్తము. వీనియందు లాంగూల హస్తము వినియోగించును.

:- సింహవదనహస్త లక్షణము :

శ్లో॥ మధ్యమానామికాంగుష్ఠ శిఖరామేళనాత్తథా ।
అన్యప్రసారణాత్సింహవదనః పరికీర్తితః ।
ఆముష్యక్షత్రియాజాతిః వినియోగోనిగద్యతే ॥

మధ్యమ-అనామికాంగుష్ఠములు కూర్చి పట్టి కనిష్ఠక తర్జనులు చాచి పట్టిన, సింహవదన హస్తమగును. దీనికి ఋషి బ్రహ్మ. తండ్రి దక్షుడు. వర్ణము నీలము. దైవము శివుడు. జాతి క్షత్రియ.

వి ని యో గ ము లు :-

కమలము, పూలమాల, చిరునవ్వు. సువాసన, ఎద్దు.మంగళస్నానము

సింహము, హోమము, వైద్యము, నీతి, మోక్షము, సంధానము, దర్భను కదిలించుట, కంచు, శుద్ధిచేయుట, ధైర్యము, వంటకము, వజ్రమణి. గాంధారము, (సప్త స్వరములలో నొకటి) సింహాసనము, ఉప్పు, చెవి. జపమాలధరించుట, గున్నఏనుగు, వీనియందు ఈ సింహవదన హస్తము చెల్లును.

-: చతురహస్త లక్షణము :-

శ్లో. తర్జన్యాద్యాసమీకృత్య, కనిష్ఠాంచ సమున్నయేత్ ।
చతురోఽనామికామూలే, తతోఽంష్ఠం నివేశయేత్ ।
మిశ్రజాతిః శ్చిత్రవర్ణః, కశ్యపాజ్జనిరీశ్వరః ।
ఖగేశ్వరో వాలఖిల్యఋషిః కృత్యం నిగద్యతే ।

తర్జని మొదలు మూడువ్రేళ్ళను, కలిపి పట్టి కనిష్ఠకను ఎడముగ చేసి బొటనవ్రేలు అనామిక మొదటచేర్చిన, చతురహస్తమగును. ఇది మిశ్ర జాతి, చిత్రవర్ణము, కశ్యపుని వల్ల పుట్టినది. అధిదేవత గరుత్మంతుడు, ఋషి వాలఖిల్యుడు.

వి ని యో గ ము లు :-

కస్తురి, చెక్కిలి, చిన్నపిల్ల. నేర్పరితనము. చూపు. (దృక్), అద్దము. నెయ్యి, నీలము మొదలగు రంగులు, రత్నములు, తేనె, నూనె, కస్తూరి, బురద, పంచదార, పదునారేండ్ల స్త్రీ. ముఖము, చెవికమ్మ, మర్మము గల మాటలు, కొంచెమను అర్థము, బంగారము. ఇంద్రనీలమణి. వీని యందు ఈ హస్తము వినియోగించును.

### -: అల పల్లవహస్త లక్షణము :-

శ్లో॥ కనిష్టాద్యాః క్రమాద్వృత్తా విరాళాశ్చాల పల్లవే,
ఋషిర్వసంతో గంధర్వజాతి ర్విష్ణోర్జసీరవిః
ఈశో వర్ణోమేచకశ్చ. వినియోగోనికధ్యతే ॥

చిటికేనవ్రేళ్ళు మొదలగు వ్రేళ్ళన్నియు, ఎడమెడముగా వుంచి వర్తులముగా పట్టిన, అలపల్లవహస్తము వచ్చును. వసంతుడు ఋషి. గంధర్వజాతి, దైవము సూర్యుడు. విష్ణువు నుండి పుట్టినది. శ్యామల వర్ణము.

వి ని యో గ ము లు :-

వస్త్రము. సొమ్ములు. మాధుర్యము. వెన్న, శిరస్సు. వికసించిన కమలము. సాధువాక్యము. దుర్గ (పార్వతి) అందము. మేడ, పట్టణము, విరహము, తాళఫలము, కిరీటము. వృక్షము, ధనము, స్తనములు, జడ, (కొప్పు) ప్రాంతనృత్యము. చాళీయనాట్యము, సూర్యకాంతమణి. వీని యందు ఈ అలపల్లవహస్తము వినియోగించునని భరతాదుల అభిమత ములు,

### -: హంసాశ్యహస్త లక్షణము :-

శ్లో॥ అంగుష్టతర్జనీశ్లేషాది తరేషాంప్రసారణాత్
విరళానాం కుంచితానా మిష్టద్దం సముఖోభవేత్ ।
ఋషిశ్శుకఃపితాకూలీ వర్ణ శ్వేతోఽధిదేవతా.
బ్రహ్మ బ్రాహ్మణజాతశ్చ వినియోగోఽస్యకధ్యతే ॥

బొటనవ్రేలు చూపుడువ్రేలు కూర్చి బట్టి మిగిలినవ్రేళ్ళు కొంచెము యెడముగా వంచి చాచి పట్టిన హంసాశ్య హస్తమగును. (బొటనవ్రేల్ను చూపుడువ్రేలు. మధ్యవ్రేళ్ళు సమాయోగము హంసాశ్యమని గ్రంధాన్తర్థ

ముల కగుపడుచున్నవి, అపాఠములు కూమ లోకప్రసిద్ధములుగానున్నవి.)
శుకుడు ఋషి. శివునివల్ల పుట్టినది. వర్ణము తెలుపు. బ్రహ్మ అధిదేవత. బ్రాహ్మణ జాతి.

వి ని యో గ ము లు :-

అదియేనేను అనుభావము. శోధించుట, మాలిక ధరించుట, గీతలు, లేదను అర్థము, ఒరిపిడి, చిత్రలేఖనము, సంగీతము లాస్యము, కాటుక, అలచందధాన్యము, సత్యము, చేయుట. అర్థము చెప్పుట లక్ష్యము, నఖము, నఖక్షతము, చిరునవ్వు. దంతక్షతము, విషము. ముత్యము జలబిందువు, నల్లి, దోమ, చలి, ఈగ, నూగారు, తుమ్మలు, క్షణకము, త్రాసు, జందెము, గగుర్పాటు, సన్నని వస్తువు, గొడుగు, కదలుట. అర విరిమొగ్గ. వేదిక. భస్మము. సంస్కారము. నిర్జనస్థలము. కొంచెమను అర్థము. గురిగింజ. ఆకారము, వేషము, వంగుట, తీగె, వెండి, గుళిక, వీనియందు ఈహస్తము వినియోగించును.

-: భ్రమరహస్త లక్షణము :-

శ్లో॥ మధ్యమానామికేశ్లిష్టే ఒక్రితేపాణితలేయది.
శేషాఃప్రసారితాః ప్రోక్తో భ్రమరో భరతాగమే.
అంగుష్ట మధ్యమేశ్లిష్టే తర్జని కుంచితేతరే
విరళే ప్రసృతే యత్రకధ్యతే భ్రమరః కరః ॥
కశ్యపోజనకోవర్ణో౽శితఈశోఖగేశ్వరః ॥
ఋషిశ్చ కపిలాచార్యో వినియోగో౽స్యకధ్యతే ॥

మధ్యమానామికలు అరచేతివరకు వంచి మిగిలిన వ్రేళ్ళు చాచిపట్టిన భ్రమరహస్తమగునని భరతసమ్మతము. మరియు నడిమివ్రేలు బొటన వ్రేలు కలిపి చూపుడువ్రేలు ముడిచి తక్కినవ్రేళ్ళు ఎడముగా చాచిపట్టిన

భ్రమరహస్తమగును. ఇది కశ్యపుని వల్లపుట్టినది. వర్ణము నలుపు. గరుత్మంతుడు అధిదేవత. ఋషి కపిలాచార్యుడు. (ఇందు జాతి నిశ్చయము లేదు. గ్రంథాంతరములో గంధర్వ జాతి.)

వి ని యో గ ము లు :-

తుమ్మెద, ఏనుగుదంతము, పూవు. చిలుక, కోయిల, చాతకము, ఆకాశము, యాగము. మౌనము, నాశము. పుష్పొడి, మాయ, నీటితుంపర, అవ్యయపదము. ముల్లుతీయుట. గోడ, పోకముడి విప్పుట. కపటము, రంధ్రము. రక్తము వీనియందు ఈ హస్తము చెల్లును.

-: హంసపక్ష హస్తలక్షణమ్ :-

శ్లో॥ సర్పశీర్షే కనిష్ఠాచేత్ప్రసృతాహంస పక్షకః ।
భృంగీపితాఽప్సరోజాతిః కృష్ణోవర్ణోఋషిస్తథా ।
భరతోమదనోదైవం వినియోగోస్యకథ్యతే ।

తా॥ సర్పశీర్ష హస్తమందలి చిటికెనవ్రేలును చాచిపట్టిన యెడల హంసపక్ష హస్తమగును. ఇది భృంగీశ్వరునివల్ల పుట్టినది. అప్సరస జాతి. కృష్ణవర్ణము. భరతుడు ఋషి. మన్మధుడు దైవము.

వి ని యో గ ము లు :-

వీణవాయించుట, శుద్ధనాట్యము, పొలిమేర, వెన్నెల, జయము, దయ. మాటిమాటికి చెప్పుట, ఎండ, సరసము, మోహము, విద్య. స్తంభము. ఉపదేశము, సముద్రబంధము, మకరికాపత్రము, స్త్రీ, కప్పుట. వస్తుపదార్ధము, రెక్కలు, కౌగిలి. ధైర్యము, వక్షము. స్థానము, ధూపము. పులకాంకురము, దత్తపుత్రుడు వీనియందు ఈ హస్తము చెల్లును.

-: సందంశ లక్షణము :-

శ్లో॥ సందంశోమిళితాంగుష్ఠ తర్జనీమధ్యమాగ్రకః ।
సరస్వలాజనిర్గౌరకాంతి విద్యాధరాన్వయః ।
ఋషిర్విశ్వావసుర్దైవం వాల్మీకిః కృచ్యముచ్యతే ॥

తా॥ బొటనవ్రేలు. చూపుడువ్రేలు. నడిమివ్రేలు. చివరి భాగములు కలుపుచు, విడదీయుచు మాటిమాటికి పట్టిన సందంశ హస్తమగును, ఇది సరస్వతివల్ల పుట్టినది. గౌరవర్ణము, విద్యాధర కులము, విశ్వావసుడు ఋషి. వాల్మీకి అధిదేవత, [పాఠాంతరములో చేతిఅయిదువ్రేళ్ళు కలుపుచు విడదీయుచు పట్టిన చందంశ మగునని ప్రశిద్ధము.]

వి ని యో గ ము లు :-

ముత్యము, పులకాంకురము. నీటిచుక్క, రుద్రాక్ష, నాట్యము, తిల హోమము, మల్లెమొగ్గ, మాత్ర, మంచిగా మాటలాడుట, జ్ఞానోపదేశము హంసముఖము, పిల్లనగ్రోవి వాద్యము, పగడము. నిస్వారముద్రిక. పూజ, ధ్యానము, లక్ష్యము, ముద్దుబెట్టుకొనుట, నీచము, చదువుట, సంగీతము, చెవి, శిధిలము, కపటము, ధైర్యము, మేషాశ్వము. మెడ, కోమలము, వీనియందు ఈ హస్తము వినియోగించును.

-: ముకుళహస్త లక్షణము :-

శ్లో॥ అశేషకరశాఖాగ్రమేళనాన్ముకుళస్మృతః ।
హనుమతోజనిర్గుహోఋషిశ్చవర్ణ కాపిలః।
అధీశ్వర సుధాకరః కులంచసంకరం తథా ॥

వ్రేళ్ళ చివరలన్నియు కలిపిపట్టిన. ముకుళహస్తము వచ్చును. ఇది హనుమంతునివల్ల పుట్టినది. దీనికి ఋషి గుహుడు. కపిలవర్ణము. చంద్రు డధీశ్వరుడు, కులము సంకీర్ణము.

వి ని యో గ ము లు :—

అరవిరిమొగ్గ, జపము, భోజనము, మంచితనము, దానము, మన్మథ బాణము, పంచప్రాణములు, గోళ్ళు, దీనవచనములు, పసిపిల్లలను ముద్దు బెట్టుకొనుట, గాలి, ఐదు అను సంఖ్య, దేవపూజ, ధ్యానము, గర్భము, పుట్టుట (జననము), దయారసము, పార్శ్వాంగుళీస్పర్శనము స్త్రీలయొక్క చక్కలిగింత), గడ్డము, చూచుకము (స్తనాగ్రము) వీనియందు ఈముకుళ హస్తము వినియోగించబడును.

శ్లో॥ కనిష్ఠాద్యాస్సమీకృత్యాశ్లిష్టశ్చాంగుష్ఠకంన్యసేత్ ।
తర్జన్యగ్రేకుంచితేచ తామ్రచూడకరోబుధః ।
జనిర్వేదా దృష్టిర్వజ్రీపాండువర్ణో బృహస్పతిః ।
అధీశోదేవజాతిశ్చవినియోగోఽస్యకథ్యతే ॥

తా॥ కనిష్ఠికమొదలు వ్రేళ్ళన్నియు కూర్చిపట్టి వాటిమీద బొటన వ్రేలువుంచి, చూపుడువ్రేలు చివర కొంచెమువంచిబట్టిన తామ్రచూడహస్త మగును. ఇది వేదములనుండి పుట్టినది. ఇంద్రుడు ఋషి. పాండువర్ణము. అధిదేవత బృహస్పతి. దేవజాతి. ఇది సమ్మతము.

వి ని యో గ ము లు :-

నృత్త-గీత-వాద్యములు కోడిజుట్టు, వేదత్రయము, ముల్లోకములు, శూలము త్రికూటపర్వతము, ప్రణయము, కన్నీరుతుడుచుట, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, ఏడుపు, లెక్కపెట్టుట, ఎరుపు, నలుపు, తెలుపు యను మూడురంగులు, నిట్టూర్పు, కీర్తి, భావి-పలక వీనియందు ఈతామ్ర చూడహస్తము వినియోగించును.

శ్లో॥ ఏతేసప్తవింశతిః పూర్వాచార్యోదితాః ।
ఇతఃపరం అభినవాచార్యోదితాః కథ్యంతే ॥

తా॥ ఈ ఇరువది ఏడు అసంయుత హస్తములు పూర్వ నాట్యాచార్యులు చెప్పియున్నారు.

శ్లో॥ రేఖాచంద్రః ఖండసర్ప చతురౌచల సర్పకః ।
అర్ధసూచ్యూర్ణనాభౌచమణీహస్తశ్చకీర్తితః ।
-ఇతి ఆభినవాః అసంయుతాః కరాః సప్త ఏతేషాం
లక్షణ వినియోగౌకధ్యతే ॥

తా॥ రేఖాచంద్ర. ఖండసర్ప. సర్పచతుర. చలసర్ప. అర్ధసూచి. ఊర్ణనాభ. మణియని ఏడు అసంయుత హస్తములు అభినవ నాట్యాచార్యుల చేత చెప్పబడినవి. వీటి లక్షణ వినియోగములు చెప్పుచుంటిని.

-: రేఖాచంద్రహస్త లక్షణము :-

శ్లో॥ మధ్యమాద్యాస్త్రయోంగుళ్య. శ్లిష్టాః కించిచ్చకుంచితాః ।
అంగుష్టతర్జనీరేఖాచంద్రస్యా. త్సంప్రసారితే ।
వియయన్యాయ విఖ్యాతి. శ్లాఘనేషు విభక్తిషు ।
ప్రేమవాగురసోరేఖాచంద్రహస్తః ప్రయుజ్యతే ॥

తా॥ మధ్యమ-అనామిక-కనిష్టికలు కలిపి కొంచెమువంచి అంగుష్ట తర్జనులు చాచిపట్టిన రేఖాచంద్రహస్తమగును.

వి ని యో గ ము లు :-

తా॥ వినయము, న్యాయము. కీర్తి, పొగడుట. విభక్తులు, ప్రేమ వాక్కులు. విశాలమగు వక్షము వీనియందు ఈ రేఖాచంద్ర హస్తము వినియోగించును.

-: ఖండచతుర హస్తలక్షణము :-

శ్లో॥ చతురేఖండ చతుర స్తర్జనీప్రోన్నతాయది ।
ఖండేవిభూత్యామమృతేర క్తేవిధురయత్నయోః ।
గోధూహనేచారకూటేహస్తోఽయం సంప్రయుజ్యతే ॥

తా॥ చతుర హస్తమందలి చూపుడువ్రేలు కొంచెము ఎత్తి వంచిన ఖండచతుర హస్తమగును.

వి ని యో గ ము లు :-

తా॥ తునుక (వస్తువుపందలి భాగము), ఐశ్వర్యము, అమృతము, రక్తము. ఎడబాటు, ప్రయత్నము. ఆవును పాలుపితుకుట. ఇత్తడి వీని యందు ఈ ఖండచతుర హస్తము వినియోగించును.

-: సర్పచతుర హస్తలక్షణము :-

శ్లో॥ సర్పశీర్షేఽనామికాయాః మూలేంగుష్ఠేనివేశితే ।
స సర్పచతురః ప్రోక్తః మధురేగణితేరసే ।
ఘనసారేకించిదర్థేభావజ్ఞైస్సంప్రయుజ్యతే ॥

తా॥ సర్పశీర్ష హస్తముయొక్క అనామికవ్రేలు మొదట బొటన వ్రేలునువంచిన, సర్పచతుర హస్తమగును.

వి ని యో గ ము లు :-

తా॥ తియ్యదనము, గణితశాస్త్రము, కర్పూరము, రసము కొంచెమను అర్థము. వీనియందు ఈ సర్పచతుర హస్తము వినియోగించుచున్నది.

-: చలసర్ప హస్తలక్షణము :-

శ్లో॥ తస్మిన్నంగుష్ఠచలనాచ్చలసర్పః కలానుచ ।
శోధనేచ, మధూచ్ఛిష్టేలాక్షియాం సంప్రయుజ్యతే ।

తా॥ సర్పశీర్ష హస్తమందలి బొటనవ్రేలు కదిలించుచు పట్టిన చల సర్పహస్తమగును.

వి ని యో గ ము లు :-

తా॥ లలితకళలు, శోధించుట, మైనము మొదలైనవి యీ చలసర్ప హస్తము వినియోగించును.

-: అర్ధసూచి ముఖహస్త లక్షణము :-

శ్లో॥ అంగుష్ఠసారణాత్స్వాచ్యామర్ధసూచీముఖో భవేత్ ।
యావాన్సూచీముఖాఖ్యశ్చ వినియోగోఽస్యకథ్యతే ॥

తా॥ సూచిముఖ హస్తమందలి బొటనవ్రేలు ఎడముగా చాచిపట్టిన అర్ధసూచిముఖ హస్తమగును. సూచిముఖ హస్త వినియోగములన్నియు అర్ధసూచిముఖముకు వినియోగించును.

-: ఊర్ణనాభ హస్త లక్షణము :-

శ్లో॥ అంగుళ్యగ్రాణ్యబ్జకోశేకుంచితానిభవంతిచేత్ ।
ఉర్ణనాభస్సకథితో నృసింహజ్జనిరీశ్వరః ।
కూర్మరాజోఽరుణోవర్ణో నృపజాతిస్తథామునిః శార్దూలో ॥

తా॥ పద్మకోశమందలి వ్రేళ్ళు చివరి భాగములన్నియు వంచిపట్టిన ఊర్ణనాభ హస్తము వచ్చును. ఇది నృసింహమూర్తివల్ల వచ్చినది, ఆది కూర్మము అధిదేవత. ఎరుపు వర్ణము. క్షత్రియజాతి.

వి ని యో గ ము లు :-

కోతి, సింహము. పెద్దపులి, తాబేలు. రాక్షసి, కొండగోగు. స్తనములు. దిట్టతనము, లేమి, వారము, గడ్డము పట్టుకొనుట, తలగోకుకొనుట, భయము వీనియందు ఈ హస్తము వినియోగించును.

-: మణిహస్త లక్షణము :-

శ్లో॥ కించిత్పతాకేసకీనాంకుంచనాన్మణిరుచ్యతే ॥

తా॥ పతాక హస్తమందలి వ్రేళ్ళ చివరలు కొంచెమువంచిన మణి హస్తమగును.

వి ని యో గ ము లు :-

సామవేదము, జపము, స్వప్నము, దుఃఖము, చిత్రపటము, ఘనము, కిరాతుడు, మరణము, వీణ. తాళము (తాళఫలము). నిషేధము, చీకటి, నీడ, చేప. రంగస్థలము, అంబులపొది, పుణ్యతీర్థము, పాము, ప్రయాణము. అపరాధము, వసంతము, దున్నుట, మలయానిలము, సంకల్పము, ధూపము. పట్టువస్త్రము, భూగోళము, పరాగము. మధ్యాహ్నము, అస్తమయము. (మద్దిల వాయించుట. మార్గనృత్యము. ఆజ్ఞాపించుట, తాపము. ఆలింగనము, వియోగము వీటిని హస్తద్వయముతో అభినయించవలెను) ఉద్యానము (బలాహకమను మేఘము). (అధోముఖహస్త ద్వయముతో చూపవలెను). పిండుట. ఉన్నతము, గరుడుడు. క్రూరజంతువు. పుష్టి. పంజరము, కాకి, గద్ద. వీది. యమపురి. ఊరుద్వయము. సభ. తాచేలు పీసికి ఈ మణిహస్తము చెల్లును.

అసంయుత హస్తములు సమాప్తము.

# సంయుత హస్తములు :-

-: అంజలి హస్త లక్షణము :-

శ్లో॥ పతాక తలయోర్యోగాదంజలిః కరకీర్తితః ॥

తా॥ రెండు పతాక హస్తముల అరచేతుల చేర్చిన యెడల అంజలి హస్తమగును.

వి ని యో గ ము లు :-

దేవతలకు, గురువులకు, బ్రాహ్మణులకును నమస్కారము చేయుటకు ఈ హస్తము చెల్లును. దేవతలకు నమస్కరించు వేళ్ళ శిరస్సునందును, గురువులకు నమిస్కరించు వేళ్ళ ముఖమునందును, బ్రాహ్మణులకు నమస్కరించు వేళ్ళ వక్షస్థలమందును క్రమముగ ఈ హస్తము ఉపయోగించును. దీని కధిదేవత క్షేత్రపాలుడు.

-: కపోతహస్త లక్షణము :-

శ్లో॥ కపోతస్స కరోజ్ఞేయ. శ్లిష్టమూలాగ్రపార్శ్వతః ॥

తా॥ ముందుచెప్పిన అంజలి హస్తమందు మొదలు, తుదలు పార్శ్వభాగములు చేర్చిపట్టిన యెడల కపోతహస్త మగును. దీని కధిదేవత చిత్రశేనుడు.

వి ని యో గ ము లు :-

ప్రమాణము, పెద్దలతో మాటలాడుట. వినయము. ఒప్పుకొనుట, వీనియందు ఈ హస్తము వినియోగించును.

-: కర్కట హస్త లక్షణము :-

శ్లో॥ అన్యోన్యస్యాఽన్తరేత్రాఽఙ్గుళ్యోనిసృతహస్తయోః ।
అంతర్ బహిర్వావర్తంతే కర్కటస్యోఽభిధీయతే ॥

తా॥ ముందు చెప్పిన కపోతహస్తమందు వ్రేలి వ్రేలి సందులలో వ్రేళ్ళు చొప్పించి వెలికిగాని, లోపలికిగాని పట్టినయెడల కర్కట హస్తమగును, విష్ణువు అధిదేవత.

వి ని యో గ ము లు :-

గుంపును చూపుట, లావైనదానిని చూపుట. శంఖనాదము చేయుట, ఒడలు విరచుకొనుట, చెట్టుకొమ్మను వంచుట వీనియందు ఈ హస్తము వినియోగింపబడును.

-:స్వస్తికహస్త లక్షణము :-

శ్లో॥ పతాకయోస్యన్నియుక్త కరయోర్మణిబన్ధయోః ।
సంయోగే నస్వస్తికాఖ్యో మకరార్ధేనియుజ్యతే ॥

తా॥ రెండు పతాకహస్తమందలి మణికట్టులను చేర్చి పట్టినయెడల స్వస్తిక హస్తమగును.

వి ని యో గ ము లు :-

మొసలిని తెల్పుట. భయముతో మాటాడుట, వాదాడుట. పొగడుట. వీనియందు చెల్లును.

:- డోలాహస్త లక్షణము :-

శ్లో॥ పతాకఊరుదేశస్థౌ డోలాహస్తోఽయయుజ్యతే ।
నాట్యారంభే ప్రయోక్తవ్యఇతినాట్యవిధోవిధుః ॥

తా॥ రెండు పతాక హస్తములను తొడలమీదికి వ్రేలాడునట్లు పట్టిన డోలాహస్త మగును, అధిదేవత సరస్వతి.

వి ని యో గ ము లు :-

మోహాము, మూర్ఛ, మదము ఆలశ్యము, విలాసము. నాట్యారంభము మొదలగు వానియందు వినియోగము.

-: పుష్పపుట హ_స్త లక్షణము :-

శ్లో॥ సంప్లిష్టా సర్పశీర్షాచేద్భవేత్పుష్పపుటః కరః ॥

తా॥ రెండు సర్పశీర్ష హ_స్తములను మనికట్టు మొదలు చిటికెన వేశ్రిలివరకుగల అరచేతి అంచులను చేర్చిపట్టిన పుష్పపుట హ_స్తమగును.

వి ని యో గ ము లు :-

కర్పూరహారతి, బిడ్డలు-పండ్లు మొదలగువానిని తీసుకొనుట, సంధ్యా కాలమందు అర్ఘ్యప్రధానము చేయుట. మంత్రపుష్ప మిచ్చుట వీనియందు ఈ హ_స్తము వినియోగించును.

-: ఉత్సంగహ_స్త లక్షణము :-

శ్లో॥ అన్యోన్య బాహుమూలస్థౌ మృగశీర్ష కరౌయది ।
ఉత్సంగనామహ_స్తోఽయంకీ_ర్తి తోభరలాగమే ॥

తా॥ రెండు మృగశీర్ష హ_స్తములను పరస్పరము మూపులకు సోకు నట్లు పట్టిన ఉత్సంగ్గ హ_స్తమగును. దీనికి అధిదేవత గౌతముడు.

వి ని యోగ ము లు :-

కౌగలింత. సిగ్గు, భుజకీ_ర్తులు మొదలగువాటిని చూపుట. బాలురను శిక్షించుట వీనియందు ఈ హ_స్తము వినియోగింపబడును.

-: శివలింగ హ_స్త లక్షణము :-

శ్లో॥ వామేఽర్ధచంద్రే విన్య_స్తః శిఖర శ్శివలింగకః ॥
వినియోగ_స్తుతసై_వ శివలింగ ప్రదర్శనే ॥

తా॥ ఎడమచేత అర్ధచంద్ర హ_స్తము కుడిచేతితో శిఖరముబట్టి ఎడమ చెయ్యిపై నుంచినచో శివలింగహ_స్త మగును,

వి ని యో గ ము లు :-

ఇది శివలింగము చూపుటకు వినియోగించును.

-: కటకావర్ధన హస్తలక్షణము :-

శ్లో॥ కటకాముఖయోః పాణ్యోస్స్వస్తికాన్మణీ బంధయోః ।
కటకావర్ధనాఖ్యాస్స్యాదితి నాట్యవిధోవిధుః ॥

తా॥ కటకాముఖముయొక్క మనికట్లు స్వస్తికముగ చేర్చిపట్టిన కటకావర్ధన హస్తము వచ్చును. దీని కధిదేవత యక్షరాజు.

వి ని యో గ ము లు :-

తా॥ పట్టాభిషేకము, పూజ, పెండ్లి దీవెన వీటికి ఈ హస్తము వినియోగించును.

-: కర్తరీ స్వస్తికహస్త లక్షణము :-

శ్లో॥ కర్తరీ స్వస్తికాకారః కర్తరీ స్వస్తికో భవేత్ ॥

తా॥ కర్తరీ స్వస్తిక హస్తము వచ్చుటకు కర్తరీముఖ హస్తములు స్వస్తికాకారముగ పట్టబడి కర్తరీ స్వస్తిక హస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ చెట్టుకొమ్మలు, పర్వత శిఖరము. వృక్షములు వీనియందు వినియోగించును.

-: శకటహస్త లక్షణము :-

శ్లో॥ భ్రమరామధ్యమాఙ్గుష్టా ప్రసారాచ్ఛకలో భవేత్ ।
రాక్షసాభినయోచాఽయంనియోజ్యోభరతాదిభిః ॥

తా॥ రెండు భ్రమరహస్తముల బొటనవ్రేలిని, నడిమివ్రేలిని చాచి పట్టిన శకటహస్త మగును.

వి ని యో గ ము లు :-

తా॥ ఇది రాక్షసులు మొదలైనవారికి చెల్లును.

-: శంఖహస్త లక్షణము :-

శ్లో॥ శిఖరాస్తరగతాఙ్గుష్ఠ ఇతరాఙ్గుష్ఠసంగతః ।
తర్జన్యోర్ధ్వాస్తతః శ్లిష్టాశ్శంఖహస్తః ప్రకీర్తితః ।
శంఖాదిషునియోజ్యోఽయమిత్యేవం భరతాదయః ॥

తా॥ శిఖర హస్తమందలి అంగుష్టముతో రెండవచేతి అంగుష్టము చేర్చి తక్కిన వ్రేళ్ళను ఆ శిఖరహస్తముపైకి చేర్చిపట్టిన శంఖహస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ ఇది శంఖము యందు, శ ం ఖ ము నూదుటయందు విని యోగించును.

-: చక్రహస్త లక్షణము :-

శ్లో॥ యత్రాఽర్ధ చంద్రౌ తిర్యఞ్చావన్యోతల సంస్పృశౌ ।
చక్రహస్తస్సవిజ్ఞేయశ్చక్రార్థేవినియుజ్యతే ॥

తా॥ అర్ధచంద్ర హస్తములు అడ్డముగ రెండు అరచేతులు చేర్చి పట్టిన చక్రహస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ ఇది చక్రమునందును. చక్రాకార వస్తువులయందును విని యోగించును.

### -: సంపుటహస్త లక్షణము :-

శ్లో॥ కుఞ్చితాఙ్గుళయశ్చక్రే సంపుటఃకర ఈరితః॥

తా॥ చక్రహస్తపు వ్రేళ్ళను ముడిచిపట్టిన సంపుట హస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ వస్తువులు దాచుటయందును, సంపుటమందును ఈ హస్తము వినియోగించును.

### -: పాశహస్త లక్షణము :-

శ్లో॥ సూచ్యానికుఞ్చితేశ్లిష్టేతర్జన్యౌపాశ ఈరితః॥

తా॥ సూచిహస్తముల చూపుడువ్రేళ్ళను వంచి కలిపిపట్టిన (మెలిక వేసిన) పాశహస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ పరస్పర కలహమందును, త్రాటియందును, సంకెళ్ళు వేయుట యందును వినియోగించును.

### -: కీలకహస్త లక్షణము :-

శ్లో॥ కనిష్ఠే కుఞ్చితేశ్లిష్టే మృగశీర్షేతు కీలకః॥

తా॥ మృగశీర్ష హస్తముల చిటికెన వ్రేళ్ళను వంచిచేర్చి (కలిపి) పట్టినయెడల కీలకహస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ స్నేహమందును, ప్రియవచనము నందును ఈ హస్తము చెల్లును.

-: మత్స్యహస్త లక్షణము :-

శ్లో॥ కరపృష్ఠో పరిన్యస్తో యత్రహస్తః పతాకికః ।
కిఞ్చిత్ప్రసారితాఙ్గుష్ఠకనిష్ఠో మత్స్యనామకః ॥

తా॥ పతాక హస్తములను ఒక చేతిపైన నొకటిచేర్చి చిటికెన వ్రేలిని, బొటనవ్రేలిని చాచిపట్టి కదిలించుచు పట్టిన మత్స్యహస్త మగును.

వి ని యో గ ము లు :-

ఇది మత్స్యమునందు వినియోగించబడును.

-: కూర్మహస్త లక్షణము :-

శ్లో॥ కుఞ్చితాగ్రాంగుళిశ్చక్రేత్యక్తాంగుష్ఠకనిష్ఠితః ।
కూర్మహస్తస్సవిజ్ఞేయః కూర్మార్థేవినియుజ్యతే ॥

తా॥ చక్రహస్తము మొనవ్రేళ్ళను వంచి చిటికెనవ్రేళ్ళు, బొటన వ్రేళ్ళు చాచిపట్టిన కూర్మహస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

ఇది కూర్మము (తాబేలు), యందు వినియోగించును,

-: వరాహ హస్త లక్షణము :-

శ్లో॥ మృగశీర్షేత్వన్య కరస్తేసశ్లిష్ట స్థితోయది ।
కనీష్టాంగుష్టయోర్యోగాద్వరాహః కరఈరితః ।
ఏతస్సవియోగస్తు వరాహార్థేతుయుజ్యతే ॥

తా॥ మృగశీర్ష హస్తమును ఒకటిపై నొకటి చేర్చి కనిష్ట. అంగుష్ట ములను చాచిపట్టిన వరాహ హస్తము వచ్చును.

వి ని యో గ ములు :-

ఆది వరాహము (పంది) యందు వినియోగించును. భరత సూత్రము.

-; గరుడహస్త లక్షణము ;-

శ్లో॥ తిర్యక్తలస్థితావర్ధచన్ద్రావంగుష్టయోగతః ।
గరుడో గరుడార్థేచ యుజ్యతే భరతాగమే ॥

తా॥ అర్ధచంద్ర హస్తములు రెండును అడ్డముగా బొటనవ్రేళ్ళు చేర్చిపట్టిన (కలిపి) గరుడహస్తము వచ్చును.

వి ని యో గ ము లు ;-

తా॥ ఇది గరుత్మంతునియందు చెల్లును.

-; నాగబంధ హస్తలక్షణము ;-

శ్లో॥ సర్పశీర్షౌ స్వస్తికాచేన్నాగబంధ ఇతీరితః ॥

తా॥ రెండు సర్పశీర్ష హస్తములు స్వస్తికముగా పట్టిన నాగబంధ హస్తమగును. (చేతులు మెలికలు వేయుచు)

వి ని యో గ ము లు :-

పాము పెనవంటిరీతి బంధమందును. పాముల పెనఁపందును పొద రిండ్లు చూపుటయందును, అధర్వణ మంత్రమునందును వినియోగించును.

-; ఘట్వాహస్త లక్షణము ;-

శ్లో॥ చతురే చతురంన్యస్యతర్జన్యంగుష్టమోక్షతః ।
ఘట్వాహస్తోచలేదేషః ఘట్వాదిషునియుజ్యతే ॥

తా॥ చతురహస్తముపై చతురహస్తమునుంచి చూపుడువ్రేళ్ళను క్రిందకు, బొటనవ్రేళ్ళను పైకి చాచిపట్టిన ఘట్వాహస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

ఇది మంచము మొదలగు వానియందు చెల్లును.

-: భేరుండహస్త లక్షణము :-

శ్లో॥ మణిబంధ కపిద్ధాఖ్యాం భేరుండకరయిష్యతే ।
భేరుండపక్షి దమ్పత్యోర్భేరుండకరఈరితః ॥

తా॥ కపిద్ధ హస్తములు రెండును. మణికట్లవద్ద చేర్చిపట్టిన భేరుండ హస్తమగును.

వి ని యో గ ము లు :-

తా॥ ఇది భేరుండపక్షి. భేరుండపక్షి దంపతులకు వినియోగించును.

-: అవహిత్త హస్త లక్షణము :-

శ్లో॥ సోలపద్మౌవక్షసిస్థావవహిత్థకరోమతః ॥

రెండు సోలపద్మ హస్తములు రొమ్ముననకెదురుగా బట్టిన అవహిత్త హస్తము వచ్చును.

వి ని యో గ ము లు :-

తా॥ శృంగార నటనము, పుట్టచెండును పట్టుట, స్తనములు వీని యందు ఈ హస్తము వినియోగించును.

సంయుత హస్తలక్షణ, వినియోగములు సమాప్తము.

—*—



1. అంజలి



4. స్వస్తికము



2. కపోతము



5. దోలాహస్తము



3. కర్కటము



6. పుష్పపుటము



7. ఉత్సంగము



10. కర్తరీస్వస్తికము



8. శివలింగము



11. శకటము



9. కటకావర్ధనము



12. శంఖము



**13.** చక్రము



**14.** సంపుటము



**15.** పాశము



**16.** కీలకము



**17.** మత్యము



**18.** కూర్మము



19. వరాహము



20. గరుడము



21. నాగబంధము



22. ఖట్వా



23. భేరుండము



24. అవహిత్థము

## -: సంకర హస్తములు :-

శ్లో॥ లాంగోలోఽధోముఖోయశ్చ గోస్తనే(గాక్షకేభవేత్ ।
ఊర్ధ్వాననోసతుధ్యాత స్తథాశాంతాభిదెరశే ॥

తా॥ లాంగూల నామక హస్తమును, అధోముఖముగబట్టినచో ఆవు స్తనములందు, (దాక్షపండ్లయందును, ఊర్ధ్వముఖముగబట్టినచో శాంతరసము నందు వర్తించును.

శ్లో॥ పద్మకోశశ్చోర్ధ్వ భాగగామి చం(ద్రార్ధభావనే ॥

తా॥ పద్మకోశ హస్తము ఊర్ధ్వభాగమున బట్టినచో చం(దునికి వినియోగింపబడును.

శ్లో॥ పశ్చాత్ప్రసారితో సూచీయచ్చబ్దేపురతోయది ।
వీక్షణేపిచతచ్చబ్దేరవ్యర్థేచోర్ధ్వచాలితా ।
ఏతే వ(క్రత్వభావేనయుక్తేచేన్తు నిరోధకే ।
ఏతే మోలసమాశ్లిష్టేయుజ్యదే సంధిభావనే ।
శూచీకరో నిశ్చలశ్చే దూర్ధ్వముత్థాపితే భవేత్ ॥

తా॥ సూచీహస్తము పశ్చాద్భాగమునందు (పసరింపచేసినచో "వాడు" యని చూపుటయంధును. పురోగభాగమందు (పసరింపచేసినచో "వీడు" యని చూపుటయందును. వీక్షణమందును. ఊర్ధ్వభాగమున చలింప చేసినచో సూర్యునియందును రెండు సూచీహస్తములు వ(క్రముగ కలిపిపట్టినచో. విరోధమునందును. మూలభాగములందు. సంశ్లిష్టములుగా చేసినచో సంధిని చెప్పుటయందు వర్తించును. సూచీహస్తము నిశ్చలముగా చూపినచో. పైకెత్తబడినవానికి వర్తించును.

శ్లో॥ అరాళోళికగామీచేద్భ్రూవల్యాంచనియుజ్యతే ।
అననాభిముఖశ్చైవహ్యధరార్దేనియుజ్యతే ॥

తా॥ అరాళహస్తము లలాట ప్రదేశమున ఘంచినచో కనుబొమ్మల యందును, ముఖమున కభిముఖముగనుంచినచో అధరమునందు వర్తించును.

శ్లో॥ మధ్యమాకేవలావక్రాశేషాశ్చైవ ప్రసారితః ।
రేఖాభిధానోహస్తస్యాత్తత్స్వరూపమిహోచ్యతే ॥

తా॥ మధ్యమాంగుళివి పక్రముగబట్టి ఇతరాంగళులను చాచిపట్టినచో రేఖాహస్త మనబడును. దీనిని పురోభాగమునందు బట్టినచో గజముఖము నందు రెండు రేఖాహస్తములు భుజములందుబట్టినచో సూర్యోపస్థానము నందు వర్తించుచున్నది.

శ్లో॥ ముష్టిశ్చుబుకగామీచేచ్చుబుకేశ్మశ్రుభావనే ।
యుజ్యతే కవిసోఽయంకరకర్మ విశారదైః ॥

తా॥ ముష్టిహస్తము చుబుకమునందు బట్టినచో గడ్డమునందు, గడ్డము పెంచుటయందు వర్తించును.

శ్లో॥ పతాకో విశ్ఛలాకారః సవిధేచేత్తదర్థకే ।
జ్యోతిశ్శాస్త్రవిచారేపియుజ్యతేహ్యుచితార్థతె ॥

తా॥ పతాక హస్తము సమీపమునందు బట్టినచో "అది" యని చూపుటయందు, జ్యోతిషశాస్త్ర విచారమునందు, ఉచితార్థమునందు వర్తించును.

శ్లో॥ సర్పశీర్షకరోభులేసీమంతార్థే నియుజ్యతే ।

తా॥ సర్పశీర్ష హస్తములు ఫాలప్రదేశమున నుంచినచో పాపడ దువ్వుటయందు వినియోగించుచున్నది.

శ్లో॥ వామభాగా దక్షిణాంగం త్రిశఃస్సూచీముఖఃకరః ।
వలయేపిచభిత్త్యాదౌయుజ్యతేకవిభిఃక్రమాత్ ॥

తా॥ సూచముఖ హస్తము వామభాగమునుండి దక్షిణాంగ పర్యంతము తెచ్చి నిలిపినచో వలయమునందును. భిత్తి మొదలగువానియందును వర్తించును.

శ్లో॥ కిరీటార్థేయుజ్యతేఽయమూర్ధ్వగోహ్యల పద్మకః ।
అధోముఖ షథస్యాచ్చేన్మిస్తకే వినియుజ్యతే ।
స ఏవ భుజగామీచేద్ఘటథావేనియుజ్యతే ॥

తా॥ అలపద్మక హస్తము ఊర్ధ్వభాతమునందు పట్టినచో కిరీటము సందును. అధోముఖముగ బట్టినచో శిరస్సునందును. భుజమునందుబట్టినచో ఘటమునందును వర్తించును.

శ్లో॥ అలకేయుజ్యతే హంసోవానుదక్షణ కర్ణగః ॥

తా॥ హంసాస్య హస్తమును వామకర్ణము మొదలు దక్షణకర్ణము పర్యంతము త్రిప్పిపట్టినచో ముంగురులయందు వర్తించును.

శ్లో॥ కర్ణద్వయాంతికగతౌ మృగశీర్ష కరౌయదా ।
కర్ణద్వయార్థేయుజ్యతేతథావక్త్రానుభావనే ॥

తా॥ మృగశీర్ష హస్తములు కర్ణద్వయ సమీపమునందుంచి పట్టినచో. రెండు చెవులయందును. ముఖము చూపుటయందును వర్తించును.

శ్లో॥ కటస్థాహంసహస్థాచేదంబరార్థేనియుజ్యతే ॥

తా॥ హంసాశ్య హస్తములు కటిపార్శ్వములందు పట్టినచో "చీర" కట్టుకొనుటయందు వర్తించును.

శ్లో॥ అన్యోన్యాభిముఖంకట్యాం పతాకౌయది హస్తకౌ ।
యోగపట్టేకల్కాల స్యభావనాయాంని యుజ్యతే ॥

తా॥ రెండు పతాక హస్తములు కటిప్రదేశమునందు అన్యోన్యాభిముఖమగునట్లు పట్టినచో యోగపట్టమందు నారచీరెలు చూపుటయందు వర్తించును.

శ్లో॥ కటిదేశాదూరుయుగ్మమధ్యస్థాచేత్పతాకకా ।
పర్ణాంబరే పింఛరూప వపనేపినియుజ్యతే ॥

తా॥ రెండు పతాక హస్తములు కటి ప్రదేశములనుండి ఊరుయుగ్మమధ్యమునకు బట్టినచో పర్ణవస్త్రమునందును, నెమలిపింఛ వస్త్రమునందును. నెమలిపింఛ వస్త్రమునందును వర్తించును.

శ్లో॥ అలపద్మః కర్ణగశ్చేత్కబర్యార్థేనియుజ్యతే ॥

తా॥అలపద్మ హస్తము శ్రోత్రప్రదేశమునందు చూపినచో కబరిని చూపుటయందు వర్తించును,

శ్లో॥ అమాతదేశాదళికగామీచేర్థం సహస్తికః ।
లలంతికార్థేయుజ్యేతికవిభిర్యో జనాంపదైః ॥

తా॥ హంసాశ్య హస్తము పాపడ ప్రదేశమునుండి దింపి ఫాల ప్రదేశమునందు బట్టినచో పాపడ బొట్టునందు వర్తించును.

శ్లో॥ తాటంకార్థేయుజ్యతేఽసౌ సూచికాఖ్యస్తుసభ్రమః ॥

తా॥ సూచీముఖహస్తము కర్ణముల సమీపమునందు చలింపచేయుచు పట్టినచో చెవ్వుల ఆభరణములకు ఈ హస్తము వినియోగించును.

శ్లో॥ ముష్టిస్త్వశికగామీచేత్కాకపక్షేనియుజ్యతే ॥

తా॥ ముష్టిహస్తము భుజప్రదేశమునందు బట్టినచో కాకపక్షముకు వర్తించును.

శ్లో॥ మృగశీర్షౌశ్లిష్టముఖావక్షసోష్టాంగుళిస్థితౌ ।
ప్రాకారేపితదాప్యగ్రే క్రీడావాప్యాంనియుజ్యతే ॥

తా॥ రెండు మృగశీర్ష హస్తములు వక్షస్థలముకు విడిచి అష్టాంగుళ ప్రమాణముగల ప్రదేశమునందు శ్లిష్టములుగా బట్టినచో "కోట" చూపుట యందు. కొనలను చూపుటయందు క్రీడాసరస్సునందు వర్తించును.

శ్లో॥ కృపార్ధేయుజ్యతేసూచీ కరస్సోఽయమధోముఖః ॥

తా॥ సూచిముఖ హస్తమును అధోముఖముగ బట్టినచో దయ చూపుటయందు వర్తించుచున్నది.

శ్లో॥ మృగశీర్షో బాలభావే కౌమారే శిఖరోభవేత్ ।

తా॥ మృగశీర్ష హస్తము బాల్యవయస్సునందును. శిఖరహస్తము కౌమార వయస్సునందును వర్తించును,

శ్లో॥ అలపద్మోహంసహస్తౌ యౌవనే చలితాయది ॥

తా॥ అలపద్మ హస్తము, హంసాశ్య హస్తము చలింప చేసినచో యౌవ్వనమందు వినియోగించును.

శ్లో॥ ముకుళోనిరశీభూతౌ వక్షస్థోయదివార్ధకే ।
యుజ్యతేయోగకుశలైస్సరసః కరవేదిభిః ॥

తా॥ ముకుళహస్తము వక్షస్థలమునందు విరళముగ నిలిపినచో వార్ధక్యమునందు వినియోగించును.

శ్లో॥ తర్జన్యాస్యాందంత్య వర్వణ్యంగుష్టోనే ప్రసారితా ।
నఖహంస ఇతిఖ్యాతః కరః కరవిచక్షణైః ॥

తా॥ అంగుష్టమును తర్జన్యంగుళియొక్క అంత్యపర్యంతమునందుంచి ఇతరాంగుళులను జూచిపట్టినచో "నఖహంస" హస్తమగును.

శ్లో॥ వజ్రవైఢూర్య రూపేచ పఖార్ధే నాశికామణౌ ।
నఖహంస ఇతిఖ్యాతః కరః కరవిచక్షణైః ॥

తా॥ నఖహస్తము వజ్రమునందును. వైఢూర్యమునందును, నఖమును చూపుటయందును, నాసామణియందును వర్తించును.

శ్లో॥ నాధూసాదధహంసాస్య ఉరశ్పిమానమాశ్రితః ।
ఉపవీతేపివై కక్ష్యేయాత్రాభేదేపియుజ్యతే ॥

తా॥ హంసాళ్య హస్తము వామభుజమువలన వక్షస్థలము బొందినచో యజ్ఞోపవీతమునందును, కంఠహారమునందును. యాత్రాభేదమునందును వర్తించుచున్నది.

శ్లో॥ పతాకాఖ్యేకనిష్టాయామూలేంగుష్టోనివేశితః ।
పతాక చతురస్సోఽయం, తత్స్వరూపవిహోచ్యతే ॥

తా॥ పతాక హస్తమునందు కనిష్టాంగుళి మూలమునందు అంగుష్టము నుంచినచో పతాక చతురహస్త మగును.

## -: వి ని యో గ ము :-

శ్లో॥ ఆననే శ్వేత వర్ణేపి సూపార్థేపిచయుజ్యతే ॥

తా॥ పతాక చతురహస్తము "ముఖమునందు", తెలుపు వర్ణమందు, సూపార్ధమునందు వినియోగించును.

శ్లో॥ చతురౌతు యధాశ్లిష్టా అననాభిముఖౌతధా ।
కపోలేనే నేత్రభావేచ యుజ్యతే భరతాదగైః ॥

తా॥ రెండు చతుర హస్తములు కలిపిపట్టి ముఖమునకు అభిముఖముగ ఉంచినచో కపోలమునందు. నేత్రములందును వినియోగించులు.

శ్లో॥ తామ్రచూడకరస్తిర్యగ్లామిచే దరుణీభవేత్ ॥

తా॥ తామ్రచూడ హస్తము అడ్డముగపట్టిన, "అరుణవర్ణము" నందు వర్తించును.

శ్లో॥ తిరిశ్చీనః పతాకశ్చేత్పీతవర్ణే నియుజ్యతే ।

తా॥ పతాకహస్తము అడ్డిముగ బట్టినచో "పీతవర్ణము" నందు వర్తించును.

శ్లో॥ తిరశ్చీనః సింహముఖశ్శ్యామలేపరియుజ్యతే ॥

తా॥ సింహముఖ హస్తము అడ్డముగబట్టినచో "నీలవర్ణము" లందు వర్తించును.

శ్లో॥ అంసదేశః పతాకాగ్రహస్తేన యదితర్మితః ।
క్షత్రియార్థేభుజార్థేపి జయలక్ష్మీ ప్రదర్శనే ।
తూణీరార్థేపి పృష్ఠర్ధ పురుషస్య ప్రదర్శనే ।
ఇత్యర్థేషు నియుజ్యంతే నాట్యకర్మ విశారదైః ॥

తా॥ పతాక హస్తాంగుళులచే భుజప్రదేశమును స్పృశించినగో క్షత్రియులయందు, భుజములందు, జయలక్ష్మిని చూపుటయందు అమ్మలపొది చూపుటయందు, పశ్చిమభాగమందుండెడి పురుషుని చూపుటయందు. ఈ హస్తము వినియోగించుచున్నది.

శ్లో॥ పతాకయాప్యూరుదేశం దర్శయేద్వైశ్యభావనే ॥

తా॥ పతాకహస్తముచే ఊరుప్రదేశము చూపించినచో, వైశ్యవర్ణము నందు వర్తించును.

శ్లో॥ జంఘాంచేత్స్పర్శయేచ్ఛూద్రే హస్తేనార్థ పతాకయా ॥

తా॥ అర్థపతాక హస్తముచేత జానుప్రదేశము స్పృశించినచో శూద్ర వర్ణమునందు వర్తించును.

శ్లో॥ అనామికాచ విశ్లిష్టా మృగశీర్షాఖ్యహస్తకే ।
నామ్నార్థ మృగశీర్షోఽయం తస్యభావవిహోభ్యతే ॥

తా॥ మృగశీర్ష హస్తమునంధు అనామికాంగుళిని. విశ్లిష్టముగా బట్టినచో అర్థమృగశీర్ష హస్తమగును.

## -: వి ని యో గ ము లు :-

శ్లో॥ బాలస్త్రీణాం భావనేస్యాత్యాంవాదేచయుజ్యతే ॥

తా॥ అర్థమృగశిర హస్తము బాలికను చూపుటయందును, లలిత వచనమునందును వినియోగించుచున్నది.

శ్లో॥ విసృజ్యముకుళం పూర్వం పశ్చాచ్ఛేన్మృగశీర్షకః ।
వృద్ధస్త్రీణాం భావనాయాం కృపాశాంతిరసోదయే ॥

తా॥ ముందుగ ముకుళహస్తము బట్టివిడిచి. తదుపరి మృగశిరహస్తమును బట్టినగో. వృద్ధస్త్రీని చూపుటయందు కృపారసశాంతి రసావిర్భావము లయందు వినియోగింపబడును.

## -: నానార్థములు :-

శ్లో। వక్షేనానార్థహస్తానాం నిర్ణయక్రమభావనాం ॥

తా॥ నానార్థ హస్తములను క్రమరీతిగా వివరించెదను.

శ్లో॥ కర్ణనా సాదరణాంచ సమీపేచవితేయది ।
సందంశ హస్తోరేఖదౌ.వర్ష ధారానుయుజ్యతే॥

తా॥ సందంశ హస్తమును కర్ణనాశికాధరముల సమీపములందు చలింపజేయుచున్నచో. రేఖాదులయందును. ఊర్ధ్వాదోముఖములుగా చలింప చేసినచో వర్షాధారలయందును వినియోగించును.

శ్లో॥ అధోధుజాంతరేతిర్యక్థ్సాయిచేన్మృగశీర్షకః ।
పతిచేత శ్శరీరార్థభావనానునిరూప్యతే ॥

మృగశీర్ష హస్తము భుజాంతరాధః ప్రదేశమున అడ్డముగా స్థాయిగా నిలిపిపట్టినచో పతియందు. మనస్సుయందు, శరీరము చూపుటందు వినియోగించును.

శ్లో॥ కనిష్టికేముకుళయోస్సమ్యగేవ ప్రసారితే ।
నామ్నార్థ ముకుళోహస్తస్తయోర్యోగోవిధీయతే ॥

తా॥ రెండు ముకుళ హస్తములు కనిష్టికాంగుళులు చక్కగా చాచి పట్టినచో. అర్థముకుళహస్తము వచ్చునని నానార్థములలో చెప్పబడియున్నది,

## -: వినియోగములు :-

శ్లో॥ అన్యోన్యాభిముఖీభావాచ్చలచ్చోపరిచాలనాత్ ।
వక్షస్థానప్రచలనాదుపవేశనకర్మణి ।
తద్వైవేతి ప్రవచనే ఆత్మార్థే వినియుజ్యతే ॥

తా॥ రెండు అర్ధముకుళ హస్తములు అన్యోన్యాభి ముఖభావము వలన అధోభాగమునందు చలింపచేసినచో ఉపవేశన కర్మయందును, ఊర్ధ్వభాగమం చలింపచేసినచో. అటులేయనుటయందు, వక్షస్థలమునందు చలింపచేసినచో మనస్సునందు వర్తించును.

శ్లో॥ అధోభాగే ముకుస్యాగ్రే వక్షస్థానే నివేశితః ।
ముకుళోజనసల్లాపే సంతోషే వినియుజ్యతే ॥

తా॥ ముకుళ హస్తమును ముఖాగ్రభాగమునకు క్రిందుగా చలింప చేసినచో జనుల సల్లాపమందు, వక్షస్థలమందు, చలింపచేసినచో సంతోషము నందు వినియోగించును,

శ్లో॥ అధోభాగే దక్షిణాంగే ముఖాస్యాగ్రే నివేశితః ।
బ్రహ్మచర్యే నిశ్చలార్థే లేఖనేపిచ సూచకః ॥
యుజ్యతే కలిభిర్నాట్య మర్మార్థచతురైస్సదా ॥

తా॥ సూచిముఖ హస్తము ముఖాగ్రభాగమున నుంచినచో బ్రహ్మ చర్యమందును, దక్షిణభాగమున క్రిందుగ పట్టినచో. కదలకుండుటయందును, వ్రాయుటయందును వినియోగించును.

శ్లో॥ పురోభాగేచోర్ధ్వదేశేప్యధోభాగేచ నిశ్చలః ।
వైష్ణవాభిదహస్తోఽయం. గార్హస్థ్యేపికలౌయుగే ।
భూగర్తేపిచయుజ్యేతకరార్థచతురైస్తథా ॥

తా॥ వైష్ణవ హస్తము పురోభాగమందుబట్టినచో గార్హస్థ్యమునందును, ఊర్ధ్వదేశమునందు బట్టినచో కలియుగమునందును, అధోముఖమునబట్టినచో భూగర్తయందును వినియోగించుచున్నది.

శ్లో॥ అన్యోన్యాభిముఖీభావాత్పురో భాగేచచాలనాత్ ।
ఊర్ధ్వాగ్రయుగ్మసంయోగాత్పతాక చతురౌకరౌ ।
వానప్రస్థాపిగమనేదేవనీరాజనావిధౌ ।
యుజ్యతే పర్ణశాలాయాం, భరతక్రమవేదిభిః ॥

తా॥ రెండు పతాక చతుర హస్తములు పరస్పరాభి ముఖభావముల వలనబట్టినచో వానప్రస్థాశ్రమమందును, పురోగభాగమునందు త్రిప్పినచో దేవతా నీరాజనమునందును, ఊర్ధ్వముఖముగబట్టినచో (అంగుళులను పరస్పరము కలిపిపట్టినచో) పర్ణశాలయందును వర్తించును.

శ్లో॥ దక్షిణాంశే పురోభాగే తిరశ్చీనస్తు నిశ్చలః ।
సన్యాసేచ స్థిరార్ధేచ సమాలంచేతిభాషణే ।
శిఖరాఖ్యకరస్సోఽయం యుజ్యతే నాట్యకోవిదైః ॥

తా॥ శిఖరహస్తము దక్షిణభాగమునందు కదలకుండ బట్టినచో సన్యాసాశ్రమమునందు. పురోభాగమున బట్టిన స్థిరమనుటయందు. అడ్డముగ బట్టినచో పట్టుకొనుమనుటయందు వర్తించును.

శ్లో॥ ఊర్ధ్వాధోముఖవిన్యాసాత్పూరోభాగే ప్రసారణాత్ ।
వక్షస్థానే నిశ్చలౌచేత్కపిద్థాకరౌతథా ।
దుదోహోత్యపివాక్యేచమథనే ధూమయానకే ।
యుజ్యతేయోగకుశలైర్నాట్యశాస్త్రవిశారదైః ॥

తా॥ రెండు కపిద్థ హస్తములు ఊర్ధ్వాధోముఖములుగ పట్టినచో పాలు పితుకుటయందును. పురోభాగ ప్రసారణమువలన - మధించుట వలన వక్షస్థలమున నిశ్చలముగ బట్టినచో ధూపహారములయందును వర్తించును

## -: ఋతువుల హస్త లక్షణములు :-

శ్లో॥ త్రిపతాక కరస్సోయ మూర్ధ్వభాగే ప్రచాలితః ।
కరోప్యర్ధ పతాకాఖ్యః పర్యాయేణాగ్రతశ్చలః ।
త్రిపతాఖ్యకరశ్చోర్ధ్వభాగే పార్శ్వద్వయేచలః ।
వసంత గ్రీష్మసమయ వర్షకామేషుచక్రమాత్ ।
యుజ్యతే యోగకుశలై భరతాన్వయవేదిభిః ॥

తా॥ త్రిపతాక హస్తము ఊర్ధ్వభాగమున చలింపచేసినచో వసంత ఋతువునందును, అర్ధపతాకహస్తము పురోభాగమున చలింపచేసినచో గ్రీష్మ ఋతువునందును, త్రిపతాకహస్తము ఊర్ధ్వభాగమునందు ఉభయ పార్శ్వము లందు చలింపచేసినచో వర్ష ఋతువునందును వర్తించును,

శ్లో॥ అలపద్మశ్చ సింహాఖ్యః కర్ణదేశే ప్రచాలితౌ ।
అధోముఖః సర్పశీర్షః పురోఽర్ధ ముకుళస్తథా ।
శరద్ధేమంత శిశిర సమయేషు యథాక్రమమ్ ॥

తా॥ అలపద్మ హస్తమున్ను, సింహముఖ హస్తమున్ను, కర్ణప్రదేశములందు చలింపచేసినచో శరదృతువునందు, సర్పశిరహస్తము అధోముఖముగ బట్టిన హిమవంత ఋతువునందు, అర్ధముకుళహస్తము పురోభాగమున బట్టిన, శిశిర ఋతువునందును వర్తించుచున్నది.

శ్లో॥ అగ్రేసూచి నిశ్చలాచేత్కాష్టేర్థే వినియుజ్యతే ॥

తా॥ సూచీముఖ హస్తము పురోభాగమునందు నిశ్చలముగ నిల్పినచో "కాష్టము"నందు వర్తించును.

## -: కాలముల హస్త లక్షణములు :-

శ్లో॥ సందాశస్యాత్కాశార్థేపినఖహంసః క్షణేభవేత్ ।
లవార్థేముకుళః ప్రోక్తః కరటీకావిచక్షణైః ॥

తా॥ సందంశ హ స్తము, కళాకాలమునందును, [illegible] హ స్తము [illegible] క్షణకాలమునందును, ముకుళహ స్తము లి ప్తకాలమునందు వ ర్తించును.

శ్లో॥ ఘటికార్ధేఽర్ధముకుళ స్తిర్యగూపోనియుజ్యతే ।
చతురోప్యర్ధయామార్ధే, యామార్ధేహంసవ క్త్రికః ।
ద్వియామేర్ధ పతాకాఖ్యా. త్రియామేతామ్రచూడకః ।
ధివారాత్రౌ పద్మకోశ ముకుళశ్చ యథాక్రమం ।
పూర్వేద్యుర్యుజ్యతే సూచీనాట్యశాస్త్ర విచక్షణైః ॥

తా॥ అర్ధముకుళహ స్తము అడ్డముగపట్టినచో ఘటికాలమునందును, చతురహ స్తము అర్ధయామమునందును. హంసాశ్యహ స్తము యామకాలమునందును, అర్ధపతాకహ స్తము రెండుయామముల కాలమునందును. తామ్రచూడహ స్తము మూడుయామముల కాలమునందును. పద్మకోశహ స్తము పగటికాలమునందును. ముకుళహ స్తము రాత్రికాలమునందును. సూచీముఖహ స్తము పూర్వదినమునందును వ ర్తించుచున్నవి యని నాట్యాచార్యులు వాగ్గేయకారులు చెప్పిరి.

శ్లో॥ పక్షార్ధేయుజ్యతే సర్పశీర్ష శ్చే త్తిర్యగాశ్రితః ।
మాసార్ధేనిశ్చలాశూచీచలితాచేద్యుగేభవేత్ ।
శుకతుండో నిశ్చలశ్చే దూర్ధ్వవర్షే నియుజ్యతే ॥

తా॥ సర్పశీర్ష హ స్తము అడ్డముగపట్టినచో పక్షకాలమునందు. శూచీముఖహ స్తము నిశ్చలముగ పట్టిన మాసకాలమందును, చలింపచేసినచో యాగమునందును, శుకతుండ హ స్తము నిశ్చలముగ బట్టినచో రాబోవు సంవత్సరమునందు వర్తించును.

శ్లో॥ ఇందీవరేచకల్హారే చంపకేచరాటకే ।
తాపింఛేబుద్బుదార్ధేచ, ఛకోరాణాంచభావనే ।
ఊర్ధ్వాకారాననోహస్తోలాంగూలో యుజ్యతేక్రమాత్ ॥

తా॥ లాంగూలహస్తము ఊర్ధ్వముఖముగ బట్టినచో నల్లకలువయందును, కల్హారకుసుమముయందును, సంపంగి పుష్పమునందును. తమాల పుష్పగుచ్ఛమునందు నీటిబుగ్గయందును, చకోరపక్షులు చూపుటయందు వినియోగించును.

శ్లో॥ నక్త్యంతికగతౌగండతలయోరంతికేస్థితౌ ।
తత్రైవరేచితౌనామ్నా. పతాకాభిదహస్తకౌ ।
మర్ధళార్థే కపోలార్థే తద్వఈతాడనక్రమే ।
యుజ్యతే యోగకుశలై న్నాట్యకర్మ విచక్షణైః ॥

తా॥ రెండు పతాకహస్తములు. మోకాళ్ళ సమీపమున నుంచినచో, మర్దళమునందును. చలింపచేసినచో మృదంగ వాద్యమందును. కపోలసమీప మునందు బట్టినచో గండస్థలమునందును, కపోల సమీపమున ఛలింపచేసినచో చెంపగొట్టుటయందును వర్తించుచున్నది.

## -: చతుర్వేద హస్త లక్షణములు :-

శ్లో॥ ఋగ్వేదేచ పతాకోగ్రేచలితోయది యుజ్యతే ॥

తా॥ పతాకహస్తము పురోభాగమునందు చలింపచేసినచో ఋగ్వేదము నందు వర్తించును.

శ్లో॥ పతాకచతురేంగుష్టః పౌనః పుణాత్ప్రిచాలితః ।
యజుర్వేదేపి యుజ్యేత నాట్యశాస్త్ర విశారదైః ॥

తా॥ పతాక చతుర హస్తమునందు అంగుష్టము మాటిమాటికి చలింప చేసినచో యజుర్వేదమునందు వర్తించును.

శ్లో॥ అధస్తాదూర్ధ్వభాగస్థో హస్తసందంశ నామకః ।
యుజ్యతే సామవేదార్థే భరతక్రమపారగైః ॥

తా॥ సందంశహస్తము క్రిందుమీదులుగ బట్టినచో సామవేదమునందు వర్తించును.

శ్లో॥ మృగశీర్షో౽ధోముఖశ్చేద థర్వణపదే భవేత్ ॥

తా॥ మృగశీర్ష హస్తములు అధోముఖముగ బట్టినచో అధర్వణ వేదమందు వర్తించునని భరతాచార్యులు చెప్పియుండిరి.

## -: చతురోపాయ హస్త లక్షణములు :-

### సామ. దాన, భేద. దండోపాయ హస్త లక్షణములు :

శ్లో॥ మృగశీర్షస్తిర్యగశ్చేత్స ఏవాగ్రే ప్రచాలితః ।
ముకుళో౽భి ముఖీభూతః పతాకశ్చే ప్రకంపితః ।
క్రమాచతురుపాయేషు యుజ్యతేవై మనీషిభిః ॥

తా॥ మృగశిర హస్తమును అడ్డముగా బట్టినచో సామోపాయము నందును, పురోభాగమునందు చలింపచేయుచు బట్టినచో దానోపాయమునందును. ముకుళహస్తము అధోముఖముగ బట్టినచో భేదోపాయమునందును. పతాకహస్తము పార్శ్వములందు చలింపచేసినచో దండోపాయమునందును వర్తించుచున్నది.

శ్లో॥ తర్జనీ మధ్యమే సమ్యక్కుంచితేతలమాశ్రితే ।
శేషాప్రసారితౌస్యో౽యం నామ్నాసంయమ హస్తకః ॥

తా॥ తర్జనీ మధ్యమాంగుళులు వంచి హస్తతలమును ఆశ్రయింప చేసి. శేషాంగుళలను చాచిపట్టినచో సంయమహస్త మనబడును.

## వినియోగములు ;

శ్లో॥ ప్రాణాయామే మహాయోగే యజమానస్య భావనే ॥

శ్లో॥ ప్రాణాయామమునందును. మహాయోగమునందును. సోమయాజి నభినయించుటయందు వర్తించును.

శ్లో॥ వక్త్రాంతికేఽలపద్మోఽయం సఏవోర్ధ్వం ప్రచాలితః ।
ఉత్సాహప్రభు శక్త్యర్థేయుజ్యతే నాట్యమర్మగైః ॥

తా॥ అలపద్మ హస్తము ముఖసమీపమునందు బట్టినచో ఉత్సాహ శక్తియందును. ఆ అలపద్మమునే ఊర్ధ్వభాగమున చలింపచేసినచో ప్రభు శక్తియందును వర్తించును.

శ్లో॥ ముకుళోవిరళీభూతోప్య పద్మకరశ్చలః ।
మంత్రశక్తౌతథాసమ్యగ్భాగధేయానుభుగ్జనే ॥

తా॥ ముకుళహస్తము విరళముగబట్టినచో మంత్రశక్తియందును, అలపద్మ హస్తము చలింపచేసినచో భాగ్యభోగియందును వర్తించును.

శ్లో॥ పతాకౌతు పురోభాగే పరస్పరాముఖాశ్రితౌ ।
సంధర్థేయుజ్యతే సోయంప్రమాణార్థేతథైవచ ॥

తా॥ రెండు పతాకహస్తములు పురోభాగమునందు పరస్పరాభిముఖ ముగ కలిపి పట్టినచో సంధియందును, ప్రమాణమునందును వర్తించును.

శ్లో॥ త్రిపతాకః పురోభాగే చలితోవిగ్రహే భవేత్ ॥

తా॥ త్రిపకాక హస్తము పురోభాగమునందు ప్రసరింపచేసినచో తరలి పోవుటయందు ఈ హస్తము వర్తించును.

శ్లో॥ ఆసనార్థేచ శిఖరః పురోభాగే స్థితోయది ॥

తా॥ శిఖరహస్తము పురోభాముగనందు నిలిపినచో, గూర్చుండుట యందు వర్తించును.

శ్లో॥ ద్వైధీభావే కర్తరీస్యాదగ్రభావే ప్రకంపితా॥

తా॥ కర్తరీ ముఖహస్తము పురోభాగమునందు కంపింపచేసినచో ద్వైధీకరణమునందు వర్తించును.

శ్లో॥ అంజలిర్వక్షసిస్థాయీ యుజ్యతేచ సమాశ్రయే॥

తా॥ అంజలిహస్తము వక్షస్థలమునందు నిశ్చలముగనుంచినచో ఆశ్రయించుటయందు వర్తించును.

## -; భూత, భవిష్య ద్వర్తమానకాల హస్త లక్షణములు :-

శ్లో॥ అధోభాగే పురోభాగే దర్శితో పృష్ఠభాగకే।
డోలావచ్చలితోహస్తః పతాకాఖ్యః మనీషిభిః ।
వర్తమానేచ భూతార్థే భవ్యర్యేచాపియుజ్యతే ॥

తా॥ పతాకహస్తము క్రిందుగబట్టినచో వర్తమానకాలమందును, పురోభాగమందు డోలాకారముగ బట్టినచో భవిష్యత్కాలమునందును. పృష్ఠభాగమునందు చాచిపట్టినచో భూతకాలమునందును వర్తించును.

శ్లో॥ ప్రయోగే కర్మణిఖ్యాతః కరోహంసోస్యప్యధోముఖః ॥

తా॥ హంసాశ్య హస్తము, అధోముఖముగ బట్టినచో కర్మణి ప్రయోగమునందును వర్తించును.

శ్లో॥ ప్రయోగేకర్తరిఖ్యాతః సందంశస్యాప్యధోముఖః ॥

తా॥ సందంశహస్తము అధోముఖముగబట్టిన కర్తరీప్రయోగమునందు వర్తించుచున్నది.

శ్లో॥ భావే ప్రయోగవిఖ్యాతః సర్పశీర్షోప్యధోముఖః ॥

తా॥ సర్పశీర్ష హస్తము అధోముఖముగ బట్టినచో భావప్రయోగమునందు వర్తించును.

శ్లో॥ తత్రప్రత్యమే ప్రయుజ్యేతి హంసాస్యోఽయ మధోముఖః ॥

తా॥ హంసాశ్యహస్తము అథోముఖము కల్గునట్లు పట్టినచో తత్రప్రత్యయాంతమునందు వర్తించును.

శ్లో॥ కృపత్వాయేఽథోముఖశ్చ స్మృగశీర్ష కరోభవేత్ ॥

తా॥ మృగశీర్ష హస్తము అథోముఖముగల్గునట్లు పట్టినచో క్త్వాప్రత్యయమునందు వర్తించును.

శ్లో॥ వహప్రాపణధావానాంత్రయేచేదర్ధచంద్రకః ॥

తా॥ అర్ధచంద్ర హస్తము క్రిందుగాబట్టినచో వహప్రాపణ ధాతువుల యొక్క త్రితయమునందు వర్తించును.

శ్లో॥ పురుషత్ర భావేతు, ఔచిత్యేన విధాపయేత్ ॥

తా॥ ప్రథమ, మధ్యమ, ఉత్తమ, పురుషభావములందు తత్కాలోచిత హస్తములు చేయవలయును.

శ్లో॥ డుకృఞ్కరణే ధాతూనాం, కరోఽర్ధ చతురోభవేత్ ॥

తా॥ అర్ధచంద్ర హస్తములు క్రిందుగాబట్టినచో డుకృఞ్ కరణే ధాతువునందు వర్తించును.

## బాంధవ్య హస్తములు (మాతృహస్త లక్షణము)

శ్లో॥ వామేతు శిఖరంకృత్వా దక్షణే మృగశీర్షకం ।
మాత్రార్థే వినియుజ్యేత కీర్తితో భరతాదిభిః ॥

తా॥ వామకరముచేత శిఖరహస్తమును, దక్షిణకరముచేత మృగశీర్షమును బట్టినచో మాతృహస్త మగును. ఇది తల్లియందు చెల్లును.

-: పితృహస్త లక్షణము (తండ్రి) :-

శ్లో॥ ఏతౌ తౌలి పరీతౌచేత్పిత్రార్థే వినియుజ్యతే ॥

తా॥ మాతృ హస్తములను విపరీతార్థముచేసి. అనగా వామహస్తము సర్పశీర్షముచేత, దక్షిణహస్తముచేత శిఖరమునుబట్టినచో పితృహస్తమగును. ఇది తండ్రికి చెల్లును.

-: పితామహ హస్త లక్షణము :-

శ్లో॥ సందంశ స్త్వళికే భాగేచలితో విరళోయది।
పితామహోని యుజ్యేత శివేన పరికీర్తితః ॥

తా॥ సందంశ హస్తమును లలాటమందుబట్టి చలింపచేసి విరళముగ బట్టినచో తాతయందు వినియోగించును.

-: పితామహీ హస్తలక్షణము (నాయనమ్మ) :-

శ్లో॥ ఆలపద్మః కంఠదేశేకృత్వాపి చలితోయది ।
పితామహీం నియుజ్యేత కథితోభరతాదిభిః ॥

తా॥ అలపద్మ హస్తము కంఠదేశమందుబట్టి చలింపచేసినచో అవ్వ యందు వినియోగించును.

-: పుత్రి - పుత్ర - హస్తలక్షణము :-

శ్లో॥ వామహస్తే సర్పశీర్షం మృగశీర్షే తతోపరి-
విన్యసేతత్సుతాయాంచేసుతేపి వినియుజ్యతే ॥

తా॥ వామహస్తముచే సర్పశీర్షమునుబట్టి. దానిపై మృగశిరహస్తము నుంచినచో పుత్రిక,- పుత్రునియందు వర్తించును.

-: జామాత హ_స్తలక్షణము (అల్లుడు) :-

శ్లో॥ మయూరే దక్షిణేహ_స్తే భ్రమరో, వా మహ_స్తకే ।
జామాతారినియుజ్యేతకర కర్మవిశారదైః ॥

తా॥ దక్షిణ కరముచేత మయూరమును. వామహ_స్తముచేత భ్రమర హ_స్తమును బట్టినచో అల్లునియందు చెల్లును.

-: శ్వరహ_స్త లక్షణము (మామ) :-

శ్లో॥ పతాకస్య పృష్టభాగ_స్తిర్యక్త్వైవ ప్రదర్శితః ।
శ్వశ్వరార్థేనియుజ్యేతనందినా పరికీ_ర్తితః ॥

తా॥ పతాక హ_స్తముయొక్క పృష్ఠభాగము అడ్డముగబట్టినచో మామయందు వినియోగింపబడును.

-: శ్వశ్రూహ_స్త లక్షణము (అ_త్త) :-

శ్లో॥ పతాకముదరే కృత్వావామే చాప్యలపద్మకం ।
శ్వశ్రాంచ సరియుజ్యేత కథితో భరతాదిభిః ॥

తా॥ పతాక హ_స్తమును ఉదరమునందు చేర్చి. వామహ_స్తముచే ఆలపద్మమును పట్టినచో అ_త్తయందు వ_ర్తించును.

-: స్నుషాహ_స్త లక్షణము (కోడలు) :-

శ్లో॥ పతాకేన భువందర్శ్యవామహ_స్తేఽర్థ చంద్రకం ।
స్నుషాయాంచ ప్రయో_క్తవ్యంకోహశేన ప్రకీ_ర్తితమ్ ॥

తా॥ పతాక హ_స్తముచేత భూమిని చూపించి. వామహ_స్తముచే అర్థచంద్ర హ_స్తమును బట్టినచో కోడలియందు వ_ర్తించును.

-: భగినీహస్త లక్షణము (చెల్లెలు) :-

శ్లో॥ దక్షిణేహంస పక్షంచవామే లాంగూలకంతథా ।
స్వసారం ప్రతియుజ్యేత త్వాంజనేయేనచోదితమ్ ॥

తా॥ ధక్షిణ కరముచే హంసపక్షమును, వామహస్తముచే లాంగూలమును బట్టినచో తోబుట్టువునందు వర్తించునది.

:- శ్యాలక హస్తలక్షణము (బావమరిది) :-

శ్లో॥ కటకాముఖ హస్తేన తామ్రచూడ ప్రదర్శితః ।
శ్యాలకేతు ప్రయుజ్యేతేత్యా చార్యేణ ప్రచోదితమ్ ॥

తా॥ కటకాముఖ హస్తమును, తామ్రచూడహస్తమును చూపినచో బావమరిదియందు వర్తించును.

-: ననాంధహస్త లక్షణము (వదిన-మరదలు) :-

శ్లో॥ శుకతుండో దక్షిణేచ. ముకుళౌవామ హస్తకే ।
ననాంధాయాం ప్రయుజ్యేత పార్శ్వత్యాపరికీర్తితమ్ ॥

తా॥ దక్షిణకరమందు శుకతుండము. వామకరమందు ముకుళహస్తము బట్టినచో వదిన - మరదండ్రయందు వర్తించును.

-: దౌహిత్ర నప్త్వహస్త లక్షణమ్ (మనమడు, మునిమనవడు :-

శ్లో॥ మృగశీర్ష స్త్రియగాని, వామేహంసాశ్యహస్తకః ।
దౌహిత్రనప్త్రోరుజ్యతేత్యగస్త్యేవ ప్రకీర్తితమ్ ॥

తా॥ దక్షిణకరముచే మృగశిరహస్తమును. వామకరముచేహంసాశ్య హస్తమును బట్టినచో దౌహిత్ర - ప్రపౌత్రులయందు వర్తించును.

-: భ్రాతృభగినీ హస్తలక్షణము (సోదరుడు-చెల్లెలు) :-

శ్లో॥ సూచీహస్తస్త్వం సందేశే కుంచితోపీక్షితోయది ।
భగిన్యాం సోదరేచైవ యుజ్యతే భరతాగమే ॥

తా॥ భుజప్రదేశమునందు సూచిహస్తమునువంచి చూపించో భగిని యందు, సోదరునియందును వినియోగించును.

-: చాతుర్వర్ణ హస్తలక్షణము :-

శ్లో॥ కరాభ్యాం శిఖరం ధృత్వాయజ్ఞసూత్ర ప్రదర్శనే ।
దక్షిణేన కృతేతిర్యగ్బ్రాహ్మణానాం ప్రదర్శితః ॥

తా॥ రెండుచేతులతో శిఖరహస్తమునుబట్టి. దక్షిణహస్తముచే నడ్డముగ ఉపవీత దర్శనము (జంధ్యము) చూపినచో బ్రాహ్మణ వర్ణమునందు వినియోగించును.

-: క్షత్రియ హస్తలక్షణము :-

శ్లో॥ వామేన శిఖరం తిర్యగ్ ధృత్వాన్యేవ పతాకః ।
ధృతోయది క్షత్రియాణాం హస్తఇత్యభిధీయతే ॥

తా॥ వామకరముచే శిఖరహస్తమును, అడ్డముగబట్టి దక్షిణకరముచే పతాకహస్తమును ధరించినచో క్షత్రియవర్ణ హస్తమగును. క్షత్రియునకు చెల్లును.

-: వైశ్యహస్త లక్షణము :-

శ్లో॥ వామేకరేతుహస్తాస్యో దక్షిణే కటకాముఖః ।
వైశ్యహస్తోయమాఖ్యాతోభరతాగమవేదిభిః

తా॥ వామకరముచే హంసాశ్యమును, దక్షిణ కరముచే కటకాముఖ మును బట్టినచో వైశ్యవర్ణ హస్తమగును. ఇది వైశ్యునికి చెల్లును.

-: శూద్రహస్త లక్షణము :-

శ్లో॥ వామేతు శిఖరం సూచీ దక్షిణే శూద్రహస్తకః ॥

తా॥ వామహస్తముచే శిఖరమును, దక్షిణ కరముచే సూచీహస్త మును బట్టినచో శూద్రవర్ణ హస్తమగును. ఇది శూద్రునకు వర్తించును.

-: భర్తృహస్త లక్షణము (పెనిమిటి) :-

శ్లో॥ విన్యస్యకంఠే హంసాస్యాశిఖరో దక్షిణేకరే ।
భర్తృహస్త ఇతిఖ్యాతస్తస్మిన్నేవనియుజ్యతే ॥

తా॥ కంఠమందు హంసాశ్యహస్తముంచి, కుడిచేత శిఖరహస్తము పట్టిన భర్తృహస్తమగును, ఇది మగనికి చెల్లును.

-: భర్తృభ్రాతృహస్త లక్షణము (భర్త అన్న) :-

శ్లో॥ వామేతుశిఖరం ధృత్వాపార్శ్వయోః కర్తరీముఖం
ధృతో దక్షిణహస్తేన భర్తృభ్రాతృకర స్మృతః ॥

తా॥ ఎడముచేత శిఖరమునుబట్టి, రెండుపార్శ్వములయందును, కుడి చేత కర్తరీముఖ హస్తమును బట్టిన, భర్తృభ్రాతృ హస్తమగును. ఇది పెనిమిటి, తోడబుట్టిన వారియందు చెల్లును.

-: జ్యేష్ఠ కనిష్ఠ భ్రాతృహస్త లక్షణము :-

శ్లో॥ మయూరహస్తః పురతః పశ్చాద్భాగేచద దర్శితః ।
జ్యేష్ఠభ్రాతృః, కనిష్ఠాస్యాఽప్యయంహస్తః ప్రకీర్తిత॥ః

తా॥ మయూరహస్తము ముందుప్రక్కను వెనుకప్రక్కను పట్టబడినయెడల జేష్టభ్రాతృ హస్తమగును. ఇది అన్నదమ్ములయందు వినియోగించును.

## విప్రకీర్ణ హస్త లక్షణములు వినియోగములు 27

-: విప్రకీర్ణ హస్త లక్షణము :-

హస్తౌతు త్రిపతాకాఖ్యౌతిర్యక్కూర్పర సంయుతౌ ।
కథ్యతేవి ప్రకీర్ణోఽయం హస్తోనాట్య విశారదైః ॥

తా॥ రెండు త్రిపతాక హస్తముల మోచేతులను అడ్డముగా గూడబట్టినయెడ విప్రకీర్ణ హస్తమగును.

వినియోగములు :-

కవచేచ కరన్యాసే మంత్రావాహేక్షమాగుణే ।
విచారేచ ప్రయోక్తవో విప్రకీర్ణ ఇతీరితః ॥

తా॥ కవచము కరన్యాసము మంత్రావాహనము క్షమాగుణము విచారము వీనియందు యీ హస్తము వినియోగించును.

-: గజదంత హస్త లక్షణము :-

కరధ్యాం శిఖరౌ దృత్వా కనిష్టే ప్రసృతేయది ।
గజదంతకరః, ఖ్యాతః కరోభరత వేదిభిః ॥

తా॥ రెండు శిఖర హస్తములును చిటికెనవేళ్ళు చాచిపట్టినయెడ గజదంత హస్తమగును.

వినియోగములు :-

జలావగాహేద్విరద దంతయోర్వ్యాపి మానయోః ।
శంఖుస్థాపనభావేషు గజదంతోని యుజ్యతే ॥

తా॥ నీళ్ళయందు మునుగుట, ఏనుగు కొమ్ములు. భూమిమానము, శంఖుస్థాపన చేయుట వీనియందు వినియోగించును.

-: తాలముఖ హస్తలక్షణము :-

కరౌ పతాక నామానౌ అన్యోన్యాభిముఖేకృతౌ ।
చలితౌ చేత్తాలముఖః. ప్రోక్తో భరతవేదిభిః ॥

తా॥ రెండు పతాక హస్తములు యెదురెదురుగాబట్టి చలింపజేయు నెడ తాలముఖ హస్తమగును.

వినియోగము :-

భుజఙ్గ సూక్ష్మనాట్యేచ ముఖనాట్యేచ మేళనే ।
గ్రహేస్థూల పదార్థేచ తాలవక్త్రోఽభిదీయతే ॥

తా॥ భుజంగనాట్యము, ముఖనాట్యము, కూడిక, గ్రహించుట, లావైన పదార్థము వీనికి చెల్లును.

-: సూచివిద్ధ హస్తలక్షణము :-

అన్యోన్యమభిసంస్పృష్టౌ సూచీవక్త్రాభిధౌకరౌ ।
సూచీవిద్ధకరస్సోఽయం. నృత్తహస్తానుసారిభిః ॥

తా॥ రెండు సూచిముఖ హస్తములు ఎదురెదురుగా చేరబట్టబడునేని సూచివిద్ధ హస్తమగును.

వినియోగములు :-

హల్లీసలీనాభినయేలగ్నార్థేమేళనేద్రుడే ।
శాఖాద్వయస్య సంయోగే సూచీవిద్దకరో భవేత్ ॥

తా॥ కోలాటమునందలి కలగలుపు. చేరిక, గట్టిది, రెండుకొమ్మల చేరిక వీనియందు ఈ హస్తము చెల్లును.

-: పల్లవహస్త లక్షణము :-

పతాకౌమణి బంధేతుచలితౌ చేదకహోముఖౌ ।
కరౌపల్లవనామాఽయం యుజ్యతేనాట్యవేదిభిః

తా॥ పతాక హస్తములు క్రిందు మొగలోగా, మనికట్లు పట్టబడిన యెడల పల్లవహస్తమగును.

వినియోగములు :-

ఫలపుష్పాతిభారేణ నమ్రశాఖాసులప్పనే ।
నమ్రతార్థేనియోక్తవ్యః పల్లవస్సోఽభిధీయతే ॥

తా॥ పుష్పఫలాదులచే వంగిన కొమ్మలు వ్రేలాడుట, వంగుట వీని యందు ఈ హస్తము చెల్లును.

-: నితమ్బ హస్తలక్షణము :-

అం సందేశం సమారవ్య నితమ్బానధిచాలితౌ ।
పార్శ్వయోస్తు పతాకౌద్వౌ నితమ్బకర ఉచ్యతే ॥

తా॥ రెండు పతాక హస్తములు మూపులు మొదలుకొని పిరుదుల దాకా ప్రక్కలలో కదలుచున్నట్లు పట్టబడినయెడ నితమ్బహస్తమగును.

వినియోగములు :-

పరివేషేచ సూర్యేన్ద్వోరఙ్గలావణ్య దర్శనే ।
ప్రాకారా దేవతానాంచనైపథ్యే భ్రమణేపిచ ।
పార్శ్వ సౌందర్య భావేవ నితమ్బాఖ్యాకరో భవేత్ ॥

తా॥ సూర్యచంద్రుల పరివేషము, చక్కదనము, ప్రాకారము, దేవతాదుల వేషము, భ్రమించుట. ప్రక్కల చక్కదనము వీనియందు ఈ హస్తము చెల్లును.

-: కేశబంధ హస్తలక్షణము :-

ఏతావేవనితమ్బాది కేశపర్యంతచాలితౌ ।
యదిశ్యాత్కేశ బంధాఖ్య కరస్సమ్యజ్నిరూప్యతే ॥

తా॥ ముందుచెప్పిన పతాక హస్తములే పిరుదులు మొదలు తల వెంట్రుకలదాకా చలింపనేయుచు పట్టబడినయెడ కేశబంధహస్త మగును.

వినియోగములు :-

వృక్షద్వయేఽధికేమేరోరర్థేబహువిభావనే ।
ఉత్తిష్టేతివచోభావే యుజ్యతే కేశబంధకః ॥

తా॥ రెండు వృక్షములు. అధికము. మేరుపర్వతము, చాలాఅనుట. లెమ్మఅనుట వీనియందు చెల్లును.

-: లతాహస్త లక్షణము :-

అలపద్మావగ్రభాగ ప్రశితౌ చవితౌయది ।
లతాహస్త స్సవిజ్ఞేయః. ప్రోక్తోనాట్య విశారదైః ॥

తా॥ రెండు అలపద్మ హస్తములు ఎదురెదురుగా చెల్లించుటట్లు పట్టబడిన లతాహస్త మగును.

వినియోగములు :-

భ్రమరాభిధనాట్యేచవాయోశ్చవితకోరకే ।
లతాయాం, పుష్పితాయాంచ, స్తబకాచలనేఽపిచ ।
లేలాకందుకభావేచ లతాహస్తోనియుజ్యతే ॥

తా॥ భ్రమరనాట్యము గాలిచే గదలెడి మొగ్గ, బూసిగె పూగుత్తుల కదలిక, చెండు వీనియందు ఈ హస్తము వినియోగింపపడును.

-: ద్విరద హస్తలక్షణము :-

పతాకనామ్నా హస్తేన స్కంధదేశే నివేశ్యచ ।
పద్మకోశమధోవక్త్రం దక్షిణేహస్తకే యది ॥
సమావృతావ్భేద్ద్విరదహస్తోఽయం పరికీర్తితః ॥

తా॥ ఎడమచేత పతాకహస్తమును. కుడిచేత పద్మకోశహస్తమును. అధోముఖముగను సమముగా పట్టిన ద్విరద హస్తమగును.

వినియోగములు :-

గజస్యాతుండాభినయే గజవక్త్ర ప్రదర్శనే ।
యుజ్యతే కరిహస్తోఽసౌ, సరహస్తానుసారతః ॥

తా॥ ఏనుగు తొండమునందును. విఘ్నేశ్వరుని చూపుటయందును, ఈ హస్తము చెల్లును.

-: సిద్ధృతహస్త లక్షణము :-

ఉరసోగ్రే హంసపక్షావన్యోన్యాభిముఖీకృతౌ ।
భవేదు ద్ధృతహస్తోఽయం వినియోగోఽస్య కథ్యతే ॥

తా॥ రొమ్మునకెదురుగా హంసపక్ష హస్తములను ఎదురెదురుగాచేరి పట్టినయెడ ఉద్ధృతహస్త మగును.

వినియోగములు :-

ఆపత్తేత్వ వ్యథాత్యర్థే భావనాయాం స్వరూపకే ।
స్థిరోభవేతి వచనేదోలాయాం స్థూలకేఽపిచ ।
గృహేఽప్యుద్ధృతహస్తోఽయం ప్రకృతార్థే నియుజ్యతే ॥

తా॥ నీటిసుడి, అధికము, తలంపు. స్వరూపము, స్థిరుడవు అగు మనుట. ఉయ్యాల, పెద్దది, ఇల్లు, ప్రకృతార్థము వీనియందు చెల్లును.

-: సంయమ హస్తలక్షణము :-

తర్జనీ మధ్యమౌ హస్తతవేన్యప్రీ కృతౌయధి ।
ఇతిరౌ ప్రసృతౌసోఽయం కరస్సంయమ నామకః ॥

తా॥ చూపుడు వ్రేలిని. నడిమి వ్రేలిని అరచేతి తట్టువంచి తక్కిన వ్రేళ్ళను చాచిపట్టినయెడ సంయమహస్త మగును.

వినియోగములు :-

ప్రాణాయామే మహాయోగే యుజ్యతేచాఽర్య భావనే.

తా॥ ప్రాణాయామము, యోగాభ్యాసము, పూజ్యులు అనుట, వీని యందు ఈ హస్తము చెల్లును,

-: ముద్రాహస్త లక్షణము :-

కరయోశ్మధ్యమాఙ్గుష్ఠే యోగాన్ముద్రాకరో భవేత్ ॥

తా॥ రెండుచేతుల నడిమి వ్రేళ్ళను, బొటనవ్రేళ్ళను చేర్చిపట్టినయెడ ముద్రాహస్త మగును.

వినియోగములు :-

అణౌత్రృణే గోముఖేచ త్రోటీపుట నిదర్శనే ।
ముద్రాహస్తోయుజ్యతేఽసౌ భరతాగమకోవిదైః ॥
తా॥ అణువు గడ్డిపోచ. ఆవుమూర, పక్షిముక్కు, వీనిని చూపుట యందు ఈ హస్తము చెల్లును,

-: అజాముఖ హస్త లక్షణము :-

సింహాననాభిధకరేతర్జనీచ కనిష్ఠికా ।
మధ్యమానామికాపృష్ఠే, యోగాద్భూయాదజాముఖః ॥

తా॥ సింహముఖ హస్తముయొక్క చూపుడు చిటికెన వ్రేళ్ళను, నడిమివ్రేళ్ళకును, ఉంగరపు వ్రేళ్ళకును మీదుగాచేర్చి పట్టినయెడల అజా ముఖ హస్తమగును.

వినియోగములు :-

అజాదికానాం వక్త్రేషు నిర్విషాణా ముఖేషుచ ।
గజకుంభే మల్లయుద్ధే అజావక్త్రో నియుజ్యతే ॥

తా॥ మేక మొదలైన జంతువుల మోరయందును, కొమ్ములులేని జంతువుల ముఖములందును. ఏనుగు కుంభస్థలమునందును. జెట్టి పోట్లాట యందును. ఈ హస్తము చెల్లును.

-: అర్ధముకుళ హస్తలక్షణము :-

లాఙ్గూలాఖ్యకరేసమ్యక్కనిష్ఠావక్రితాయది ।
ప్రోక్తోఽర్ధ ముకుళాఖ్యోఽసౌభరతాగమవేదిభి ॥

తా॥ లాంగూల హస్తపు చిటికెనవ్రేలు బాగుగా వంపబడినయెడల అర్ధ ముకుళహస్త మగును.

వినియోగములు :-

లికుచేశీలభావేచఽప్యుచితేపి కుచేఽపిచ ।
లోభే ముకుళపద్మేచ కరణే వినియుజ్యతే ॥

తా॥ గజనిమ్మపండు, మంచిస్వభావము. ఉచితము, కుచము, లోభము. తామరమొగ్గ, ఉపకరణము, ఏసియందు ఈ హస్తము వినియో గించును.

-: రేచితహస్త లక్షణము :-

అలపద్మకరౌయత్ర శ్లిష్టాపార్శ్వప్రసారితౌ ।
తత్తత్ప్రయోగకుశలైః రేచితోఽయం నిరూప్యతే ॥

తా॥ అలపద్మ హ_స్తములనుచేర్చి, పార్శ్వమందు చాచిపట్టినయెడ రేచితహ_స్త మగును.

వినియోగములు :-

చారీషు పార్శ్వనజానే నారికేళే ప్రలాపిది ।
సర్వనాట్యేషు వేళాయాం యుజ్యతే రేచితఃకరః ॥

తా॥ చార్మినాట్యమునందును. పార్శ్వనాట్యమునందును, టెంకాయ యందును. ప్రలాపమునందును ఎల్లనాట్య సమయములయందును. ఈ హ_స్తము చెల్లును.

-: కుశలహ_స్త లక్షణము :-

అన్యోన్యాభీ ముఖావర్ధచంద్రౌ కుశలసంజ్ఞకః
భూచారే నయనే పూర్ణవస్తు నిర్దేశభావనే ।
జలావగాహే పద్మేచ యుజ్యతే కుశలఃకరః

తా॥ అర్ధచంద్ర హ_స్తములను ఎదురెదురుగా పట్టినయెడ కుశల హ_స్తమగును. ఇది భూసంచారము, నేత్రము, పూర్ణవస్తువుల నిర్దేశిం చుట, నేటిలో మునుగుట. తామరపువ్వు వీనియందు చెల్లును.

-: పక్షవంచిత హ_స్తలక్షణము :-

కటిదేశగతావేతౌ పక్షవంచితకోభవేత్ ।
పక్షిణాంపక్షభావేతు రశనాయాం నితమ్బకే ।
పషవఞ్చితహస్తోఽయం యుజ్యతేఽత్రపురాతనైః

తా॥ ఈ కుశల హ_స్తమునందలి అర్ధచంద్ర హ_స్తములను కటి ప్రదేశమున నుంచినయెడ పక్షవంచిత హ_స్తమగును. ఇది పక్షుల రెక్కలు మొలనూలు, కటిపశ్చాద్భాగము వీనియందు వినియోగపడును.

-: తిలకహస్త లక్షణము :-

త్రిపతాకాభిధౌహస్తౌ లలాటే హృదయేస్థితౌ ।
తిలకాభిధహస్తోఽయం కీర్తితోభావవేదిభిః ।
దేవపుష్పాంజలౌగన్ధవస్త్వాది తిలకేషుచ ।
తిలకాభిదహస్తోయం కీర్తితోభావవేదిభిః ॥

తా॥ త్రిపతాక హస్తములను నొసటను రొమ్మునందు నుంచినయెడ తిలకహస్తమగును. ఇది దేవపుష్పాంజలి, వాసనగల వస్తువు మొదలైనవి తిలక భేదములు వీనియందు వినియోగించుచున్నది.

-: ఉత్తానవంచిత హస్తలక్షణము :-

త్రిపతాక వంశదేశగతా వుత్తానవంచితః ।
విష్ణోరభినయేస్తమ్భభావనాయాంబుధోదితః ।
ఉత్తానవంచితాభిఖ్య, స్సర్వనాట్యేషుకీర్తితః ॥

తా॥ త్రిపతాక హస్తములను. భుజమూలములకు సమీపమున జేర్చి పట్టినయెడ ఉత్తానవంచిత హస్తమౌను, ఇది మహావిష్ణువును అభినయించుట, స్తంభములను చూపుట వీనియందు చెల్లును.

-: వర్ధమాన హస్తలక్షణము :-

ఊర్ధ్వభాగోన్ముఖౌహస్తౌ శిఖరౌ వర్ధమానకః ।
సర్వదేతివచోభావేపత్త మిత్యర్థకేఽపిచ ।
కింకిమిత్యుక్తిసమయేకదాచిదితిభాషణే ।
వర్ధమానకరః ప్రోక్తః భరతాగమవేదిభిః ॥

తా॥ శిఖరహస్తము మీదికెత్తి పట్టినయెడల, వర్ధమానహస్తమగును. ఇది యెల్లప్పుడని చెప్పుట, ఇయ్యబడేనది యనుట, ఏమి ఏమి యేనెడి సమయము. ఒకానొకప్పుడనుట వీనియందు వినియోగించును.

-: జ్ఞానహస్త లక్షణము :-

శ్లో॥ ఆదౌపతాకౌధృత్వాతు అంసాదూర్ధ్వముపావహేత్ ।
భవేజ్ఞానాభిధకరః కధితంసృత్తకోవిదైః ।
గ్రహేచహృదయే ధ్యానే, జ్ఞానహస్తోవిధీయతే ॥

తా॥ మొదట పతాకహస్తములనుబట్టి భుజమూలములకెదురుగనిక్కించినయెడల జ్ఞానహస్త మగును. ఇది గ్రహము, హృదయము, ధ్యానము. వీనియందు వినియోగింపబడును.

-: రేఖాహస్త లక్షణము :-

శ్లో॥ అఙ్గుష్టఃకుఞ్చితోభూయాన్మధ్యమాఽనామికాతధా ।
కుఞ్చితాస్యాత్కనిష్టాచ తర్జనీప్రసృతాయది ।
రేఖాభిధరకరస్సోఽయం ముద్రాయాంసమ్ప్రయుజ్యతే ॥

తా॥ అంగుష్టమును, మధ్యమ, అనామిక, కనిష్టిలనువంచి చూపుడు వ్రేలును చాచినయెడ రేఖాహస్త మగును. ఇది ముద్రయందు వినియోగింపబడును.

-: వైష్ణవహస్త లక్షణము :-

శ్లో॥ ఊర్ధ్వగాత్రిపతాకౌచే వైష్ణవః కరఈరితః ।
విష్ణోరభినయే యోజ్య ఇతిభావ విధోవిధుః ॥

తా॥ త్రిపతాక హస్తములను, యెగుమొగములు బట్టినయెడ వైష్ణవహస్తమగును. ఇది మహావిష్ణువునందు చెల్లును.

-: బ్రహ్మోక్త శుకతుండ హస్తలక్షణము :-

శ్లో॥ కపిత్థేజుష్ఠతర్జన్యౌ సమానాగ్రౌ దృతౌయది ।
బ్రహ్మోక్త శుకతుణ్డస్స్యాద్గరుడార్థేనియుజ్యతే ॥

తా॥ కపిద్ధ హస్తముయొక్క బొటనవ్రేలిని. చూపుడువ్రేలిని పక్కల గ్రక్కులుగ పట్టినయెడల త్రికోణ కటకముఖ హస్తమగును. ఇది గరుడస్తం భమునందు చెల్లును.

-: ఖండచతుర హస్తలక్షణము :-

శ్లో॥ చతురేఙ్గుష్ఠనేత్యక్తా కనిష్ఠామిశ్రితాయది ।
నామ్నాఽయంఖణ్డచతురః కీర్తితో నర్తనాగమే ॥

తా॥ చతురహస్తపు చూపుడువ్రేలును విడిచి, చిటికెనవ్రేలును చేర్చి పట్టినయెడల. ఖండచతుర హస్తమగును. ఇది రిక్తము కొనపైన ద్రవ వస్తువులయందు వినియోగించును.

-: ఆర్ధచతుర హస్తలక్షణము :-

శ్లో॥ అస్మిన్కనిష్ఠికోత్క్రాన్తాయద్యర్ధ చతురో భవేత్ ।
మధురాదిరసాస్వాదే వినియోగోఽస్య కీర్తితః ॥

తా॥ ఖండచతుర హస్తమందు చిటికెనవ్రేళ్ళను విడిచినయెడల అర్ధ చతుర హస్తమగును. ఇది మధురాది రసము లాస్వాదించుటయందు వినియోగింపబడును.

-: లీనముద్రాహస్త లక్షణము :-

శ్లో॥ ముద్రాఖ్యేతర్జనీ నమ్రా, లీనముద్రాకరో భవేత్ ॥

తా॥ ముద్రాహస్త మందలి చూపుడువ్రేలును వంచి పట్టినయెడల లీనముద్రా హస్తమగును.

## -: బ్రహ్మాది దేవతాహస్త లక్షణములు :-

శ్లో॥ బ్రహ్మణ చతురోవామే హంసాస్యో దక్షణేకరే ॥

తా॥ ఎడమచేత చతుర హస్తమును, కుడిచేత హంసాస్య హస్తమును. పట్టినయెడ బ్రహ్మహస్తమగును. ఇది బ్రహ్మకు వర్తించును.

-: శమ్భుహస్త లక్షణము :-

శ్లో॥ శమ్భోర్వామే మృగశీర్ష త్రిపతాకశ్చ దక్షిణే ।

తా॥ ఎడమచేత. మృగశీర్ష హస్తమును. కుడిచేత త్రిపతాక హస్తమును పట్టినయెడ శంభుహస్తమగును. ఇది శంభునికి చెల్లును.

-: విష్ణుహస్త లక్షణము :-

శ్లో॥ హస్తాభ్యాం త్రిపతాకాభ్యాం విష్ణుహస్తః ప్రకీర్తితః ॥

తా॥ రెండు చేతులను త్రిపతాక హస్తములు పట్టినయెడ విష్ణుహస్తమగును. ఇది విష్ణువునకు చెల్లును.

-: సరస్వతి హస్త లక్షణము :-

శ్లో॥ సూచీకృతే దక్షిణేఽర్ధ చంద్రే వామకరే తథా ।
సరస్వత్యాః కరః ప్రోక్తః భరతాగమవేదిభిః ॥

తా॥ కుడిచేత సూచిహస్తమును, ఎడమచేత అర్ధచంద్ర హస్తమును, పట్టినయెడల సరస్వతి హస్తమగును.

-: పార్వతి హస్తలక్షణము :-

శ్లో॥ ఊర్ధ్వాధః ప్రసృతావర్ధ చంద్రౌ వామదక్షిణే ।
అభయోవరదశ్చైవ పార్వత్యాః కర ఈరితః ॥

తా॥ కుడి యెడమ చేతులను, క్రిందుమీదులుచేసి అర్ధచంద్ర హస్తములుగా పట్టిన, అభయ వరద హస్తములగును. అవియే పార్వతి హస్తములు.

-: లక్ష్మీహస్త లక్షణము :-

శ్లో॥ అంసోపకంఠేహస్తాభ్యాం కపిత్థాభ్యాంశ్రియంకరః ॥

తా॥ బాహుమూలమందు రెండు కపిద్ధ హస్తములు పట్టినయెడల లక్ష్మీ హస్తమగును.

-: వినాయక హస్తలక్షణము :-

శ్లో॥ పురోగాభ్యాం కపిత్థాభ్యాం కరాభ్యాం విఘ్నరాట్కరః ॥

తా॥ ఎదురుగా రెండు కపిద్ధ హస్తములు పట్టినయెడల విఘ్నేశ్వర హస్తమగును.

-: షణ్ముఖ హస్తలక్షణము :-

శ్లో॥ వామేకరే త్రిశూలంచ శిఖరందక్షిణంకరే ।
ఊర్ధ్వంగతే షణ్ముఖస్యకర ఇత్యుచ్యతేబుధైః ॥

తా॥ ఎడమచేతియందు త్రిశూల హస్తమును, కుడిచేతియందు శిఖర హస్తమును ఎత్తుగా బట్టినయెడల షణ్ముఖహస్త మగును.

-: మన్మథహస్త లక్షణము :-

శ్లో॥ వామేకరేతు శిఖరం దక్షిణే కటకాముఖః ।
మన్మథస్యకరః ప్రోక్తోనాట్యశాస్త్ర విశారదైః ॥

తా॥ ఎడమ చేతియందు శిఖరహస్తమును, కుడిచేతియందు కటకాముఖహస్తమును పట్టినయెడల మన్మథహస్తము వచ్చును.

-: ఇంద్రహస్త లక్షణము :-

శ్లో॥ త్రిపతాకౌ స్వస్తికౌచే దింద్రహస్తః ప్రకీర్తితః ॥

తా॥ రెండు త్రిపతాక హస్తముల మణికట్టులను చేర్చిపట్టిన ఇంద్ర హస్తమగును.

-: అగ్నిహస్త లక్షణము :-

తా॥ త్రిపతాకో దక్షహేతువామే లాంగూలహస్తకః ।
అగ్నిహస్తస్య విజ్ఞేయో నాట్యశాస్త్ర విశారదైః ॥

తా॥ కుడిచేతియందు త్రిపతాక హస్తమును, ఎడమ చేతియందు లాంగూల హస్తమును బట్టినచో అగ్నిహస్తమగుచున్నది. ఇది అగ్నిదేవునికి వినియోగించును.

-: యమహస్త లక్షణము :-

శ్లో॥ వామేపాశః దక్షహేతు సూచీయమకర స్మృతః ॥

తా॥ ఎడమకరమందు పాశహస్తమును. దక్షణకరమందు సూచీ హస్తమును పట్టిన యమునికి చెల్లును.

-: నైఋతీహస్త లక్షణము :-

శ్లో॥ ఖట్వాచ శకటశ్చైవ కీర్తితో నైరృతేః కరః ॥

తా॥ ఖట్వాహస్తమును, శకట హస్తమును బట్టినయెడల నైరు హస్తమగును.

-: వరుణహస్త లక్షణము :-

శ్లో॥ పతాకో దక్షహేవామే శిఖరం వారుణః కరః ॥

తా॥ కుడిచేతియందు పతాక హస్తమును. ఎడమకరమునందు శిఖర హస్తమును బట్టిన వరుణహస్త మగును.

-: వాయుహస్త లక్షణము :-

శ్లో॥ అరాళో దక్షిణే వామే హస్తేచార్ధ పతాకకః ।
ధృతౌ చేద్వాయుదేవస్య హస్త ఇత్యభిధీయతే ॥

తా॥ కుడిచేత అరాళహస్తము, ఎడమచేత అర్ధపతాక హస్తమును బట్టినచో వాయుహస్తమగును.

-: కుబేరహస్త లక్షణము :-

శ్లో॥ వామేపద్మం దక్షిణేతుగదా యక్షపతేః కరః ॥

తా॥ ఎడమ చేతియందు పద్మహస్తమును. కుడిచేత గదాహస్తమును పట్టిన కుబేరహస్త మగును.

## -: నవగ్రహ హస్తలక్షణములు :-

-: సూర్యహస్త లక్షణము :-

తా॥ భుజశిరస్సుల సమీపములందు, రెండుచేతులచే సోలపద్మ, కపిద్ధ హస్తములు పట్టిన సూర్యహస్త మగును.

-: చంద్రహస్త లక్షణము :-

తా॥ ఎడమచేతితో సోలపద్మమును, కుడిచేతితో పతాకమును బట్టిన చంద్రహస్త మగును.

-: అఙ్గారక హస్త లక్షణము :-

తా॥ ఎడమచేత సూచీహస్తము, కుడిచేత ముష్టిహస్తము బట్టిన అంగారకహస్తము వచ్చును.

-: బుధహస్త లక్షణము :-

తా॥ ఎడమచేత అడ్డముగ ముష్టి హస్తమును, కుడిచేత పతాకహస్తమును పట్టిన బుధహస్తమగును.

బృహస్పతి హస్త లక్షణము :-

తా॥ రెండు చేతులతో శిఖర హస్తమును యజ్ఞసూత్ర ప్రదర్శనము వలెపట్టిన, బృహస్పతి హస్తమగును. ఇది ఋషులయందు, బ్రాహ్మణుల యందు చెల్లును.

-: శుక్రహస్త లక్షణము :-

తా॥ ఎడమచేయి పైకి, కుడిచేయి క్రిందికి, ముష్టి హస్తములు బట్టినచో శుక్రహస్తమగును.

-: శనైశ్చర హస్తలక్షణము :-

తా॥ ఎడమచేత శిఖర హస్తము, కుడిచేత త్రిశూల హస్తము బట్టిన శనైశ్చర హస్తమగును.

-: రాహు హస్త లక్షణము :-

తా॥ ఎడమచేయితో సర్పశీర్ష హస్తమును, కుడి కరముతో సూచీ హస్తము బట్టిన రాహుహస్తమగును.

-: కేతు హస్తలక్షణము :-

తా॥ ఎడమ కరముతో సూచీహస్తమును, కుడి కరముతో అర్ధపతాక హస్తమును బట్టిన కేతు హస్తమగును.

# -: దశావతార హస్త లక్షణములు :-

## -: మత్స్యావతార హస్త లక్షణము :-

తా॥ మత్స్యహస్తమును చూపి, రెండుచేతులతో త్రిపతాక హస్తములు భుజ శిరస్సులకు సమానముగ బట్టినచో మత్స్యావతార హస్తము వచ్చును. ఇది మత్స్యావతారమునకు వినియోగించును. చేప. మత్స్యావతార ప్రదర్శన, మున్నగు వాటికి వర్తించును.

## -: కూర్మావతార హస్తలక్షణము :-

తా॥ కూర్మ హస్తమును చూపి భుజశిరస్సులకు సమముగా త్రిపతాకములు బట్టిన కూర్మావతార హస్తమగును.

## :- వరహావతార హస్త లక్షణము :

తా॥ వరాహ హస్తమును చూపి, పిరుదులయందు డోలా హస్తము పట్టిన, వరాహావతార హస్తము వచ్చును.

## :- నృసింహావతార హస్తలక్షణము :-

తా॥ ఎడమచేత సింహముఖ హస్తమును, కుడిచేత త్రిపతాకమును బట్టిన నారసింహావతారమగును.

## :- వామనావతార హస్త లక్షణము :-

తా॥ ఎడమ, కుడి, కరములు పైకి క్రిందకు ముష్టిహస్తములు బట్టిన వామనావతారమగును.

:- పరశురామ హస్త లక్షణము :-

తా॥ వామకరమును నడుమునందుంచి, దక్షిణ కరముచేత అర్ధపతాకము బట్టిన, పరశు రామావతార హస్తము వచ్చును.

:- రఘురామావతార హస్తలక్షణము :-

తా॥ దక్షిణ కరముతో కపిద్ధ హస్తమును, వామ కరముతో శిఖర హస్తమును బట్టిన రామచంద్రావతార హస్తము వచ్చును. ఇది రామచంద్రుని వర్తించును.

:- బలరామావతార హస్తలక్షణము :-

తా॥ దక్షణ కరమందు పతాకమును, వామకరమందు ముష్టి హస్తమును బట్టిన బలరామావతార హస్తమగును.

:- బుద్ధావతార హస్తలక్షణము :-

శ్లో॥ సమస్థానస్థితోడోలాహస్తా వృభయపార్శ్వయోః।
సంచాలయన్ బుద్ధరూపం భరతజ్ఞః ప్రదర్శయేత్.

తా॥ సమస్థానమున నిల్చి డోలా హస్తములు రెండుప్రక్కలకు ఊపుచు పట్టిన బుద్ధావతారమగును. (గాక రెండు హంసాశ్య హస్తములు గాని, జ్ఞానముద్రలుగాని ఒకచేతిపైన నొకటి యుంచి నాభి స్థానమెదురుగ పట్టి నేత్రములు మూసుకొనిన బుద్ధావతారమగును.)

:- కల్క్యవతార లక్షణము :-

తా॥ దక్షణ కరముతో పతాక హస్తమును, వామకరముతో త్రిపతాక హస్తమును బట్టిన, కల్క్యవతారమగును.

:- రాక్షస హస్తలక్షణము :-

తా। రెండు కరములతో ముఖము వద్ద శకట హస్తము పట్టినయెడల రాక్షస హస్తమగును. (గాక రెండుచేతులతో పద్మకోశహస్తములు బట్టి, భుజశిరస్సులకు సమముగా యుంచి, ప్రేక్షకుల కభిముఖము చేసినచో, రాక్షస హస్తము వచ్చును.)

-: ప్రశిద్ధ హస్త లక్షణములు :-

తా॥ శుకతుండము హారిశ్చంద్రునకును. మయూర హస్తము నలుని యందును, పురుకుత్సునికి అలపద్మ హస్తము, పురూరవునికి ముష్టిహస్తము అలపద్మ హస్తము శిరస్సునందు చేర్చిన సగరునికి, పతాకము దిలీపునకును కర్తరీ ముఖము అంబరీషునికిని, కపిద్ధ హస్తమును చలింపచేయుచు బట్టిన శిబియందును, రెండు పతాక హస్తములు భుజముల కొనలకు దూరముగా నుంచి, దేవభావనతో బట్టిన, కార్తవీర్యునకు, ఆ పతాకహస్తములే ముందు వెనుకలగా మార్చిబట్టిన, రావణుని యందును. భుజప్రదేశమున రెండు సూచీ హస్తములు చలింపజేయుచు బట్టిన ధర్మరాజునకును. త్రిపతాక హస్తములు మాటిమాటికి ఎదురుగా చలింపచేయుచు బట్టిన అర్జునుని యనిదును, ముష్టిహస్తము ఎదురుగా చలింపచేయుచు బట్టిన భీమసేనుని యందును, ఉద్వేష్టితాంగుళమగు సూచీహస్తము శైభ్యుని యందును, నకులునకు కటకాముఖమును, శిఖరము సహదేవునకును, సహుషునికి చల పతాక హస్తము. యయాతికి తామ్రచూడ హస్తము. అర్ధచంద్ర హస్తము త్రిపతాకాకృతిగ పట్టిన భగీరథుని యందును, రాహుగ్రస్తమైన చంద్ర మండలమందును చెల్లును. మరత్తు మహారాజు. మాంధాత, హస్తముకుళము సూచీ, ముష్టి, ఉద్వేష్టితార్ధ పతాకము, ఈ నాల్గు హస్తములు క్రమముగ చెల్లును. అర్ధపతాకహస్తములు, రఘుమహారాజు, అజమహారాజులకు కుడి

యెడమలుగా చెల్లును. స్వస్తికాలపద్మము దశరథునకును. శిఖరహస్తము రామునికిని చాపపాణులైన రాజులయందును చెల్లును. శిఖరము కుడిమూపున చేర్చిబట్టిన భరతునికి, ఎడమమూపునందు బట్టిన లక్ష్మణునికి, నొసటికి అభిముఖముగా నుంచిన శతృఘ్నునికి చెల్లును. ఈ హస్తములన్నియు సూర్యవంశరాజులకు వర్తించును. వీటినే యెడమప్రక్కగ హస్తవిన్యాస క్రమము జరిపినచో చంద్రవంశ రాజులకు వర్తించునని నాట్యశాస్త్రజ్ఞులచిత చెప్పబడియున్నది.

## -: చతుర్దశ లోకహస్త లక్షణములు :-

### -: ఊర్ధ్వలోక హస్త లక్షణము -:

తా॥ భూలోక, భువర్లోక, సువర్లోక, జనోలోక, తపోలోక, మహార్లోక, సత్యలోకంబులకు, ఉద్వేష్టిత పతాకహస్తము వినియోగించును. ఈ ఏడు ఊర్ధ్వలోకములు.

### -: అధోలోక హస్త లక్షణములు :-

తా॥ అతల, వితల, సుతల. రసాతల, తలాతల, మహాతల. పాతాళలోకంబులకు. ఆపవేష్టిత పతాకహస్తము వర్తించును. ఈ ఏడును అధోలోకంబులందురు.

## -: వృక్షహస్త లక్షణములు :-

### -: అశ్వత్థ వృక్షము :-

తా॥ రెండు అలపద్మ హస్తములు చలింపచేసిన అశ్వత్థ వృక్షముకు చెల్లును. (అనగా రావిచెట్టు)

### : కదలీ వృక్షము :- (అరటి)

తా॥ శ్లిష్టముకుళ హస్తమును పోడవుగా కదిలించి పట్టిన కదలీ వృక్షమునకు (అరటి) చెల్లును.

-: నారఙ్గవికుచ వృక్షములు :-

తా॥ పద్మకోశము నారింజవృక్షమునకును, భ్రమరహస్తము గజనిమ్మచెట్టుకును చెల్లును,

-: పనస. బిల్వ వృక్షములు :-

తా॥ చతుర హస్తము. పనస, బిల్వ (మారేడు) వృక్షములకు వినియోగించును.

-: పునాగ వృక్షములు :-

తా॥ పతాక చతుర హస్తములు పొన్నమ్రానికి చెల్లును.

-: మందార, వకుళ వృక్షములు :-

తా॥ ఖంచచతురము, మందార వృక్షముకును, సందంశ హస్తము వకుళ వృక్షమునకు చెల్లును.

-: వటార్జున వృక్షములు :-

తా॥ పతాకము మర్రిమ్రానుకు. సింహాముఖ హస్తము ఏరుమద్ది మ్రానుకు వర్తించును.

-: పాటలీహింతాల వృక్షములు :-

తా॥ శుకతుండము పాదిరిచెట్టుకును, తాటిచెట్టుకు కర్తరీముఖహస్తము చెల్లును.

-: శోక వృక్షము :-

తా॥ పద్మకోశ హస్తములు స్వస్తికములుచేసి పట్టినచో శోకమ్రానుకు వర్తించును.

-: చమ్పక వృక్షము :-

తా॥ అథోలాంగూల హస్తము వినియోగింపవలయునని పూర్వ శాస్త్రజ్ఞులచే చెప్పబడియున్నది.

-: ఖదిర వృక్షము :-

తా॥ ఎక్కువ క్రిందకు మొగముగ తామ్రచూడ హస్తము వంచి పట్టిన నల్లతుమ్మచెట్టుకు చెల్లును.

-: శమీవృక్షము (జమ్మి :-

తా॥ శ్లిష్టకర్తరీ హస్తము జమ్మిచెట్టుకు చెల్లును.

-: అశోక వృక్షము :-

తా॥ పతాక స్వస్తిక హస్తమును, (పతాకములు మణికట్టు నుంచి సచో) అశోక వృక్షమునకు చెల్లును.

-: శింధుకార వృక్షము (వావిరి) :-

తా॥ శ్లిష్టమయూర హస్తము వావిరిచెట్టుకు వర్తించును.

-: ఆమలక వృక్షము :-

తా॥ సంయమమను హస్తము ఉశిరిక చెట్టునందు చెల్లును. (తర్జనీ. మధ్యమలు అరచేతిలోచేర్చి తక్కినవి చాచితచో సంయమమను హస్తము వచ్చును).

: కురువక వృక్షము : (ఎర్రపూల గోరింట)

తా॥ ఎర్రపూల గోరింట చెట్టునకు, కర్తరి, త్రిపతాక హస్తములు చెల్లును.

-: కపిత్థ వృక్షము :- (వెలగ)

తా॥ వెలగచెట్టునకు అలపద్మ హస్తములు స్వస్తికముగ పట్టినచో కపిద్ధవృక్షము (వెలగ) కు చెల్లును.

-: కేతకీ వృక్షము :- (పచ్చమొగలి)

తా॥ పతాక చతుర హస్తములను, మణిబంధములందు స్వస్తికములుగా బట్టినచో పచ్చమొగలియందు, దేవమంత్రియందు చెల్లును.

-: శింశుపాల వృక్షము (ఇరుగుడు మ్రాను) :-

తా॥ అర్ధచంద్ర హస్తములు స్వస్తికములు చేసినచో, ఇరుగుడు మ్రానుకు వినియోగించును.

-: నిమ్బసాల వృక్షములు :-

తా॥ వేపవృక్షమునకును, సాలవృక్షమునకును. శుకతుండ హస్తములు స్వస్తికము చేసిపట్టిన వర్తించును.

-: పారిజాత వృక్షము :-

తా॥ ఎడమ, కుడిచేతులతో పతాక హస్తములు త్రిప్పిబట్టిన త్రిజ్ఞాన హస్తము వచ్చును. ఈ హస్తము రొమ్మునకెదురుగా ఉంచినచో పారిజాత వృక్షమునకు చెల్లును.

-: తింత్రిణీ, జంబూ వృక్షములు :- (చింత, నేరేడు)

తా॥ చింతచెట్టుకు లాంగూలము, నేరేడుకు పతాకహస్తమువర్తించును.

:- పాలాశ-దసాల వృక్షములు (మోదుగ, తియ్యమామిడి) :-

తా॥ అర్ధచంద్ర హస్తము మోదుగను, త్రిపతాక హస్తము తియ్యమామిడికి వినియోగించును.

## -: సింహాది మృగముల హస్త లక్షణములు :-

### -: సింహ హస్త లక్షణము :-

తా॥ కుడిచేత సింహముఖ హస్తమునుబట్టి దానివెనుక పతాకహస్తమును వ్రేళ్ళు ఎడముచేసి పట్టినచో, శ్లిష్టసింహముఖ హస్తమగును. ఇది సింహమునకు వర్తించును.

### -: వ్యాఘ్రహస్త లక్షణము (పులి) :-

తా॥ పెద్దపులికి, అర్ధచంద్రహస్తము అధోముఖముచేసినచో వ్యాఘ్రమునకు వినియోగించును.

### -: సూకరహస్త లక్షణము (పంది) :-

తా॥ మత్స్య హస్తమును, దక్షణహస్తమువంచి కదలించుచు వ్రేళ్ళ నంటిని విరళముగ బట్టిన సంకీర్ణ మకరహస్త మగును. ఇది సూకరమునకు చెల్లును.

### -: కపిహస్త లక్షణము (కోతి) :-

తా॥ ఊర్ణనాభ హస్తము కపికి, (కోతికి) చెల్లును. ముష్టిహస్తమందలి మధ్యమాంగుష్టములు చేరికవలన అధోముష్టి ముకుళమగును. ఈ హస్తముకూడా కోతికి వినియోగింపబడును.

### -:భల్లూకహస్త లక్షణము (ఎలుగుగొడ్డు) :-

తా॥ వామకరమున పద్మకోశహస్తము దిగుమొగముగాబట్టి దక్షణకరముచే పతాకహస్తమునుబట్టి దానిపైనుంచిన పద్మకోశ పతాకహస్తమగును. ఇది ఎలుగుగొడ్డునందు వినియోగించును.

### :- మార్జారహస్త లక్షణము (పిల్లి) :-

తా॥ అర్ధముకుళ హస్తము పిల్లికి వినియోగించును. (ముష్టిహస్తమందలి అనామికాంగుష్టములు చేర్చినచో అర్ధముకుళ మగును.)

-: చమరీమృగ హస్త లక్షణము :-

తా॥ ముష్టిముద్రాహస్తము, చమరీమృగమునకు వినియోగించును. (ఎడమచేత ముష్టిహస్తమును, కుడిచేత ముద్రాహస్తమును మణికట్టుతో చేర్చి క్రిందుమొగముగా బట్టిన ముష్టిముద్రా హస్తము వచ్చును.)

-: గోధాహస్త లక్షణము (ఉడుము) :-

తా॥ తలపతాక హస్తము ఉడుమునందు చెల్లును. (పతాకహస్తమందలి కనిష్టికాంగుష్టములను కొంచెము మీదికెత్తినచో తలపతాక హస్తమగును.)

-: శల్యమృగ హస్తలక్షణము :-

తా॥ చంద్రమృగ హస్తము శల్యమృగమందు వినియోగించును. (మృగశీర్షమందలి చూపుడువ్రేలు పైకెత్తినచో చంద్రమృగ హస్తము వచ్చును.)

-: కురంగహస్త లక్షణము (జింక) :-

తా॥ మృగశీర్ష హస్తము జింకయందు చెల్లును.

:- కృష్ణసార హస్త లక్షణము (నల్లజింక) :-

తా॥ ముష్టిమృగ హస్తము నల్లజింకకు వినియోగింపబడును. (ముష్టిహస్తమందలి కనిష్టాంగుష్టములను చాచినచో ముష్టిమృగ హస్తము వచ్చును.)

-: గోకర్ణ హస్త లక్షణము :-

తా॥ నాగబంధ హస్తములు మీదికి చలింపచేయుచు పట్టిన గోకర్ణ మృగమందు చెల్లును.

-: మూషికహస్త లక్షణము (ఎలుక) :-

తా॥ ఖండముకుళ హస్తము మూషికమునకు వర్తించును. (ముకుళ హస్తమందలి చూపుడు(వ్రేలును చాచిపట్టినచో ఖండముకుళ హస్తము వచ్చును.)

-: గిరికాహస్త లక్షణము (చిట్టెలుక) :-

తా॥ ఖడ్గముకుళ హస్తము చిట్టెలుకకు వర్తించును. (ముకుళహస్త మందలి చూపుడు(వ్రేలును వంచి అడ్డముగా పట్టినయెడల ఖడ్గముకుళము వచ్చును.)

-: శశహస్త లక్షణము (కుందేలు) :-

తా॥ తలపతాక హస్తము అడ్డముగ (త్రిప్పబడిన కుందేలుకు చెల్లును.

-: వృశ్చికహస్త లక్షణము :-

తా॥ పద్మకోశమందలి మధ్యమాంగుళిని ఉంచి తక్కిన (వ్రేళ్ళన్నింటిని అంగుష్టముతో కలిపి పట్టినచో వృశ్చికహస్త మగును.

-: శునకహస్త లక్షణము (కుక్క) :-

తా॥ మధ్యపతాక హస్తము శునకమునకు వర్తించును. (పతాకమందలి చిటికెన(వ్రేలు ముడిచినచో మధ్యపతాక హస్తము వచ్చును.)

-: ఉష్ట్రహస్త లక్షణము (ఒంటె) :-

తా॥ ఖండాంజలి హస్తము ఒంటెయందు వినియోగించును. (అంజలి హస్తమందలి అంగుష్టములను వంచి చేర్చి పొడవుగాచాచి అధోముఖముగ చలింపచేయుచు పట్టిన ఖండాంజలి హస్తము వచ్చును.)

-: అజహస్త లక్షణము (మేక) :-

తా॥ శిఖర హస్తములను ముఖభాగమున చేరబట్టినయెడ మేకయందు వినియోగించును.

-: గార్ధభహస్త లక్షణము (గాడిద) :-

తా॥ భిన్నాంజలి హస్తము గార్ధభముకు వర్తించును. (ఖండాంజలి హస్తమందలి తర్జనీ ద్వయమునుచేర్చి వంచిపట్టినయెడ భిన్నాంజలిహస్తము వచ్చును.)

-: వృషభహస్త లక్షణము (ఎద్దు) :-

తా॥ మధ్యమ, అనామికలను కొంచెము అరచేతిలోకి వంచి. వాని మీద అంగుష్టమునుచేర్చి తక్కిన రెండు(వేళ్ళను చాచిపట్టిన తలసింహా హస్తమగును. ఈ హస్తము వృషభమునకు వినియోగించును.

-: ధేనుహస్త లక్షణము (ఆవు) :-

తా॥ సంకీర్ణ ముద్రహస్తము ఆవుకు వినియోగించును. (చేతియందలి నడిమి(వేలిని వంచి తక్కిన(వేళ్ళను చాచియుంచినచో సంకీర్ణముద్ర హస్తము వచ్చును.)

## -: పక్షిహస్త లక్షణములు :-

-: పారాపత హస్త లక్షణము (పావురము) :-

తా॥ కపోతహస్తము పుంఖతాకారముగ పట్టిన పావురముకు వినియోగించును.

-: శశాదన హస్త లక్షణము (డేగ) :-

తా॥ (బహోర్ముక్తశుకతుండ హస్తము డేగయందు వినియోగించును.

-: ఉలూకహస్త లక్షణము (గుడ్లగూబ) :-

తా॥ సంకీర్ణ గజదంత హస్తము ఉలూకముకు చెల్లును. (గజదంత హస్తమొనలను చేర్చిపట్టిన. సంకీర్ణ గజదంత హస్తము వచ్చును.)

-: గండభేరుండ హస్తలక్షణము :-

తా॥ స్వస్తిక చంద్రహస్తము గండభేరుండ పక్షికి వినియోగించును. (అర్ధచంద్ర హస్తములు మణికట్టుచేర్చి అథోముఖముగబట్టి వ్రేళ్ళను విరళముగ చేసిన స్వస్తిక చంద్రహస్తము వచ్చును.)

-: చాతకహస్త లక్షణము :-

తా॥ లాంగూల హస్తములు పుంఖితముగ పట్టినచో చాతకపక్షియందు చెల్లును.

-: కుక్కుటహస్త లక్షణము (కోడి) :-

తా॥ భ్రమరహస్తము కోడికి వినియోగించును.

-: కోకిల హస్త లక్షణము :-

తా॥ అరాళ హస్తము పుంఖితముగ బట్టినచో కోకిల హస్తము వచ్చును. ఇది కోయిలకు వర్తించును.

-: వాయసహస్త లక్షణము (కాకి) :-

తా॥ చందంశ ముకుళహస్తము కాకియందు చెల్లును, (భ్రమరహస్తాంగుష్టమును, చూపుడువ్రేలి కొనతో చేర్చిపట్టిన తరువాత పుంఖితముచేసినచో చందంశ ముకుళహస్తము వచ్చును.)

-: కురర హస్త లక్షణము :-

తా॥ సూచీహస్తము అపవిద్ధముగ బట్టిన కురర పక్షికి వినియోగించును.

-: శుకహస్త లక్షణము (చిలుక) :-

తా॥ శుకతుండ హస్తములు పుంఖితాకారముగ బట్టిన చిలుకయందు వినియోగించును.

-: సారసహస్త లక్షణము :-

తా॥ ప్రదేశ ముకుళహస్తము సారసపక్షికి చెల్లును. (ముకుళహస్త చిటికెన వ్రేళ్ళు కొంచెము వంకరగా బట్టిన ప్రదేశ ముకుళహస్తము వచ్చును.)

-: బకహస్త లక్షణము (కొంగ) :-

తా॥ సంకీర్ణ హంసహస్తము బకము (కొంగ) కు చెల్లును. (తర్జ న్యంగుష్టములను చేర్చి, మధ్యమ అనామికలను చాచి, కనిష్టను అరచేతిలోకి మడచి వుంచినచో సంకీర్ణహంస హస్తము వచ్చును.) మంత్రభేదమందు చెల్లును.

-: క్రౌఞ్చపక్షి హస్త లక్షణము :-

తా॥ లీనాల పద్మహస్తము క్రౌంచపక్షికి వినియోగించును. (అల పద్మహస్తమందలి చిటికెనవ్రేళ్ళు అరచేతిలోకి వంచినచో లీనాల పద్మ హస్తము వచ్చును.)

-: ఖద్యోత హస్త లక్షణము (మిడుగురు పురుగు) :-

తా॥ ముఖహంస హస్తము, మిడుగురు పురుగునందు వినియోగిం చును. (బొటనవ్రేలిచే నడిమివ్రేలి కొనగనుపు ఒరియునట్లు అపవిద్ధముగ బట్టిన ముఖహంసము వస్తుంది.)

-: భ్రమరహస్త లక్షణము (తుమ్మెద) -:

తా॥ భ్రమర హస్తములు పుంఖితములుగ బట్టిన తుమ్మెదయందు చెల్లును.

-: మయూరహస్త లక్షణము (నెమలి) :-

తా॥ మయూర హస్తములు పుంఖితాకారములుగపట్టిన నెమలియందు వినియోగించుగు.

-: హంసహస్త లక్షణము :-

తా॥ హంసాశ్య హస్తము హంసపక్షికి చెల్లును.

-: చక్రవాక హస్త లక్షణము :-

తా॥ అలపద్మ హస్తములు ఘంఖితములుగ పట్టినచో చక్రవాక పక్షి యందు వినియోగించును.

-: కోయష్టిక హస్త లక్షణము :-

తా॥ అరాళపతాక హస్తము కోయష్టిక పక్షికి వర్తించును. (కుడి చేత అరాళహస్తమును, ఎడమచేత పతాకముతో చేర్చివుంచినచో అరాళ పతా కము వచ్చును.)

-: వ్యాళిహస్త లక్షణము :-

తా॥ తర్జనీ మధ్యములను చేర్చి ధనస్సువలెవంచి. అనామికను అంగుష్టసంధియం దుంచి. కనిష్టను వంచిపట్టినచో వ్యాళిహస్తమగును. ఇది వ్యాళీయను పక్షికి చెల్లును.

## -: జల జంతు హస్త లక్షణములు :-

-: భేకహస్త లక్షణము :-

తా॥ శ్లిష్టచక్ర హస్తము భేకార్థము (కప్ప)నందు చెల్లును. (చక్ర హస్తములయొక్క అంగుష్ట తర్జనులను చేతిలోపలికి ముడిచి మధ్యమము లను చేర్చి, అనామికలనువంచి, కనిష్టలను చాచిపట్టినచో శ్లిష్టచక్రహస్తము వచ్చును.)

-: కుళీరహస్త లక్షణము :-

తా॥ లీనకర్కటహస్త ముకుళీరార్థమందు వినియోగించును. (కుడి కర్కట హస్తమును, అపవేష్టితముగ ఎడమచేతిమీదికి చాచిబట్టి వ్రేళ్ళను చేర్చిన లీనకర్కటి హస్తము వచ్చును.)

-: రక్తపాయి హస్త లక్షణము (జలగ) :-

తా॥ సూచీహస్తము కదలించుచు అడ్డముగా బట్టిన జలగయందు వినియోగించును,

-: డుణ్డుభ హస్త లక్షణము (ఇరుతలల పాము) :-

తా॥ కర్తరీ దండహస్తము ఇరుతలల పాముకు వర్తించును. (కుడి చేత కర్తరీ ముఖహస్తమును ఊర్ధ్వముఖముచేసి అన్యప్రకోష్టమందు కటకా ముఖమును బట్టినచో కర్తరిదండ హస్తము వచ్చును.)

-: గ్రంధాంతర వాణహస్త లక్షణము :-

తా॥ చూపుడువ్రేలు మొదలు మూడువ్రేళ్ళను బొటనవ్రేనితో చేర్చి, చిటికెన వ్రేలిని చాచిపట్టినచో బాణహస్త మగును. ఇది ఆరు అను లెక్కిం చుటకు, నాళనృత్యమందు వినియోగించును.

-: గ్రంధాంతర అర్దసూచిక హస్తలక్షణము :-

తా॥ కపిత్థహస్తపు చూపుడువ్రేలును పొడవుగా ఎత్తిపట్టినయెడల, అర్థసూచిక హస్తము వచ్చును. ఇది మొలక, పక్షిపిల్ల, పెద్దపురుగు మొద లగు వాటికి వినియోగింపబడును.

:- గ్రంధాంతర ఊర్ణనాభ హస్తలక్షణము ;-

తా॥ పద్మకోశ హస్తపు వ్రేళ్ళను వంచినచో ఊర్ణనాభ హస్తమ గును. ఇది నృసింహస్వామివల్ల పుట్టినది. వీనికి శార్దూలకుడు ఋషి. రక్త వర్ణము. ఆదికూర్మము అధిదేవత. క్షత్రియ జాతి.

అసంయుత, సంయుత, సంకర, నానార్థ, కాల, ఋతు, చతుర్వేద, చతుర్విధోపాయ, భూత భవిష్యద్వర్తమాన, బాంధవ్య, చతుర్వర్ణ, విప్ర కీర్ణ, బ్రహ్మాదిదేవతా, నవగ్రహ, దశావతార, ప్రశిద్ధరాజ, చతుర్దశలోకాల, వృక్ష, సింహాదిమృగ, పక్షి, జలజంతు ఇత్యాది సర్వహస్తములుగల హస్తా ధ్యాయము సర్వము సంపూర్ణము.

# చతుర్వింశతి

## -: శిరోభేదములు లక్షణములు :-

శ్లో॥ ధుత. విధుత, మాధూత, మనధూతంచ, కంపితమ్ ।
అకంపితో, ద్వాహితేచ, పరివాహిత, కాంచితే ।
నిహాంచితం, పరావృత్తముత్క్షిప్తాఽధోముఖేతథా ।
లోలితంచేతి విజ్ఞేయం చతుర్దశవిధంశిరః ।
తిర్యక్షేతోన్నతం స్కంధానతమారాత్రికం సమం ।
పార్శ్వాభిముఖమిత్యన్యచ్చేదం పంచపరేజగుః ।
సౌమ్యలాలోలితంచైవతిరశ్చీనం ప్రకంపితమ్ ।
సౌందర్యం పంచధాప్రోక్తం శిరసాం లక్షణం తథా ॥

తా॥ 1 ధుతము, 2 విధుతము, 3 అధూతము, 4 అవధూతము, 5 కంపితము, 6 అకంపితము, 7 ఉద్వాహితము, 8 పరివాహితము, 9 అంచితము, 10 నిహాంచితము, 11 పరావృత్తము, 12 ఉత్క్షిప్తము, 13 అధోముఖము, 14 లోలితము ఈ పదునాల్గునూ, 1 తిర్యజ్ఞతోన్నతము, 2 స్కంధానతము, 3 ఆరాత్రికము, 4 సమము, 5 పార్శ్వాభిముఖము ఈ ఐదున్నూ, 1 సౌమ్యము, 2 ఆలోలితము, 3 తిరశ్చీనము, 4 ప్రకంపితము, 5 సౌందర్యము ఈ ఐదున్నూ కలసి 24 శిరోభేదములు అయినవి.

### 1. ధుతశిరస్సు లక్షణము :

శ్లో॥ వామదక్షిణ భాగేతు, చలితం తద్ధుతం శిరః ॥

తా॥ వామ, దక్షిణ భాగములయందు శిరమును చలింపచేసినచో "ధుత" శిరస్సు వచ్చును. ఇది లేదుయను వచనమందును, మాటిమాటికి పార్శ్వములను చూచుటయందును, జనుల సమాధానము లేకపోవుటయం

దును, విస్మయమునందును. దుఃఖమునందు, అనిష్టమగు దానియందు ఈ శిరస్సును యింకా. వలదు అనుటయందుకూడా వినియోగించును.

2. విధుత శిరస్సు లక్షణము ;

శ్లో॥ ధృతగత్యధయద్యస్మా, ద్విధుతం తత్ర్పయుజ్యతే ॥

తా॥ ధుత శిరస్సునకు, ధృతగతి కల్గినచో విధుత శిరస్సు వచ్చును. ఇది సీతబాధచే పీడింపబడువాని జూపుటయందును, జ్వరపీడితునియందును, సద్యఃపానము చేసినవానియందును ఈ విధుత శిరస్సు వినియోగించును.

3. అధూత శిరస్సు లక్షణము :

శ్లో॥ అధూతంతుసకృత్తిర్య, గూర్ధ్వనీతం శిరోమతం ॥

తా॥ ఒకమారు వంచి ఊర్ధ్వముఖముగ త్రిప్పినచో, అధూత శిరస్సు యనబడును. ఇది గర్వముచేత తన శరీరమును తాను చూచుకొనుటయందును, పార్శ్వభాగములందుండు వస్తువులను ఊర్ధ్వముగ చూచుటయందును, నేను సమర్థుడనెడు అభిమానమునందు ఈ అధూతశిరము వినియోగించును.

4. అవధూత శిరస్సు లక్షణము :

శ్లో॥ యదధసకృతానీత, మవధూతంతదుచ్యతే ॥

తా॥ ఒకమారు అధోముఖముగ వంచబడిన శిరము "అవధూత" శిరమగును. ఇది కూర్చుండుటకు స్థానము చూపుటయందు, ప్రశ్నయందును, ఉపదేశమునందును. ఆలాపమునందును ఈ అవధూత శిరస్సు వినియోగించుచున్నది.

5 కంపిత శిరస్సు లక్షణము :

శ్లో॥ బహుశోధృత మూర్ధ్వంచ, కంపనాత్కంపితం శిరః ॥

తా॥ శీఘ్రముగ అనేకమారులు ఊర్ధ్వముగ కంపింపజేయబడినది. కంపిత శిరస్సు యగును. ఇది జ్ఞానము, అంగీకారము, కోపము, సంశయము, బెదరించుట, తీవ్రమనుట, ప్రశ్నవచనము వీటియందు ఈ కంపిత శిరస్సు వినియోగించును.

6. అకంపిత శిరస్సు లక్షణము :

శ్లో॥ ఆకంపితం తదేతత్స్యా, ద్యిరుక్తంతుశనైర్యది ॥

తా॥ రెండుమారులు సూక్ష్మముగ కదలించినచో అకంపిత శిరస్సు వచ్చును, ఇది ఎదుటివస్తువుల చూచుటయందును, ప్రశ్నించుటయందును, ఉపదేశముయందును, సంజ్ఞచేయుటయందును. దేవతాహ్వానాదులయందును. స్వాభిప్రాయము చెప్పుటయందును. ఈ అకంపిత శిరస్సు వినియోగించును,

7. ఉద్వాహిత శిరస్సు లక్షణము ;

శ్లో॥ సకృధూర్ధ్వం శిరోనీత, ముద్వాహితముదీరితం ॥

తా॥ ఒకసారి శిరమును పైకెత్తినచో, ఉద్వాహిత శిరమనబడును ఇది ఈ కార్యమునందు నేను సమర్ధుడనను నభిమానమునందును, ఉద్వాహిత శిరము వినియోగించును.

8. పరివాహిత శిరస్సు లక్షణము :

శ్లో॥ పరంమండలికాకారం, భ్రామితం పరివాహితం ॥

తా॥ తరచుగా మండలాకారముగ త్రిప్పిన శిరస్సు "పరివాహిత" శిరస్సగును. ఇది లజ్జాతిశయమునందును, భ్రమయందు, చిరునగవునందు.

సంతోషమునందు, దోషమునందు. ఘోషించుటయందు. విచారణయందు ఈ పరివాహిత శిరస్సు వినియోగించును.

9. అంచిత శిరస్సు లక్షణము :

శ్లో। శిరస్స్యాదంచితం, కించిత్పార్శ్వయో, ర్నతకంధరం ॥

తా॥ ఉభయపార్శ్వములందు, నమ్రమసూచికముగ కంఠమును వంచి పట్టినచో అంచితశిరస్సు యగుచున్నది. ఇది రోగమందు, చింతయందు, మూర్ఛయందు, తత్కాలోచితకార్యము వహించుటయందును, అంచితశిరస్సు వినియోగించుచున్నది.

10. నిహంచిత శిరస్సు లక్షణము ;

శ్లో॥ విక్షిప్తబాహుశిఖరం, మగ్నగ్రీవం నిహంచితమ్ ॥

తా॥ పైకెత్తబడిన భుజశిరస్సులతో, మగ్నకంఠముగల శిరస్సు నిహంచిత శిరమగును. ఇది విలాసము. లలితము, గర్వము, బిబ్బోకము. కిలికించితము. మోట్టాయితము. కుట్టమితము, మౌనము, స్తంభము, మొదలగు స్త్రీల శృంగారభావముల క్రియలందును, ఈ నిహంచితము వినియోగించును. (శృంగార భావక్రియలు భావప్రకరణ చూడవలె.)

11. పరావృత్త శిరస్సు లక్షణము :

శ్లో॥ పరాఙ్ముఖీకృతం శీర్షం, పరావృత్తము దీరితం ॥

తా॥ పరాఙ్ముఖముగ చేయబడిన శిరస్సు, పరావృత శిరమగును, ఇది అటులే చేయమనుటయంధు. కోపము, లజ్జ మొదలగు వానియందు ముఖమును దాచుటయందు, ఉపేక్షయందు. వెంట్రుకలు చూపుటయందు, అంబులపోది చూపుటయందును ఈ శిరస్సు వినియోగించును.

12. ఉత్క్షిప్త శిరోలక్షణము :

శ్లో॥ ఊర్ధ్వవక్త్రం శిరోజ్ఞేయ. ముత్క్షిప్తం తత్ప్రయుజ్యతే ॥

తా॥ పైకెత్తిన ముఖముగల శిరస్సు ఉత్క్షిప్త శిరస్సయగును. ఇది ఉన్నతమైన వస్తువులను చూచుటయందును. చంద్రాద్యంతరిక్ష సంచారులను చూచుటయందును ఈ శిరస్సు వినియోగించును.

13. అథోముఖ శిరస్సు లక్షణము :

శ్లో॥ ఆథోముఖస్థితంచాపి. శిరః ప్రాహురథోముఖం ॥

తా॥ శిరస్సువంచి భూమిని చూచుచున్న శిరస్సు, అథోముఖ శిరస్సు యగును, ఇది లజ్జయందు, దుఃఖమునందును. నమస్కారమునందును, అన్వర్థనామధేయముగల ఈ అధోముఖ శిరస్సు వినియోగించనగును,

14. లోలిత శిరస్సు లక్షణము :

శ్లో॥ శిరస్తల్లోలితం, గర్వాధిక్యా, చ్ఛిద్దిలలోచనం ॥

తా॥ గర్వాధిక్యముచే శిథిలములైన నేత్రములుగల శిరస్సు లోలిత శిరస్సగును. ఇది నిద్రయందు, రోగమునందు. గ్రహావేశమునందు, మదము నందు మూర్ఛయందును, ఈ లోలిత శిరస్సు వినియోగించుచున్నది.

15. తిర్యఙ్ఞతోన్నత శిరఃలక్షణము ;

శ్లో॥ తిర్యఙ్ఞత్యున్నతి ప్రాప్తం. శిరస్తిర్యఙ్ఞతోన్నతం॥ ॥

తా॥ అడ్డముగ నమ్రోన్నతిం బొందించిన శిరము, తిర్యఙ్ఞతోన్నత శిరమగును. ఇది స్త్రీలయొక్క బిబ్బోకాది చేష్టలయందు వినియోగింపు చున్నది.

### 16. స్కంధాన శిరస్సు లక్షణము :

శ్లో॥ స్కంధానతతథాఖ్యాతం, స్కంధేయన్నిహితం శిరః ॥

తా॥ భుజమునందుంచబడిన శిరము, స్కంధాన శిరస్సగును. ఇది నిద్ర. మదము. మూర్ఛ. చింత వీవియందు ఈ స్కంధాన శిరమ్స వినియోగించును.

### 17, ఆరాత్రిక శిరస్సు లక్షణము :

శ్లో॥ స్కంధౌతుకించితాశ్లిష్య, భ్రాంతమారాత్రికంసమం ॥

తా॥ భుజముల నించుకతగిలి త్రిప్పబడు శిరము ఆరాత్రికశిర మన బడును. ఇది విస్మయమునందు, పరుల అభిప్రాయము తెలుసుకొనుట యందు ఈ ఆరాత్రిక శిరము వినియోగించును.

### 18. సమశిరస్సు లక్షణము ;

శ్లో॥ స్వాభావిక సమంశీర్షం, స్వభావాభినయేభవేత్ ॥

తా॥ స్వాభావికమైన శిరము సమశిరస్సగును యని భరతాదులు చెప్పి యున్నారు, ఇధి భరతమతము. ఉన్నది వున్నట్లుండు శిరము సమశిరస్సు యగును. ఇది స్వాభావాభినయమందు వినియోగించును,

### 19. పార్శ్వాభిముఖ శిరస్సు లక్షణము :

శ్లో॥ పార్శ్వాభిముఖమన్వర్ధం. పాశ్వస్థస్యానలోకనే ॥

తా॥ పార్శ్వాభిముఖమగు శిరము, పార్శ్వాభిముఖ శిరమగును. ఇది ఒకప్రక్కకు త్రిప్పబడిన శిరస్సుకూడా పార్శ్వాభిముఖ శిరస్సగును. ఇది ప్రక్కనున్న వస్తువులను చూచుటయందుది వియోగించుచున్నది.

20. సౌమ్యశిరస్సు లక్షణము ;

శ్లో॥ నిశ్చలం సమమాఖ్యాతం, నృత్తారంభే ప్రయుజ్యతే ॥

తా॥ నిశ్చలమగు సమశిరస్సు సౌమ్యశిరమగుచున్నది. ఇది నృత్తారంభాను కాలములయందు వినియోగించును.

21. ఆలోలిత శిరస్సు లక్షణము ;

శ్లో॥ ఆసమంతాల్లోలితం, యత్తదాలోలితంమీరితం ॥

తా॥ అంతటను త్రిప్పబడిన శిరము ఆలోలిత శిరమగును. ఇది పుష్పాంజలినిచ్చు క్రమమందు. చారీనాట్యమందు, లవణ నాట్యమునందు ఈ ఆలోలిత శిరస్సు వినియోగించుచున్నది.

24. తిరశ్చీన శిరస్సు లక్షణము :

శ్లో॥ పార్శ్వద్వయోరూర్ధ్వభాగే. చలనాత్తిర్యగ్గీరితమ్ ॥

తా॥ ఉభయ పార్శ్వముల ఊర్ధ్వభాగములందు అడ్డముగా చలింప చేసినచో తిరశ్చీన శిరమగును. ఇది లజ్జానిరూపణయందు, ముఖచాళీయ నృత్తమునందు, తత్తదుచితకార్యమునందును ఈ శిరస్సు వినియోగించును.

23. ప్రకంపిత శిరస్సు లక్షణము ;

శ్లో॥ పునః పునః ప్రచలనా, త్పురోభాగేచ పార్శ్వయోః ।
ప్రకంపితం శిరఃప్రోక్తం, నాట్యశాస్త్రేషు సమ్మతమ్ ॥

తా॥ అద్భుతరసము, పాట, ప్రబంధము, తుమ్మెద, శతృయుద్ధ భావము వీనికి ఈ శిరము వర్తించుచు.

24. సౌందర్య శిరస్సు లక్షణము :

శ్లో॥ ఊర్ధ్వాధోముఖవిన్యాసా, త్పశ్చాద్భాగేనచాలనాత్ ।
సౌందర్యాఖ్య శిరఃప్రోక్తం, సర్వనాట్యేషు ప్రశస్యతే ॥

తా॥ క్రిందుమీదులకు త్రిప్పుటవలన. వెనుకతట్టు చలించుగలది, సౌందర్యశిరస్సు యగును. ఇదియెల్ల నాట్యములయందు ప్రశంసింపబడు చున్నది. ఇది కారణాభినయమునందు. హస్తభ్రమరణమునను. నృత్త మందు, యోగాభ్యాసమునందు వినియోగించుచున్నది.

## -: నవవిధ దృష్టిభేద లక్షణ వినియోగములు :-

శ్లో॥ పార్శ్వదృష్టిర్యాతదృష్టిః. మీలితోన్మీలనేతథా ।
కంపవ్యావృత్తదృష్టిచ, అంతర్మీలనమేవచా ।
అధస్తలంచోర్ధ్వతలం, దృష్టియోనవధామతాః ॥

తా॥ పార్శ్వదృష్టి. యాతదృష్టి, మీలితదృష్టి, ఉన్మీలనదృష్టి, కంప దృష్టి, వ్యావృత్తదృష్టి. అంతర్మీలనదృష్టి, ఊర్ధ్వతలదృష్టి యని దృష్టి భేదములు తొమ్మిది విధములుగా చెప్పియుండిరి.

### 1. పార్శ్వదృష్టి లక్షణ వినియోగములు ;

శ్లో॥ దృష్ట పార్శ్వాపార్శ్వ దృష్టి, రమర్షే పార్శ్వదర్శనే ।
సంజ్ఞాయాం ప్రణయక్రోధే, భవేదేషా పరాఙ్ముఖే ॥

తా॥ ప్రక్కకు చూడబడిన దృష్టి పార్శ్వదృష్టి యగును. ఓర్వలేని తనము, ప్రక్కకుచూచుట, సంజ్ఞ, పెడముఖము, ప్రణయకోపము వీని యందు ఈ దృష్టి వర్తించును.

### 2. యాతదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ ఉభౌపార్శ్వౌయయాదృష్టా, యాతదృష్టిర్నిగద్యతే ।
అన్వేషణే భవేదేషా, భయతస్సం ప్రదర్శనే ॥

తా॥ రెండుప్రక్కలకు చూడబడిన దృష్టి యాతదృష్టి యగును. వెదకుట, భయముతో చూచుటయందు ఈ యాతదృష్టి వినియోగించును,

### 3. మీలితదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ మీలితే లోచనేస్యాతాం, మీలితాదృష్టి రుచ్యతే ।
నిద్రామదే(శ్రమేధ్యానే, పారవశ్యేచ దృష్కృతౌ ॥

తా॥ కన్నులుమూసిన దృష్టి మీలితదృష్టి యగును. నిద్ర, మదము, శ్రమ, ధ్యానము, పరపశము, చెడుపనిచూచుట వీనియందీ మీలితదృష్టి వినియోగించును.

### 4. ఉన్మీలనదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ ఉన్మీలనాయానిమిషా, పురోభవతి మంజులమ్ ।
ఆశ్చర్యేచ, శ్రమేకోప భరే, సుందరవీక్షణే ।
మనోరథేచ శరల్యేచ, దూరనిశ్చలయోర్భవేత్ ॥

తా॥ రెప్పపాటులేక ముందుకు మృదువుగా చూచినచో. ఉన్మీలన దృష్టియగును. ఇది ఆశ్చర్యము, శ్రమ, అధికకోపము, అందముగా చూచుట, కోరిక, లక్ష్యము, దూరముగాచూచుట, నిశ్చలముగా చూచుట వీనియందు చెల్లును.

### 5. కంపదృష్టి లక్షణ వినియోగములు ;

శ్లో॥ ముహుర్నిమేషైశ్చలితా. కంపదృష్టిర్భవేదియమ్ ।
శృంగారేకంపనే సీతే, నృత్యే మంజులభాషణే ।
కులాలచక్రత్వరితే. తరంగే వాతపేనవే ।
ఉన్మేషేచ ప్రకాశేచ, యుజ్యతేఽసౌమనీషిబిః ॥

తా॥ మాటిమాటికి కన్నులుమూయుచు చలింపచేసెడి దృష్టి కంప దృష్టియనబడును. ఇది శృంగారము, వణకుట. చలి. వేగము, తరంగము.

యెండ, నూతనము, ప్రకాశము. కష్నులు తెరచుటయందీ కంపదృష్టి వినియోగించును.

6. వ్యావృత్తదృష్టి లక్షణములు :

శ్లో॥ వ్యావృత్తావృత్త చలితే. నేత్రేచావర్తభృంగయోః।
నీరాజనే వర్తులేచ. భవత్యేషా ప్రదక్షిణే ॥

తా॥ కన్నులు గుండ్రముగా త్రిప్పి చలింపచేయు దృష్టి వ్యావృత దృష్టియగును. ఇది సుడిగుండము. తుమ్మెదలు, నీరాజనము. గుండ్రని వస్తువు, ప్రదక్షణము, వీనియందీ వ్యావృతదృష్టి చెల్లును.

7. అంతర్మీలనదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ అంతర్మీలన దృష్టిస్యా. ల్లోచనేఽర్ధ నిమీలితే।
దుఃఖే ధ్యానేఽలసే కోపే, పారవశ్యే భవేదియమ్ ॥

తా॥ కనులు సగము మూసిన దృష్టి అంతర్మీలన దృష్టియగును. ఇది దుఃఖము. ధ్యానము, మాంద్యము, కోపము. పారవశ్యము వీనియందీ దృష్టి వినియోగించును.

8. అధస్తలదృష్టి లక్షణ వినియోగములు ;

శ్లో॥ చిరం స్వచరణే దృష్టాయ. యాసాఽధస్తలామతా।
దైన్యేహ్రియాం నమ్రశీర్షే, భవత్యేషాత్మదర్శనే॥

తా॥ చాలా సేపు తన కాళ్ళయందు చూచుట అధస్తలదృష్టి యగును. ఇది దైన్యము. సిగ్గు, శిరమువంచుట, ఆత్మదర్శనము వీనియందు అధస్తల దృష్టి వినియోగించును.

9. ఊర్ధ్వతలదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ దృష్టాకాశేభవే దూర్ధ్వతలదృష్టి స్సమున్నతే।
మూర్ఛారంభేచ చంద్రార్కే. పవనాత్మసుయుజ్యతే ॥

తా॥ ఆకాశమును చూచినదృష్టి ఊర్ధ్వతల దృష్టియగును. ఇది మిక్కిలి ఎత్తయిన వస్తువు. మూర్ఛారంభము, ఆత్మ, సూర్య-చంద్రులు. వాయువు వీనియందు చెల్లును.

## మరియు అష్టవిధ దృష్టిభేద లక్షణములు - వినియోగములు :

శ్లో॥ సమమాలోకితంసాచీ, ప్రలోకితనిమీలితే ।
ఉల్లోకితానువృత్తేచ, తథాచైవాఽవలోకితమ్ ।
ఇత్యష్టదృష్టిభేదాస్తు, కీర్తితాభరతాగమే ॥

తా॥ సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, నిమీలితము, ఉల్లోకితము, అనువృత్తము, అవలోకితము యని దృష్టి యెనిమిది విధములుగా భరతశాస్త్రమందు చెప్పబడియున్నది. ఇంక వీటి లక్షణ వినియోగములు క్రమంగా తెల్పుదును.

### 1. సమదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ వీక్షితం సురనారీ, ఖిన్నమానం, సమవీక్షణమ్ ॥

తా॥ దేవతాస్త్రీలవలే రెప్పపాటులేక చూచుట సమదృష్టి యగును. ఇది నాట్యారంభము, త్రాసు, ఇతరచింతను-నిశ్చయించుట, ఆశ్చర్యము. దేవతారూపముయందు, ఈ సమదృష్టి వినియోగించుచున్నది.

### 2. ఆలోకితదృష్టి లక్షణములు - వినియోగములు :

శ్లో॥ ఆలోకితం భవేదాశు, భ్రమణం స్ఫుటవీక్షణమ్ ॥

తా॥ వడితోడ తిరుగుడుగల స్పష్టమైన చూపును ఆలోకితమందురు. ఇది కుమ్మరిసారె తిరుగుట, అన్నివస్తువులను చూచుట, ఇచ్ఛ వీనియందీ దృష్టి వినియోగింపబడును.

3. సాచీదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ స్వస్థానే తిర్యగాకార, మపాఙ్గచలనక్రమాత్ ।
సాచీదృష్టిరితిజ్ఞే యా, నాట్యశాస్త్రార్థకోవిదైః ॥

తా॥ స్వస్థానమునుండి కడకంటివరకు అడ్డముగా చలించునది సాచీ దృష్టి యనబడుచున్నది, ఇది అభిప్రాయము, మీసము దువ్వుటయందు• గురి, వస్త్రము, తలుపు, సైగ, కులటానాట్యము వీనియందు ఈ దృష్టి వినియోగించును.

4. ప్రలోకితదృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ ప్రలోకితం పరిజ్ఞేయం. చలనాత్పార్శ్వభాగయోః ॥

తా॥ ఇరుప్రక్కలయందు చలించునట్టి దృష్టి ప్రలోకిత మనబడును. ఇది ఇరుప్రక్కలనుండు వస్తువులను చూచుట. సైగచేయుట, కదలుట, కలవరము వీనియందీ దృష్టి వినియోగింపబడును.

5. నిమీలిత దృష్టి లక్షణ వినియోగములు ;

శ్లో॥ దృష్టేరర్థవికాసే, నిమీలితా దృష్టిరీరితా ॥

తా॥ సగము కన్నుతెరచి చూచెడిచూపు నిమీలిత దృష్టియగును. ఇది ఋషివేషము, పరవశత్వము, జపము, ధ్యానము. నమస్కారము, చిత్తచలనము, సూక్ష్మదృష్టి వీనియందు ఈ దృష్టి వినియోగింపబడును.

6. ఉల్లోకితదృష్టి లక్షణ వినియోగములు ;

శ్లో॥ ఉల్లోకితమితిజ్ఞేయ, మూర్ధ్వభాగోన్నతానతమ్ ॥

తా॥ మీదికి నిక్కించి వంపబడిన దృష్టి ఉల్లోకితమగును. ఇది ధ్వజము కొనగోపురము, దేవమంటపము, పూర్వజన్మము, పొడుగు. వెన్నెల మున్నగువానియందీ దృష్టి వినియోగించును.

7. అనువృత్త దృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ ఊర్ధ్వాధోవీక్షణంవేగా. దనువృత్త నిరీక్షణమ్ ॥

తా॥ వడిగా క్రిందుమీదుగా చూచునట్టిచూపు అనువృత్తమనబడును. ఇది కోపముతో చూచుట, ప్రీతితో పిలచుట వీనియందు ఈ దృష్టి వినియోగించును.

8. అవలోకిత దృష్టి లక్షణ వినియోగములు :

శ్లో॥ అధస్తాద్దర్శనంయత్త. దవలోకితముచ్యతే ॥

తా॥ క్రిందకు చూచెడిచూపు అవలోకిత మనబడును, ఇది నీడను చూచుటయందు, విచారమందు, శయనము, చదువుటయందు. తన అవయవములు చూచుటయందును, నడకయందు ఈ దృష్టి వినియోగించును.

## నవవిధ గ్రీవాభేద లక్షణ వినియోగములు :

సమ, నత, ఉన్నత, త్ర్యశ్ర, రేచిత, కుంచిత, అంచిత, వలిత. వివృత్తయని తొమ్మిది విధముల గ్రీవములు కలవు.

1. సమగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ స్వాభావికముగనుండు మెడ "సమగ్రీవ" మగును. ఇది ధ్యాన స్వభావ, జపములయందు ఈ సమగ్రీవము ప్రయుక్తమగును,

2. నతగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ ముఖమును క్రిందకు వంచునట్టి మెడ "నతగ్రీవ" మగును. ఇది నగలు ధరించుకొనుటయందు, కౌగలించుకొనుటయందు నతగ్రీవము ప్రయుక్తమగును.

3. ఉన్నతగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ ముఖమును పైకెత్తుటచే యెత్తబడిన మెడ "ఉన్నతగ్రీవ" మగును. ఇది పైకి చూచుటయందు ప్రయుక్తమగును.

4. త్ర్యశ్రగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ ముఖముతోబాటు ప్రక్కకు త్రిప్పబడిన మెడ "త్ర్యశ్యగ్రీవ" మగును. ఇది దుఃఖమునందును. అంసము, (మూపు) మీద బరువు వున్నప్పుడును ప్రయుక్తమగును.

5. రేచితగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ ఇటునటు ఆడించుమెడ "రేచితగ్రీవ" మగుచున్నది. ఇది భావించుట. కవ్వము త్రిప్పుట, నృత్తమనువానియందీ గ్రీవము ప్రయుక్త మగును.

6. కుంచితగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ కొంచెము క్రిందికి వంచబడిన మెడ "కుంచితగ్రీవ" మనబడును. ఇది నెత్తిమీద బరువున్నప్పుడును, మెడను రక్షించుకొనుటయందును వర్తించును.

7, అంచితగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ శిరముతోపాటు వెనుకకు వంచబడిన మెడ "అంచితగ్రీప" మగును. ఇది జుట్టుముడి వేసుకొనుట, మీదకుచూచుట మొదలగువానియందిది ప్రయుక్తము.

8. వలితగ్రీవ లక్షణ వినియోగములు ;

తా॥ ప్రక్కగు త్రిప్పబడిన మెడ "వలితగ్రీవ" మనబడుచున్నది. ఇది ముఖమును త్రిప్పిచూచుటయందు ప్రయుక్తము.

9. వివృత్తగ్రీవ లక్షణ వినియోగములు :

తా॥ అభిముఖముగానున్న మెడ "వివృత్తగ్రీవ" మనబడును. ఇది స్వస్థానమందుండి యెదుటివారిని చూచుటయం దిది ప్రయుక్తమగును.

(ఈ గ్రీవలన్నియు శిరఃకర్మల ననుసరించియే నుండునని నాట్యాచార్యులు, నర్తకులు, నర్తకీమణులు తెలియవలెను.)

## నవవిధ తారాభేదముల లక్షణ వినియోగములు ;

భ్రమణ, వలన, పాతన, చలన, సంప్రవేశన, వివర్తన, సముద్వృత్తనిష్క్రామ ప్రాకృతయని తారాభేదములు తొమ్మిదివిధములుగలవు.

1. భ్రమణ తారాలక్షణ వినియోగములు :

తా॥ తారకలు (కనుగ్రుడ్లు) రెప్పలలోపల. మండలాకారముగ తిరుగుట భ్రమణమగును. ఇది వీర, రౌద్రములందు నిది ప్రయుక్తమగును.

2. వలనము తారాలక్షణ వినియోగములు :

తా॥ తారకలను, త్ర్యశ్రముగ (ముక్కోణము) త్రిప్పుటవలన, "వలన" తారయగును. ఇది వీర రౌద్ర రసములయందు వినియోగించును.

3. పాతన తారాలక్షణ వినియోగములు (పాతము) :

తా॥ తారకలు దిగజారినట్లు వేదావదులుగా వుంచుట పాతనమగును. ఇది కరుణరసమందు ప్రయుక్తము.

4. చలనతారా లక్షణ వినియోగములు :

తా॥ తారకలు కంపించుట "చలన" మగును. ఇది భయానకమ రసమందు ప్రయుక్తము.

5. సంప్రవేశము (లేక ప్రవేశము) తారాలక్షణ వినియోగములు :

తా॥ తారకలు రెప్పలలోనికి జొచ్చుకొనిపోవుట సంప్రవేశమగును. హాస్య, భీభత్సములయందిది ప్రయుక్తమగును.

6. వివర్తన తారాలక్షణ వినియోగములు :

తా॥ తారక కంటిచివరకుపోవుట (ప్రక్క-చూపు చూచుట) వివర్తనమగును. ఇది శృంగారమందు ప్రయుక్తము.

7. సముద్వృత్త తారాలక్షణ వినియోగములు ;

తా॥ తారకలను పైకెత్తుట సముద్వృత్తమగును. ఇది వీర రౌద్ర రసములయందు ప్రయుక్తము కాగలదు.

8. నిష్క్రామము, లేక నిష్క్రమణ తారాలక్షణ వినియోగములు :

తా॥ తారకలు కనుపడకుండుట నిష్క్రామమగును, ఇది వీర రౌద్ర ఆద్భుత భయానకములయందు ప్రయుక్తమగును,

9. ప్రాకృత తారాలక్షణ వినియోగములు :

తా॥ తారకలు స్వభావసిద్ధముగా నుండుట ప్రాకృతమగును. శేషించిన భావములందిది ప్రయుక్తములగును.

## కటిభేద లక్షణ వినియోగములు - పంచవిధములు :

శ్లో॥ కంపితోద్వాహితాచిహ్నా, నివృత్తారేచితాతథా ।
కటిః పంచవిధేత్యుక్తా. తల్లక్ష్మప్రోచ్యతేధునా ॥

తా॥ కంపితము, ఉద్వాహితము, చిహ్నము, వికృతము, రేచితము అని కటిభేదములు ఐదు విధములు.

1. కంపిత కటిలక్షణ వినియోగములు :

శ్లో॥ ధృతంగతౌ గతౌ పార్శ్వే, దధతీ కంపితాత్మతాం ।
తాంకుబ్జవామనాదీనాం, గమనేతునియుజ్యతే ॥

తా॥ శీఘ్రగమన, గమనాదులయందు; ఉభయపార్శ్వములయందు, చలనాత్మక భావము ప్రదర్శించుచో "కంపిత" కటియనబడును. ఇది గూను వానియందు, పొట్టివానియందు వినియోగించును.

2. ఉద్వాహిత కటిలక్షణ వినియోగములు ;

శ్లో॥ శనైరుచ్ఛలితాపార్శ్వద్వయే, నోద్వాహితాకటిః ॥

తా॥ పార్శ్వద్వయముచే మెల్లమెల్లగా ఉచ్ఛలితమగు కటి ఉద్వాహిత కటియగును. ఇది విలాస గమనమందు. స్థూలదేహము గలవాని గమనమందు, "ఉద్వాహితకటి" వినియోగించుచున్నధి.

3. చిహ్నకటి లక్షణ వినియోగములు :

శ్లో॥ చిహ్నతిర్యఙ్ముఖేపాత్రే, మధ్యస్యమునాత్కటిః ॥

తా॥ పాత్రతోఙ్ముఖమునుండి కటిని చలింపజేసినచో చిహ్నకటి యగుచున్నది. ఇది విస్తారముగ తిరుగుట, వెనుదిరిగి చూచుటయందు చిహ్నకటి ప్రయుక్తమగును.

4. వివృత్తాకటి లక్షణ వినియోగములు :

శ్లో॥ వరాఙ్ముఖేన పాత్రేణా, భిముఖం యానివర్తితా ।
వివృత్తసాలేటఃప్రోక్తా వినియోజ్యావివర్తనే ॥

తా॥ పెడముఖముగల పాత్రధారిచేత కటి (నడుము) అభిముఖముగ త్రిప్పబడిన వివృత్తకటి యగును. ఇది వివర్తనమందు (అభిముఖముగ తిరుగుట) వినియోగించును.

5. రేచితకటి లక్షణ వినియోగములు :

శ్లో॥ సర్వతో్భ్రమణాద్యుక్తా రేచితాభ్రమణే భవేత్ ॥

తా॥ అంతటను తిరుగుటవలన రేచితకటి యనదగును. ఇది భ్రమణ మున వినియోగించును.

## పంచవక్షో భేదములు, లక్షణములు, వినియోగములు

శ్లో॥ సమమాభుగ్న నిర్భుగ్నే, కంపితోద్వాహితేపరే ।
ఇతి పంచవక్షః ప్రోచ్యతే శంభునిర్మితమ్ ॥

తా॥ 1 సమము, 2 అర్భుగ్నము, 3 నిర్భుగ్నము, 4 కంపితము, 5 ఉద్వాహితము యని అయిదు విధములుగా చెప్పబడినది.

1. సమవక్ష లక్షణ వినియోగములు :

శ్లో॥ సమ్యగాధిష్టితం వక్షః చతురం చాంగసంశ్రియం।
ప్రకృతిస్థం సమప్రాహు, స్వభావాభినయేచతత్ ॥

తా॥ మనోహరముగ ఉపాంగముల నాశ్రయించి ప్రకృతిసిద్ధముగా నుండెడి వక్షము సమవక్ష మనబడును.

2. అభుగ్నవక్ష లక్షణ వినియోగములు :

నిమ్నంశిధిలమాభుగ్నం వీక్షస్స్యాద్గర్వలజ్జయోః ।
శీతహృచ్ఛల్యయోశ్శోకే మూర్ఛాయాం సంభ్రమేపిచ ॥

తా॥ నిమ్నముగా వంచినచో అభుగ్నవక్ష మగును. ఇది గర్వము నందు, లజ్జయందు, చలియందు, హృచ్ఛల్యరోగమునందు, మూర్ఛయందు, సంభ్రమణమునందును వినియోగించును.

3. నిర్భుగ్నవక్ష లక్షణ వినియోగములు :

నిర్భుగ్నం నిమ్నపృష్ఠం చేత్కృతం స్తబ్ధమురస్తథు ।
మానేచ సత్వవచనే స్తంభే విస్మయవీక్షణే ।
ప్రహర్షే భాషణే గర్వోత్సేధేచైవ ప్రయుజ్యతే ॥

తా॥ నిమ్నపృష్టమును నిశ్చలముగ వక్షమును చేసినచో, నిర్భుగ్న వక్షమగును. ఇది గర్వమునందు, సత్యప్రతిజ్ఞాన వచనమునందు, స్తంభము నందు, ఆశ్చర్యము చూపుటయందు, సంతోషభాషణమునందు, గర్వాధిక్యము నందు వినియోగించుచున్నది.

4. కంపితవక్ష లక్షణ వినియోగములు ;

ప్రకంపితం కంపితంచేదూర్ధ్వక్షేపై ర్నిరంతరైః ।
స్యాద్విహాసస్రశ్రమాశ్వాసభానహిక్కాసురోదనే ॥

తా॥ తరచుగా ఊర్ధ్వక్షేపములచే కంపింపజేయబడిన వక్షము ప్రకంపితవక్ష మనబడుచున్నది. ఇది విశేషహాసమునందు, శ్రమయందును, శ్వాసకాసలయందును, హిక్కయందును. రోదనయందును ఈ కంపిత వక్షము వినియోగించునని శాస్త్రజ్ఞులు చెప్పిరి.

5. ఉద్వాహితవక్ష లక్షణ వినియోగములు :

సకృత్తరళ ముత్క్షిప్తం కించిత్కంపన సంయుతం ।
ఉద్వాహితదుత్తుంగా లోకనేస్యార్విజృంభణే ।
ఊర్ధ్వచ్ఛ్వాస విజృంభాయామభినేయమితీరిత ॥

తా॥ సకృచ్చలనమగునట్లు పైకెత్తబడి స్వల్పకంపముతో గూడిన వక్షము ఉద్వాహితవక్ష మనబడును. ఇది పైనుండెడి వస్తువుల చూచుట యందును, విజృంభణమునందును, ఊర్ధ్వశ్వాసోజృంభణమందును ఈ ఉద్వాహిత వక్షము వినియోగించును.

# కపోలభేద లక్షణ వినియోగములు - షడ్విధములు

1 క్షామ, 2 ఫుల్ల, 3 ఘూర్ణ, 4 కంపిత, 5 కుంచిత, 6 సమ యని కపోలములు ఆరు విధములుగా చెప్పిరి.

### 1. క్షామకపోల లక్షణ వినియోగములు ;

తా॥ చెక్కిళ్ళు దిగజారినచో "క్షామకపోల" మగును. ఇది దుఃఖము నందు ప్రయుక్తమగును.

### 2. ఫుల్లకపోల లక్షణ వినియోగములు :

తా॥ చెక్కిళ్ళు వికశితములైనచో "ఫుల్లకపోల" మగును. ఇది సంతోషమునందు వినియోగించునని శాస్త్రసమ్మతము.

### 3. ఘూర్ణమను కపోల లక్షణ వినియోగములు ; (పూర్ణము)

తా॥ చెక్కిళ్ళు పెద్దవగుచో ఘూర్ణమనబడును. ఇది ఉత్సాహ. గర్వములందు ప్రయుక్తములగును.

### 4. కంపిత కపోల లక్షణ వినియోగములు :

తా॥ చెక్కిళ్ళు అదరుచో "కంపిత" మగును. ఇది రోష, హర్షము లందు ప్రయుక్తములగును.

### 5. కుంచిత కపోల లక్షణ వినియోగములు :

తా॥ చెక్కిళ్ళు సంకుచితములైనచో "కుంచిత" మనబడును. రోమాంచము కల్గించు స్పర్శమందును, శీత, భయ, జ్వరములయందును, ఇది ప్రయుక్తమగుచున్నది.

### 6. సమకపోల లక్షణ వినియోగములు : (ప్రాకృత)

తా॥ చెక్కిళ్ళు సమముగ సహజముగానున్నచో "సమ" మగును. తక్కిన భావములకిది ప్రయుక్తము.

# నాసాకర్మల లక్షణ వినియోగములు - షడ్విధములు

1 నత, 2 మంద. 3 వికృష్ట, 4 సోచ్ఛ్వాస, 5 వికూణిత, 6 స్వాభావిక యని నాసాకర్మలు షడ్విధములుగా చెప్పబడియుండిరి.

## 1. నతనాసా లక్షణ వినియోగములు :

తా। నాసాపుటములు (ముక్కుదొప్పలు) మాటిమాటికి శ్లిష్టములగుచో యది "నతనాశిక" యగును. ఇది మందోత్కంపముతో గూడిన విశ్వాసమునందును, ప్రియురాలిని అనునయించుటయందును, మెల్లగా అగి ఆగి ఏడ్చుటయందును నిది ప్రయుక్తమగును.

## 2. మందనాశిక లక్షణ వినియోగములు ;

తా॥ నాసాపుటములు నిశ్చలములైనచో "మంద"యగును. నిర్వేద, ఔత్సుక్య, చింతా, శోకములయందిది వినియోగించును.

## 3. వికృష్ట నాసాలక్షణ వినియోగములు :

తా॥ నాసాపుటలు పెద్దవియగుచో "వికృష్ట" యగును. ఇది తీవ్రగంధము నాఘ్రాణించుటయందు, ఇది రౌద్ర వీరములయందు ప్రయుక్తములగును.

## 4, సోచ్ఛ్వాసనాసా లక్షణ వినియోగములు

తా॥ లోనికి గాలి బీల్చుకొనుచో "సోచ్ఛ్వాసనాశిక" యగును, ఇది ఇష్టమైనదానిని వాసన చూచుటయందు, ఉచ్ఛ్వాసమునందు ప్రయుక్తములగును.

## 5. వికూణిత నాశిక లక్షణ వినియోగములు :

తా॥ నాశిక సంకుచితమగుచో "వికూణిత" మగును. ఇది జుగుప్సా అసూయలందు ప్రయుక్తము.

6. స్వాభావిక నాశికా లక్షణ వినియోగములు :

తా॥ నాశిక సమముగానున్నచో "స్వాభావిక" యగును. తక్కిన భావములందిది ప్రయుక్తములగును.

## -: పార్శ్వభేద లక్షణ వినియోగములు :- (పంచవిధ)

శ్లో॥ వివర్తితం చాపసృతం ప్రసారిత మధోన్నతం ।
ఉన్నతం చేతిచప్రాహుః పార్శ్వం పంచవిధంబుదాః ॥

తా॥ వివర్తితము. అపసృతము, ప్రసారితము. అధోన్నతము. ఉన్నతము యని పార్శ్వభేదములు అయిదు విధములుగా చెప్పియుండిరి,

1. వివర్తిత పార్శ్వలక్షణ వినియోగములు :

శ్లో॥ వివర్తనాత్త్రికస్యస్యాత్పరా వృత్తౌవివర్తితం ॥

తా॥ పృష్టవంశాధర ప్రదేశములు తిరుగుట "వివర్తిత" పార్శ్వ మనబడును.

2. అపసృత పార్శ్వలక్షణ వినియోగములు :

శ్లో॥ తత్సన్నిపాతాపసృతం భవేత్పార్శ్వస్థదర్శనే ॥

తా॥ పార్శ్వమును బాగుగా త్రిప్పినచో "అపసృత" మగును. ఇది పార్శ్వమంధున్నదానిని చూచుటయందు వినియోగించునని నాట్యకళాభిజ్ఞులు చెప్పియుండిరి.

3. ప్రసారిత పార్శ్వలక్షణ వినియోగములు :

శ్లో॥ ప్రసారితంచో భయతో విస్తృతంస్యాన్ముదాదిషు ॥

తా॥ ఉభయ పార్శ్వములందు విస్తృతములుగా బట్టినచో "ప్రసారిత" మగును. ఇది సంతోషాదులందు వర్తించును.

4. అధోన్నత పార్శ్వలక్షణ వినియోగములు :

శ్లో॥ ఏకాత్రాత్యున్నతం చాధోన్నతంస్యాదుప సర్పణే ॥

తా॥ ఒకవైపు ఉన్నతముగబట్టినచో "అధోన్నతపార్శ్వ" మగును. ఇది చేరువకు పోవుటయందు వర్తించును.

5. ఉన్నతపార్శ్వ లక్షణ వినియోగములు :

శ్లో॥ పార్శ్వం తద్విపరీతంతూన్నతంస్యాదుప సర్పణే ॥

తా॥ తద్విపరీతమగు దానిని విపరీత పార్శ్వమగును. (అనగా ఉన్నతపార్శ్వము). ఇది తిరిగివచ్చుటయందు చెల్లును.

## పంచవిధ ఊరూకర్మ లక్షణ వినియోగములు :

కంపన, వలన. స్తంభన, ఉద్వర్తన, వివర్తన యని అయిదు విధముల తొడలకర్మలు యని శాస్త్రకారులు చెప్పియుండిరి.

1. కంపనఊరూ లక్షణ వినియోగములు :

తా॥ పార్ష్ణిని (మడమ-చీలమండ) మాటిమాటికిని పైకెత్తుట, క్రిందకు దించుట చేయుచుండుటచే ఊరువులు కదల్చుచున్నచో యది "కంపితోరువు" యగును. ఇది అధమపాత్రల భయగతియం దిది ప్రయుక్తము.

2. వలన, ఊరులక్షణ వినియోగములు ;

తా॥ నడుచుచున్నప్పుడు మోకాళ్ళ తొడలమధ్యకు వచ్చుచున్నచో, యది "వలితోరువు" యగును. ఇది స్త్రీల స్వేచ్ఛావిహారములందుప్రయుక్తమగును.

3. స్తంభనఊరు లక్షణ వినియోగములు :

తా॥ ఊరువులను చేష్టారహితములుగా నుంచినచో, నది "స్తంభితోరువు" యగును. ఇది సాద్వద-విషాదములయందిది ప్రయుక్తమగును.

4. ఉద్వర్తనఊరు లక్షణ వినియోగములు :

తా॥ తొడలు మధ్యలకు తగులునట్లుగా మోకాళ్ళను వంచి త్రిప్పుచున్నచో, "ఉద్వర్తితోరువు" యగును. ఇది కరణములయందును. వ్యాయామతాండవములయందు ప్రయుక్తమగును.

5. వివర్తనఊరు లక్షణ వినియోగములు :

తా॥ నడుచుటలో చీలమండలు తొడలకు తగులుచున్నచో యది "వివర్తితోరువు" యగుచున్నది. ఇది సంభ్రమాది పరిక్రమములయందిది ప్రయుక్తము.

## దశవిధ జంఘాకర్మల లక్షణ వినియోగములు :

ఆవర్తితము, నతము. క్షిప్తము. ఉద్వాహితము, పరివృత్తము. భ్రామితము. నిస్సృతము. కంపము. తిరశ్చీనము. బహిర్గతము యని దశవిధ జంఘాతర్మలు చెప్పియుండిరి.

1. అవర్తిత జంఘాలక్షణ వినియోగములు :

తా॥ కుడివైపునుండి యెడమవైపునకును, ఎడమవైపునుండి కుడివైపునకును. పాదములు వేయుచు నడిచినచో "అవర్తితజంఘ" యగును. ఇది విదూషక పరిక్రమమునందు ప్రయుక్తమగును. జంఘలను స్వస్తికముులుగా కూర్చుటకూడా అవర్తిత మనబడుచున్నది. (ఇది అధికపాఠము)

2. నతజంఘ లక్షణ వినియోగములు :

తా॥ మోకాళ్ళను వంచినచో "నతజంఘ" యగును. ఇది నేలమీదగానీ. ఆసనముమీదగాని కూర్చుండుటయందిది ప్రయుక్తమగును.

3. క్షిప్తజంఘ లక్షణ వినియోగములు :

తా॥ జంఘలను విసరుచు నడిచినచో "క్షిప్తజంఘ" యగును. వ్యాయామ తాండవములందిది ప్రయుక్తము.

4. ఉద్వాహిత జంఘలక్షణ వినియోగములు :

తా॥ జంఘను మీదికెత్తి నడిచినచో "ఉద్వాహితజంఘ" యగును. ఇది అవిద్ధ గమనాదులయందిది ప్రయుక్తము.

5. పరివృత్త జంఘలక్షణ వినియో॥ :

తా॥ జంఘను వెనుకకు త్రిప్పినచో "పరివృత్తజంఘ" యగును. ఇది తాండవాదులయందు ప్రయుక్తము.

6. భ్రామితజంఘ లక్షణ వినియోగములు :

తా॥ మండల భ్రమణముచే తిరుగునది "భ్రామితజంఘ" యగును. ఇది డమరుకవాద్యమందు, ఛత్రభ్రమరీ యను కరణమందు ప్రయుక్తమగును.

7. నిస్సృతజంఘ లక్షణ వినియోగములు :

తా॥ ముందుకు చాచినది నిస్సృత మనబడును.

8. కంపజంఘ లక్షణ వినియోగములు :

తా॥ ఇది విదలించుటయందు, భయమునందును, చిరుగజ్జెలు వాయించుటయందును వర్తించును.

9. తిరశ్చీనజంఘ లక్షణ వినియోగములు :

తా॥ ఒకప్రక్కకు పోవుటయందు, పద్మాసనాదులయందు నిది ప్రయుక్తమగును యని శాస్త్రవేత్తల యభిప్రాయము.

10. బహిర్గతజంఘ లక్షణ వినియోగములు ;

తా॥ నేలవిడిచి ప్రక్కకు సాగినది "బహిర్గతజంఘ" యగును. ఇది ఖండసూచకమను స్థానమునందు వర్తించును,

## అంగ, ప్రత్యంగ, ఉపాంగ లక్షణములు :

1. అంగ లక్షణము :

శ్లో॥ అంగాన్యత్ర శిరోహస్తౌ, వక్షౌపార్శ్వకటీతటౌ ।
పాదావితిషడుక్తాని గ్రీవామప్య పరేజగుః ॥

తా॥ తల, చేతులు. చంకలు. పార్శ్వములు, నడుము, పాదములు ఈ ఆరును అంగము లనబడుచున్నవి. కొందరు కంఠముకూడా అంగమని యందురు.

2. ప్రత్యంగ లక్షణము :

శ్లో॥ ప్రత్యంగానిత్వధస్కంధౌ, బాహుపృష్టం తథోధరమ్ ॥
ఊరూజఙ్ఘేషడిత్యాహు, రపరేమణిబంధకౌ ।
జానునీకూర్పర, మితిత్రతయ. మప్యధికంజగుః ॥

తా॥ మూపులు, భుజములు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు ఈ ఆరున్నూ ప్రత్యంగములందురు. కొందరు మణికట్టు, మోకాళ్ళు, మోచేకులు, కూడ ప్రత్యంగములందురు.

3. ఉపాంగ లక్షణము :

శ్లో॥ దృష్టిభ్రూకుటతారాశ్చ. కపోలౌనాశికాహనుః ।
అధరోదశనాజిహ్వా, చుబుకం వదనం శిరః ।
ఉపాంగానిద్వాదశైతాన్య, న్యాన్యంగానిసంతిచ ।
పార్ష్ణిగుల్ఫౌతథాఙ్గుళ్యః కరయోః పదయోస్తలే ।
ఏతాని పూర్వశాస్త్రానుసారేణోక్తానివై మయా ॥

తా॥ చూపు, రెప్పలు, నల్లగ్రుడ్లు, చెక్కిళ్ళు, ముక్కు, దవడలు, అధరము, దంతములు, నాలుక, గడ్డము, మొగము, శిరస్సు ఈ పన్నెండున్నూ ఉపాంగములు. వీని అంగాంతరములుగా, గుదికాలు, చీలమండ, కాళ్ళచేతులవ్రేళ్ళు, అరచేతులు, అరకాళ్ళు మొదలైనవి పూర్వశాస్త్రము ననుసరించి చెప్పబడినవి.

## సప్తవిధ భ్రూభేద లక్షణ వినియోగములు ;

ఉత్క్షేపము, పతిత, భ్రుకుటి, చతురము, కుంచితము, రేచితము, సహజము యను ఈ భ్రూ భేదములు సప్తవిధములుగా చెప్పబడినవి.

### 1. ఉత్క్షేపభ్రూ లక్షణ వినియోగములు :

తా॥ రెండు కనుబొమ్మలు ఒక్కసారిగాగాని, పర్యాయముగాగాని పైకెత్తుట "ఉత్క్షేపభ్రూ" యగును. ఇది కోపము, వితర్కము, హేల, సహజలీలలు, దర్శనము, శ్రవణము అనువానిని నిరూపించుటయందు బొమ్మలు పర్యాయముగ పైకెత్తుచుండవలయును. విస్మయ, రోషముల యందు ఒక్కసారిగా పైకెత్తవలయును.

### 2. పతితభ్రూ లక్షణ వినియోగములు ;

తా॥ రెండు కనుబొమ్మలు ఒక్కసారిగాగాని, పర్యాయముగగాని క్రిందకు వాల్చుట. ఇది అసూయ, జుగుప్స, హాసము, వాసన పీల్చుట అనువానిని నిరూపించుటయందిది ప్రయుక్తమగును.

### 3. భ్రుకుటీ భ్రూలక్షణ వినియోగములు ;

తా॥ కనుబొమలయొక్క మూలములను పైకెత్తుట (అనగా నాశిక పైభాగమున రెండు కనుబొమలు ముడివడుట) ఇది క్రోధ స్థానములందును, పెద్దవెలుగు చూచుటయందును ఇది వినియోగించును.

4. చతురభ్రూలక్షణ వినియోగములు :

తా॥ మధురమగు పద్ధతిలో కనుబొమలను మెల్లగా కదిలించుచు పెద్దవిచేయుట. ఇది శృంగారము, లలితము, సౌమ్యము, సుఖస్పర్శము, ప్రబోధము మొదలగు అర్థములను నిరూపించుటయందిది ప్రయుక్తమగు నని భరతాదుల మతము.

5. కుంచిత భ్రూలక్షణ వినియోగములు :

తా॥ కనుబొమలు రెండును ఒక్కసారిగాగాని పర్యాయముగాగాని మృదువుగా వంపుదేరుట. ఇది మోట్టాయిత, కిలికించిత, కుట్టమితములం దును. నానావస్థాంతరాత్మకములగు స్త్రీ పురుషుల సల్లాపములందును ఇది ప్రయుక్తము యగును.

6. రేచిత భ్రూలక్షణ వినియోగములు :

తా॥ ఒక కనుబొమ్మను లలితముగ పైకెత్తుట, ఇది నృత్తము నందు ప్రయుక్తమగును.

7. సహజ భ్రూలక్షణ వినియోగములు : (స్వాభావికము)

తా॥ కనుబొమలు రెండును సహజస్థితిలో నుండుట, ఇది అనావిద్ధ (వికారహిత) భావములను నిరూపించుటకు ఇది ప్రయుక్తమగును.

## నవవిధ పుటభేదముల లక్షణ వినియోగములు :

ఉన్మేష, నిమేష, ప్రసృత, కుంచిత, సమవివర్తిత, స్ఫురిత, పిహిత, వితాడిత యను పుటకర్మలు తొమ్మిది విధములు కలవు,

1. ఉన్మేషపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలు ఎడముగా నుండుట "ఉన్మేషపుట" యగును. ఇది క్రోధమందు ప్రయుక్తమగును.

2. నిమేషపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలు కలయుట "నిమేషపుట" యగును. ఇదియును క్రోధమునందు ప్రయుక్తమగును.

3. ప్రసృతపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలు బాగుగా విప్పారుట "ప్రసృతపుట" యగును. ఇది విస్మయ హర్ష వీరములందిది ప్రయుక్తము.

4. కుంచితపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలు కొంచెము ముడుచుకొని యుంచుట "కుంచితపుట" యగును. అనిష్టములైన, దర్శన, స్పర్శన. గంధరసములను నిరూపించుట యందిది ప్రయుక్తము.

5. సమపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలు సహజముగా యుండుట "సమపుట" యగును. ఇది శృంగారమందు వినియోగించుచున్నది.

6. వివర్తితపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలుపైకి బాగుగా లాగబడుట "వివర్తితపుట" యగును. ఇది క్రోధమంధు ప్రయుక్తమగును,

7. స్ఫురితపుట లక్షణ వినియోగములు ;

తా॥ రెప్పలు అదరుచుండుట "స్ఫురితపుట" యగును. ఇది ఈర్ష్య యందు ప్రయుక్తమగునని భరతాచార్యులు చెప్పియుండిరి.

8. పిహితపుట లక్షణ వినియోగములు :

తా॥ రెప్పలను దగ్గరగా నొక్కిపట్టుట "పిహితపుట" యగును. ఇది సుప్తమూర్ఛితములందును, గాలి, వేడి, పొగ, వర్షము. కాటుక. మంట, నేత్రరోగము అనువానిని నిరూపించుటయందు ప్రయుక్తము.

వితాడితపుట లక్షణ వినియోగములు ; (వితాడితపుట)

తా॥ రెప్పలను అల్లాడ్చుట "వితాడితపుట" యగుచున్నది. (అనగా రెప్పలు ఒకదానితో వేరొకటి కొట్టుకొనుట) అభిఘాతమును నిరూపించుట యందు వర్తించును.

## అష్టవిధ దంతకర్మల లక్షణ వినియోగములు ;

శ్లో॥ దంతకర్మాణివక్ష్యామో, దంతలక్షణ సిద్ధయే ।
కుట్టనం ఖండనం ఛిన్నం, చుక్కితం గ్రహణం సమం ।
దుష్టం నిష్కరణంచేతి, దంతకర్మాష్టకంజగుః ॥

తా॥ కుట్టనము, ఖండనము. ఛిన్నము. చుక్కితము, గ్రహణము, సమము. దుష్టము, నిష్కరణము అని దంతకర్మలు యెనిమిధి విధములుగ చెప్పబడినవి,

1. కుట్టనదంత లక్షణ వినియోగములు :

"సంఘర్షణం గుట్టనం స్యాత్"

తా॥ దంతముల రాపిడి (పల్లుకొరుకుట) కుట్టనమగును. ఇది చలి యందు, రోగమందు (చలిజ్వరము), భయమునందు, ముసలితనమందు వినియోగించుచున్నది.

2. ఖండన దంతకర్మల లక్షణ వినియోగములు ;

శ్లో॥ "ఖండనంతు ముహూర్ధంత, శ్లేష విశ్లేషణంమతం"

తా॥ పైది. క్రింది దంతములు మాటిమాటికి కలయుచు, విడిపోవుట (నమలుట), ఖండనము యగును. ఇది జపమునందు, వేదాధ్యయన మందు. సంభాషణమునందు, భక్షించుట (తినుట) యందు వినియోగించును.

3. ఛిన్నదంతకర్మ లక్షణ వినియోగములు :

శ్లో॥ "ఛిన్నం స్యాద్గాఢ సంశ్లేషో"

తా॥ రెండు పలువరుసలు గాఢముగ కలియుట "ఛిన్న" మగును. ఇది ఏడ్చుటయందు, భయమునందు, చలియందు, వ్యాధి (రోగము)నందు, తాంబూలమును కోరుటయందు, వ్యాయామము (కసరత్తు) మొదలగు వావి యందు వినియోగించుచున్నది.

4. చుక్కిత దంతకర్మల లక్షణ వినియోగములు :

శ్లో॥ "దంతపంక్త్యోర్విస్థితిర్దూరే, చుక్కితం జృంభణాదిషు"

తా॥ పై పలువరుస, క్రింది పలువరుస దూరముగా నుండుట. "చుక్కిత" మగును. ఇది ఆవలింతయందు వినియోగించును.

5. గ్రహణ దంతకర్మల లక్షణ వినియోగములు ;

శ్లో॥ "తృణస్యచాంగుళైర్దంతే, ధారణం గ్రహణంభయే"

తా॥ చేతి వ్రేళ్ళతో దంతములయందు, గడ్డిపరకను ధరించుట గ్రహణ మగును. (నోటితో గడ్డిపరక పెట్టుకొని దంతములతో పట్టుకొనుట) ఇది భయమునందు వినియోగించును.

6. సమదంత లక్షణ వినియోగములు ;

శ్లో॥ "కించిచ్ఛేషః సమంతచ్చ, స్వభావాఽనయేమతం"

తా॥ రెండు పలువరుసలు కొంచెము కలసియుండుట "సమదంత" మగును. ఇది స్వభావికముగ నుండుటయందు వినియోగించును.

7. దుష్టదంతకర్మ లక్షణ వినియోగములు :

శ్లో॥ "అధరేదంశనందంతైః, దష్టక్రోధేఽభిధీయతే"

తా॥ పై దంతములతో క్రిందిపెదవి నొక్కిపట్టుట "దుష్టదంత" మగుచున్నది. ఇది కోపమునందు వినియోగించుచున్నది.

8. నిష్కారణ దంతకర్మ లక్షణ వినియోగములు :

శ్లో॥ నిష్కారణంతు నిష్కాసః, కార్యం మర్కటరోదనే"

తా॥ పలువరుస సంతటిని బైటకుపెట్టుట "నిష్కారణదంత"మగును. ఇది కోతుల ఏడ్పునందు వినియోగించును.

## పంచవిధ మణిబంధ లక్షణ వినియోగములు :

శ్లో॥ "పంచధా మణిబంధఃస్యాత్, నికుంచాకుంచితౌచలః
భ్రమితః సమఇత్యత్ర ........

తా॥ నికుంచము, అకుంచితము, చలము, భ్రమితము, సమము యని మణిబంధ భేదములు ఐదు విధములు.

1. నికుంచిత మణిబంధ లక్షణ వినియోగములు :

శ్లో॥ నికుంచస్తుస ఉచ్యతే ।
యెబహిర్నిమ్నితాంనీతః. సదాఽనాభయదానయోః॥

తా॥ మణిబంధము బయటికి పల్లముగా చేసినచో "నికుంచితమణి" బంధమగును. ఇది దానమిచ్చుటయందు. అభయము నిచ్చుటయందు వినియోగించును.

2. అకుంచిత మణిబంధ లక్షణ వినియోగములు :

శ్లో॥ "అకుంచితోంతర్నిమ్నోసౌ, కార్యోపసరణేబుధైః"

తా॥ మణిబంధము లోపలికి పల్లముగా చేసినచో "అకుంచిత మణిబంధ" మగుచున్నది. ఇది తొలగుటయందు వర్తించుచున్నది.

3. చలమణిబంధ లక్షణ వినియోగములు :

శ్లో॥ "నికుంచాకుంచితాభ్యాసాత్, చలమావాహనేవిదుః"

తా॥ పైనచెప్పిన నికుంచ-అకుంచిత మణిబంధముల క్రియవలన (అనగా లోపలికి బయటకు పల్లము చేయుటవలన) చలమణిబంధమగును. ఇది పిలచుటకు వర్తించును.

4. భ్రమిత మణిబంధ లక్షణ వినియోగములు ;

శ్లో॥ "భ్రమితో భ్రమత్కాణాత్కడ్గ, ఛురికాభ్రమణాదిషు"

తా॥ మణిబంధమును త్రిప్పుటవలన భ్రమిత మణిబంధ మగును. ఇది కత్తి, చురకత్తి త్రిప్పుటయందు వినియోగించును.

5. సమమణిబంధ లక్షణ వినియోగములు :

శ్లో॥ "ఋజుః సమః పుస్తకస్యా, ధారణే ప్రతిగ్రహే"

తా॥ సమముగ (వంకరలేకుండ) నున్న మణిబంధము సమమణి బంధమగును. ఇది పుస్తకము ధరించుటయందు, దానము పుచ్చుకొనుట యందు వర్తించుచున్నది.

## పాత్ర లక్షణము

శ్లో॥ తన్వీరూపవతిశ్యామా, పీనోన్నతపయోధరా ।
ప్రగల్భా సరసాకాన్తా, కుశలాగ్రహ మోక్షయోః ।
చారితాళలయాభిజ్ఞా, మండలాస్థానపండితా ।
హస్తాంగస్థాననిపుణా, కరణేషు విలాసినీ ।
విశాలలోచనా, గీతవాద్య తాళానువర్తినీ ।
పదార్థభూషాసంపన్నా, ప్రసన్నాముఖపంకజా ।
నాతిస్థూలా, నాతికృశా, నాత్యుచ్చా, నాతివామనా ।
ఏవంవిధ గుణోపేత, నర్తకీ సముదాహృదా ॥

తా॥ నటించెడి పాత్ర రూపవతియు, యవ్వన మధ్యస్తురాలు, బలసిన స్తనములు కలదియు, ప్రగల్భ రసికురాలు, మనోహరమైనది. పట్టు విడుపులయందు నేర్పుగలది, చారీ విధానములు తెలిసియున్నది, తాళలయాదులయందు నేర్పుగలది, మండల విధానము లెరిగినది, స్థానకములయందు పండితురాలు, హస్త, పాద, విన్యాసములందు నేర్పరి, తాండవ భేదములగు కరణ అంగాహారములందు చాకచక్యము కలది, విశాలములగు నేత్రములు గలది. అమూల్యాభరణములు గలది, గీత వాద్య తాళములనుసరించి నటించగల్గినది, సంపన్నురాలు, ప్రసన్నమగు ముఖవర్చస్సు గలది. మిక్కిలి లావు, మిక్కిలి సన్నము, మిక్కిలి పొడవు, మిగుల పొట్టిది గానిదిగా నుండవలయును.

## పాత్రదేవతా తత్త్వము

శ్లో॥ పాత్రాస్యాంగేషు తిష్టంతి, దేవతాస్యముపాశ్రితాః ।
బ్రహ్మరంధ్రే స్థితోదేవ, స్సదాశివ ఇతీరితః ॥
లలాటేక్షేత్రపాలస్తుశాక్యఃకట్సంతరేష్టితః ।
మణిబంధే మహాదేవః పరమేశః స్థితోమహాన్ ॥
కరస్థలేఽచలాలక్ష్మీః కరాగ్రే జయపార్వతీ ।
వక్షః స్థలేహృషీకేశః స్తనయోర్మేరుమందరౌ ॥
నాభౌతు దేవతాలక్ష్మీః జఘనే పృథివీతథా ।
ఊర్వోర్దేవసహస్రాక్షః జంఘయోః కమలాసనః ॥
జాన్వోచ్చ దేవతావాయుః దృష్టోశ్చైవ రమాసుతః ।
ఉభయోః పాదయోరేశా చంద్రసూర్యౌ ప్రకీర్తితౌ ॥

తా॥ నాట్యకాలమున పాత్ర అవయవములయందు దేవతలు ఆశ్రయించియుందురు. బ్రహ్మరంధ్రమున సదాశివుడు లలాటమున క్షేత్రపాలుడు

కటి స్థలమున బుద్ధదేవుడు మణికట్ల యందు మహాదేవుడు, హస్తముల యందు స్థిరలక్ష్మి హస్తాగ్రముల పార్వతి వక్షమున శ్రీమహావిష్ణువు స్తన ద్వంద్వమున మేరుమందరములు, నాభినందు లక్ష్మీదేవి. జఘనమున భూదేవి ఊరూద్వయమున చంద్రుడు. జంఘలయందు బ్రహ్మ, జానువుల యందు వాయువు, దృష్టులయందు మన్మథుడు. ఉభయపాదముల చంద్ర సూర్యులు ఆశ్రయించుకొనియుందురు,

## అపాత్ర లక్షణం

శ్లో॥ పుష్పాక్షీకేశహీనాచ, పీనోష్టిలంబకస్తనీ ।
అతిస్థూలాఽప్యతికృశాఽప్యత్యుచ్చాఽప్యతివామనా ॥
కుబ్జాచ స్వరహీనాచ దశైతానాట్యవర్జితాః ।

తా॥ పువ్వులు వేసిన కన్నులు గలది. జుత్తులేనిది (బట్టతలది), లావైన పెదవులు గలది, జారిన వక్షోజములు గలది, అతిస్థూలమైనది (లావైనది). అతికృశము (బాగానన్నుగది), అతిడిర్ఘమైనది (చాలా పొడవైనది), అతివామనము (మిగుల పొట్టిది), మరిగుజ్జు. స్వరహీనము గలది ఈ పదిలక్షణములుగల స్త్రీలు నాట్యమునకు అయోగ్యులు.

### కిఙ్కిణీ లక్షణమ్ (గజ్జలు)

శ్లో॥ కిఙ్కిణ్యః కాంస్యరచితాః, తామ్రేణ రజతేనవా ।
సుస్వరాశ్చ సురూపాశ్చ. సూక్ష్మనక్షత్ర దేవతాః ॥
బంధ్దయేన్నీలసూత్రేణ, గ్రంథిభిశ్చ సమన్వితమ్ ।
శతద్వయం శతంవాఽపిపాదయోర్నాట్యకర్మణి ।
శతంవాదక్షణేపాదే ద్విశతం వామపాదకే ॥

తా॥ గజ్జలు కంచువిగానైనను, రాగివిగానైనను. వెండివిగానైనను వుండవలయును. అవి మంచి స్వరము గలవిగాను, అందమైనవిగాను,

చిన్నవిగాను ఉండవలెను. నక్షత్రాధి దేవతగల అట్టి గజ్జలను నల్లదార మున గ్రుచ్చి, గజ్జగజ్జకు ముడివేయవలెను. నాట్యమాడెడి కాలములయందు పాత్ర కాళ్ళయందు ఇన్నూరిన్నూరుగాని. నూరు-నూరుగాని గజ్జెలుండవల యును. లేనిచో కుడికాలియందు నూరు, ఎడమకాలియం దిన్నూరుగ్నైన నను నుండవలయును.

## నర్తక లక్షణము

శ్లో॥ కులీనోనృత్యశాస్త్రజ్ఞః. తత్వవేదీజితేంద్రియః ।
ఊహాపోహ విశేషజ్ఞోదక్షోలక్ష్య ప్రదర్శనే ॥
కదిర్వాద్యశృతీః ప్రబంధేషు, స్వయంవాదన కోవిదః ।
జ్ఞాతావాద్య శృతీః నర్వాహముఖవాద్య విశారదః ।
చతురః శిష్యశిక్షాయాం నరనేనిపుణఃస్వయం ॥
సంగీతమేలనాభిజ్ఞోనానాదేశీయ నృత్యవిత్ ॥

తా॥ మంచికులమున జన్మించినవాడు, నృత్యశాస్త్రము లెరిగినవాడు. తత్వజ్ఞానము కలవాడు, ఇంద్రియములను జయించుకొన్నవాడు, ఊహాపో హల భేదము లెరిగినవాడు, లక్ష్యమును ప్రదర్శించుటయందు దక్షుడు, వాద్యప్రబంధములు కవనము చేయగలవాడు, తానే వానిని వాయింప నేర్పు గలవాడు, వాద్యముల శృతులన్నియు తెలిసిననాడు. ముఖవాద్యమందు నేర్పరి, శిష్యులకు నేర్పుటయందు చతురుడు, తానే నర్తించు నైపుణ్యము కలవాడు, నృత్తగీత వాద్యములను మేళవించు నేర్పుగలవాడు, నానాదేశ నృత్యరీతుల నెరిగినవాడు, కళావిదుడు, నిరహంకారుడు, పరంపరంగా విద్యోపదేశం కలవాడు, తాళమునందు కుశలుడు, మాటకారి. గీతవాద్యములు తెలిసినవాడు. క్రొత్తక్రొత్త భంగులను కల్పింపగలవాడు, చేతులతో వాద పాటవములు మొదలగు పనులుచేసి చూపువాడు, అంగహీనత లేనివాడు, అంతర్ముఖ ఆరోగ్యవంతుడు, రూపవంతుడు, మచ్చరము లేనివాడు, నర్తకి మనస్సుతో ఏకీభావము నొందగలవాడు, మంచిరేఖ కలవాడు. రంజనచేయ

గలవాడు, మధురవాక్కు గలవాడు ఇట్టివాడు నర్తకుడగును. ఇన్ని గుణ ములు కలిగిన నర్తకునకు వయస్సు కొంత సడలినపుడు నాట్యవిద్యను నేర్పుటకు తగియుండును.

## నర్తకి లక్షణము

శ్లో॥ రూపయవ్వనలావణ్యా నృత్తవిద్యాశ్రయత్వతః।
నేత్రానందసుధాపానభాజనత్వాచ్చ నర్తకి ॥
ఉపచారప్రయోగజ్ఞైః పాత్రమిత్యభిధీయతే ।

తా॥ రూపము, యవ్వనము, లావణ్యము, నృత్తవిద్య వీటికి ఆశ్రయమై నుండుటచేతను, నేత్రానందమును అమృతము త్రాగవలసిన పాత్ర మగుటవలనను ఔపచారిక ప్రయోగము నెరిగినవారు నర్తకిని పాత్రము అని పేర్కొనినారు. చులకని దేహముగలిగి ప్రాయము అందము, మంచి అదృష్టము. భర్తకు ప్రీతిపాత్రత వీనికి నెలవై యుండవలయును. సత్కులమునబుట్టి రూపసంపద కలిగి గ్రహణధారణములందు సమర్థత కలిగి ప్రతిభకలిగి, రసభావములను తెలిసి, ఉత్సాహమును, కుతూహలమునుకలిగి కళలు తెలిసినదియు, విధేయములగు అంగములు కలిగినదియునైన నర్తకి యగునని భరతాదులు చెప్పియుండిరి.

## నటలక్షణము

శ్లో॥ రూపవాన్ మదురభాషీ, కృతీవాజ్మీపటుస్తథా।
కులాంగనాసుతశ్చైవా, శాస్త్రజ్ఞోమధురస్వరః ॥
గీతవాద్యాది నృత్యజ్ఞ, స్సిద్ధకః ప్రతిభానవాన్ ।
ఏతాదృశగుణైర్యుక్తో, నటఇత్యుచ్యతేబుధైః ॥

తా॥ రూపము గలవాడు, ఇంపుగ మాట్లాడు నేర్పుగలవాడు, పాండిత్యము, నృత్యశాస్త్రజ్ఞానము, మధురమైన స్వరము, గీతవాద్య నృత్య విజ్ఞానము, పట్టుదల, ప్రతిభ ఇట్టి గుణములు గలవాడు నటుడని చెప్పుదురు,

వ్యాఖ్యానము :- నటుడనగా నాటకములు ప్రయోగించువాడని అర్థము. కేవలము నాట్యము ప్రయోగించువాడు నర్తకుడు, నటలక్షణ లక్షితుడై మాత్రముండవలెను, నటలక్షణములలో "శాస్త్రజ్ఞ" అను పదములకు "చతుర్ధాభినయాభిజ్ఞః నటోబాణాదిభేదవిత్" ఆంగిక వాచిక ఆహార్య సాత్విక మను చతుర్విధ అభినయములను పూర్ణముగాతెలిసి ప్రయోగించగలవాడు, దశవిధ నాటక భేదములను తెలిసినవాడును యని వ్యాఖ్యానించవలెను.

## ఆచార్య లక్షణములు

శ్లో॥ వాద్యత్రయేలక్ష్యలక్ష్మవేద్యాచార్యః ప్రకీర్తితః ।
వాగ్మీసురూపవేషోఽసౌసురసః స్తుతికోవిదః।
సభాసు పరిహాసజ్ఞః భవేద్వాదనవాద్యవిత్ ॥

తా॥ నృత్త-గీత-వాద్యములయొక్క లక్ష్యలక్షణములను తెలిసినవాడు, వాక్పాటవము గలవాడు, సుందరమైన వేషము గలవాడు, సరసుడు, ముఖస్తుతి చేయగలవాడు. సభయందు చమత్కారముగ మాట్లాడి సదస్సుల నవ్వించగలవాడు. వాద్యవాదనములను తెలిసినవాడు ఆచార్యుడని చెప్పుదురు.

### పాత్ర బహిఃప్రాణ లక్షణము

శ్లో॥ మృదంగశ్చ సుతాళౌచ, వేణుర్గీతి స్తతస్మృతి ।
ఏకవీణాకింకిణీచగాయకశ్చసువిశ్రుతః ॥
ఇత్యేవమన్య యజ్ఞైశ్చపాత్రప్రాణాబహిస్స్మృతః ।

తా॥ మృదంగము, మంచితాళములు, పిల్లనగ్రోవి, శృతి. వీణ, వంతపాట. గజ్జెలు, ప్రశిద్ధుడగు గాయకుడు అను ఈ యెనిమిది నాట్య మొనరించు పాత్రమునకు బహిః ప్రాణములని చెప్పబడినవి.

పాత్ర అంతఃప్రాణ లక్షణములు

శ్లో॥ జవస్థిరత్వరేఖాచ, భ్రమరీదృష్టిరశ్రమః ।
మేధాశ్రద్ధావచోగీతి స్త్వంతః ప్రాణాదశస్మృతాః ॥

తా॥ జపము స్థిరత్వము, రేఖా. చపలత్వము, దృష్టి, శ్రమలేక పోవుట, బుద్ధి శ్రద్ధ, వాక్కు, సంగీతము అను పదియును నాట్యమొన రించు పాత్రయొక్క అంతఃప్రాణములని చెప్పిరి.

రంగపూజ లక్షణము

శ్లో॥ విఘ్నేశం భారతీందేవీం. బ్రహ్మవిష్ణుమహేశ్వరాన్ ।
రంగేతద్దేవతాన్ వందేతాళవాద్యాదిభిః క్రమాత్ ॥

తా॥ విఘ్నేశుని. సరస్వతీదేవిని, బ్రహ్మ విష్ణు శంకరులను, నాట్య రంగ స్థలమున తాళవాద్యాదులచేత క్రమముగా నమస్కారము చేయుచు న్నాను. (చేయుము)

నాట్యరంగాధి దేవతా ప్రార్థన

శ్లో॥ భరతకుల భాగ్యకలికే భావరసానంద భూషితాపాంగే ।
జగదేక మోహనకరే జయజయరంగాధి దేవతేదేవీ ॥

తా॥ భరత కులమునకు (నాట్యసంప్రదాయమునకు) భాగ్యకళికా ప్రాయురాల రసభావముల ఆనందాదిశయములచే నలంకృత దృష్టులు గల దాన జగన్మోహినియగు ఓ నాట్యరంగ స్థలాధి దేవతా నీకు నమస్కారము.

## నాట్యకర్తలు

శ్లో॥ శంభుర్గౌరీ తథాబ్రహ్మా మాధవో నందికేశ్వరః ।
దత్తికోహూహళశ్చైవాయాజ్ఞవల్క్యశ్చ నారదః ॥
హనుమాన్విఘ్నరాజశ్చ షణ్ముఖోఽథ బృహస్పతిః ।
అర్జునోరావణశ్చైవాకన్యాబాణాసుతాతథా ।
ఏతే భరతకర్తారో భువనేషు ప్రకీర్తితః ॥

తా॥ శివుడు, పార్వతి, బ్రహ్మ విష్ణువు. నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహళుడు, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి. యాజ్ఞవల్క్యుడు. నారదుడు, హనుమంతుడు, బృహస్పతి. అర్జునుడు, రావణుడు, ఉషాకన్య యను ఈ పదునార్గురు భరత శాస్త్రకర్తలుగా లోకమున ప్రసిద్ధి చెంది యుండిరి. వీరుగాక భరతముని శార్ఙ్గదేవుడు, శుక్రుడు మొదలగువారుకూడా లోకప్రసిద్ధ నాట్యశాస్త్రకర్తలు.

## నాట్యభేదములు

శ్లో॥ నాట్యం నృత్తం నృత్యమితిమునిభిః పరికీర్తితమ్ ।
నాట్యం తన్నాటకేష్వేవయోజ్యం పూర్వకథాయుతమ్ ॥
రసభావ విహీనంతు నృత్తమిత్యభిధీయతే ।
రసభావవ్యంజకాదియుతం నృత్యమితీర్యతే ।
ఏతత్త్రియం ద్విధాభిన్నం, లాస్యతాండవ సంజ్ఞకమ్ ॥

తా॥ నాట్యము, నృత్తము. నృత్యముయని నాట్యము మూడు విధములుగ చెప్పబడినవి. నాట్యము నాటకములయందు పూర్వకథతో గూడుకొనియుండును. నృత్తము రసభావములులేక కేవలము తాళలయాశ్రితములైన నాట్యము. నృత్యము రసభావములతోగూడి రసభావానుగుణ్యమగు నాట్యము కలిగియుండును, మరల ఇందులాస్యములనియు, తాండవమనియు రెండు విధములుగ చెప్పబడినవి.

"సుకుమారంతు తల్లాస్యం ఉద్ధతంతాండవం విదుః"

తా॥ మృదువుగ రసభావములను అభినయించునది "లాస్యము" యనియు, ఆంగికాభినయములతో రసభావములు సమ్మిశ్రితముచేసి అభినయించునది "తాండవ" మనియు చెప్పబడియున్నది.

శ్లో॥ "ద్రష్టవ్యేనాట్యనృత్యేచ సర్వకాలే విశేషితః ।
నృత్యం తత్రనరేంద్రాణాం అభిషేకేమహోత్సవే ॥
యాత్రాయాం దేవయాత్రాయాం వివాహేప్రియసంగమే ।
నగారాణా మగారాణాం ప్రవేశే పుత్రజన్మని ॥
శుభార్థిభిః ప్రయోక్తవ్యః మాంగల్యం సర్వకర్మసు ॥

తా॥ పైచెప్పిన మూడు విధములగు వానిలో నాట్యనృత్యములు రెండును సర్వకాలములయందును చూడతగియున్నది. మరియు నృత్యము రాజపట్టాభిషేకము, తిరునాళ్ళు, పెండ్లి ఊరేగింపు, దేవుని ఊరేగింపు, వివాహము, ఇష్టుల కలయిక, పురప్రవేశము, గృహప్రవేశము, పుత్రోత్సవము మొదలగు సమయములయందు శుభార్థులు మంగళకరములుగా ప్రయోగించవలయును.

చతుర్వింశతి నాట్య భేదములు

శ్లో॥ శృంగారనాట్యముగ్రంచ భృంగినాట్యంచ చిత్రకమ్ ।
చారినాట్యంచచాళీయం శుద్ధనాట్యంచ విశృతమ్ ॥
హస్తచాళీయనాట్యంచ మార్గనాట్యంచ సమ్మతమ్ ।
అంగాహారాఖ్యనాట్యంచ పాదచారీచ పార్శ్వకమ్ ॥
సుఖచాళీయనాట్యంచ లవణీనాట్యమీరితమ్ ।
దేశీనాట్యం ఫేరణీచ లీలానాట్యంచ తతఃపరం ॥
తాండాలికళ్చ సందిళ్చ ప్రాంతనృత్యం ప్రకాశితే ।

భూచారినాట్యమావృత్తం విద్యుద్భ్రమర నాట్యకమ్ ॥
పుష్పాంజలిస్తు నాట్యంచ చతుర్వింశతి నాట్యకమ్ ।

తా॥ శృంగార ఉగ్రభృంగి చిత్రచారీచాళీయ శుద్దహస్తచాళీయమార్గ అంగాహార, పాదచారీ, పార్శ్వక, ముఖచాళీయ లవణీ, ఫేరణీ, దేశీలీల. తాండాళిక, సంధి, భ్రాంత, భూచారి, ఆవృత్త విద్యుద్భ్రమరి, పుష్పాంజలి యని ఇరువదినాల్గు విధములుగా నాట్యము చెప్పబడుచున్నది. (ఇవన్నియు భరతముని తాండవ లక్షణాంగములుగ గన్పట్టుచున్నవి.)

శ్లో॥ శుద్దదేశీవిధంనాట్యం ద్వివిధం మంగళంప్రదమ్ ।
భుక్తి ముక్తిప్రదం నృణాం నృత్యోత్సవ మిదంజగుః ॥

తా॥ పైనచెప్పిన ఇరువది నాలుగు రకముల నాట్యములలో "శుద్ద" దేశీనాట్యములు రెండును మంగళప్రదములు. ప్రజలకు భుక్తిని ముక్తిని నొసంగునవి. గాన "శుద్ధ" "దేశీ" నాట్యములు, ప్రదర్శనలు నృత్యోత్సవమనిరి.

## సభా లక్షణము

శ్లో॥ విద్వాంసః కవియోః భట్టాః గాయకాః పరిహాసకాః ।
ఇతిహాస పురాణజ్ఞాస్సభాసప్తాంగ లక్షణమ్ ॥

తా॥ విద్వాంసులు, కవులు, భట్టును, గాయకులు, పౌరాణికులు, పరిహాసకులు, ఇతిహాసకులు (పూర్వకథలు తెలిసినవారు), సభకు సప్తాంగములని చెప్పియుండిరి.

## సభాసదుల లక్షణము

శ్లో॥ మహాకులసముద్భూతాః సర్వశాస్త్ర విశారదః ।
సంగీతజ్ఞా విశేషేణ రశికావిజితేంద్రియాః ॥
అమత్సరా స్స్వామిభక్తాస్సభ్యాఏవం విధామతాః ।

తా॥ ఉన్నతకుల సంజాతులు, సర్వశాస్త్ర పారంగతులు, సంగీతశాస్త్ర విశేషజ్ఞులు, విశేషించి రశికులు. జితేంద్రియులు, మాత్సర్యరహితులు, స్వామిభక్తులు ఈ గుణములు గలిగినవారు సభాసదులుగాను. ప్రేక్షకులు గాను సామాజికులుగాను, సదస్యులుగాను చెప్పిరి.

## నీచనాట్య లక్షణము

శ్లో॥ అకృత్వా పూజనంపాత్ర మాచరేద్యదినాట్యకమ్ ।
తన్నాట్యం నీచమిత్యాహుః నాట్యశాస్త్రవిధోబుధాః ॥
నీచపాత్రకృత్యంనాట్యం, యదిపశ్యంతిమానవాః ।
అపుత్రాః పశువశ్చైవ జాయంతే మృగయోనిషు ॥
యస్మాత్సర్వం సమాలోచ్య పూర్వకైర్యదుదాహృతమ్ ।
దేవతాప్రార్థనాదీనికృత్వానాట్యముపక్రమేత్ ॥

తా॥ దేవతాపూజ ప్రార్థనలులేక చేసెడి నాట్యములు నీచనాట్యమందురు. నీచనాట్యము చేసిన పాత్రను చూచినవారు అపుత్రకులై పశువులై మృగయోనులందు జన్మింతురు. కావున శాస్త్రము తెలిసిన పెద్దలు నిర్ణయించినట్లు దేవతాప్రార్థనలు జరిపి నాట్యము ప్రారంభించవలెను,

## పాదభూషణ నిషేధము

శ్లో॥ సమస్తగుణసంయుక్తాసర్వతాళేషుకోవిదా ।
పాదభూషణసంయుక్తాసభామధ్యేతుతాంత్యజేత్ ॥

తా॥ యోగ్యమగు నటి లక్షణములు గల్గి సమస్త విధతాళ జ్ఞానము గలిగియున్నను గజ్జలు (కింకిణులు) మినహా ఇంకేవిధమైన పాదభూషణములు గలిగియున్నను పాదభూషణములు ధరించి రంగప్రవేశము చేసియున్న "నటిని" వెంటనే సభామధ్యంబున విసర్జించవలయును.

## నాట్యోత్పత్తి

శ్లో॥ ఋగ్యజుస్సామవేదేభ్యోవేదాచ్చాఽధర్వణాత్క్రమాత్ ।
వాద్యంచాభినయంగీతరసాన్‌సంగృహ్యపద్మభూః ॥
వ్యరీరచచ్ఛాస్త్రమిదం ధర్మకామార్ధశిద్దిదమ్ ।
అపిబ్రహ్మపరానందాదిదమప్యధికం ధృవమ్ ॥
నకించిత్ దృశ్యతేలోకేదృశ్యం శ్రావ్యమతఃపరం ॥

తా॥ ఆదికాలమున బ్రహ్మదేవుడు ఋగ్వేదమునుండి వాద్యమును యజుర్వేదమునుండి అభినయమును, సామవేదమునుండి గానమును, అధర్వణవేదమునుండి రసమును గ్రహించి నాట్యశాస్త్రమును రచించిరి. వేదసారమగు ఈ నాట్యశాస్త్రము ధర్మార్ధ కామమోక్షముల నొసంగునదియేగాక దుఃఖ అర్తి శోక నిర్వేద ఖేదాదులను పోగొట్టి ఆనందమొసంగును. బ్రహ్మపరానందాధికమైనదిగూడ యగును. లోకమునకు దృశ్య - శ్రవ్యములు నాట్యముకన్న వేఱులేవని చెప్పవచ్చును,

## ఊరూకంచుకము

శ్లో॥ అహోమార్గస్యనృత్యస్యమధ్యే దృష్ట్వోర్ధ్వతాండవమ్ ।
కాళిలజ్జాన్వితాజాతాతస్యాంగీర్వాణసంసది ॥
స్త్రీభిః కధమిదం నాట్యంకర్తుం సంసదిశక్యతే ।
ఇది సంచింత్యభరతః కూర్పాసంపంచదాఽకరోత్ ॥
జఘనాంతం చోరుమధ్యం జాన్వంతం మధ్యజానుకమ్ ।
అగుల్ఫాత్ పురోవస్త్రం కింకిణీజాల సంయుతమ్ ॥
వట్టుసూత్రేణ సంబద్ధ్వాధార్యంస్త్రీభిశ్చసంసది ॥

తా॥ శివపార్వతులిద్దరు దేవతల సభయందు నాట్యమొనర్చు సమయమున శివుడు మార్గనృత్యమగు ఊర్ధ్వతాండవము (ఒకకాలు పైకెత్తి)

చేయగా పార్వతి చూచి సిగ్గుపడినది. అప్పుడు భరతముని స్త్రీలు సభల యందు మార్గనృత్యమగు తాండవాది భేదములనాడుటకు ఎట్లు వీలుకలుగు నని నాలోచించి స్త్రీలుకూడా తాండవములాడుటకు వీలుగ "కూర్పాసము" ను (ఊరుకంచుకము) అయిదు విధములుగా నిర్ణయించినారు. ఒకటి జఘనాంతము (సెడ్డి). రెండు ఊరుమధ్యము (సగము తొడలవరకు చిన్నలాగు), మూడు జాన్వంతము (మోకాలుదాటి చివరకుండునట్టి లాగు). నాలుగు. మధ్యజానుకము మోకాలుదాటి పిక్కలవరకుండునట్టి లాగు ఐదు గుల్ఫ పర్యంతము (కాలి చీలమండలవరకు ఉండునట్టి లాగు) ముందుకు గుచ్చులు వచ్చునట్లుచేసి పట్టుదారముతో గజ్జలుకూర్చి కంచుకమును స్త్రీలు ధరించుటకు వీలుగా చేసెను.

శ్లో॥ అర్ధోరు జఘనాంతంచ పురుషాణాం ప్రశస్యతే ॥

తా॥ మోకాలిపైకి కలది ఒకటి, పిరుదల క్రిందికి కలదిఒకటి ఈ రెండులాగూలు పురుషులు ధరించి నాట్యమొనర్చుటకు యోగ్యమగును.

శ్లో॥ ఆదౌదేవగురుం పంచభూతాన్నత్వోరుకంచుకం ॥
నానాచిత్రపటైః క్లుప్తంధారయేన్నాట్యకర్మణి ॥

తా॥ నాట్యమునకు మొదలు అభీష్టదైవముకు నాట్యవిద్యా గురువును పంచభూతములను నమస్కరించి అనేకములగు రంగుగుడ్డలతో తయారు చేయబడిన "కంచుకము"ను ధరింపవలయును.

## ద్వాదశహస్త ప్రాణ లక్షణ వినియోగములు ;

శ్లో॥ ప్రసారణం కుంచితశ్చరేచితం పుంఖితం తధా ।
అపవేష్టితకంచాపి, ప్రేరితోద్వేష్టితేతధా ॥
వ్యావృతః పరివృత్తశ్చ, సంకేతస్తదనంతరమ్ ।
చిహ్నంపదార్థటీకేతి. ప్రాణాద్వాదశహస్తః ॥

తా॥ ప్రసారము, కుంచితము, రేచితము, పుంఖితము, అపవేష్టితము ప్రేరితము, ఉద్వేష్టితము, వ్యావృత్తము, పరివృత్తము, సంకేతము, చిహ్నము, పదార్థటీక యని హస్తప్రాణములు పన్నెండు విధములుగా చెప్పబడుచున్నవి.

1. ప్రసారణహస్త ప్రాణలక్షణము

ప్రేళ్ళను చాచుట "ప్రసారణ" హస్తమగును.

2. కుంచితహస్త ప్రాణలక్షణము

ప్రేళ్ళను ముడుచుట "కుంచిత" హస్త ప్రాణమగును.

3. రేచితహస్త ప్రాణలక్షణము

ప్రేళ్ళను కదుల్చుట "రేచిత" హస్త ప్రాణమగును.

4. పుంఖితహస్త ప్రాణలక్షణము

పతాకాది హస్తములయందు ప్రేళ్ళు ముందుకు వచ్చుట, కదిలించుట. చాచుట "పుంఖిత" హస్త ప్రాణమగును.

5. అపవేష్టితహస్త ప్రాణలక్షణము

ప్రేళ్ళను క్రిందుగా చాచుట "అపవేష్టిత" హస్త ప్రాణమగును.

6. ప్రేరితహస్త ప్రాణలక్షణము

ప్రేళ్ళను వెనుక భాగమునకు ముడుచుట, కదలించుట, చాచుట "ప్రేరిత" హస్త ప్రాణమగుచున్నది.

7. ఉద్వేష్టిత హస్త ప్రాణలక్షణము

నాట్యసమయమున చేతులు పైకెత్తుట "ఉద్వేష్టిత" హస్త ప్రాణమగును.

## 8. వ్యావృత్తహస్త ప్రాణలక్షణము

పార్శ్వభాగములందు పైకెత్తబడిన చేతులు "వ్యావృత్త" హస్త ప్రాణమగును.

## 9. పరివృత్తహస్త లక్షణము

నాట్యమందు పార్శ్వముఁ నుండి ముందుభాగమునకు చేతులుతెచ్చుట "పరివృత్త" హస్త ప్రాణమగును.

## 10. చిహ్నహస్త ప్రాణలక్షణము

నాట్యసమయమందు ప్రత్యక్ష పరోక్ష వస్తువులయొక్క స్థావర జంగమత్వములను తెల్పు చిహ్నములు అష్టవిధములుగా నున్నవి.

1. వాని ఆకారములు చూపుట
2. ముఖములను చూపుట
3. అవియుండు స్థలములను చూపుట
4. వాని లెక్కములను చూపుట
5. ఆయుధములను తెల్పుట
6. వానియందుగల ప్రయోజనములను తెల్పుట
7. అవివ్యాపించిన వానిని తెల్పుట
8. వాని చేష్టలు తెల్పుట. ఈ యెనిమిది విధములుగల హస్త ప్రాణము చిహ్నమగును.

## 11. పదార్థటీక హస్త ప్రాణలక్షణము

చెప్పబడిన పదములయొక్క అర్థమిదియని నిశ్చయపరచునట్టిది "పదార్థటీక" హస్తప్రాణమగును.

## 12. సంకేతహస్త ప్రాణలక్షణము

మాటలతోగాక ఊహలతో తెలియదగు గుర్తులను చేయుట "సంకేత" హస్త ప్రాణమగును.

## షోడశ బాహుభేద లక్షణములు వినియోగములు :

ఊర్ధ్వగతము, పృష్టగతము. తిర్యగ్గతము, స్వస్తికము, మండలము. అపవిద్ధము, అంచితము, అవిద్ధము. కుంచితము, అధోముఖము, సరళము, ఆందోళితము, నమ్రము, ఉద్వేష్టితము, ఉత్సారితము. ప్రసారితము, యని బాహుభేదములు పదియారు విధములుగా చెప్పిరి.

1. ఊర్ధ్వగతము :- శిరస్సుకంటే పైకిపోవు చెయ్యి.
2. పృష్టగతము ;- వెనుకకుపోవు చెయ్యియందురు.
3. తిర్యగ్గతము :- ప్రక్కకుపోవు చెయ్యిగలవి.
4. స్వస్తికము ;- ఇతర బాహులతో స్వస్తికముగా చేసునది.
5. మండలము ;- ఇరుప్రక్కలకుత్రిప్పు బాగులుగలది.
6. అవిద్ధము :- బాహువుల నడుమ ఆడించునది.
7. కుంచితము :- మోచేతిని బిగబట్టి మణచునది.
8. అధోముఖము ;- నేలకు దించునట్టి చెయ్యి.
9. సరళము : పైకి క్రిందకు సాగినచెయ్యి.
10. ఆందోళితము :- తూగిపోవుచున్న బాహువు.
11. నమ్రము :- కొంచెము వంకరయైన బాహువు.
12. ఉద్వేష్టితము :- అర్ధముగా మణికట్టుమీదుగాపోవు చెయ్యి.
13. ఉత్సారితము :- తన పక్కనుండి వేరొక పార్శ్వమునకుబోవు చెయ్యి.
14. ప్రసారితము :- చక్కగా యెదురుగా చాచునది.
15. అంచితము : వక్షమునుండి శిరస్సుదాకాపోయి, మరల ఎదరు వచ్చునది.
16. అపవిద్ధము : వక్షమునుండి వెడల మండలముగా సాగునది.

## పంచవిధ మాలాలంకారములు

వేష్టిమ, వితత. సంఘాత్య, గ్రంధిమ, ప్రాలంబితములు యని ఐదు విధములు,

## శిరోభూషణములు - పురుష భూషణములు

చూడామణి :- (శిరోమధ్యమున నుంచుదురు)
మకుటము, లేదా ముకుటము :- (లలాటోర్ధ్వ భాగమున ధరించబడును.
కర్ణభూషణములు :- (చెవి) కుండలము (చెవిక్రింద ధరింపబడును)
మోచకము :- (కర్ణశష్కులీమధ్యచ్ఛిద్రమందు)
కీలము :- [ఊర్ధ్వచిద్రమందు)

## కంఠాభరణములు

ముక్తావళి :- (ముత్యాలదండ)
హార్షకము :- (సర్పాధిరూపకముగ నుండునది)
సూత్రము :- (బంగారు గొలుసు ఎక్కువ పేటలు గలది)

## అంగుళీభూషణములు

వేతిక :- సూక్ష్మకటక రూపమైనది (మామూలు ఉంగరము)
అంగుళీముద్ర :- (పక్షి-పద్మాద్యాకారములు కలిగినది)

## బాహునాళీ భూషణములు

హస్తలి :- వలయములు (కంకణములు) మణిబంధ (మణికట్టు) విభూషణములు.
రుచకము :- (ఇది నేటి రిష్టువాచీ వంటిది కావచ్చును)

చూలిక :- (ఇది నికుంచికమను పేర ప్రసిద్ధము) ఇది రుచికముపైని అనగా చేతి పైభాగమున ధరించబడును.

కూర్పరోపరిభూషణములు

కే యూ ర ము :- అనగా కూర్పరమునకు (మోచేతికి) పైభాగమున ధరించుదురు.

అంగదము :- కేయూరము పైభాగమున ధరింతురు.

వ క్షో వి భూ ష ణ ము లు

త్రిసరము :- (మూడుపేటల ముత్యాలదండ) హారము,

అ ం గ వి భూ ష ణ ము లు

వ్యాలంబ మౌక్తికహారము (వ్రేలాడుచున్న ముత్యాలదండ) (మాల-పూలదండ)

క టి వి భూ ష ణ ము లు

తలకము :- బొడ్డునకు క్రిందిభాగమున ధరించబడును)

సూత్రకము :- తలకమునకు క్రిందుగ ధరింపబడును. పురుషుల కవుసరమైన భూషణవిధులు దేవతలు పార్థివులుకూడా అనుసరించవలెను.

స్త్రీ ల భూ ష ణ ము లు

శిరోభూషణములు —

శిఖాపాశము :- శిఖావ్యాలము లేక శిఖాజాలము. అనగా సర్పాకృతిగల నాగరము.

పిండీపత్రము :- పద్మమువలెనుండు నాగరము.

చూడామణి :- శిరోమధ్యంబున దరించునది,

మకరిక :- మకరిపత్రము,

ముక్తాజాలము :- లలాటమందు వ్రేలాడకట్టబడు ముత్యాలజూలు.

గవాక్షము :- ముత్యముతో తోరణరూపముగలేక జాలికారూపముగ నుండును.

శీర్షజాలకము :- శిఖపత్రము (మయూర పింఛాకారమైన విచిత్రవర్ణ మణిరచితావతంసము.)

వేణీ భూషణములు

కండకము :- శిఖపత్రము (ఖడ్గపత్రము)

దొరకము :- (జజుగంటలవంటి ఆభరణము)

లలాట భూషణములు

నానావిధ శిల్ప ప్రయోతమగు తిలకము ;- (ఇది కనుబొమ్మల మధ్య భాగమునకు పైగా కుసుమగుచ్ఛాకృతిగా ఉండవలయును.)

కర్ణ భూషణములు

కర్ణిక :- (దుద్దులు) కర్ణవలయము, పత్రకర్ణిక. కుండలము.

కర్ణముద్ర :- కర్ణోత్కీలకము, నానారత్న విచిత్రములైన దంతపత్రములు, కర్ణపూర్ణం,

గండ భూషణములు

తిలకములు :— పత్రలేఖను నేత్రములకు అంజనము. (కాటుక) పెట్టుకొనవలయును. అధరమునకు రంజనము (ఎరుపురంగు) కర్తవ్యము (తాంబూలాదులచే కల్గునది) అస్మరాగద్యోతితములైన అధరము పల్లవ ప్రభలను వెదజల్లుచుండును. ముందరి నాలుగు దంతములకు రంగువేయ వచ్చును. లేదా యవి తెల్లగానే యుండవచ్చును. రాగాంతర కల్పనము దంతములకు అధికశోభను చేకూర్చును. ముక్తావిభాశితములైన దంతములుగాని పద్మపల్లములవలే శోభించు సురక్తములైన దంతములుగాని

ముగ్ధలగు సుందరులకు శోభావహములు. సవిభ్రమాపాంగ నిరీక్షణములు వారికి విలాసావహములు.

కంఠ విభూషణములు

ముక్తావళి :- వ్యాళ (హారము), పంక్తి, రత్నమాలిక, మంజరి, రత్నావళి, సూత్రకము, హారములు, ద్విసరములు (రెండుపేటలు గలది) లేదా త్రిసరములు. లేదా చతుస్సరములుగా ఉండును. (శృంఖలికకూడా కంఠ భూషణమే యగును.)

బాహుమూల విభూషణములు

అంగదము :- వలయము

వక్షో భూషణములు

త్రివణి :- నానాశిల్పకృతములైన హారములు

స్తన విభూషణములు

మణిజాలబద్ధమైన ఆభరణము.

బాహునాళీ విభూషణము

కర్పూరకము :- ఉచ్చితికము

అంగుళీ విభూషణములు

కలాపి, కటకము. శంఖము, హస్తపత్రికము, పూరకము, ముద్ర, అంగుళీయకము.

శ్రోణీ విభూషణములు

కాంచి. మేఖల, రశన, కలాపము, ముక్తాజాలాఢ్యమగు తలకము.
కాంచి :- (ఏకయష్టిక) ఒకపేట గలది.
మేఖల :- (అష్టయష్టిక) ఎనిమిది పేటలు గలది.

రశన :- (షోడశయష్టిక) పదియారు పేటలు గలది.
కలాపము :- (పంచవింశయష్టిక) ఇరువదియైదు పేటలుగలది.
దేవ :- పార్థివస్త్రీల ముక్తాహారములు. ముప్పది రెండు. లేదా అరువదినాలుగు. లేదా నూటయెనిమిది పేటలు కలిగియుండును.

### గుల్ఫోపరి (మడమపై) విభూషణములు

నూపురము :- అందెలు మొదలైనవి.
కింకిణీకము :- చిరుగజ్జెలు కలది.
ఘంటిక : పెద్దగజ్జెలు గలది.
ధ్వనించెడి కటకములు :- (గులకరాళ్ళతో గూడియున్న గుల్లకంకణములు) రత్నజాలము.

### పాద విభూషణములు

జంఘలయందు పాదపత్రములు, అంగుళులయందు అంగుళీకములు (మట్టెలు), అంగుష్టమందు తిలకముండవలయును. మరియు చిత్రరచనానివేదితమైన అలక్తకరాగము (పారాణియెరుపు) అశోక పల్లవఛాయమై పాదములకు సహజ సంపదను చేకూర్చకలదు.

### చతుర్విధ ఆభరణ విధులు

ఆవేద్య, బంధనీయ, ప్రక్షేప్య, ఆరోప్య యని నాలుగు రకముల ఆభరణ విధులు.
ఆవేద్యములు :- కుండలాది శ్రవణ భూషణములు.
బంధనీయములు :- శ్రోణీసూత్ర (వడ్డాణము) అంగదములు, బంధనీయములు.
ఆరోప్యములు :- వివిధములైన హేమసూత్రాది ఆభరణములు.
ప్రక్షేప్యములు :- నూపుర వస్త్రాభరణములు.

## దివ్యాంగన భూషణ విధులు

దివ్యాంగనలకు (సురాంగన) వైఢూర్య ముక్తాభరణములను కూర్చవలయును. వారి పరిచ్ఛేదము శుకపింఛతుల్యమైన వస్త్రములతో కూడియుండును. దివ్యవానర స్త్రీలకు పుష్యరాగ మణిభూషణములు లేదా ఒక్కొక్కప్పుడు వైఢూర్యభూషణములు నీలపరిచ్ఛదములు వారికి అర్హములు. శృంగారిణులగు దివ్యాంగనవేషములు పైనవివరించిన విధముగా నుండును. వాని అవస్థాంతరములందు (అనగా శృంగారేతరములైన అవస్థలందు) వారి వేషములు శుద్ధముగా (తెల్లగ) ఉండవలయును.

## విద్యాధర స్త్రీలకు భూషణములు

ముక్తాభూషితమగు శిఖాబంధనము ను రచింపవలయును. వారి వేష పరిచ్ఛదము శుద్ధముగ నుండవలయును. యక్షిణులను, అప్సరసలును రత్నభూషణోపేతులు కావలయును. వారి వేషములును సమానము చే గాని యక్షిణులు కేవలము శిఖలు ధరించవలెను.

## నాగస్త్రీల భూషణములు

దివ్యస్త్రీలకువలెనే యుండవలయును. కాని ముక్తామణీల తాత్త్రాయ ములగు ఫణములు (పడగలు) ఉండవలయును.

## మునికన్యకల భూషణములు

వీరి శిరస్సులు ఏకవేణీధరములు గావలయును. వీరికి భూషణములు లేవు. వేషములు వనోచితముగ నుండవలయును.

## శిద్ధాంగన భూషణములు

ముక్తా మరకత ప్రాయమైన ఆలంకారమును పీతవస్త్ర పరిచ్ఛదము లును (పరిచ్ఛదము-మేలిముసుగు) సముచితములుగా నుండును.

## గంధర్వస్త్రీల భూషణములు

పద్మరాగ మణిమయప్రాయములైన విభూషణములు వీణాహస్తము కౌంసుభ (కనకాంబరపురంగు) వస్త్రములును రమ్యముగా నుండును.

## నాట్యోపకరణములు

ప్రకృతుల ననుసరించి నాట్యమునకు సంబంధించిన బహుప్రకారములగు ఉపకరణములను ప్రయోగములయందు ఉపయోగించవలయును. చరాచర సమన్వితమైన ఈ లోకమందలి శిల్పులు కర్మలు మున్నగునవి అన్నియును నాట్యమందున ఉపకరణములే యగును. నాట్యోపకరణములుగ ఆశ్రయింపబడు శిల్పకర్మలు అనంతములు. కావున ఏది ఎవని దేశమునకు సంబంధించియుండునో దానినే వానికి కల్పించవలయును. నాట్యోపకరణముల విషయమున ప్రయోక్తులకింతకంటె మార్గాంతరములేదు. కర్మ-శిల్పములను తొలుతగా సృష్టించినవాడే వాని, నిర్మాణ-ప్రమాణ లక్షణ విధులను వివరించియుండును. (కావున వానినే ఇందును అనుసరించవలెను.) మహాత్మునిచే (విశ్వకర్మ) కాష్ఠ-యంత్ర-భూయిష్ఠముగ చేయబడిన శిల్పసృష్టి నాట్యమందు ప్రయుక్తమగుట సమ్మతముగాదు. గురుత్వము (బరువు) వలన అది ఖేదావహమగును, ఈ జీవలోకమందలి నానా లక్షణ లక్షితములగు వస్తువుల ఆకృతి విశేషమే నాట్యమందు ఉపకరణములుగాగలదు. ప్రాసాద-గృహ-యాన-నానాప్రహరణములను యథోక్త లక్షణముగా నాట్యమందు చూపించుట శక్యముగాదు. లోకధర్మి ఒక విధముగ నుండును. నాట్యధర్మి ఇంకొకవిధముగ నుండును. లోకధర్మి స్వభావసిద్ధము. నాట్యధర్మి విభవనాత్మకము (భావనామాత్ర సిద్ధము) ఇనుముతోగాని, గుల్లగాగాక ఘట్టిగానుండునట్లుగాని నాట్యోపకరణములు నిర్మింపరాదు. అట్లు నిర్మింపబడినచో బరువువల్ల ఖేదము జనించును. కాష్ఠ-చర్మ-వస్త్ర-జతు (లక్క)-వేణుదళము (వెదురుగొట్టము) లతో కదుల్చుటకు వీలుగానుండునట్లు నాట్యోపకరణములు తయారుచేయవలయును.

చర్మ-వర్మ-శైల-ప్రాసాద-హయ-దేవతాగృహ - వారణయాన - విమాన గృహముల ఆకృతులను ముందుగ వేణుదళములతో (వెదురుబద్ద) రూపు పొడగట్లునట్లుగా నిర్మించి. వానిని మంచిరంగులుగల వస్త్రములతో కప్పి ప్రకృతి సారూప్యమును కల్పించవలయును. ఒకవేళ వస్త్రములు దొరకనిచో వానికి బదులుగా "శ్లక్షము"లైన తాళీయపత్రము (తాళపత్రము) లనుగాని కిలింజమను (భూర్జవేణూదళాదులు)గాని ఉపయోగించవలయును.

ఇంక ఆయుధములను తృణ-వేరూదళములతోడను తదితర నానా రూపములను జతు-భేండ (జీలుగబెండు) ములతో నిర్మించవలయును. ప్రతి (కృత్రిమ)—పాద, ప్రతిశిరః-ప్రతిహస్త-ప్రతిత్వచములను తృణ, కిలింజ, భేండములచే నిర్మించి సారూప్యమును కలిగించవలయును. మరియు సారూప్యము కల్గునట్లుగ వివిధరూపములను మట్టితోకూడ నిర్మింపవచ్చును. భేండ-వస్త్ర-మధూచ్ఛిష్ట (మైనము)-లాక్షి - అభ్రదళము (అభ్రకపురేకు) (మైకా) (ఇది ఇప్పటి డాగురేకుయై యుండవచ్చును.) లలో అతసీ (అవసె) శణ (జనుము)-బిల్వము (మారేడు) లతోను. ఏనుగులను (పర్వతములని పాఠాంతరము) నిర్మించవలయును. నానాకుసుమ జాతులును, వివిధ ఫలములను, భేండ-వస్త్ర-మధూచ్ఛిష్ట-లాక్షా నిర్మితములు కావలయును. భేండ-వస్త్ర-మధూచ్ఛిష్టములలో, తామ్రపత్రము (రాగిరేకు) లతో నీలవర్ణోపేతములు లేదా రంజితములుయైన అభ్రపత్రములతో మణులను తయారుచేయవలయును. అసలు వీనికి ఉపాశ్రయములుగ (ఆధారములుగ) మెరసెడి తగరపురేకులే (ముత్యపురేకులై యుండును.) ఉండవలయును.

పూర్వము వివరింపబడిన వివిధములైన దివ్యమకుటములు అభ్రపత్రోజ్వలములుగా నిర్మింపబడవలయును. మరియు మణివ్యాలోపసోభితములు కావలయును. వానిని నిర్మించుటయందు శాస్త్రప్రభవమైన కర్మవిధానము చెప్పబడలేదు. కాని యివి ఊహాపోహ ప్రయోజితములై ఆచార్య

బుద్ధిననుసరించి నిర్మితములు కావలయును. భవిష్యత్కాలమందలి మనుష్యులు అల్పబలులగుదురుగాన వారికి ఉచితమగునట్లుగా, ఈ నాట్యోపకరణ నిర్మాణ ప్రక్రియలను చేయవలయును. మనుష్యులు కాంచనమయములైన ఆభరణాదులను కల్పించుకొనలేరు. సువర్ణ-మణినిర్మితములుకారాదు. యుద్ధ-నియుద్ధ-నృత్త-దృష్టి-వ్యాపారకర్మలందు ఆభరణములు బరువుచే అలసినవానికి స్వేద, మూర్ఛలు కలుగును. స్వేద-మూర్ఛ-క్లమార్తుని పరియోగము తప్పక వినాశమొందును, అంతియేగాదు, వ్యాయత (అతిశయ) చేష్టలవలన ప్రాణాపాయమును కలుగగలదు. కనుక తామ్రపత్ర-రంజితాభ్రపత్ర-భేండ-మధూచ్ఛిష్టములతోనే ఆభరణములను తయారుచేయవలయును, ఇట్లు లోక స్వభావములననుసరించి, స్వబుద్ధివిభవములతో, బుధుడు (నాట్యాచార్యుడు) నాట్యోపకరణములను దక్కగా కూర్చవలెను.

ఆయుధములచే భేదించుటగాని (నరకుటగాని) ఛేదించుటగాని (చీల్చుటగాని) కొట్టుటగాని రంగమునందు చేయరాదు. వానిని సంజ్ఞామాత్రముగనే ప్రయోగించవలయును. యోగశిక్షచే, విద్యచే, (సుధామగుడు చెప్పిన హస్తలాఘవములచే) మాయచే (చక్షుర్బంధాదికము - కనికట్టు-మెస్మరిజం) నిరంతర మధ్యంబున శస్త్రప్రయోగమును యదార్థముగ చూపవచ్చును. ఇదిగాక ఇంకను సమయానుకూలముగ లోకమునుండి గ్రహింపవచ్చును.

## లోకధర్మి, నాట్యధర్మి లక్షణములు

### లోకధర్మి లక్షణము

శ్లో॥ శ్వభావోగతం శుద్ధంత్వవికృతం తథా ।
లోకవార్తా క్రియోపేతమంగలీలా వివర్జితమ్ ॥
స్వభావభినయోపేతం నానాస్త్రీ పురుషాశ్రయమ్ ।
యదీదృశ్యం భవేన్నాట్యం లోకధర్మీతుసాస్మృతా ॥

తా॥ సహజముగ జనిస్తించునట్టి స్థాయి - వ్యభిచార్యాతి భావములతో గూడినదియును, కవిబుద్ధికృతమైన రంజనావైచిత్రిలేనిదై శుద్ధముగనున్నది యును లోకప్రసిద్ధములైన వ్యవహారములతో కూడినదియును. అంగవర్త నాదులు లేనిదియును. స్వభావాభినయముతో కూడినదియును, నానా స్త్రీపురు షాశ్రయమును అగు నాట్యము "లోకదర్మి"కి చెందదగును.

## నాట్యధర్మి లక్షణము

శ్లో॥ అతివాక్య క్రియోపేతమతిసత్త్వాతిభావకమ్ ।
లీలాంగహారాభినయం నాట్యలక్షణ లక్షితమ్ ॥
స్వరాలంకార సంయుక్తమస్వస్థ పురుషాశ్రయమ్ ।
యదీదృశంభవేన్నాట్యం నాట్యధర్మీతుసాస్మృతా ॥

తా॥ ఇతిహాసాదులయందుండు అర్థమును అతిక్రమించిన కవి బుద్ధి కృతరంజనావైచిత్రి అనగా (కల్పనలు) కలదియును, సహజములగు ప్రకృతిని చిత్తవృత్తిని అతిక్రమించిన కవి కల్పితములగు ప్రకృతి-చిత్త వృత్తి-విశేషములతో కూడినదియును, శోభాప్రధానములును, మనోహర ములును యగు అభినయములు కలదియును. నాట్యలక్షణములతో కూడిన దియును, అస్వస్థ పురుషులతో కూడినదియును అగు నాట్యము నాట్య ధర్మికి చెందదగును.

## నాట్యధర్మి ఉదాహరణలు

కేవలము అభినయముచే సూచింపదగిన వానిని మూర్తిమంతము గను, అభిలాషను రేకెత్తించునదిగను ప్రదర్శించుట "నాట్యధర్మి"యగును. సమీపమందు మాట్లాడుచున్నను. వినపడనట్లుండుట. (అనగా జనాంతిక అపవారితకముల విషయము) అసలు చెప్పబడనిదానిని వినినట్లు కన్పట్టుట (ఆకాశభాషిత విషయము) నాట్యదర్మి యగును.

పర్వతములు, వాహనములు, విమానములు, [illegible] కవచము, ఆయుధము, ధ్వజము మున్నగువాటిని మూర్తిమంతములుగా (రూపములను తాల్చినట్లుగా) ప్రయోగించుట నాట్యదర్మి యగును,

నేర్పు కలిగియుండుటచేగాని మరియొక నటుడు లేకుండుటచేగాని ఒక భూమికను నిర్వహించి వెంటనే మరియొక భూమికను ధరించుట నాట్యదర్మియగును. అగమ్యమైన స్త్రీ భూమికను నిర్వహించి. వెంటనే గమ్యమగు స్త్రీ భూమికను నిర్వహించుట లేదా గమ్యమగు స్త్రీ భూమికను నిర్వహించి వెంటనే అగమ్యమగు స్త్రీ భూమికను నిర్వహించుట నాట్యదర్మి యగును.

మామూలుగా నడచివెళ్ళుటకు బదులు లలితములైన అంగవిన్యాసములతో, చతురస్రాది పరిమితగతులతో నృత్తమునందువలె నడచుట నాట్యదర్మి.

సుఖ-దుఃఖ-రూపమగు లోకస్వభావము అంగాభినయ సంయుక్తముగా (అనగా అతోద్య-హస్త-విన్యాసాదులతో కూడినదిగా) ప్రదర్శింపబడుట నాట్యదర్మి యగును.

దివ్యులు మనుష్యుల ఆహ్లాదము కొరకు ఇతిహాసములనుండియు, వేదములనుండియు, బ్రహ్మ ఏ అర్థములను ఏర్చికూర్చెనో అవి నాట్యదర్మి యగును.

రంగపీఠగతమగు కక్ష్యావిధానమంతయును "నాట్యదర్మి" యేయగును.

నాట్యమెల్లప్పుడును నాట్యదర్మి సహితముగనే ప్రయుక్తము గావలయును. గీత ఆతోద్యాద్యాదులును, అభినయనములును లేనిచో సామాజికులకు ప్రీతి జనించదు. నాట్యగతియును. అంగాలంకారనిష్ఠమును, నాట్యదర్మిరూపమును అగు వాక్కు-అర్థమును, అపేక్షించియే ప్రయుక్తమగును. అట్లే

అభినయముకూడ అర్థానుసారిత్తై యుండును. అందుచే సహజార్థములతో సంవదించియుండు నాట్యధర్మికి సమస్తార్థములకును సంబంధించిన లోక స్వభావమే మూలభూతము.

## నృ త్య ల క్ష ణ ము

శ్లో॥ ఇదానీం ప్రకృతం నృత్యం యథాలక్షణముచ్యతే ।
భవేత్భావాశ్రయంనృత్యం పదార్థాభినయాత్మకమ్ ॥

తా॥ ప్రకృతమైన నృత్యలక్షణము. భావములనాశ్రయించినది, పదార్థముల నభినయించు స్వరూపముగలది "నృత్య"మగును. తాళలయ ననుసరించి చేయునది నృత్యము.

## నృ త్త ల క్ష ణ ము

శ్లో॥ గీతవాద్యాది మిళితం లయమాత్రాసమాశ్రయం ।
అంగవిక్షేపణం నృత్తంభవేదభినయోజ్ఝితమ్ ॥

తా॥ పాట, వాద్యములతోకలసి లయనుమాత్రము ఆశ్రయించి అభినయములేక అంగముల నాడించుట "నృత్త"మగును.

## నా ట్య ల క్ష ణ ము

తా॥ సర్వభావానుకీర్తనము, సప్తద్వీపానుకరణము. హితోపదేశము, విశ్రాంతిజనకము. వినోదజనకము. సుఖ దుఃఖ సమన్వితమైన ఈ లోక స్వభావము అంగాద్యభినయోపేతమగుచు "నాట్య" మనబడును.

## లా స్య ల క్ష ణ ము

శ్లో॥ లాస్యతాండవభేదేన ద్వయమేతత్ద్వివిధాపునః ।
సుకుమారంతయోరాద్యంభవేదపరముద్ధతమ్ ॥

తా॥ ఈ రెండును (నృత్త-నృత్య) లాస్యమని. తాండవమనిమరల రెండు విధములగును. అందు మొదటిది లాస్యము, సుకుమారముగ నుండును, రెండవది తాండవము ఉద్ధతమైనది.

శ్లో॥ "భావఃస్త్రీపుంసయోర్లాసః తదర్ధః (ర్థం?) తత్రసాధువా ।
లాస్యంమనిశిజోల్లాసహేతు మృద్వంగహారవత్ ॥
దేవ్యైదేవోపదిష్టత్వాత్ ప్రాయస్త్రీభిః ప్రయుజ్యతే ॥

తా॥ స్త్రీ పురుషుల పరస్పర విషయమైన భావము, "లాసము" దాని కొరకైనది. లేదా దానికి తగినదియను అర్ధముగలది "లాస్యము" ఇది కామోల్లాసమునకు హేతువులగు మృదువైన అంగవిక్షేపములు గలది. దేవికి శివుడు ఉపదేశించినది గనుక ప్రాయికముగా దీనిని స్త్రీలే ప్రయోగింతురు.

తాండవ లక్షణము (ఉద్ధతము)

శ్లో॥ ఉద్ధతంతుమహేశస్యశాసనాత్తండునోదితమ్ ।
భరతాయతతఃఖ్యాతంలోకేతాండవ సంజ్ఞయా ॥

తా॥ ఉద్టతము మహేశ్వరుని ఆజ్ఞచే తండువు భరతమునికి చెప్పినది గావున లోకమున "తాండవ" మను పేర వెలసినది.

శ్లో॥ ప్రాయోనిర్వర్త్యతేపుంభిరంగహారైస్తదుద్ధతైః ॥
ప్రయోగస్తూచ్యతే తజ్ఞైః తన్యోత్సాహాదిగోచరః ॥

తా॥ అదిప్రాయికముగ ఉద్ధతమైన అంగాహారములతో పురుషులు నెరవేర్తురు. ఉత్సాహము మొదలగు భావములందు దానిని ప్రయోగింపతగు నని చెప్పుదురు.

## చతుర్విధాభినయనములు

శ్లో॥ ఆంఘికోవాచిక స్తద్వ దాహార్యః సాత్వికోఽపరః ।
చతుర్ధాభినః తత్రఆంగికోంగై ర్ధర్మితోమతః ॥
వాచావిరచితః కావ్యనాటకాది స్తువాచకః ।
ఆహార్యోహారకేయూర కిరీటాది విభూషణమ్ ।
సాత్వికః సాత్త్వికై ర్భావైః బావుకేనవిభావితః ॥

అంగికము, వాచికము, ఆహార్యము. సాత్వికములని అభినయములు నాలుగు విధములు ;

ఆంగికమనగా:- నటులయొక్క అంగవిన్యాసముచేత ప్రదర్శింపబడునది.

వాచికమనగా ;- కవి విరచితమగు కావ్యశైలిని నోటితో ఉచ్చరించుచు నటించుట.

అహార్యమనగా :- నటులు ధరించు హారములు, కేయూరములు (భుజ కీర్తులు) ధనురాది ఆయుధములు (వేషమని యర్ధము) పాత్రోచిత వేషధారణము,

సాత్యికమనగా :- నటుడు భావకుడై లోకానుభవముచేత, స్తంభ - ప్రళయ-రోమాంచాది, సాత్వీక భావములు చూపించుట.

## చతుర్విధ పృష్టోదర భేద లక్షణములు

శ్లో॥ పృష్టంతు జఠరో క్తాభిః వివ ర్తతే ।
అతోనపృధగ్వాచ్యం జఠరం తూచ్యతేఽధునా ॥

తా॥ జఠరలక్షణమందు చెప్పబడిన వర్తనలచేత పృష్టముకూడా వివర్తింపబడును, (త్రిప్పబడును.) అందుచేత పృష్టమునకు వేరుగ లక్షణము చెప్పబడుటలేదు. (అనగా జఠర లక్షణములే పృష్టలక్షణములని యర్ధము.)

జఠరలక్షణ వినియోగములు (చతుర్విధములు)

శ్లో॥ క్షామం ఖల్లంతథా పూర్ణం త్రేధా జఠరమిష్యతే ॥

తా॥ క్షామము, ఖల్లము, పూర్ణము, రిక్తపూర్ణ యని నాలుగు విధములు :

1. క్షామజఠర లక్షణ వినియోగములు (కృశించినది)

"క్షామం స్యానమనాత్"

ఉదరం (జఠరము) వంచుటవలన క్షామజఠర మగును.

.... .... జృంభా"

హాస్యనిస్వాసరోదనే"

ఆవలించుటయందు, నవ్వుటయందు, ముక్కునుండిగాలి, విడుచుట యందును, ఏడ్చుటయందును క్షామజఠరము వినియోగించును.

2. ఖల్ల జఠర లక్షణ వినియోగములు (పల్లము) (గుంట) గా నుండునది.

"నిమ్నం ఖల్లం" ........

పల్లముగనుండు జఠరము ఖల్ల మనబడును.

.... .... క్షుదార్తేస్యాత్"

"ఆతూరేశ్రమే కర్శితే"

"వేతాలభృంగిరిట్వాది జఠరాకారధారితత్"

తా॥ ఆకలిచే పీడింపబడినవానియందు, రోగపీడితునియందును, శ్రమ చేత కృశించినవానియందును వినియోగించును. మరియు ఈ ఖల్లజఠరము వేతాలుడు, భృంగి, రిటుడు మొదలగువారియొక్క (వీరు శివభక్తులు) జఠరములను పోలియుండును, (అనగా వారియొక్క పొట్టలు ఈ విధముగా నుండునని యర్థము.)

### 3. పూర్ణ జఠర లక్షణ వినియోగములు

పూర్ణం స్థూలం వ్యాధితేస్యాత్ ।
తుందిలేఽత్యసితే తథా ॥

తా॥ స్థూలముగా (లావుగ) నున్న జఠరము పూర్ణజఠరమగును. ఇది రోగగ్రస్థునియందును, పెద్దపొట్టయందు, అధికముగ భుజించినవాని యందు ఈ పూర్ణజఠరము వినియోగించును.

### 4. రిక్తపూర్ణ జఠర లక్షణ వినియోగములు
(మతాంతర జఠరము) (తగ్గు-హెచ్చు)

“అన్యేఽన్వర్థం రిక్తపూర్ణం స్వాసరోగేఽపరంజగుః ॥

తా॥ జఠరము రిక్తమైనప్పుడు పృష్టము పూర్ణమగును. ఇది శ్వాస రోగములు గలవానియొక్క జఠరమునం దుపయుక్తమగునని కొందరు ఈ లక్షణము చెప్పినారు.

## సప్తవిధ జానుకర్తల లక్షణ వినియోగములు

ఉన్నతము, వివృతము. నమ్రము, అర్ధకుంచితము. కుంచితము, సంహతము, సమము యని జానుకర్మలు సప్తవిధములు.

### 1. ఉన్నత జానులక్షణ వినియోగములు

స్తనముదాక జానువు యెత్తబడినది "ఉన్నతము" ఇది కొండలు యెక్కుట మొదలైన వానియందు, నృత్తమునందు వచ్చును.

### 2. వివృత జానువు లక్షణము-వినియోగము

చేరికలేక వేరుగానున్నది "వివృత్తము" ఇది గజారోహణమందు ప్రయుక్తము.

### 3. నమ్రజాను లక్షణ వినియోగములు

నేలకు సోకియుండిన జానువు "నమ్రము" యందురు. ఇది నమస్కారమునను, పడినప్పుడును వచ్చును.

### 4. అర్ధకుంచిత జానులక్షణ వినియోగములు

నితంబమును (పిరుదల) వంచుటచే "అర్ధకుంచిత" జానువగును. ఇది నృత్తమునందు వినియోగించును.

### 5, కుంచిత జానులక్షణ వినియోగములు

తొడ పిక్కలతో చేరిన "కుంచిత" జానువగును. ఇది మనుష్యులు కూర్చుండినపుడు వచ్చును.

### 6, సంహత జానులక్షణ వినియోగములు

మోకాళ్ళు రెండు కలసినవి "సంహతజాను" వగును. ఇధి స్త్రీల ఈర్ష్య-సిగ్గు మున్నగువానియందు ప్రయుక్తమగును.

### 7. సమజాను లక్షణము

సహజముగ నిలిచినది "సమజానువు." ఇది సమపాదమగు స్థానమున ప్రయోగింపదగును. ఇది సప్తజానువుల లక్షణ వినియోగములు.

### స్వీ యా ల క్ష ణ ము

శ్లో॥ సంపత్కాలే విపత్కాలేయానముంచతి వల్లభం ।
శిలార్జవగుణోపేతాసాస్వీయా పరికీర్తితా ।
ముగ్ధామధ్యాప్రగల్భేతిత్రేధాసాతునిగధ్యతే ॥

తా॥ సంపత్కాలమందును, విపత్కాలమందును, శీలము. ఆర్జవము మొదలగు సద్గుణములు కలిగి నాయకుని విడువకయున్నట్టి స్త్రీ

"స్వీయ' యని చెప్పబడును. ఇందు ముగ్ధ-మధ్య-ప్రగల్భయని ముత్తె రంగులు గలవు.

ము గ్ధ ల క్ష ణ ము

శ్లో॥ ముగ్ధానవవధూః కామరతౌవామామృదుః క్రుధి।
యతతే రతిచేష్టాసు గాఢలజ్జామనోహరా।
కృతాపరాధేదయితే వీక్షతేరుదతీ నతీ ॥

తా॥ ఏయువిదమన్మథ విహారమందు నూతన స్త్రీగాను, మన్మథ క్రీడయందు అస్వాధీనురాలుగాను. గాఢమైన లజ్జగలదిగాను. కోపకాలమందు స్తిమితగాను, నాయకు డపరాధియైనను రోదనము చేయుచు చూచుచుండునదిగాను, రతివ్యాపారము యత్నము చేయుచు హితాహితములను చెప్పకయుండునో యది ముగ్ధనాయిక యనదగును.

మ ధ్య ల క్ష ణ ము

శ్లో॥ సమానలజ్జామదనాప్రోద్యత్తారుర్యాశాలిని।
మధ్యాకామయతేకాంతం మోహాంతే సురతషమా ॥

తా॥ సమానములైన సిగ్గును, కామమును గలదియును, వృద్ధి పొందు యవ్వనము కలదియును, మోహవ్యాపార మధ్యమందు సురత యోగ్యతగలదియు నగుచు నాయకుని అపేక్షించు నాయిక "మధ్య" యనబడును.

ప్రగల్భ లక్షణము

శ్లో॥ సంపూర్ణ యవ్వనోన్మత్తాప్రగల్భారూఢమన్మధా.।
దయితాంగక వీనేవయతతే రతికేళిషు ॥

తా॥ నిండుయవ్వనముచే మంచిదిగాను. మన్మథ వ్యాపార పారంగతురాలుగాను ఉండునది ప్రగల్భ యనదగును.

## పరకీయ లక్షణము

శ్లో॥ పరానురాగ వ్యాపారగోపనే ఉత్తమానసా ।
పరకీయేతిసాప్రోక్తాభరతాగమవేదిభిః ।
సాచకన్యాపరోఢేతి ద్వివిధా పరికీర్తితా ॥

తా॥ పరపురుషునియందుగల ఇచ్ఛావ్యాపారములను మరుగుపరచుట యందు, దత్తచిత్తురాలై యున్న నాయిక "పరకీయ" యనబడును. అది కన్య యనియు, పరోఢయనియు ఇరుతెరంగులు కలిగియుండును.

## పరకీయ కన్యాలక్షణము

శ్లో॥ కన్యాత్వనూఢాయువతిస్సలజ్జా పితృపాలితా ।
సఖీకేళిషువిస్రబ్ధా ప్రియే ముగ్ధగుణాన్వితా ॥

తా॥ చతురయుగాను, యవ్వనమధ్యస్థయుగాను, సిగ్గుగలదిగాను, తల్లిదండ్రులచే పోషితగాను. చెలులతోగూడి విహారములయందు ప్రియురాలుగాను, ప్రియునియందు ముగ్ధగుణముగలదిగాను నుండునది కన్య యగును.

## పరకీయ పరోఢ లక్షణము

శ్లో॥ పరోఢాతుప్రియేణోఢాప్యన్యసంగమలాలసా ।
నిపుణాగృహకృత్యేషు భర్తృచిత్తానువర్తినీ ॥

తా॥ ప్రియునిచే పెండ్లియాడబడినదిగాను, పెనిమిటి మనస్సునకు సరియైన నడతలు గలదిగాను, గృహకృత్యములందు సమర్థురాలుగాను ఉండి యును పరపురుష సంగమమందాసక్తి గలదిగా నుండునది "పరోఢ" యనబడును.

## సామాన్య లక్షణము

శ్లో॥ సామాన్యాసైవగణికా కలాప్రాగల్భ్య దార్ఢ్యయుక్ ।
విత్తమాత్రాశయాలోకే పురుషేష్వనురాగిణీ ॥
ఏతస్యానురాగస్స్యాద్గుణవత్యపినాయకే ।
భగ్నకామాన్నృతార్థజ్ఞాక్ బాలపాషాండషండకాన్ ॥
రక్తేవరంజయేన్నిత్యం నిశ్వానాశువివాసయేత్ ।
తస్యాదౌత్యప్రబృతయోగుణాస్తదుపయోగినః ॥

తా॥ సంగీతాభినయాద్యనేక విద్యాప్రాగల్భ్య ధైర్యములు గలదిగాను జనులయందు ధనాశచేతనే అనురాగము కలదిగను, నుండునది "సామాన్య" యనదగును. ఇదే గణిక. ఈ నాయికకు నాయకుడు గుణవంతుడైనను, ధనాగమము లేకున్నవానియందు ప్రేమకలుగదు. ధనాశమము కలవారు, భగ్నకాములైనను, బాలురైనను, పాషాండులైనను, షండులైనను వారల యందు ప్రేమగలవానివలెనే వారిని సంతోషపరచును. ఈ చెప్పబడినవారు కపటమెరుగనివారుగను యుండవలయును.

## ఉత్తమ నాయిక లక్షణము

విధధత్యప్రియంవత్యో ప్రియమాచరతిస్వయం ।
వల్లభేసాపరాధేఽపి తూష్టింతిష్టంతిసోత్తమా ॥

తా॥ నాయకుడు అహితము చేయునుండగనతనికి ప్రియముగా నెవతి నడచుచున్నదో, అపరాధియగు వల్లభుని చూచి నెవ్వతె యోరకయున్నదో యామె "ఉత్తమ" నాయిక యగును.

## మధ్యమ నాయిక లక్షణము

పుంసిస్వయం కామయతి కామయేద్యాచతంవధూః ।
నత్రౌ ధేకృధ్యతిముహుః సూనృతే సత్యవాదినీ ॥

సాపరాధేఽపక ర్త్రీస్యాత్స్నిగ్ధేస్నిహ్యాతివలభే ।
ఏవమాదిగుణోపేతామధ్యమాసా ప్రకీర్తితా ॥

తా॥ నాయకుడు ఇచ్ఛించిన తానిచ్ఛించుట, అతడు కోపించుకొనిన తానూ కోపించుకొనుట. ఆతడు నిజము పల్కిన తాను నిజము పల్కుట, అతడపరాధము చేసిన తానపరాధము చేయుట, అతడు స్నేహించిన తాను స్నేహించుట ఈ రీతి గుణములు గలది "మధ్యమ" నాయిక యనబడును.

ఆధమ నాయిక లక్షణము

కలస్మాత్కుప్యలిరుషం ప్రార్థితాపినముంచతి ।
సురూపంవావిరూపంవాగుణవంతమథాగుణం ॥
స్థవిరం తరుణం వాపియావాకామయతే ధృతిం ।
ఈర్ష్యాకోపవిషాదేషు, నియతాసాధమామతా ॥

తా॥ ఏ నాయిక అకారణముగ నోపించుచున్నదో ప్రార్థించినను, కోపమును విడువదో చక్కనివాడైనను, తరుణుడైనను, ఎట్లున్నను, నాయకుని ఇచ్ఛించుచున్నదో, ఈర్ష-కోపము-వ్యసనము వీనిని గలదిగా నున్నదో ఆది "అధమ" నాయిక యనబడును.

నిష్పత్తిర్నామ లక్షణము

కార్యోత్పత్తిర్విభావస్యకార్యజ్ఞాప్తిస్తతః పరం ।
అనుభావస్య కార్యస్య సంపుష్టిర్వ్యభిచారిణః ॥
ఇతిసూత్రస్థనిష్పత్తి శబ్దార్థః పరికీర్తితః ॥

తా॥ విభావమునకు కార్యమును కలుగచేయుటకును, అనుభావమునకు కార్యమును జ్ఞాపించుటకును. వ్యభిచారి భావమునకు కార్యమును పోషించుటయును "నిష్పత్తి" శబ్దార్థమని చెప్పబడినది.

## భావ-విభావ-అనుభావ-లక్షణములు

భావలక్షణము ;- వాచిక - ఆంగిక - సాత్వికాభినయోపేతములైన కావ్యార్థములను (అనగా రసములను), భావింపచేయునవి గాన ఇవి "భావము" లనబడినవి. "భూ" అను ధాతువునకు "కరణము" (అనగా చేయుట) అని యర్థము. కావుననే భావితము, కృతము. వాసితము. అను పదములు ఏకార్థములగుచున్నవి. లోకమందుకూడా "అహో" ఈ గ్రంథముచే లేదా ఈ రసముచే సర్వమును భావితమైనదనుట ప్రసిద్ధమే. కావున భావపదమునకు "వ్యాప్తి" అనగా వ్యాపించుట అని అర్థము, ఏ అర్థము విభావముచే ఆహృతమై అనగా నిష్పాదితమై అనుభావములచేతను వాగంగ సత్వాభినయములచేతను. గమ్యమానమగునో అనగా అభివ్యక్తము చేయబడునో. ఆ అర్థము భావమగును. వాచిక-ఆంగిక- ముఖరాగాత్మకమైన, అభినయనముచేతను, సాత్వికాభినయముచేతను. కవ్యంతరగతమైన భావమును భావింపజేయునది అనగా ఆస్వాదయోగ్యముగా చేయునదికాన యిది భావమనబడినది. వాగంగాది వివిధాభినయ సంబంధములైన రసములను భావింపజేయునది అనగా ప్రేక్షకులచే ఆస్వాదింపచేయునది కాన ఇది"భావ" మనబడినదియని నాట్యప్రయోక్తలు తెలియవలయును.

### విభావ లక్షణము

విశిష్ట జ్ఞానహేతువైనది లేదా విజ్ఞానము అను అర్థము కలది "విభావ" మనబడును. విభావము-నిమిత్తము-హేతువు ఇవి పర్యాయ పదములు. వాచిక-ఆంగిక-సాత్వికాభినయములు. దీనివలన విభావ్యములగును. అనగా విశిష్టములుగా తెలుసుకొనబడును. కాన ఇది "విభావ" మనబడినది. వ్యాంనాభినయాశ్రములైన పెక్కుఅర్థములు దీనివలన విభావ్యములగును. కాన దీనికి "విభావ" మను పేరువచ్చినది.

### అనుభావ లక్షణము

వాగంగసత్వకృతంబైన అభినయము దీనివలన అనుభావ్యమగును. అనగా అనుభవయోగ్యముగా చేయబడునుగాన ఇది "అనుభావ" మనబడి నది, వాగంగాభినయములచే అర్థము అను భావ్యమగును కాన యిచ్చట ఇది "అనుభావ" మనబడినది, మరియు ఈ అనుభావము శాఖా (హస్త) అంగ ఉపాంగ సంయుక్తముగా వుండును.

### ర స ల క్ష ణ ము

విభావైర్నుభావైశ్చ వ్యభిచారిభిరేవచ।
ఆనీయమానస్వాదుత్వంస్థాయి భావోరసస్మృతః ॥

తా॥ స్థాయిభావానుభావ వ్యభీచారీ భావములచే మనోజ్ఞత్వంబును పొందింపబడి "రస" మగుచున్నది.

### స్థాయిభావ లక్షణ వినియోగములు

సజాతియై ర్విజాతీయైర్భావై ర్యేత్వతిర స్కృతాః।
క్షీరాబ్ధివన్నయంత్యన్యాక్ స్వాత్మత్వం స్థాయినోహితే ॥
తేత్వష్టావితివిజ్ఞేయాః స్థాయినోమునిసమ్మతాః।
రత్యుత్సాహౌచశోకశ్చ విస్మయశ్చ తతఃపరం ॥
హాసోభయజుగుప్సేచ క్రోధోనాట్యే ప్రకీర్తితాః ॥

తా॥ సజాతీయ విజాతీయ భావములచేత అతిరస్కృతములై క్షీర సముద్రమువలెనే యితర భావములను స్వాత్మత్వమును బొందించుకొను నవి "స్థాయిభావములు," ఇవి ఎనిమిది విధములుగ ఋషులచే చెప్పబడి యున్నవి. వాటిపేర్లు ;- రతి, ఉత్సాహము, శోకము, విస్మయము, హాసము, భయము, జుగుప్స క్రోధము యని నాట్యమందు చెప్పబడి యున్నవి.

## 1. రతిస్థాయి లక్షణ వినియోగములు

యానోరన్యోన్య విషయాస్థాయి నీచ్ఛారతిర్భవేత్ ।
నిసర్గేణాభియోగేన సంసర్గేణాభిమానతః ॥
అత్యోపమాది విషమైరేతాస్స్యుస్తత్రవిక్రియాః ।
కటాక్షపాతభ్రూక్షేపప్రియవాగాదయోఽపిచ ।

తా॥ స్వభావము, సహవాసము, సంబంధము, అభిమానము, ఆత్మోపమాది విషయములు వీనిచేత నాయికా నాయకులు మనస్సున కలుగు అన్యోన్య విషయమైన ఇచ్ఛావిశేషము "రతిస్థాయి" యగును, అందు కడగంటిచూపు, కనుబొమలు యెగురవేయుట, ప్రియవాక్యము మొదలైనవి కలుగును.

## 2. ఉత్సాహస్థాయి లక్షణ వినియోగములు

శక్తిధైర్య సహాయుద్యైశ్శీలశ్లాఘ్యేషు కర్మసు ।
సత్వరామానసీవృత్తిరుత్సాహ స్తత్ర విక్రియాః ॥
కాలాద్యవేక్షణం ధైర్యత్యాగారంభాదయోఽపిచ ।
సహజాహార్యభేదేన సద్విధాపరికీర్తితః ॥

తా॥ శీలశ్లాఘ్యములైన కార్యములయందు శక్తి, ధైర్యము, సహాయము మొదలైనవానిచేత త్వరగాప్రవర్తించు మనోవ్యాపారము "ఉత్సాహస్థాయి" యగును. అందు సమయమును చూచుట, ధైర్యము, త్యాగము, ఆరంభము మొదలైనవి కలుగును. ఇందు సహజోత్సాహ స్థాయియనియు, ఆహార్యోత్సాహ స్థాయియనియు రెండు విధములగును.

### 3. శోకస్థాయి లక్షణ వినియోగములు

బంధువ్యాపత్తిశార్గత్య ధననాశాదిభిః కృతః ।
చిత్తక్లేశకరశ్శోక స్తత్రచేష్టావివర్ణతా ॥
భాష్పోద్గమోముఖేశోష స్తంభనిశ్వసితాదయః ।

తా॥ బంధువిషయమైన విపత్తు, దుర్గతి, ధననాశనము మొదలైన వానిచే గలుగు చిత్తక్లేశకరమైన వృత్తి "శోకస్థాయి" యనబడును. అందు దేహకాంతి మారుట, కన్నీరు కలుగుట, ముఖమువాడుట, స్తంభము, నిట్టూర్పు మొదలైనవి కలుగును.

### 4. విస్మయస్థాయి లక్షణ వినియోగములు

లోకోత్తర పదార్థానామపూర్వాలోకనాదిభిః ।
విస్తారశ్చేతసోయ స్తు విస్మయస్స నిగద్యతే ॥
క్రియా స్తత్రాక్షివిస్తారోసాధూక్తిపులకాదయః ॥

తా॥ లోకోత్తరములైన పదార్థములను, అపూర్వముగ చూచుట, వీనిచే గలుగు మనోవిస్తారము "విస్మయ" స్థాయి యనబడును. ఇందు నేత్రవైశాల్యము శ్లాఘించుట, పులకరించుట మొదలైన క్రియలు గలవు.

### 5. హాసస్థాయి లక్షణ వినియోగములు

భాషణాకృతివేషాణాం క్రియాయాశ్చ వికారతః ।
తౌల్యాదేవ పరస్థానామేషామనుకృతేరపి ॥
వికారశ్చేతసో హాస స్తత్రచేష్టాస్సమీరితాః ।
దృష్టేర్వికాసో నాసోష్టకపోల స్పందనాదయః ॥

తా॥ పలుకులు. ఆకారము, వేషము. పని వీని వికారముచేతను, ఇవి పరస్థలవాములైనయెడ సహజముగనుండినను, లెక్కించుటచేతను. గలుగు

మనోవికారము "హాసస్థాయి" యనబడును. ఇందు వికారపు చూపు, ముక్కు. పెదవి, చెక్కిళ్ళు వీనికదలిక మొదలైనవి కలుగును.

6. భయస్థాయి లక్షణ వినియోగములు

భయంతుమంతునా ఘోరదర్శన శ్రవణాదిభిః
చిత్తస్యాతీపచాంచల్యం తత్ర్వాయో నీచమధ్యయోః ॥
ఉత్తమస్యతుజాయేత కరణై రతికారణైః ।
అనుభావ్యోభవేత్వం పముఖసంశోషణాదిభిః ॥

తా॥ ఆకస్మికముగ భయంకర వస్తువుల చూచుట, వినుట మొదలైనవానిచేతను, తప్పిదముచేతను గఱగు మిక్కిలి చిత్తచాంచల్యము "భయస్థాయి" యగును. ఇది ఉత్తమ. మధ్యమ, నీచాశ్రయమై ముత్తెరగులగును. నీనిని వణకుట, ముఖమువాడుట మొదలైనవాని నేనెరుగ వచ్చునని తెలియవలయును.

7. జుగుప్సాస్థాయి లక్షణ వినియోగములు

అహృద్యానాం వరార్థానాం దర్శనశ్రవణాదిభిః ।
మనస్సంకోచనం యత్సాజుగుప్సాత్ర విక్రియాః ॥
నాసాపిధానాం త్వరితాగతిరాస్యవికూణనం ।
సర్వాంగదూననంకుత్సాముగుర్నిష్ఠీవనాదయః ॥

తా॥ అయోగ్య వస్తువులను చూచుట, వినుట మొదలైన వానిచే గలుగు మనస్సంకోచము "జుగుప్సస్థాయి" యగును. ముక్కు మూసుకొనుట, వేగముగా బోవుట. ముఖమును వంకర చేసికొనుట, సల్వాంగధూనపము అసహ్యపడుట, మాటిమాటికి ఉమ్మివేయుట మొదలైనవి కలుగును.

8. క్రోధస్థాయి లక్షణ వినియోగములు

భవేత్ప్రజ్వలనంక్రోధ॥ పురాక్షేపాది సంభవః ।
ఫుల్లానాసాపుటోద్వృత్త తారకాద్యయనుభావయుక్ ॥

శత్రుభృత్య సుహృత్పూజాశ్చత్వారో విషయా సుతాః ।

తా॥ పురాక్షేపాదులచే గల్గు మనఃప్రజ్వలనము ""క్రోదస్తాయి" యన బడును. ఇది పుల్లనాసాపుటము, గిరగిరతిరుగు నల్లగ్రుడ్లు మొదలైన అను భావములను గలదై యుండును. దీనికి శత్రువులు, భృత్యులు, స్నేహితులు, పూజ్యులు ఈ నల్గురు విషయము లనబడుదురు.

## వ్యభిచారీభావ లక్షణములు - వినియోగములు

వ్యభీఇత్యుపసర్గౌద్వౌ విశేషాభిముఖత్వయోః ।
విశేషేణాభిముఖ్యేన చరంతిస్థాయినంప్రతి ॥
వారంగసత్వయుక్తాయేజ్ఞేయా స్తే వ్యభిచారికాః ।

తా॥ పలుకు, దేహము, సత్వము వీనితోగూడినవై స్థాయికి విశేషాభి ముఖములుగా తిరుగు భావములు ంవ్యభిచారీ" భావములు యని యెరుంగ వలెను.

"విచారయంతివాసమ్యగితిసంచారిణోఽపితే" ॥

తా॥ అవి స్థాయులను బాగుగా చలింపజేయుచున్నవి గనుక "సంచారీ" లనియు చెప్పబడును.

"ఉన్మజ్జంతో నిమజ్జంతః స్థాయిన్యం బునిధావివ ॥
ఊర్మివద్వర్ధయంత్యేనం యాంతితద్రూపతాంచతే" ॥

తా॥ ఏ భావములు స్థాయియందు సముద్రమందుండు నలలవలే దానిని వృద్ధిపొందించి తద్రూపతను బొందుచున్నవో అవి "వ్యభిచారీ" భావము లనబడుచున్నవి.

నిర్వేవాదయో నిరూప్యతే

నిర్వేదగ్లానిశంకాశ్చ తదాసూయా మదశ్శ్రమః ।
ఆలస్యంచైవదైన్యంచ చింతామోహోధృతి స్మృతిః ॥

క్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా ।
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రాపస్మార ఏవచ ॥
సుప్తిర్విబోధో ఽమర్షశ్చ అవహిత్థాప్యథోగ్రతా ।
మతిర్వ్యాధి స్తథోన్మాదః తథామరణ మేవచ ।
త్రాసశ్చైవ వితర్కాశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః॥
త్రయస్త్రింశదమీభావాః సమాఖ్యాతా స్తునామతః ॥

తా॥ నిర్వేదము, గ్లాని, శంఖ, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, ధైర్యము, చింత, మోహము, ధృతి, స్మృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము. జడత, గర్వము. విషాదము. ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విభోదము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము ఈ ముప్పది మూడును వ్యభిచారి భావములని చెప్పబడును.

## 1. నిర్వేద లక్షణము

తత్వజ్ఞానాశ్చ దౌర్గత్యాదాపదో విప్రయోగతః ।
దుఃఖాదేరపినైష్ఫల్యమతిర్నిర్వేద ఉచ్యతే ॥

తా॥ తత్వజ్ఞానము, పేదరికము, సంకటము, వినియోగము, దుఃఖము. మొదలైన వానిచే గలుగు ఫలాభావమతి "నిర్వేద" మనబడును.

## 2. గ్లా ని ల క్ష ణ ము

ఆదివ్యాదిజరాతృష్ణా వ్యాయామ సురతాదిభిః ।
నిష్ప్రాణతాగ్లానిరత్రక్షమాంగ వచనక్రియాః ॥
కలానుత్సాహవైవర్ణ్య నయనభ్రమణాదయః ॥

తా॥ మనోవ్యాధి, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము, సురతము ఇవి మొదలైనవాచేని గలుగు దౌర్భల్యము "గ్లాని" యగును.

ఇందు దేహము చిక్కుట, సన్నపలుకులు, మెల్లనడకలు కళా విషయము లందు ఉత్సాహము లేకయుండుట. దేహవైవర్ణ్యము, గుడ్లు తిరుగుట మొదలైన ఆకారములు కలుగును. (గలవు.)

౩. శం కా ల క్ష ణ ము

శంకాచౌర్యాపరాధాద్యైః స్వానిష్టోత్ప్రేక్షణంమతం ।
తత్రచేష్టాముహుః పార్శ్వవీక్షణం ముఖశోషణం ॥
అపకుంఠనవైవర్ణ్య కంఠసాదాదయోఽపిచ ॥

తా॥ చౌర్యాపరాధాదులచే దనకహితము నుత్ప్రేక్షించుట "శంక" యనబడును. ఇదిమాటిమాటికి పార్శ్వములను చూచుట, మోమువాడుట, ముసుకిడుట, వైవర్ణ్యము, కంఠగద్గదము మొదలైన చేష్టలు కలవు.

ద్వివిధాచేయమాత్మోత్థాపరోత్థాచేతిభేదతః ।
స్వకార్యజనితాస్వోత్థా ప్రాయోవ్యంగ్యేయమింగితైః ॥
ఇంగితానితుపక్ష్మభ్రూతారకాదృష్టి విక్రియాః ।
పరోత్థాతు పరస్వేదః పరస్యాకారతోభవేత్ ॥
ప్రాయేణాకారచేష్టాద్యైఃతామిమామనుభావయేత్ ।
ఆకారస్సాత్వికశ్చేష్టాస్త్వంగ ప్రత్యంగజాఃక్రియాః ॥

తా॥ ఈ శంకఆత్మోత్థశంకయనియు, పరోత్థశంకనియు, నిరుతెరంగులగును. స్వకార్యమువలన గలుగునది, "ఆత్మోత్థశంక' ఇందుగల ఇంగితములు రెప్పకనుబొమలు, నల్లగ్రుడ్లు. చూపు వీనియందు గలుగు వికారములు, ఇతరులఆకాశమువలన గలుగు చెమట "పరోత్థశంక "యనబడును. వరుసగా నాకారచేష్టాదులచే నీ రెండువిధముల శంకను నూహింపవచ్చును. ఆకారము. సాత్వికము, చేష్టలు, అంగ ప్రత్యంగములయందు గలుగు క్రియాభేదములు.

## 4. అసూయా లక్షణము

పరసౌభాగ్య సంపత్తి విద్యాశౌర్యాదిహేతుభిః ।
గుణేఽపి దోషారోపస్స్యాదసూయాతత్రతత్క్రియాః ॥
ముఖాపవర్తనంగర్హా భ్రూభేదానాదరాదయః ॥

తా॥ ఇతరుల సౌభాగ్యము, సంపత్తి, విద్య. శౌర్యము మొదలగు హేతువులచే గుణమందుకూడా దోషారోపణము చేయుట "అసూయ" యనబడును. ఇందు మోమును త్రిప్పుట, నిందించుట, భ్రూభేదము, ఉపేక్ష, ఇవి మొదలైన క్రియలు గలవు.

## 5. మ ద ల క్ష ణ ము

మదస్త్వానంద సమ్మోహ సంభ్రమో మదిరాదిజః ।
సత్రిధాతరుణోమధ్యోఽపకకృష్టశ్చేతిభేదతః ॥

తా॥ మదమనునది మద్యము మొదలైనవానిచే గలుగు ఆనంద సమ్మోహములయొక్క సంభ్రమము. ఆ మదము "తరుణ" మదమనియు, మధ్యమదమనియు, అపకృష్ట మదమనియు మూడు విధములు.

దృష్టిః స్మేరా ముఖేరాగః సస్మితాకులితంవచః ।
లలితావిద్ధగత్యాద్యాశ్చేష్టాస్స్యుస్తరుణేమదే ॥

తా॥ తరుణమదమందు గర్వపుచూపులు, ముఖమందు ఎరుపు, చిరునగవును, సంభ్రమమునుగల పలుకు. వయ్యారపు నడక ఇవి మొదలైన చేష్టలు గలుగును.

"మధ్యమేతు మదేవాచిస్ఖలనం ఘూర్ణనం దృశోః ।
గమనేవక్రతాబాహ్వోర్విక్షేపస్రస్తతాయదః" ॥

తా॥ మధ్యమదమందు వాక్కున తడబాటు; గ్రుడ్లు తిరుగుట, వంకరగ నడుచుట. చేతుల నాడించుట, వ్రేలవేయుట మొదలైన చేష్టలు గలవు.

“అవకృష్టేతుచేష్టాస్స్యుర్గతిభంగోవిసంజ్ఞతా ।
నిష్ఠీవనం ముహుశ్శ్వాసో హిక్కాఛర్ద్యాదయోమతాః ॥

తా॥ అపకృష్ఠమదమందు గతిభంగము. మూర్ఛిల్లుట, తెలివి తప్పియుండుట, వాంతి, ఉమియుట, వెక్కిళ్ళు మొదలైన చేష్టలు కలుగును,

“ఉత్తమ ప్రకృతిశ్శేతే మధ్యోహసతిగాయతి ।
అధమప్రకృతిర్గ్రామ్యం పురుషం వక్తిరోదతి ॥

తా॥ ఉత్తమమదమును గలవాడు పండుకొనియుండును. మధ్యమ మదము గలవాడు నవ్వుచు బాడుచునుండును. అధమ మదము గలవాడు కౄరముగను, వికారముగను, మాటలాడుచును, దుఃఖించుచుండును.

6. శ్ర మ ల క్ష ణ ము

“శ్రమోమానసఖేదస్స్యాదధ్వ నృత్తరసాదిభిః ।
అంగమర్దన నిశ్వాసపాదసంవాహనానిచ ॥
జృంభణం మందయానత్వం ముఖనేత్రవికూణనమ్ ।
సీత్కృతిశ్చేతి విజ్ఞేయా అనుభావాశ్శ్రమోత్థితాః ॥

తా॥ త్రోవనడచుట, నృత్తమాడుట, క్రీడ మొదలైన వ్యాపారములచే గలుగు మానసఖేదము “శ్రమ” యనబడును. ఇందు అంగమర్దనము, నిట్టూర్పు, కాళ్ళుపిసుకుట, ఆవలింత, మందముగ నడచుట, ముఖమును కన్నులను వంకరచేసుకొనుట, సత్కారము చేయుట ఈ అనుభావములు కలుగును.

## 7. అలస్య లక్షణము

స్వభావభయసౌహిత్య గర్వనిర్భయతాదిభిః ।
కృచ్ఛ్రక్రియోన్ముఖత్వం య త్తథాలస్యమిహక్రియాః ॥
అంగభంగక్రియాద్వేష జృంభణాక్షివిమర్ధనాః ।
శయ్యాసనైకప్రియతాతంద్రీనిద్రాదయోఽపిచ ॥

తా॥ స్వభావము, భయము, తృప్తి, గర్వము, భయములేకయుండుట మొదలగు వానిచేత కష్టమున పనులను చేయయత్నించుట, "ఆలస్య" మనబడును. ఇందు అంగభంగము, క్రియాద్వేషము, ఆవలింత, నేత్రము లు నలుపుట, పండుకొనుటయందును, కూర్చుండుటయందును, ముఖ్యముగా ప్రియము గలుగుట, కన్నులు మూతలుబడుట. నిదుర మొదలగు క్రియలు గలుగును.

## 8. దైన్య లక్షణము

"హృత్తాపదుర్గతత్వా ధైర్యనౌద్ధత్యంహిదీనతా ।
అత్రానుభావా మాలిన్యగాత్ర స్తంభాదయోమతాః ॥

తా॥ మనస్తాపము, పేదరికము మొదలైనవానిచే గలుగు అణకువ "దైన్య" మవబడును, ఇందుకు మాలిన్యదేహ స్తంబాద్యను భావములు కలుగును.

## 9. చింతా లక్షణము

''ఇష్టవస్త్వ పరిప్రాప్తైరైశ్వర్యభ్రంశనాదిభిః ।
చింతాధ్యానాత్మికాతస్యామనుభావాభనంత్యమీ ।
కార్మాభోముఖ్యసంతాప నిశ్వాసోచ్ఛ్వసనాదయః ॥

తా॥ ప్రియవస్తువులు లభింపనందువలన నైశ్వర్యభ్రంశనము మొదలైన వానిచేత గలుగు ధ్యానము "చింత" యనబడును. ఇందు మేను చిక్కుట, తలవంపు, సంతాపము, నిట్టూర్పు మొదలైనవి గలుగును.

## 10. మో హ ల క్ష ణ ము

ఆపన్భీతి వియోగాద్యైర్మోహశ్చిత్తస్యమూఢతా ।
విక్రియా స్తత్రవిజ్ఞేయా ఇంద్రియాణాంచ శూన్యతా ।
నిశ్చేష్టతాంగభ్రమణ పతనాఘూర్ణనాదయః ।

తా॥ ఆవత్తు, భయము, వియోగము మొదలైన వానిచే మనస్సు కేమియు తెలియకపోవుట "మోహ" మనబడును. ఇందు యింద్రియములు శూన్యముగనుండుట. చేష్టలులేక యుండుట, దేహము తిరుగుట, గ్రుడ్లు గిరగిరలాడుట ఇవి మొదలైన క్రియలు గలుగును.

## 11. ధృ తి ల క్ష ణ ము

జ్ఞానవిజ్ఞాన గుర్వాది భక్తైర్నానార్థ శిద్ధితః ।
లజ్జాదిభిశ్చచిత్తస్యనైస్పృహ్యం ధృతిరుచ్యతే ॥
అత్రానుభావావిజ్ఞేయాప్రాప్తార్థానుభవస్తథా ।
అప్రాప్తాతీతనష్టార్థానభిసంక్షోభణాదయః ॥

తా॥ మోక్ష విషయజ్ఞానము, శాస్త్రజ్ఞానము, గురుభక్తి, నానావిషయముల శిద్ధి, సిగ్గు మొదలైనవానిచేత మనస్సునకు ఇచ్ఛలేకయుండుట "ధృతి" యనబడును, ఇందు లభించినవానిని అనుభవించుట, పొందబడని విషయములు, గడచిన విషయములు, నష్టవిషయములు, వీనికిగా మనస్సున చింత లేకయుండుట మొదలగునవి కలుగును,

## 12. స్మృతి లక్షణము

స్వతశ్చిత్తధృడాభ్యాసాత్ సదృశాలోకనాదిభిః ।
స్మృతిః పూర్వానుభూతార్థ ప్రతీతిస్తత్ర విక్రియాః ॥
కంపనోద్వేపనేమూర్ధ్నో భ్రూవిక్షేపాదయోఽపిచ ॥

తా॥ మనోభ్యాస బలముచేత తనంతటను సమాన వస్తువుల చూచుట మొదలైనవానిచే గలుగు పూర్వానుభూతార్థ జ్ఞాపము "స్మృతి"యనబడును,

ఇందు శిరస్సును ఆడించుట, ఊచుట, కనుబొమల నిక్షేపములు మొదలై
నవి కలుగునని చెప్పిరి.

## 13. వ్రీ డా ల క్ష ణము

అకార్యకరణావజ్ఞాస్తుతి నూతనసంగమైః ।
ప్రతీకారక్రియాద్యైశ్చవ్రీడాత్వనతిధృష్టతా ॥
తత్రచేష్టానిగూఢోక్తిరాథోముఖ్యవిచింతనే ।
అనిర్గమోబహిర్వాపిదూరాదేవావకుంఠనమ్ ॥
నఖానాంకృతనం భూమిలేఖనం చైవమాదయః ॥

తా॥ అకార్యము చేయుట. అవమానము, స్తోత్రము, నూతన సంగ
మము, ప్రతీకారక్రియ మొదలైన వానిచేత అతిదార్ష్యము లేకయుండుట
"వ్రీడ'' యగును. ఇందు మరుగుగా మాట్లాడుట. తలవంచుట. యోగిం
చుట, బయటరాకుండుట, దూరముగానే ముసుగిడుట, గోళ్ళుగిల్లుట, నేల
గీరుట ఇవి మొదలైనవి కలుగును.

## 14. చపలతా లక్షణము

రాగద్వేషాదిభిశ్చిత్తేలాఘవంచాపలంభవేత్ ।
చేష్టాస్తత్రావిచారేణ పరిరంబాపలోకనే ॥
నిష్ఠాసనోక్తి పారుష్యేతాడినాజ్ఞాపనాదయః ॥
తా॥ ఆశ, ద్వేషము మొదలైన వానిచే మనస్సులో ంలుగు లాఘ
వము "చాపల" మగును. అందు యోచింపక, కౌగలించుకొనుట, చూచుట,
వెళ్ళమనుట, కఠినపు మాటలు, కొట్టుట, ఆజ్ఞాపించుట మొదలగునవి
కలుగును.

## 15. హ ర్ష ల క్ష ణ ము

మనోరథస్యలాభేన శిద్ధియోగ్యస్యవస్తునః ।
మిత్రసంగాచ్చదేవాధి ప్రసాదేనచ కల్పితః ॥

మనఃప్రసాదోహర్షస్స్యాదత్ర నేత్రాస్య ఫుల్లతా ।
ప్రియభాషణమాశ్లేషః పులకానాం ప్రరోహణం ।
స్వేదోద్గమశ్చహస్తేన హస్తసం తాడనాదయః ॥

తా॥ మనోరథముయొక్క సిద్ధియోగ్యమైన వస్తువుయొక్క లాభము చేతను, మిత్రుల సంగమముచేతను, దేవతాదుల ప్రసాదముచేతను గలిగింప బడిన మనఃప్రసాదము "హర్ష" మనబడును. ఇందు ముఖము, కన్నులు, వికసించుట, ప్రియము పలుకుట. కౌగలించుట, పులకరించుట, చెమట కలుగుట. చేతులు తట్టుట మొదలైనని కలుగును.

## 16. ఆవేగ లక్షణము

చేత్తస్య సంభ్రమోయస్స్యాదావేగోఽయఁ సచాష్టదా ।
ఉత్పాతవాతవర్షాగ్ని మత్తకుంజరదర్శనాత్ ।
ప్రియాప్రియశ్రుతేశ్చాపిశాత్రవ వ్యసనాదపి ॥

తా॥ మనస్సుయొక్క తడబాటు "ఆవేగ" మనబడును. ఆ యావేగము ఉత్పాతవేగమనియు, వాతావేగమనియు, వర్షావేగమనియు, అగ్న్యావేగమనియు, మత్తకుంజర దర్శనావేగమనియు, ప్రియశ్రవణావేగమనియు శాత్రవవ్యసనావేగమనియు కారణానుసారముగ నెనిమిది తెరంగులగును.

## 17. జడతా లక్షణము

జాడ్యమప్రతిపత్తిస్స్యాదిష్టానిష్టార్థయోశ్శ్రుతేః ।
దృష్టేర్వావిరహాదిభ్యః క్రియాస్త్రానిమేషతా ।
అశ్రుతిః పారవశ్యంచతూష్ణీం భా దవయోఽపిచ ॥

తా॥ ఇష్టార్థము, అనిష్టార్థము వీని వినికివలనగాని, వర్షముపలనగాని, విరహము మొదలైన వానివలనగాని కలుగు అజ్ఞానము "జాడ్య"

(జనక) మన్యుప. ఇందు చెప్పపాటు లేకయుండుట, చెవులు వినకయుం డుట, పరవశుడగుట, ఊరకయుండుట మొదలగు చేష్టలు కలుగును.

## 17. గర్వ లక్షణము

ఐశ్వర్యరూపతారుణ్యకులవిద్యాబలై రపి ।
ఇష్టలాభాదినాన్యేషామవజ్ఞాగర్వ ఉచ్యతే ॥
అనుభావాభవంత్యత్రగుర్వాద్యాజ్ఞావ్యతిక్రమః ।
అనుగ్రహ ప్రధావంచ వై ముఖ్యాభాషణాదయః ॥
విభ్రమాపహ్నుతీ వాక్యపారుష్యమనలేక్షణం ॥
ఆవేక్షణం నిజాంగానా మంగభేదాదయో ఽపిచ ॥

తా॥ ఐశ్వర్యము, రూపము, యవ్వనము, కులము, విద్య, బలము, ఇష్టలాభము మొదలైనవానిచేత నొరుల నవమానించుట "గర్వ"మనబడును. ఇందు అహంభావము. ఆజ్ఞోల్లంఘనము. అనుగ్రహ ప్రదానము, మోము త్రిప్పుకొనుట, మాటలాడకయుండుట, తన అవయవములను చూచుకొనుట, ఒడలు విరచుకొనుట మొదలైన యనుభావములు కలుగును.

## 19. విషాద లక్షణము

ప్రారబ్దకార్యానిర్వాహాదిష్టా ప్రాప్తేర్విపత్తితః ।
అపరాధ పరిజ్ఞానాదనుతాపస్తుయోభవేత్ ॥
విషాద ఇతివిఖ్యాతో భరతార్ణవపారగైః ।
సవిషాదస్త్రిధాజేష్ఠ మధ్యమాధమ సంశ్రయాత్ ॥

తా॥ తానారంభించిన పని సాగకుండుట, ఇష్టపదార్థప్రాప్తి, విపత్తు. తప్పునెరుగుట వీనివలన గలుగు నునుతాపము "విషాద" మనబడును ఆ విషాదము ఉత్తమ, మధ్యమ, అధముల యాశ్రయమువలన మూడు తెరగులు కలదియగును,

## 20. నిద్రా లక్షణము

మందస్వభావ వ్యాయామ నిశ్చింత త్వసమాదిభిః ।
మనోనిమీలనం నిద్రాచేష్టాస్తత్రాస్యగౌరవం ॥
అఘూర్ణ మాననేత్రత్వమంగానాం పరివర్తనం ।
నిస్వాసోచ్ఛ్వసితేగాత్రస్వేదో నేత్రనిమీలనం ॥
శరీరస్యతుసంకోచో జాడ్యంచేత్యేవమాదయః ॥

తా॥ మందస్వభావము, వ్యాయామము, నిశ్చింతత, సమాధి వీనిచే గలుగు మనోనిమీలనము "నిద్ర" యనబడును. ఇందు ముఖగౌరవము, కన్నులు జోలాయించుట, అంగముల పరివర్తనము. ఉచ్ఛ్వాసనిశ్వాసములు. దేహమందు చెమటపోయుట, నేత్రములు మూతపడుట. దేహసంకోచనము, తెలివిలేకయుండుట ఇవి కలుగును.

## 21. అపస్మార లక్షణము

ధాతువైషమ్యదోషేణభూతావేశాదినాకృతః ।
చిత్తక్షోభస్త్వపస్మారః తత్రచేష్టాః ప్రకంపనం ॥
ధావనం పతనం స్తంభో భ్రమణంనేత్రవిక్రియా ।
స్ఫోటదంశభుజాక్షేప లాలా ఫేనాదయోఽపిచ ॥

తా॥ వాత, పిత్త. శ్లేష్మ, ధాతువుల హెచ్చుతక్కువ, దోషము, దయ్యముసోకుట మొదలైన వాటిచేత చేయబడిన మనస్సుయొక్క క్షోభము "అపస్మార" మనబడును. ఇందు వణకుట, పరుగెత్తుట, పడుట, కదలకుండుట, తిరుగుట, నేత్రముల విక్రియస్ఫోటము (భేదనము), పండ్లుకొరుకుట. చేతులు విసరుట, చొల్లుకారుట, నురుగు గలుగుట మొదలైనవి కలుగును.

## సుప్తి లక్షణము

ఉద్రేక ఏవనిద్రాయాస్సుప్తిస్స్యాత్తత్రవిక్రియాః ।
ఇంద్రియోపరతిర్నేత్రమీలనంప్రస్తగాత్రతా ॥
ఉత్స్వప్నాయితనైశ్చల్యశ్వాసోచ్ఛ్వాసాదయోఽపిచ ॥

తా॥ నిదురయొక్క ఆధిక్యమే "సుప్తి" యనబడును ఇంద్రియములు ఉపరతిని పొందియుండుట, కన్నులు మూసియుండుట, గాత్రము ప్రస్తమైయుండుట, కలగనుట. దీర్ఘకాలము కదలకయుండుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు మొదలైనవి కలుగును.

## విబోధ లక్షణము

విబోధశ్చేతనావాప్తిశ్చేష్టాస్తత్రాక్షిమర్దనం ।
శయ్యాయామోక్షణం బాహువిక్షేపోఽంగుళిమోటనం ॥
శిరఃకండూయనంచాంగ వీలనం చైవమాదయః ।

తా॥ నిదుర మేలుకొనుట "విబోధ" మనబడును. ఇందు కన్నులు నలుపుకొనుట, పడకను విడుచుట. బాహువిక్షేపము, అంగుళిమోటనము (బొటనవ్రేళ్ళు లాగుకొనుట), తలను గోకుకొనుట, దేహమును త్రిప్పుట మొదలైనవి కలుగును.

## అమర్ష లక్షణము

అధిక్షేపావమానాద్యైః క్రోధోఽమర్ష ఇతీరితః ।
తత్ర స్వేద శిరః కంపతర్జనాముఖ్యవిచింతనే ॥
ఉపాయాన్వేషణోత్సాహ వ్యవసాయాదయః క్రియాః ॥

తా॥ తక్కువచేయుట, అవమానముచేయుట మొదలైనవాటిచేత గలుగు క్రోధము "అమర్ష"మనబడును, అందు స్వేదము, శిరఃకంపము,

తలవంచుకొనుట. చింతించుట, ఉపాయములను వెతకుట, ఉత్సాహము, వ్యవసాయము మొదలగునవి కలుగును.

## 25. అవహిత్థా లక్షణము

అవహిత్థాకారగుప్తిః ధైర్యప్రాభవనీతిభిః ।
లజ్జాసాధ్వసదాక్షిణ్య ప్రాగల్భ్యాపజయాదిభిః ॥
అన్యథాపాదనం మిథ్యాధైర్యమన్యత్రవీక్షణం ।
కథాభంగాదయోఽప్యస్యా అనుభావాభవంత్యమీ ॥

తా॥ ధైర్యము, ప్రాభవము నీతి, సిగ్గు, సాధ్వసము, దాక్షిణ్యము, ప్రాగల్భ్యము, అపజయము ఇవి మొదలైన వానిచేగలుగు ఆకారగుప్తి "అవహిత్థ" యనబడును. ఇందు వేరుగచెప్పుట, అబద్ధపు ధైర్యము, మరియొక ప్రక్కచూచుట, కథాభంగము మొదలగునవి కలుగును.

## 26. ఉగ్రతా లక్షణము

అపరాధాపమానాభ్యాం చౌర్యనిగ్రహణాదిభిః ।
అసత్ప్రలాపనాద్యైశ్చకృతం తూర్ణత్వముగ్రతా ॥
క్రియాస్తత్రాస్యనయనరాగోబంధనతాడనే ।
శిరసః కంపనంస్వేదవర్ధనం భర్త్సనాదయః ॥

తా॥ అపరాధము, అవమానము, దొంగతనము, నిగ్రహము, అసత్ప్రలాపము మొదలైనవానిచే చేయఁబడిన త్వర "ఉగ్రత" యనబడును. అందు కన్నులు, ముఖము, ఎఱ్ఱనేటి. బంధించుట. కొట్టుట, తలయాడించుట, బెదరించుట, చెమటపోయుట మొదలైనవి కలుగును.

## 27. మతి లక్షణము

నానాశాస్త్రార్థకథనాదర్థనిర్ధారణం మతిః ।
అత్రచేష్టాస్తుకర్తవ్యకరణం సంశయచ్ఛిదా ॥
శిష్యోపదేశోభ్రూక్షేప ఊహాపోహాదయోఽపిచ ।

తా॥ అనేక శాస్త్రార్థములను చెప్పుటవల్ల గలుగు అర్థనిర్ణయము "మతి" యనబడును. ఇందు యుక్తమగు పనులను చేయుట, సంశయమును పోగొట్టుట, శిష్యోపదేశము, కనుబొమల నాడించుట, ఊహాపోహములు మొదలైనవి కలుగును.

## 28. వ్యాధి లక్షణము

దోషోద్రేక వియోగాద్యైః జ్వరాత్మావ్యాధిరుచ్యతే ।
గాత్రస్తంభః శ్లథాంగత్వం కూజితం ముఖకూణనం ॥
వృధాకృతాంగవిక్షేపోనిశ్వాసాదాస్తువిక్రియాః ।
సశీతోదాహయుక్తశ్చ ద్వివిధః పరికీర్తితః ॥

తా॥ ధోషోద్రేకముచేతను. వియోగాదులచేతను గలుగు జ్వరము "వ్యాధి" యనబడును. ఇందు దేహము స్తంభించుట, అంగము బిగుతగ్గుట, ఆరచుట, ముఖము వంకరబోవుట, వ్యర్థముగ నంగవిక్షేపము చేయుట. నిట్టూర్పు మొదలైనవి గలుగును. ఆ జ్వరము, శీతజ్వరమనియు, దాహ జ్వరమనియు ఇరుతెరంగులగును.

## 29. ఉన్మాద లక్షణము

ఉన్మాదశ్చిత్త విభ్రాంతిః వియోగాదిష్టనాశతః ।

తా॥ వియోగము, ఇష్టనాశనము వీనివలన కలుగు చిత్తవిభ్రమము "ఉన్మాద" మనబడును.

## 30. మరణ లక్షణము

వాయోర్ధనం జయస్యాపి విప్రయోగో మహాత్మనః ।
శరీరావచ్ఛేదవతో మరణంనామ తద్భవేతి ॥
ఏతచ్చ ద్వివిధం ప్రోక్తం వ్యాధిజంచాభిఘాతజం ॥

తా॥ సర్వాంగ వ్యాపిగానుండు ధనుంజయ వాయువుయొక్క నిర్గమము "మరణ" మనబడును. ఈ మరణము వ్యాధిజమనియు. అభిఘాతజమనియు రెండు తెరంగులగుచున్నవి.

## 31. త్రాస లక్షణము

త్రాసస్స్యాచ్చిత్త చాంచల్యం విద్యుత్క్రవ్యాద గర్జితైః ।
తథాఘూతభుజంగాద్యై ర్విష్టేయా స్తత్ర విక్రియాః ॥
ఉత్కంపకగాత్ర సంకోచరోమాంచ స్తంభగద్గదాః ।
ముహూర్ని మేషో విభ్రాంతిపార్శ్వస్థాలంబనాదయః ॥

తా॥ మెరుపు, రాక్షసులు, ఉరుము, పిశాచము, సర్పము మొదలైనవానిచే గలుగు చిత్తచాంచల్యము "త్రాస" మనలడును. ఇందు ఉత్కంపము, దేహసంకోచము, రోమాంచము, స్తంభము, గద్గదము. అడుగడుగునకు రెప్పపాట్లు, భ్రమ, ప్రక్కనుండువారిని పట్టుకొనుట మొదలైనవి గలుగును.

## 32. వితర్క లక్షణము

ఊహోవితర్కస్సందేహ విమర్శ ప్రత్యయాదిభిః ।
జనితోఽర్థ యోఽర్ధస్య అసత్యస్సత్య ఏవచ ॥
అత్రానుభావాస్స్యురమీ భ్రూ శిరః కంపనాదయః ।

తా॥ సందేహము, నిశ్చయము మొదలగువానిచే గలుగు ఊహాత్మకమగు సత్యాసత్య నిర్ణయము "వితర్క" మనబడును దీనియందు కనుబొమలు యెగురవేయుట, తలయూడించుట మొదలైన యను భావములు గలుగును.

చేష్టలు :-

చేష్టాస్తుయౌవ్వనోద్భూత, కటాక్షాదయ ఈరితాః ॥

తా॥ యవ్వన ప్రాప్తిచేత గలుగు కడగంటి చూపులు మొదలైనవి చేష్టలు యనబడును.

అ లం కృ తి :-

ఏతుర్ధాలంకృతిర్వాసో భూషామాల్యానువేపనైః

తా॥ అలంకృతి, వస్త్రములు, భూషణములు, పుష్పములు, పైపూతలు ఈ విధములచే నలుతెఱంగులగును.

త ట స్థ లు :-

తటస్థాశ్చంద్రికాధారగృహా చంద్రోదయాదయః ।
కోకిలాకులమాకందమంద మారుత షట్పదాః ॥
లతామంటపభూగేహా దీర్ఘికాజలధారవాః ।
ప్రాసాదగర్భ సంగతక్రీడాద్రి నరిదాదయః ।
ఏవమాహ్యేయధాకాలముపభోగోపయోగినః ॥

తా॥ చంద్రికాధారములైన గృహములు, చంద్రోదయము మొదలైనవి, కోయిలలు నిండియుండు రసాలవృక్షము, మందమారుతము, భ్రమరములు. పొదరిండ్లు, భూగేహము, దీర్ఘికలు. మేఘనాదము, ప్రాసాద మధ్యము, సంగీతము, క్రీడాదులు, సెలయేరులు మొదలైనవి ఉపభోగోపయోగవస్తువులు "తలుస్థోద్దీపనములు" ఇవి కాలోచితముగా నూహించుకొనవలసినవి.

## అష్టవిధ నాయిక లక్షణ వ్యాపారములు

స్వాధీనపతికాచైవ తథావాసవసజ్జకా ।
విరహోత్కంఠితాప్రోక్తా విప్రలబ్ధాచఖండితా ।
కలహాంతరితాచైవ తథాప్రోషితభర్తృకా ।
తథాభిసారికాచైవ మష్టధానాయికామతాః ॥

తా। స్వాధీనపతిక, వాసనసజ్జక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక యని పూర్వముచెప్ప బడిన నాయికలు ఒక్కరతె దశాభేదములచేత నెనిమిది విధములు.

1. స్వాధీనపతిక నాయికా వాయికా లక్షణ వ్యాపారములు

ప్రియోపలాలితానిత్యం స్వాధీనపతికామతా ।
అస్యాస్తుచేష్టాః కథితాః స్మరపూజోత్సవాదయః ॥
వనకేళీ జలక్రీడా కుసుమపచయాదయః ॥

తా॥ నాయకునిచే నెల్లప్పుడును సంతోషబరుపబడిడెది "స్వాధీన పతిక", ధీని వ్యాపారము మన్మథపూజా మహోత్సవము మొదలైనవి యును, వనవిహారము, జలక్రీడ, పుష్పాపచయము మొదలైనవి.

2. వాసవసజ్జకా లక్షణ వ్యాపారములు

ప్రియాగమనవేళాయాం మండయంతీ ముహూర్ముహుః ।
కేళీగృహాంతధాత్మానంసాస్యాద్వాసకసజ్జికా ॥
అస్యాస్తుచేష్టాస్సంపర్క మనోరథవిచింతనం ।
సఖీవినోదోనితరాం ముహూర్దూతీ నిరీక్షణం ॥
ప్రియాభిగమప మార్గాభివీక్ష ప్రభృతయోమతాం ॥

తా॥ ప్రియుడు వచ్చెడి సమయమందు తానలంకరించుకొని కేళీ గృహము నలంకరించి సిద్ధముగానుండునది "వాసపసజ్జక".

దీని వ్యాపారములు :- నాయకుని సంపర్గ మనోభీష్టమును యోచిం చుట. సఖులతోడి వినోదము సల్పుట, అడుగడుగునకు నూకతిను సాభిప్రా యముగ చూచుట, నాయకుడు వచ్చెడిదారిని చూచుట మొదలైనవి.

3. విరహోత్కంఠిత నాయికా లక్షణ వ్యాపారములు

అనాగసి ప్రియతమే చిరయత్యుకాతుయా ।
విరహోత్కంఠితా భావవేదిభిః పరికీర్తితా ॥

అస్యాస్తుచేష్టాస్సంతాపో వేపథుశ్చాంగసాదనం ।
అరతిర్బాష్పమోక్షశ్చస్వావస్థా కథనాదయః ॥

తా॥ నిరపరాధియగు ప్రియుడు రాక జాగుశేయగా కాలవిలంబనము నోర్వక యెదురుచూచుచునుండు నాయిక విరహోత్కంఠిత యనబడును.

దీని వ్యాపారములు ;- సంతాపము, దేహమువణకు, చిన్నబోవుట, వ్యాపారాంతరములందు ప్రీతిలేకయుండుట, కన్నీరు విడచుట, తన యవస్థను చెలులకు తెల్పుట మొదలైనవి.

4. విప్రలంబ నాయికాలక్షణ వ్యాపారములు

క్వచిత్సంకేత మావేద్యతత్రనాధేన వంచితా ।
స్మరార్తా విప్రలబ్దేతి, కథితాభావకోవిదైః
అస్యాస్తుచేష్టా నిర్వేదశ్చింతా ఖేదోఽథ దీనతా ।
అశ్రు నిశ్వాస మూర్ఛాద్యాః కథితాభావవేదిభిః ॥

తా॥ ఒకానొకచోటును సంకేత స్థానముగచెప్పి అక్కడ నాయకునిచే వంచింపబడి, అనగా అతడక్కడికి రాకపోగా మన్మథ పీడితురాలై యుండునది "విప్రలబ్ద".

దీని వ్యాపారములు :- నిర్వేదము, చింత, ఖేదము, దీనత కన్నీరు విడుచుట. నిట్టూర్పు విడుచుట, మూర్ఛజెందుట మొదలైనవి.

5. ఖండితనాయికా లక్షణ వినియోగములు

ఉల్లంఘ్య సమయంయస్యాః ప్రేయానన్యోపభోగవాన్ ।
భోగలక్ష్మాంకితః ప్రాతరాగచ్ఛేత్సాహి ఖండితా ॥
అస్యాస్తుచేష్టానిశ్వాసతూష్ణీంభావోఽశ్రుమోచనం ।
ఖేదభ్రాంత్యస్ఫుటాలాపా ఇత్యాద్యా విక్రియామతాః ॥

తా॥ సంకేతసమయము నతిక్రమించి అన్యోపభోగపు గురుతులతో ప్రాతఃకాలమందు వచ్చెడి నాయకుడుగలది "ఖండిత".

దీని వ్యాపారములు ;- నిట్టూర్పు విసుమట. పలుకకుండుట, కన్నీరు విడచుట, ఖేదపడుట. భ్రమించుట, మూల్గుట మొదలైనవి ఈ నాయిక వ్యాపారములు.

6. కలహాంతరిత నాయికాలక్షణ వ్యాపారములు

యానఖీనాపురః పాదపతితం వల్లభంరుషా ।
నిరస్యపశ్చాత్తపతి కలహాంతరితాతుసా ॥
అస్యాస్తుచేష్టానిస్వాసభ్రాంతిర్హృత్తాపసాధ్వసే ।
ముహుఃప్రలాపఇత్యాద్యాశ్చేష్టాః ప్రోక్తామనీషిభిః ॥

సఖులయెదుట చరణపతితుడగు నాయకుని నిరాకరించి పిదప పరితాపబడునది కలహాంతరిత యగును,

దీని వ్యాపారములు :- నిట్టూర్పులిచ్చుట, భ్రమించుట. మనస్తాపబడుట, స్తంభాదిసాధ్వస బాసములు గలుగుట, మాటిమాటికి ప్రలపించుట, మొదలైనవి ఈ నాయిక ల్లుంకను వ్యాపారములు.

7. ప్రోషిత భర్తృక నాయికలక్షణ వ్యాపారములు

దేశాంతరగతేకాంతే ఖన్నాప్రోషితభర్తృకా ।
అస్యాస్తుగాగరః కార్శ్యం నిమిత్తాద్యవలోకనం ॥
మాలిన్యమనవస్థానంప్రాయశయ్యానిషేవణం ।
జాడ్యచింతాప్రభృతయో విక్రియాః కథితాబుధైః ॥

తా॥ నాయకుడు దేశాంతరము జెందియున్నప్పుడు ఖేదపడుచుండునది "ప్రోషితభర్తృక".

దీని వ్యాపారములు :- నిదురలేకయుండుట, కృశించుట, ప్రియు డెన్నాళ్ళకు వచ్చునని దినములు చూచుట, మలినమైయుండుట, నిలచిన చోట నిలువకపోవుట, ఎప్పుడును పడుకొనియుండుట. ఏమియు దోపక యుండుట, చింత మొదలైనవి.

8. అభిసారికా నాయికలక్షణ వ్యాపారములు

మదనానలసంతప్తాయాభిసారయతిప్రియం ।
స్వయంవాభిసరేద్యాతుసాభవేదభిసారికా ॥
అస్యాస్సంతాపచింతాద్యావిక్రియాస్స్యుర్యథోచితతు ॥

తా॥ మదనానలసంతప్తయై తన స్థలమునకు నాయకుని వచ్చుచు న్నట్లు చేయుచున్నదిగాని, తానే నాయకుని స్థలమునకు బోవుచున్నదిగాని "అభిసారిక" యగును.

దీని వ్యాపారములు ;- సంతాపబడుట, చింత మొదలైనవి ఆయా సమయోచితముగ నుండును.

## ఆసాంధదూతికల నిరూపణం

దూతీదాసీ నఖీచేటీ ధాత్రేయీ ప్రాతికేశినీ ।
లింగినీ శిల్పినీ త్యాద్యాస్సహాయాః పరికీర్తితాః ॥

తా॥ ఈ నాయికలకు సహాయపడువారు, దూతి, దాసి, చేటి, సఖి. ధాత్రేయి, ప్రాతికేశిని, లింగిని, శిల్పిని మొదలైనవారు.

శృంగార నాయకల లక్షణములు

పతిశ్చోపపతిశ్చైవ వైశికశ్చ తతఃపరం ।
స్త్రీయాదీనాం నాయకానాం నాయకాః కధితాబుధైః ॥

తా॥ పతి, ఉపపతి, వైశికుడు అను వీరు స్వీయ, పరకీయసామాన్య లకు వీరు నాయకులని చెప్పబడుదురు.

## పతి లక్షణము

వేదశాస్త్రానురోధేనపాణిం గృహ్ణాతియఃస్త్రియః ।
స ఏవ పతిరిత్యుక్తః విద్వద్భిరిహశాస్త్రతః ॥

తా॥ ఏ పురుషుడు వేదశాస్త్రోక్తముగ ఏ స్త్రీని పాణిగ్రహణము చేసుకొనుచున్నాడో, ఆమెకు అననే భర్తయని విద్వాంసులు శాస్త్రమందు చెప్పుచున్నారు.

## ఉపపతి లక్షణము

ప్రలోభ్యాన్యవధూం భుక్తేఉపాయైర్వివిధైర్యపి ।
సతూపపతి రిత్యుక్తః విద్వద్భిరిహశాస్త్రతః ॥

తా॥ అన్యవనితను వివిధోపాయములచే నాశపరచి అనుభవించునతడు "ఉపపతి" యగును.

## వైశిక లక్షణము

వేశ్యాబహుళ సంభోగ సమాసాధితగౌరవః ।
విత్తవ్యయీ విలాసీచ వైశికః పరికీర్తితః ॥

తా॥ ఎవడు వేశ్యోపభోగములచే పొందబడిన గౌరవము కలవాడును, అర్థవ్యయము చేయువాడును, విలాసము గలవాడై యుండునో వాడు "వైశికు" డని చెప్పబడును.

## చతుర్విధ శృంగార నాయకుల లక్షణము

ఏతే శృంగార విషయాశ్చత్వారస్స్యుః పృథక్పృథక్ ।
అనుకూలో దక్షిణశ్చ దృష్టశ్శఠ ఇతిస్మృతాః ॥

తా॥ శృంగార విషయములైన ఈ నాయకులు అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు అని వేర్వేరుగ నలుతెరంగు లగుదురు.

అనుకూల నాయకుని లక్షణము

ఏకాయత్తోఽనుకూలస్స్యాత్సధా తామనురంజయన్ ।
అన్యస్త్రీ దర్శనాదిభ్యో నివృత్త నిజమానసః ॥

తా॥ ఇతర స్త్రీలను చూచుట మొదలైన వ్యాపారరహితుడుచు, స్వస్త్రీయందే ప్రేమగలవాడునై యుండువాడు "అనుకూలు" డనబడును.

2. దక్షిణ నాయకుని లక్షణము

బహ్వీషు విధ్యమానాసు స్వాశ్రితాసునిరంతరం ।
సమప్రీతిం ప్రకుర్వాణః సదక్షిణ ఇతిస్మృతః ॥

తా॥ తన్నాశ్రించిన అనేక స్త్రీలయందు సమముగా ప్రీతిచేయువాడు "దక్షిణు"ఁ డనబడును.

3. ధృష్టనాయకుని లక్షణము

వ్యక్తాగారితభీర్ధృష్టః నారితోఽపినముంచతి ।
తామేవాను సరత్యాసు ప్రణయమానునయాదిభిః ॥

తా॥ ఎవడు తన యపరాధము నాయికచే యెరుగబడినను భయము లేకయుండునో తొలగించినం దొలుగడో ఆ నాయికనే త్వరగా సమస్కారము మొదలైన ఉపాయములచే అనుసరించునో వాడు ధృష్టు" డనబడును.

4. శఠనాయకుని లక్షణము

ప్రియాయామనురక్తాయాం, గూఢవిప్రియకకర్మకృత్ ।
అతశ్శఠ ఇతిప్రోక్తః భావశాస్త్ర విచక్షణైః ॥

తా॥ అనురాగముగల ప్రియకు గూఢముగా అహితము చేయువాడు "శఠు" డనబడును.

## ఏతేషాం సహాయ నిరూప్యతే

పీఠమర్దోవిటశ్చేటః విదూషక ఇతిస్మృతాః ।
చత్వారః కామతంత్రజ్ఞా ఏతేషాం సహకారిణః ॥

తా॥ ముందుచెప్పిన శృంగార నాయకులకు సహాయులగువారు పీఠ మర్దుడనియు, విటుడనియు, చేటుడనియు, విదూషకుడనియు నలుదెరంగు లగుదురు.

### 1. పీఠమర్ధనాదుల లక్షణములు

కించిదూనః పీఠమర్దః ఏకవిద్యోవిటః స్మృతః
సంధానచతురశ్చేటః హాస్యప్రాయో విదూషకః ॥

తా॥ నాయకునికి కొంచెము తక్కువగానుండువాడు "పీఠమర్దనుడు" కామశాస్త్ర ప్రవీణుడై యుండువాడు "విటుడు" నాయికా, నాయకులకు సంధి చేయువాడు "చేటుడు", హాస్యప్రధానుడై యుండువాడు "విదూషకుడు,

### ఉత్తమ-మధ్యమ-అధమ నాయకుల లక్షణములు

దయితాయాభూయః ప్రకోపేఽప్యుపచార పరాయణ ఉత్తమః ॥

తా॥ తన ప్రియయెంత కోపముచెందినను (ఆమెకు) సేవ లొనర్చుటయం దాసక్తుడు "ఉత్తము" గనబడును.

### 2. మధ్యముకు - లక్షణము

ప్రియాయాః ప్రకోపేకోపమనురాగంవానప్రకటయతి ।
చేష్టాయా మనోభావం గృహ్ణాలసమధ్యమః యదా ॥

తా॥ ప్రియ యెంతకోపించినను (తాను) కోపముగాని, అనురాగము గాని చూపక (ప్రియయొక్క) చేష్టలచేత (తదీయ) మనోభావమును కని పెట్టువాడు "మధ్యముడు" అనబడును.

3. అధముడు - లక్షణము

భయకృపాలజ్జాశూన్యః కామక్రీడాయా ।
మకృతకృత్యాకృత్య విచారోఽధమం ॥

తా॥ భయము, కృప, లజ్జలు లేనివాడు, కామక్రీడలయందు నిది చేయదగినది. నిది చేయరానిది యను పిచారము లేనివాడు "అధముడు" అన దగును.

నా య క ల క్ష ణ ము

వ్యసనియైగాని, దుఃఖమును పొందిగాని పిమ్మట యెవ్వడు అభ్యుదయమును బొందినవాడగునో అతడే ప్రధాన "నాయకుడు" అనుచున్నాడు. అనేకులకు ఒకేవిధముగ వ్యసన అభ్యుదయములు రెండును కలిగినప్పుడు ఎవని వ్యసనాభ్యుదయములు పరిపుష్టములై యుండునో ఆతడే "నాయకుడు" అనబడును.

మానవతి లక్షణము

ప్రియాపరాధసూచికాచేష్టామానః ।
సచలఘుర్మధ్యమోగురుశ్చ అల్పాపనేయోలఘుః ॥
కష్టాపనేయో మధ్యమః కష్టతరాపనేయోగురుః ।
అసాధ్యస్తురసాభాస ఏవ అన్యస్త్రీసంగమ జన్మాగురుః ॥
అన్యథాసిద్ధ కుయుహలాద్వపనేయోలఘుః ।
అన్యథావాదశపథాద్యపనయోమధ్యమః ॥
చరణపాత భూషణాద్యపనేయోగురుః ॥

తా॥ మానవతియనగా ప్రియునియందు అన్యస్త్రీ ప్రయుక్తముగా కోపగించుటడియును, దానికి ప్రియుడుచేయు మనశ్శాంతియునుబట్టి ఏర్పడు చున్నది. ఇందు "లఘుమాన" "మధ్యమాన" "గురుమాన" యని మూడు విధములు గలవు.

### 1. లఘుమాన లక్షణము

లఘుమానయనగా అన్యస్త్రీని ప్రియుడు చూచుటచేగలుగు కోపము గలది. ప్రియుడు మరల ఉపలాలించుటచే మనశ్శాంతి కలిగినది, లఘు మాన యనబడును.

### 2. మధ్యమాన లక్షణము

మధ్యమానయనగా ప్రియునికి ప్రీత్యతిశయముచేత హటాత్తుగా మరియొక స్త్రీ నామోచ్చరణము చేయుటచే అతనియందు కోపముగలది. ఇది పురుషుడు ఆన పెట్టుకొనుటవలన మనశ్శాంతి కలుగును.

### 3. గురుమాన లక్షణము

గురుమాన యనగా అన్యస్త్రీ సంభోగ చిహ్నములవలన గలుగు కోపముగలదీ. ఇది పాదప్రమాణమువలన మనశ్శాంతి కలుగునది,

### మా న ల క్ష ణ ము

శ్లో॥ ప్రియపరాధావగమాత్సంజాతోమాన ఇష్యతే ।
లఘుమానో మధ్యమానో గురుమాన ఇతిత్రిధా ॥

తా॥ నాయకాపరాధము తెలిసినపిదప గలుగు మనోవ్యాపార విశే షము "మాన" మని చెప్పబడును. ఇవి లఘు, మధ్య, గురు మానములు యనబడును.

# స్వీయాది షోడశ నాయికల లక్షణములు

1. స్వీయ :- అనగా తన స్వామియందే అనురాగము గలది.

2. ముగ్ధ :- అనగా అంకురిత యవ్వన, (వయస్సు వచ్చుచున్న స్త్రీ.)

3. మధ్య :- అనగా సమాన లజ్జామదన.

4. ప్రగల్భ :- అనగా సకలకేళీకలాప కోవిద, లజ్జను జయించిన కామేచ్ఛ గలదనుట.

5. అజ్ఞాతయవ్వన :- అనగా తనకు యవ్వన ప్రాదుర్భావము నొందినట్లు తెలియనిది.

6. జ్ఞాతయవ్వన :- అనగా తనకు యవ్వనమొచ్చినట్లు తెలియగలిగినది.

7. నవోఢ :- అనగా లజ్జాభయ పరాధీన రతిగలది.

8. విప్రలబ్ధనవోఢ :- అనగా కొంతరతి పరిచయము గలది.

9. మధ్యధీర :- అనగా అన్యస్త్రీ సంభోగమువలన పతియందు వ్యంగ్యముగ కోపప్రకాశము చేయునది.

10. మధ్యాధీర ;- అనగా అన్యస్త్రీ సంభోగము వలన పతియందు వ్యంగ్య వచనములు చేయుచు వెంబడే అవ్యంగ్యములైన కోపచేష్ట గలది.

11. మధ్యధీరాధీర :- అనగా అన్యస్త్రీ సంభోగమువలన పతియందు వ్యంగ్య వచనములు చేయుచు వెంబడే అవ్యంగ్యములైన కోపచేష్టగలది.

12. జ్యేష్టకనిష్ట :- అనగా ఇద్దరి భార్యలయందు పతికిగల అధికన్యూనస్నేహములనేర్పడునది. అట్టిసమయములో తనయందుగల న్యూనస్నేహంబు నెరిగినపతియందు కోపప్రకాశనము చేయుటలో ధీరాధీరాది లక్షణములు గలుగును.

13. ప్రగల్భధీర:- అన్యస్త్రీ సంభోగము చేసివచ్చిన పతియందు రత్యుదాసీన భావము గలది.

14. ప్రగల్భాధీర :- అన్యస్త్రీ సంభోగము చేసివచ్చిన పతియందు తర్జన తాడనాదులు చేయునది.

15. ప్రగల్భధీరాధీర :- అన్యస్త్రీ సంభోగము చేసివచ్చిన పతియందు రత్యుదాసీన భావముగలిగి తర్జనాదులు చేయునది.

16. జ్యేష్ట కనిష్టాది భేదంబులు ప్రగల్భకుం గలవు. తనయందుండు న్యూన్య

స్నేహము నెరిగి పతియందు కోపప్రకాశము చేయుటలో ప్రగల్భకు చెప్పి యుండు ధీరాధీరాది లక్షణములు గలిగియుండును.

## అష్టసాత్వికభావ లక్షణము

శ్లో॥ అన్యేషాం సుఖదుఃఖాది భావేషు కృతభావనం।
అనుకూల్యేనయచ్చిత్తం భావకానాం ప్రవర్తతే ॥
తత్సర్వమితివిజ్ఞేయం ప్రాజ్ఞైస్సత్వోద్భవానిమాన్ ।
సాత్వికఇతిజానంతి భరతాద్యా మహర్షయః ॥
తే స్తంభ స్వేదరోమాంచస్స్వరభేదశ్చవేపథుః ।
వైవర్ణమశ్రుప్రళయ ఇత్యష్టౌసాత్వికామతాః ॥

తా॥ ఇతరులయొక్క సుఖదుఃఖములు మొదలైన భావములయందు అనుకూల్యముతో కృతభావనమై యేమనస్సు ప్రవర్తించుచున్నదో యది సత్వమనబడును అందునుండి గలుగు భావములు "సాత్విక" భావము లగును. అవి స్తంభమనియు, స్వేదమనియు, రోమాంచమనియు, స్వరభేదమనియు, వేపదుయనియు, వైవర్ణమని, అశ్రుసనియు, ప్రళయమనియు యెనిమిది సాత్వికభావము లనబడును,

### 1. స్తంభ లక్షణము

శ్లో॥ స్తంభోహర్ష భయామర్ష విషాదాద్భుత సంభవః।
అనుభావోభవేదత్ర నిష్క్రియాం గత్వమేవహి ॥

తా॥ స్తంభమను సాత్వికభావము, సంకోషము, భయము, కోపము, విషాదము, అద్భుతము వీనిచేగలుగు నిష్క్రియాంగత్వము.

### 2. స్వేద లక్షణము

శ్లో॥ నిదాఘహర్ష వ్యాయామ శ్రమక్రోధ భయాదిభిః।

స్వేదస్సంజాయతే తత్రత్వనుభావా భవంత్యమీ ।
స్వేదాపినయవాతేచ్ఛా వ్యజనగ్రహణాదయః ॥

తా॥ ఎండ, సంతోషము, వ్యాయామము, శ్రమము, క్రోధము, భయము మొదలైన వానిచేతగలుగు స్వేదము (చెమట) కలుగను, అపుడు చెమటను తుడుచుకొనుట, గాలిని ఇచ్ఛగించుట, వ్యజనగ్రహణము మొదలైన అనుభావములు కలుగును.

## 3. రోమాంచ లక్షణము

శ్లో॥ రోమాంచో విస్మయోత్సాహ హర్షాద్యైస్తత్ర విక్రియాః ।
రోమోద్గమాద్యాః కథితా విక్రియాస్తత్రకోవిదైః ॥

తా॥ ఆశ్చర్యము, ఉత్సాహము, సంతోషము మొదలైన వానిచేత కలుగునది "రోమాంచన" మందురు. ఇందు గగుర్పొడుచుట మొదలైన వికారములు కలుగును.

## 4. స్వరభేద లక్షణము

శ్లో॥ స్వరభేదస్సుఖాద్యైస్తుతత్రస్యుర్గద్గదాదయః ।

తా॥ సుఖాదులచే స్వభేదము గలుగును. ఇందు డగ్గుత్తిక మొదలైనవి కలుగును.

## 5. వేపథు లక్షణము

వేపథుర్హర్ష సంత్రాస జ్వరక్రోధాదిభిర్భవేత్ ।
అత్రానుభావాః స్మరణగాత్రకంపాదయోమతాః ॥

తా॥ సంతోషము, బెదరించుట, స్వరము. కోపము మొదలైనవానిచే "వేపథు" గలుగును. ఇందు స్మరించుట, దేహము వణకుట మొదలైనవి కలుగును.

6. వైవర్ణ్య లక్షణము

విషాదపరరోషాద్యైర్వైవర్ణ్యముపజాయతే ।
ముఖవర్ణ పరావృత్తిః కార్శ్యాద్యాస్తత్ర విక్రియాః ॥

తా॥ విషాదము, ఇతరులయందుగల రోషము మొదలైనవానిచే వైవర్ణ్యము గలుగును. ఇందు ముఖతేజస్సు మారుట, చిక్కిపోవుట మొదలైనవి కలుగును.

అశ్రు లక్షణము

శ్లో॥ విషాదరోష సంతోషధూమాద్యైరశ్రువిక్రియాః ।
భాష్పబిందు పరిక్షేపనేత్ర సమ్మార్జనాదయః ॥

తా॥ వ్యసనము, కోపము, సంతోషము, ధూమము మొదలైన వానిచే "అశ్రువు" కలుగును. ఇందు కన్నీరు విదలించుట, కన్నులను తుడుచుకొనుట మొదలైనవి కలుగును.

8. ప్రళయ లక్షణము

శ్లో॥ ప్రళయస్సుఖదుఃఖాద్యైశ్చేతసస్తువిసంజ్ఞతా ॥
తా॥ ప్రళయమనగా సుఖదుఃఖాదులచే గలుగు ప్రజ్ఞాభంగము.
"ఏతేషాం సత్వమూలత్వాత్ భావానాం సాత్వికప్రథా
అనుభావాశ్చ కధితాః భావసం సూచనాదయః ।
ఏవంద్వై విద్యమేతేషాం దర్శితం భావకోవిదైః ॥

తా॥ సత్యమూలములైనవి గనుక వీనికిసాత్వికభావములని పేరు. భావసంసూచనాదులు అనుభావము లనబడును ఇట్లు అనుభావములు రెండు విధములు గలిగియుండును.

"విభావా అనుభావాశ్చతేభవంతి పరస్పరం ।
కార్యకారణ భావాశ్చజ్ఞేయాభావ విశారదైః ॥

తా॥ విభావానుభావములు ఒకటికొకటి కార్యకారణ భావములుగాను భావజ్ఞులచే నెరుగతగ్గవి.

## అంగాహార లక్షణములు

అంగాహారములు ముప్పదిరెండు పేర్కొనబడినవి. నూటయెనిమిది కరణముల పరస్పర సంయోజనములచే అంగాహారముల నంతములుగ ఏర్పడవచ్చును. కాని విశిష్టములును, స్పష్టగోచరములును అగు ముప్పది రెండుమాత్రమే పేర్కొనబడినవని తెలియవలయును.

అభినగుప్తుడు అంగాహారములకు మూడు వ్యుత్పత్తులను నొసంగినాడు.

"అంగానాంధే శాంతరే ప్రాపణప్రకారోఽంగహారః"

తా॥ ఒక స్థితిలోనున్న అంగములను సముచితమైన ఇంకొకస్థితిని పొందించు విధానము అంగాహార మనబడును.

"హరస్యచాయం హారః ప్రయోగః"

తా॥ హరుడనగా శివుడు. ఆ హరునకు సంబంధించిన ప్రయోగమగుటచే ఇది అంగాహార మనబడినది.

"అంగనిర్వర్త్యోహారోఽంగహారః"

తా॥ అంగములచే నిర్వర్తింపబడునదిగాన అంగాహార మనబడినది.

## కరణ లక్షణములు

కరణమనగా క్రియ లేదా చేష్ట. నృత్తమునకు సంబంధించిన క్రియ అగుటచే నిది నృత్తకరణ మనబడినది. ఏకకాలమున పాదములు, సమన్వయ పూర్వకముగా సవిలాసముగా కదిలించుట "కరణ" మగును. హస్త పాద కదలికలు అనేక విధములుగా నుండవచ్చును. కానీ విలాస విన్యాసములతో కూడుకొనియున్నవే "కరణము" లందు గ్రాహ్యములు. హస్తపాద

ములు మాత్రమే చెప్పబడుటచే తక్కిన అవయవములకు యందు సంబంధములేదని అవి చలనరహితములుగ నుండునని తలచరాదు. పూర్వక్షేత్ర సంయోగ త్యాగమునుండి సముచిత క్షేత్రాంచితప్రాప్తి పర్యంతమైన ఏకరూపమగు క్రియ "కరణ" మగునని అభినవ గుప్తులవారు వివరించియున్నారు. శరీరావయవములయొక్క విలాసవిక్షేపమునకు సంబంధించినక్రియ "కరణ" మని సారాంశము. నృత్తమందలి హస్తపాద సంయోగము "కరణ" మనబడును. ఇట్టి రెండు నృత్తకరణములు ఒక నృత్తమాతృకయగును. రెండు, లేక మూడు, లేదా నాలుగు మాతృకలవలన అంగాహారము లేర్పడును. మూడు కరణములు ఒక "కలాప" మగును. నాలుగు కరణములు ఒక "మండక" మగును. అయిదు కరణములు ఒక సంఘాతక" మగును, మరియు ఆరు, లేదా ఏడు, లేదా యెనిమిది, లేదా తొమ్మిది కరణముల కూడికలవలన "అంగాహారము" లేర్పడుచున్నవి. కరణములన్నియు నృత్తమందును, యుద్ధమందును ఉపయుక్తము లగును.

## పిండీబంధములు

మృదంగ-భేరీ-పటహ-భాండ-డింఢిమ - గోముఖ-పణవ - దర్దురాది సర్వాతోద్యములను ప్రయోగించుచుండగా రేచిక-అంగాహారములతో నృత్తమును చేయుచున్న శంకరుని, సుకుమారముగ నృత్తము చేయుచున్న పార్వతిని. నంది-భద్రముఖాది గణములుగాంచి అందేర్పడిన పిండీబంధములనుపలక్షించి ఆయాబంధముల కనుగుణమగు పేర్లుపెట్టిరి. ఈ పిండీబంధములు ఆయా దేవతలయొక్క లేదా వారివారి వాహనములయొక్క ప్రతికృతులను సూచించుచు వారికి సంతోషమును కలిగించును. వృషభపిండి ఈశ్వరునికి, పట్టిసపిండి నందికి, సింహవాహిని పిండి ఛండికకును, తార్క్ష్యపిండి విష్ణువునకును, పద్మపిండి బ్రహ్మకును. ఐరావతిపిండి ఇంద్రునకును. ఝషపిండి మన్మ

ధునకును, శిఖిపిండి కుమారస్వామికిని, రూపపిండి లక్ష్మికి, ధారాపిండి జాహ్నవికిని, పాశపిండి యమునకును, నదీపిండి వరుణకును, యక్షీపిండి కుబేరునకును, హలపిండి బలరామునకును, సర్పపిండి నాగలోకవాసులకును, దక్షయజ్ఞ విమర్దనియనెడి మహాపిండి గణేశ్వరులకును, త్రిశూలాకృతిగల రౌద్రపిండి అంధకద్వేషుడైన శివునకు చిహ్నములై వారివారికి సంతోషములు కలిగించును. ఇతర దేవతల విషయమునను వారివారి ధ్వజాకృతులను పోలిన పిండీబంధములను ప్రయోగించవలెను.

ఇరువురు ప్రయోక్తలు సమకాలమున ఏకభావమున "నృత్తమొనర్చుటచే "పిండీ'' బంధ మేర్పడును. ఇందు యిరువురేగాక యింకను అధికముగ ప్రయోక్త లుండవచ్చును ఈ నృత్తము అనేక వాద్యసహితమై తాల-లయానుసారియై రేచికాంగాహారములతో ప్రయుక్తమగును. ఇట్లీ పాత్రప్రయోక్తలు కలసి అంగాహారములను ప్రయోగించినపుడు ఏర్పడు ఆకార విశేషము ఏ దేవతాప్రకృతిని సూచించునో ఆ పేరుతో ఆ పిండీబంధమును వ్యవహరించిరి. పిండీబంధమనగా అంగాహార ప్రయోగమం దేర్పడు ఆకార విశేషమని సారాంశము.

ప్రయోగము చేసెడి స్థలము, హస్తపాదాద్యంగములు ప్రయోక్తలు సమవిషమాది ప్రయోగములు అను వీని కలయికయే "పిండీ" (సమూహము) అనబడును.

ఇట్టి కలయికవలన సామాజికుల హృదయములందు ఒక ఆకార విశేషము స్ఫురించును. అట్టి ఆకార విశేషమునే "పిండీబంధము" యని యందురు, కరణాంగాహార సమూహాదులకును "పిండీ" యనిపేరు. ఈ పిండీబంధములు ఆయా దేవతల రూపమునగాని, ఆయా దేవతల ధ్వజాదుల రూపమునగాని ఉండును.

# వర్ధమానకము

ఆసారితముల సంయోగము "వర్ధమానక" మనబడును. ఆ వర్ధమానకముయొక్క ఉత్పత్తిని, ప్రయోజనమును వివరించుచున్నను.

మహా తేజశ్శాలియగు రుద్రుడు దానవసంహార మొనర్చి చిత్ర-తాండవ-సంజ్ఞితములగు రెండు నృత్తములను సృజించెను. ఆ సమయమున మహాత్ములగు భూతములు పిండబంధములతో విభూషితమగు ఈ వర్ధమానక"మును జృజించిరి. దానిని చూచి సంతుష్టుడై పత్నీ సహితుడగు వృషధ్వజుడు యిట్లు వరమిచ్చెను,

"లక్ష్యలక్షణ సంయుక్తమగు వర్ధమానకమును ప్రయోగించువారు శివ గౌరవమును పొందుదురు.

ఈ విధముగ పూర్వము పిండీబంధ సహాయతమగు "వర్ధమానకము" సృజింపబడెను. వీని లక్షణములను వివరించుదును,

వర్ధమానకమును ప్రయోగింపబడు "కండికలు" (కటకములు) నాల్గు విధములు :- విశాల-సంగత-సునంద-సుముఖి యని నాలుగు విధములుగా చెప్పబడినవి.

విశాలకు నాలుగు కలలును, సంగతకు యెనిమిది కలలును, సునందకు పదియారు కలలును" సుముఖికి ముప్పదిరెండు కలలును యుండును. శమ్యతాళము, త్రికల సన్నిపాతము అనునవి "విశాల"యం దుండును.

"సంగత"యందు ద్వికలాచంచత్పుట తాలము ప్రయుక్తమగును. పై కండితల ఉపోహనవిధి యిప్పుడు తెల్పుదును.

ఈ నాలుగు "కండికల"యందును ఉపోహనములు వరుసగా 5, 6, 7, 8 కలలు కలిగియుండును. ఇంక ఈ కండికలు ఉపోహనములందలి గురులఘ్వక్షర క్రమమును వివరింతును.

విశాల :— ఇందలి ఉపోహనమున (అసారితాంగనము) మొదట 2 గురువులు, తరువాత 14 లఘువులు, చివర 1 గురువు వుండును.

సంగత :— ఇందలి ఆపోహనమున మొదట రెండు గురువులు, తరువాత పదునెనిమిది లఘువులు, చివర ఒకగురువు వుండును.

సునంద :— ఇందలి ఉపోహనమున మొదట రెండుగురువులు, తరువాత ఇరువదిరెండు లఘువులు, చివర ఒకగురువు వుండును.

సుముఖ :— ఇందలి ఉపోహనమున రెండుగురువులు. ఇరువది ఆరు లఘువులు. ఒకగురువు వుండును.

స్థాయిస్వర సమాశ్రయమగు ఈ ఉపోహనమున స్వరములు, ఉపోహితములగుచు తదనుసారియగు గీతమును ప్రవర్తింపచేయును, కాన, ఇది "ఉపోహన" మనబడును, లేదా సూచనాదులచే ప్రయోగము వహింపబడును. కాన, ఇది "ఉపోహన" మనబడును. ఇది గానభాండ-సమాశ్రయమైయుండును. విశాలోపోహనమున శమ్యతాళము, శమ్యతాళము, సన్నిపాతము అను క్రియులుండును. సంగతోపోహనమున ద్వికలాచంచత్పుటతాళమును, ప్రయోగింపవలయును. సునందయందు పై సంగతలోని, తాళమునకు చివర సన్నిపాతమును చేర్పవలెను. సుముఖ్యుపోహనమున. ద్వికలచంచత్పుట తాళమును ప్రయోగించవలెను.

ఇంక వీని అనుపూర్వీ ప్రయోగమును వివరించెదను.

కనిష్ఠాసారితమున "విశాల"ను మొదట చంచత్పుట తాళమునందు ప్రయోగించవలెను. లయాంతరమునందు "సంగత" యందలి గ్రహమును గ్రహించి మరల "విశాల"ను ఆచరించవలెను. చంచత్పుట తాళమును ఇందు కూర్చవలయును,

ఆసారితములలో కనిష్ఠాసారితమున తొమ్మిది కళలను, లయాంతరమున పదునేడు కళలును, మధ్యమాసారితమున ముప్పదిమూడు కళలును,

జేష్టాసారితమున అరువదియైదు కళలును వుండును. ఇందు కళలు, అక్షరములు, లయ అనునవి వృద్ధిపొందుటనుబట్టి దీనికి "వర్ధమానక"మను పేరు వచ్చినది, మరియు వర్ణ-తాళ-లయ-గ్రంథ-వాద్య-అభినయ-పాత్రలవర్ధనమును, (అభివృద్ధిని) బట్టి దీనికి "వర్ధమానక" మనిపేరు కలిగెను. వర్ధమున శరీరమునకును, ఆసారితమునకును, పరస్పరము కార్య-కారణభావము బీజాంకుర న్యాయముగ ఒప్పుచుండును.

## రేచిక లక్షణము

పాదహస్త కటిగ్రీవా రేచకాం శ్చతురో బ్రువే ।
ఉభయోరథవై కస్యపాదస్యధరణీతలే ॥
అశ్రాంతంగమనంపార్శ్వై ర్గంగుష్టాగ్రస్యచాన్వితమ్ ।
సమనోన్నమనై రంతరార్బహిశ్చరణ రేచకః ॥

తా॥ పాదములు, హస్తములు, కటిమెడ4టిని రేచకములను నాలు గింటిని తెల్పుదును.

రెండుకాళ్ళవిగాని, ఒకకాలివిగాని, నేలమీద మడమ బొటనవ్రేలి వ్రేలికొన-ఈ రెంటి ఎత్తి దింపులతో ఎడతెగక లోపలికి వెలుపలికి నడచుట "పాదరేచక'' మగును

"త్వరితం హంసపక్షస్య భ్రమణం హస్తరేచకః ।
హస్తస్యరేచిత్ భాషంతే విరలప్రశ్రృతాంగుళేః ॥

తా॥ హంసపక్షమును వేగముగత్రిప్పుట "హస్తరేచకము". కొందరు ఈ హస్తమున వ్రేళ్ళు విడివిడిగా చాపబడియుండవలెనందురు.

"కట్యాః సమంతతో భ్రాంతిః కధ్యతేకటి రేచకః ॥
శిరోవినమనాత్, భ్రాంతిర్గ్రీవాయాః కంఠరేచకః ॥
పాఠాంతరవిధే స్త్వేనం (విధౌత్వేవం) లలితం పఠ్యతేయదాః ॥

తా॥ కటిని అన్ని ప్రక్కలకు త్రిప్పుట కటిరేచకమగును. తలవంచి మెడ ప్రక్కకు త్రిప్పుట కంఠరేచకము.

పాదరేచకము :- తొట్రుపడుట, చలించుట అనునవి పాదరేచకమందలి క్రియలు. వివిధ పాదగతులతో ఒక పార్శ్వమునుండి మరియొక పార్శ్వమునకు వెడలుట పాదరేచక మనబడుచున్నది.

కటిరేచగము :- త్రికస్థానము మీదికు త్తుట, కటిని గుండ్రముగ త్రిప్పుట పిమ్మట వెనుకకు లాగుట అనునవి కటిరేచకమందలి క్రియలుగా చెప్పిరి.

హస్తరేచకము :- హస్తమును పైకెత్తుట, క్రిందపడవేయుట, విసరుట, త్రిప్పుట, ముందునకు చాచుట అనునవి హస్తరేచకమందలి క్రియలు.

గ్రీవ (కంఠ) రేచకము :- కంఠమును పైకెత్తుట, క్రిందకు వంచుట. పక్కకువంచుట, త్రిప్పుట అనునవి గ్రీవారేచకమందలి క్రియలు,

## చారుల లక్షణము

భవేదౌణాదికత్వాదిఙ్ చరేః కరణభావయోః ।
కృదికారాత్కృతెజీషీసిద్ధంచారీత్యతః పదమ్ ॥

తా॥ "చర" ధాతువుపై ఉణాది సూత్రముచే (ఇఙ్) (ఇ) ప్రత్యయము, కరణము-భావము-అను నర్థమునందు వచ్చి ఆపై "కృదికారా దక్తినః "అనుపాణిని సూత్రముచే జీష్ (ఈ) ప్రత్యయముచేరి "చారీ" అను పదము సిద్ధించినది

"చార్యంకట్యాది పాదాంతచేష్టయైవ భవింతియత్ ।
వినియోగః పృథకాస్తాం నప్రత్యేకం భవేత్తతః ॥

తా॥ చారులు కటిమొదలు పాదములవరకుగల యంగముల చేష్ట చేతనే యేర్పడును గనుక వానికి ప్రత్యేకముగ వినియోగములు గలుగదు,

ధృవంపాదస్య యత్కర్మతత్ జంఘోరుకృతం యతః।
పాదజంఘోరు కరణంతతః కుర్యాద్ధ్రువంసమమ్ ॥

తా॥ పాదముచేయు పనియంతయు విజముగ జంఘులును, తొడలును చేయునదే కనుక పాదజంఘోరువుల వ్యాపారమును దిట్టముగ సమముగా చేయదగును.

(ప్రవర్తయేతే) చరణా ఊరుజంఘేయ తస్తతః ।
తుల్యత్వకరణాదేషాం పాదచారీ ప్రశస్యతే ॥

తా॥ చరణములును, పిక్కలును, తొడలును, నడుపును. కనుక ఈ మూడింటిని సమానముగ నడుపుటచే పాదచారి ప్రశస్తమగును,

"పాదస్యైకస్య యశ్చారః సచారీతి నిగద్యతే ।
కరణంపాదయోశ్చారః ఖండస్తుకరణైస్త్రిభిః ॥

తా॥ ఒక కాలిపని చారీయనబడును. రెండు పాదములది కరణమగును. మూడు కరణములచారము ఖండమనబడును,

ఖండైః త్రిభిశ్చతుర్భిర్వామండలం మిలితైర్మతమ్ ।
తౌయుద్ధేనియుద్ధేచ చక్రశక్త్యాదిమోచనే ।
నృత్తే నాట్యేచచారీభిర్వినాకించిత్ (నవర్తతే) ॥

తా॥ ఖండములు మూడో నాలుగోచేరి చేయుట మండలమగును, నడకయందు, యుద్ధమున బాహుయుద్ధమున, చక్రము, శక్తి మున్నగు వానిని ప్రయోగించుటయందును. చారులు, లేక నృత్తమందుగాని, నాట్యమందుగాని యేమియు సాగదు,

## పదునారు భూచారులు

శ్లో॥ సమపాదా స్థితావర్తా జనితాస్యందితామతా ।
తదాఽవస్యంధితాబద్ధా శకటాస్యాఽధవిచ్యవా ।
ఎలకాక్రీడితాచాషగతిరుత్స్యందితాఽడ్డితా ।
సమో సరితమత్తల్లీమత్తల్ల్యధ్యర్థికాతతః
ఊరూద్వృత్తేతి భూచార్యః షోడశైతాః ప్రకీర్తితాః ॥

తా॥ సమపాదము, స్థితావర్తము, జనితము, స్యందితము, అవస్యందితము, బద్ధము, శకటాశ్యము, విచ్యవము. ఏలకాక్రీడితము, బాషగతి, ఉత్స్యందితము, అడ్డితము. సమోసరితమత్తల్లి, మత్తల్లి, అధ్యర్ధికము, ఊరూద్వృత్తము యని పదివారు భూచారులుగ చెప్పిరి.

## షోడశ ఆకాశచారులు

శ్లో॥ అతిపార్శ్వాపపూర్వాఃస్యుః క్రాంతాః సూచీమృగప్లుతా ।
భుజంగత్రాసితాఽలాతాఽవిద్ధానూపురపాదికా ॥
అక్షిప్తా భ్రమరీదండా విద్యుద్భ్రాంతాభిదాతతః ।
ఊర్ధ్వజానురథోద్వృత్తాదోలాపాదేతి షోడశ ॥
ఆకాశిక్యఃస్మృతాశ్చార్యః ప్రాక్తనైః భరతాదిభిః ।
భూమ్యాకాశ చరత్వేన ప్రాయశస్తాస్తదాహ్వాయాః ॥

తా॥ అతిక్రాంతము, పార్శ్వకాంతము. అపక్రాంతము. సూచీమృగప్లుతము, భుజంగత్రాసితము, ఆలాతము, అవిద్ధము. నూపురపాదిక, ఆక్షిప్తము, భ్రమరి, దండము, విదుద్భ్రాంతము. ఊర్ధ్వజానువు, ఉద్వృతము, దోలాపాదము యని యీ పదునారు అకాశచారులును భరతముని మొదలగు ప్రాచీనులు చెప్పినారు.

ఎక్కువగా భూమియందును, ఆకాశమునందును చరించుటచేత ఆ పేర్లు వానికి కలిగినవి.

## భూచారుల లక్షణములు

### సమపాదచారీ లక్షణము

మడమలును, కాలిగోళ్ళను చేరికగానుండునట్లు నిలుచుండి రెండు పాదములను సమముగా ఒక్కొక్కటిగా నడుచునది సమపాదచారి.

### స్థితావర్తచారీ లక్షణము

తుది యరికాలితో నేలనురాచుచు మోకాళ్ళు రెండును స్వస్తికముగ నేర్పడునట్లు యింకొకప్రక్కకు కాలు సాగించవలయును. ఇట్లు లోపలి మండల మేర్పరుపవలయును. తరువాత రెండవకాలిని విడదీసి యెత్తి అట్లే తన పార్శ్వమునందే చేర్పవలయును. "నిది స్థితావర్తము" నిలచి నిలచి పరివర్తించును గనుక స్తితావర్తచారి యగును.

### జనితచారీ లక్షణము

ఒకచేయి పిడికిగినిబట్టి స్తనములకు చేరువగానుంచి ఇంకొకహస్తము త్రిప్పుచు అడుగు తల సంచరముగ నడుపుట "జనిత"మగును. దేశీమార్గము నెరిగిన కొందరు వీనిని "ముసలఘాటిక" అని పేర్కొనిరి.

### స్యందితచారీ లక్షణము

తొడలు క్రిందకుదించి యెడమకాలి యడుగు సమముగానుండగా కుడియడుగు ఐదుతాళముల నడిమికొలతయుండునట్లు చాచిన "స్యందితచారీ" యనబడును. (తాలమనగా చేతి బొటనవ్రేలు, నడిమివ్రేలు చాచినకొలత)

### అపస్యందితచారీ లక్షణము

అట్లే కాళ్ళు మార్చివేసినచో యది "అపస్యందిత" మనబడును. ఇవి నిజముగ ఆలీఢ-ప్రత్యాలీఢ స్తానములతో సమానమునేగాని అవి నిశ్చలములు. ఇవి చలనములు గనుక భిన్నములు.

### బద్ధచారీ లక్షణము

చిరుదొడలు పరస్పరము స్వస్తికముగ తగులుకొని తరువాత మోకాళ్ళు, తొడలు క్రిందికిచేరుట "బద్ధమ" చారీ యగును. (ఈ చారీలో స్వస్తికము విడదీసి అరికాళ్ళ కొనలతో మండలభ్రమణముచేసి తమ తమ పార్శ్వములకు చేర్చుట ఊరువలన మనదగునని కొందరు పండితులు అని యున్నారు.)

### శకటాస్యచారీ లక్షణము

పూర్వాంగము దిట్టముగ నిలుపుకొని యెదనుయెత్తి ఒక కాలిని తల సంచరముగ అడ్డముచాచి ఇంకొకకాలిని సమముగనుంచుకొనుట, "శకటాస్యచారీ" యనిరి, (దీనితో బండిని తోలుచుదురుగాన ఈ పేరు సార్థకము. కొందరు దీనియందు పాదమును అటునిటు కదలింపవలెనని కల్పింతురు.)

### విచ్యవచారీ లక్షణము

సమపాదచారియందు క్రమముగా అరికాలి కొనలతో నేలను తట్టుచు పాదములకు విచ్యుతి-పిడివడుట కలిగించినచో "అనివిచ్యవచారీ" యగును.

### ఏలికాక్రీడితచారీ లక్షణము

తలసంచార పాదములు క్రమముగా ఎగిరిపడుటగలది ఏలికాక్రీడిత చారి యగును.

### చాషగతి లక్షణము

కుడికాలొక తాలమంత ముందుకుచాచి ఆపై రెండుతాలములంత వెనుకకెత్తి యీడ్చి యెడమకాలితోగూడి నిలుచుట. ఇట్లు పలుసార్లుచేయుట "చాషగతిచారి" యగును.

### ఉత్స్యందిత లక్షణము

చిటికెనవ్రేలిమీది భాగముతోను, బొటనవ్రేలి యడుగుభాగముతోను క్రమముగా రేచికానుసారముగా పాదముసాగుచూ రాకపోకలు తిన్నగా

చేయుట "ఉత్స్యందిత" మనబడును. (కొందరు పండితులు దీనియందు రేచితమను నృత్తహస్తమను ప్రయోగింపవలెనందురు.

### అడ్డిత లక్షణము

ఒకపాదము సమస్థితిలోనుండగా రెండపది తలిసంచరమై క్రమముగా ముందు వెనుక భాగములతో ఒరయుచున్నది "అడ్డితచాలి" దీనికి "అగ్రథ" యనిపేరు ప్రసిద్ధముగానున్నదని ఆచార్య కీర్తిధరుడు వచించెను.

### సమోసరితమత్తల్లి లక్షణము

ఒకపాదము తలసంచరమై యదరుచుండగా ఇంకొకటి అట్లే స్వస్తికము చేయుచు చేరవలయును, ఇట్లు మార్చిమార్చి చేయునది సమోసరిత మత్తల్లి". ఇది నడుమంత్రపు మత్తు సూచించును. (స్వస్తికమును వదలి ఏకకాలమందే ఆదరుచున్న పాదములు రెండును మరిమరి చేరుకొనుట దీని లక్షణముగా కొందరు చెప్పుదురు. దీనికి "మత్తపాదము" అని ఇంకొక పేరు లోకమున ప్రసిద్ధముగా నున్నది.)

### మత్తల్లి లక్షణము

స్వస్తికము చేసిన చిరుతొడలపు, నిండుగా నేలమోచిన అరకాళ్ళను గల పాదములు కొంచెము ఎడముగా అదరుచుచేరుట. అప్పుడు హస్తములు ఉద్వేష్టితములును, అపవేష్టితములునుగా సాగుట-నిది మత్తల్లి, నిండు మత్తులో దీని వినియోగము. (అపసర్పణమని కొందరు స్ఖలత్పాదమని కొందరు దీనిని పేర్కొనిరి.)

### అధ్యర్ధిక లక్షణము

ఎడమపాదము కుడిఖాలిమడమ వద్దకి చేరినపుడు ఆ కుడికాలు ప్రక్కకు జరుగవలయును. ఇది "అధ్యర్ధిక"మని బుధులు యందురు.

### ఊరూద్వృత్త లక్షణము

తల సంచరముగానున్న ఒక కాలిమడమ ఇంకొక కాలిమీద భాగమును చూచుచుండగా దాని చిరుదొడ వంకరగానుండి రెండవకాలి చిరుదొడ వంకకు సాగియుండునది "ఊరూద్వృత్తము".

## ఆకాశచారులు - లక్షణములు

### అతిక్రాంతచారీ లక్షణము

పాదమును కొంచెముగ ముందుకుచాచి పాత్రస్వభావ భేదమును గమనించి, నాలుగు తాలములు మొదలుకొని అంతరముండునట్లు మీదికెత్తి తుదికాలితో నేలపైన పడవేయవలెను. దానిని "అతిక్రాంత" మందురు. భరతముని విశిష్టముగా చెప్పలేదుగాన అతని చిత్తమెరిగిన కీర్తిధరుడు పాదమును పార్శ్వమునందే పడవేయవలయునని చెప్పియున్నారు.

### పార్శ్వక్రాంత లక్షణము

ముడిచిన పాదమును అడ్డముగ ప్రక్కలో మీదికెత్తి ఉద్ఘట్టితముగా మోపుట "పార్శ్వక్రాంతము" రెండవకాలి తొడ సరిగా పాదమెత్తి ఉద్ఘటితముచే పడవేయవలలయునని "కీర్తిధరుడు'' దీని లక్షణము చెప్పెను. మరియు లోకవ్యవహారమునందు దీనికి "పార్ష్ణి ఛండఘాతము'' అని పేరు గలదనెను.

### అపక్రాంత లక్షణము

మొదలు బద్ధచారినిచేసి ముడిచినపాదము మీదికెత్తి దానిప్రక్కలో పెట్టునది "అపక్రాంతము'' (....పాదము మీదికెత్తి ప్రక్కలో న్యాసము చేయవలయును. దీనిపేరు విక్షేపదలనము అని కీర్తిధరుడు చెప్పినాడు.)

### సూచీచారీ లక్షణము

దముముడిచి మోకాలివరకుగాని, తొడవరకుగాని జంఘనుపాను

ముందరికి చాచి పాదాగ్రముతో నేలపై పడవేయవలయును. దీనిని "సూచీ చారీ" యందురు.

## మృగప్లుతచారీ లక్షణము

అతిక్రాంతచారికి చెప్పినపాదము నెత్తియెగిరి పడవేయవలయును. ఇంకొక కాలిపిక్కను వంకరయైన యడుగుతోనే వెనుకకెత్తివేయవలయును. ఇట్టిది "మృగప్లుతచారీ" యని పెద్దలందురు.

## భుజంగత్రాశిత లక్షణము

ముడిచిన పాదమును దాని పార్శ్వమున మోకాలుండునట్లుగా ఎత్తి త్ర్యశ్రముగానే తొడ మొదటి ప్రదేశమునకు త్రిప్పవలయును. "అది "భుజంగత్రాశితచారి" యగును. కాని దగ్గరచేరిన పామువలన భయమును నిది చూపును గనుక, నిది భుజంగత్రాశిత మగుచున్నది.

## ఆ లా త ల క్ష ణ ము

వెనుకకు చాచిన పాదము త్రిప్పి లోపలికిదాల్చి దాని యరికాలికి ఇంకొక కాలితొడ యెదురగునట్లుచేసి మడమతో తన ప్రక్కలో నేలకువేయ వలెను. ధీనిని నృత్తజ్ఞులు "అలాత" మందురు.

## అ వి ద్ధ ల క్ష ణ ము

ముడిచిన పాదమును చిరుదొడలు విడిపడిన స్వస్తికమువలే చేసి ముందుకుచాచి దాని ప్రక్కకు మరలద్రోసి ఇంకొక కాలిమడమచెంతకు, తన మడమతో వేయుట "అవిద్ధ" మనబడును. కొందరు దీనిని అక్షిప్తావిద్ధమని పేర్కొనిరి.

## నూపురపాదిక లక్షణము

వంచిన పాదమును మడమ పిరుదుదిన్నెను తాకువరకును వెనుకకు తీసుకొనిపోయి దాని పార్శ్వమునందే వంచిన డిక్కుతో వేగముగా నేలబడ

వేయవలెను. నిది "నూపురపాదిక" యగును. (అందము ననుసరించి పాదము, పాదము పిరుదుదిన్నెకీవలనే యుండదగునని జాయవ సేనాని యభిప్రాయము.)

### ఆ క్షి ప్త ల క్ష ణ ము

మూడుతాలముల యెత్తు ముడిచినకాలెత్తి మరల జంఘా-స్వస్తికము చేసి మడమతో ఎడమప్రక్కకు వేయవలయును, ఇది ఆక్షిప్తము." దీనికి "ఖండేచింత" (?) అను మూరుపేరు గలదు.

### భ్ర మ రీ ల క్ష ణ ము

ఒకపాదముచే భుజంగత్రాశితము చేయుచు రెండవ యరికాలితో వేగముగా శరీరమును ద్రిప్పుట "భ్రమరీచారి" యందురు,

### దండపాద లక్షణము

నూపుర పాదమున చెప్పిన క్రియచేసి మరల ముడిచిన కాలిని తన దేహమున కెదురుగా మోకాలి మొదలు క్రియసాగునట్లుగా వేగముగా చాయవలయును. దీనిని పండితులు "దండపాద" మందురు.

### విద్యుద్భ్రాంత లక్షణము

అడ్డము తిరిగి వీపును తాకిన పాదమును వెనుకకు చాచి మేదిక్రింది పక్కలలో మండలాకారముగా త్రిప్పినగో అవి "విద్యుద్భ్రాంతము" ఇది చేసిచూపుట చాలాకష్టము.

### ఊర్ధ్వజానువు లక్షణము

ముడిగిన పాదము, మోకాలును, స్తనములను సరికొలతలో నుండు నట్లు ఎత్తవలయును. అప్పుడు రెంపవపాదము తిదలకుండవలెను. దీనిని పెద్దలు "ఊర్ధ్వజానువు" యని చెప్పిరి,

### ఉ ద్వృ త ల క్ష ణ ము

ఇంకొక తొటమీదికి మడమచేరునట్లు అవిద్ధపాదమును బెట్టి యెగిరి బాహ్యభ్రమరిచేసి నేలమీధ వేయవలయును. ఇది "ఉద్వృత్తమని" అందురు. ఇది వ్యవహారమున "భూచారమనోవర్త" అనబడుచున్నది.

### డోలాపాద లక్షణము

కుంచితపాదము మీదికెత్తి ప్రక్కలలో ఉంచును, మడమతో తన ప్రక్కన నేలపై బెట్టుట "డోలాపాదము" యగును. ఒకప్పుడు పాదము ప్రధానముగ, మరొకప్పుడు హస్తము ప్రధానముగ, ఇంకొకప్పుడు రెండును ప్రధానముగా నుండును. విది అందము ననుసరించి ప్రయోగముగే తెలుసు కొనవలయును.

## మం డ ల ము లు :-

ఆకాశగములు, భూమిగములు అనెడి భేదములచే "మండలములు" రెండు విధములు, ఆకాశగములైన మండలములు పది. భూమిగములైన మండలములు పది. మొత్తము మండలములు ఇరువదిగా చెప్పియుండిరి.

## ఆకాశకీ మండలములు 10

అతిక్రాంత-విచిత్ర-లలితసంచర - సూచీవిద్ధ-దండపాద - విహృత-అలాతక-వామివిద్ధ-లలిత-క్రాంత భేదములచే, ఆకాశకీ మండలములు పది విధములు.

1. అతిక్రాంతము :- దక్షపాదముచే క్రమముగా, జనిత శకటాస్యచారులను ఆచరింపవలయును, పిమ్మట వామ-దక్షిణములచే క్రమముగా అలాంతక-పార్శ్వక్రాంతవాదులడు. తిరువాతవారు పాదముచే సూచీచారినీ దక్షణపాదముచే అపక్రాంతచారినీ, మరల వామపాదముచే క్రమముగా సూచీ భ్రమరిచారులను, తిరిగి దక్షణపాదముచే ఉద్వృత్తచారిని, వామపాదముచే

అలాథచారిని (అలాతచారిని భ్రమరీచారిగా మార్పునొందించవలయును.) పిమ్మట వామదక్షణ పాదములచే క్రమముగా, అతిక్రాంత-దండపాదచారులను ఆచరించవలయును. యే వ్యాయామమునే "అతిక్రాంత" మండలమని యందురు.

విచిత్రము :- దక్షిణ పాదముచే జనిత-పార్శ్వక్రాంతచారుల నాచరింపవలయును, పిమ్మట వామపాదముచే స్యందితచారిని దక్షిణపాదముచే పార్శ్వక్రాంతచారినీ మరల వామపాదముచే సూచీచారినీ దక్షిణపాదమునే అపక్రాంతచారిని ఆచిరింపవలయును. పిమ్మట క్రమముగా వామపాక్షముచే భుజంగత్రాసితచారిని దక్షిణపాదముచే అతిక్రాంతచారిని దక్షణపాదముచే ఉద్వృత్తచారిని, వామపాదముచే అలాంతచారిని, దక్షణపాదముచే పార్శ్వకాౄంతచారిని, వామపాదముచే సూచీచారిని, దక్షిణపాదముచే విక్షిప్తచారిని. వామపాదముచే అపక్రాంతచారిని అచరించవలయును. ఈ న్యాయము విచిత్రమండల మనబడుచున్నది.

3. లలిత సంచరము ;- దక్షణ పాదమును ఊర్ధ్వజానుచరణముగావించి సూచీచారిని ప్రయోగింగవలెను. వామపాదముచే అతిక్రాంతచారిని దక్షణపాదముచే పార్శ్వక్రాంతచారిస కావించవలయును. మరల వామపాదముచే సూచీభ్రమరచారులను పిమ్మట క్రమముగా దక్షిణపాదముచే పార్శ్వకాౄంతచారిని, వామపాదముచే అతిక్రాంతచారిని, దక్షిణపాదముచే సూచీచారిని, వామపాదముచే ఆపక్రాంతచారిని ఆచరింపవలయును. తరువాత దక్షణపాదముచే పార్శ్వక్రాంతచారి, వామపాదముచే ఆతిక్రాంతచారిని ఆచరించవలయును. (ఈ చివరి అతిక్రాంతచారిని భ్రమరీచారిగా మార్పునొందించవలయును.) దీనిని లలితసంచర మండలమందురు.

4. సూచీవిద్ధము ;- వామపాదముచే వరుసగా సూచీ - భ్రమరక చారులను ప్రయోగించి దక్షణపాదముచే పార్శ్వక్రాంతచారిని ప్రయోగించి

వామపాదముచే అతిక్రాంతచారిని గావించవలయును. మరల క్రమముగా దక్షిణపాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంతచారిని, దక్షిణపాదముచే పార్శ్వక్రాంతచారిని ప్రయోగించవలయును. ఇది సూచివిద్ధ మండలమనబడును.

5. దండపాదము :- క్రమముగా దక్షిణపాదముచే జనిత - దండపాదచారులను వామపాదముచే సూచి-భ్రమరికచారులను ప్రయోగించవలెను. మరల దక్షిణపాదముచే ఉద్వృత్తచారిని, వామపాదముచే అలాతకచారిని పిమ్మట దక్షిణపాదముచే పార్శ్వక్రాంత భుజంగత్రాసితచారులను వామపాదముచే అతిక్రాంతచారిని తరువాత దక్షిణపాదముచే దండపాదచారిని, వామపాదముచే సూచీచారిని ప్రయోగించి త్రికమును అపవర్తము చేయవలయును. (భ్రమరీచారి ఇందు సూచికము) ఇది "దండపాద" మండలమనియందురు.

6. విహృతము :- దక్షిణపాదముచే జనితచారిని ప్రయోగించి నికుట్టకముచేసి (ఇచ్చట అగ్రతల సంచరపాదము సూచికము) వామపాదముచే అస్కందితచారిని ప్రయోగించవలయును. మరల దక్షిణ పాదముచే ఉద్వృత్తచారిని, వామపాదముచే అలాతకచారిని. దక్షిణ పాదముచే సూచీచారిని, వామపార్శ్వముచే పార్శ్వక్రాంతచారిని. దక్షిణ పాదముచే ఆక్షిప్తచారిని భ్రమరక-దండపాదచారులను క్రమముగా ప్రయోగించవలెను. వామపాదముచే సూచీచారిని ప్రయోగించి త్రికమును పరివర్తము చేయవలయును. తరువాత దక్షిణపాదముచే భుజంగత్రాసచారిని. వామపాదముచే అతిక్రాంతచారిని ప్రయోగించవలయును. ఇట్టి చారీప్రయోగము విహృతమండలమగును.

7. అలాతకము (అలాతము) :- దక్షిణపాదముచే సూచిచారిని వామపాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలయును. మరల దక్షిణ

పాదముచే పార్శ్వక్రాంతచారిని. వామపాదముచే అలాతకచారిని ప్రయోగించ వలయును. మరల ఈ చారులనే పర్యాయముగా ఆరుసార్లుగాని. ఏడుసార్లు గాని లలితపాద విన్యాసములలో ప్రయోగించి అంతమున దక్షిణపాదముచే అపక్రాంతచారిని, వామపాదముచే అతిక్రాంత-భ్రమరకచారులను కావించ వలయును. ఇట్టిది అలాతక మండలమందురు.

8. వామవిద్ధము (వామబంధము) :- దక్షిణపాదముచే సూచీచారిని వామపాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలయును, మరలదక్షిణ పాద ముచే దండపాదచారిని, వామపాదముచే సూచీచారిని దక్షిణపాదముచే భ్రమ రక-పార్శ్వక్రాంతచారులను వామపాదముచే ఆక్షిప్తచారిని క్రమముగా ప్రయోగించవలయును. పిమ్మట దక్షిణపాదముచే దండపాద-ఊరూద్వృత్త చారులను వామపాదముచే సూచీ-భ్రమరకచారులను మరల వామపాదముచే అలాతకచారిని, దక్షిణపాదముచే పార్శ్వక్రాంతచారిని ప్రయోగించవలెను. ఇట్టిది వామవిద్ధ (వామబంధ) మండలమగును.

9. లలితము :- దక్షిణ పాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంతచారి ప్రయోగించవలయును. మరల దక్షిణపాదముచే పార్శ్వ క్రాంత భుజంగత్రాసితచారులను, వామపాదముచే అతిక్రాంతచారిని మరల దక్షిణపాదముచే ఆక్షిప్తచారిని వామపాదముచే అతిక్రాంత-ఊరూద్వృత్త అలాతచారులను మరల దక్షిణపాదముచే పార్శ్వక్రాంతచారిని, వామపాద ముచే సూచీచారిని దక్షిణపాదముచే అపక్రాంతచారిని. వామపాదముచేలలిత సంగర పాదములతో అతిక్రాంతచారిని క్రమముగా ప్రయోగించవలెను.

10. క్రాంతము :- దక్షిణపాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలయును. పిమ్మట దక్షిణ-వామపాదములు రెండింటిచే పార్శ్వక్రాంతచారిని ఆచరించి వీనినే మరల పర్యాయముగా ప్రయోగించవలయును, పిమ్మట వామపాదముచే సూచీచారిని, దక్షిణపాద

ముచే అపక్రాంతచారిని కావించవలయును. స్వభావగమనమందీ "క్రాంత మండలము" ప్రయుక్తమగును. గమనము (క్రాంతము) గలవిగాన ఇది క్రాంతమండల మనబడినదని ప్రయోక్తలు తెలియవలయును. (ఇవి ఆకాశ గములైన పది మండలములుయని తెలియవలయును.

## భౌమ (భూమిగములైన) మండలములు :-

భ్రమర. ఆస్కందిత, అవర్త, సమోత్సారిత. ఏడకాక్రీడిత, అడ్డిత, శకటాస్య, అద్యర్ధిక, పిష్టకుట్ట, చాషగత భేదములచే భౌమ మండలములు పది విధములు.

1. భ్రమరము :- క్రమముగా దక్షిణపాదముచే జనితచారిని వామ పాదముచే ఆస్పందితచారిని, దక్షిణపాదమునే శకటాస్యచారిని కావించి వామ పాదమును ప్రసారితమును చేయవలయును. పిమ్మట దక్షిణపాదముచే భ్రమ రకచారిని (త్రికపరివర్తనము) వామపాదముచే ఆస్పందితచారిని కావించ వలయును. మరల దక్షిణపాదముచే శకటాస్యచారి నొనర్చి వామపాదమును వెనుకకుచాచి భ్రమరక- ఆస్పందిత (ఆస్కందిత-స్పందిత-స్యందిత) చారుల నొనర్పవలయును. ఇట్టిది భ్రమరమండల మనబడును,

2. ఆస్కందితము :- దక్షిణపాదముచే భ్రమరకచారిని.వామపాద ముచే అడ్డితచారిని గావించవలయును, దక్షిణపాదముచే భ్రమర-శకటాస్య-ఊరూద్వృత్తచారులను, వామపాదముచే అపసర్పిత - భ్రమరకచారులను ప్రయోగించవలయును. పిమ్మట దక్షిణపాదముచే ఆస్కందితచారిని, వామ పాదముచే శకటాస్యచారిని గావించి ఆ పాదముచేతనే ఆస్ఫోటనము చేయ వలయును. ఇట్టిది ఆస్కందిత" మండల మనబడును. ఇది యుద్ధపరిక్ర మోపియగు మండలము.

3. అవర్తనము :- దక్షిణపాదముచే జనితచారిని గావించి వామ పాదముచే నిక్కుట్టితము చేయవలెను, మరల దక్షిణపాదముచే శకటాస్య

ఊరూద్వృత్తచారులను, వామపాదముచే వెనుకకుచాచి చాషగతిచారిని ప్రయోగి చపలెను. పిమ్మట దక్షణపాదముచే ఆస్కందితచారిని, వామపాద ముచే శకటాస్యచారిని ప్రయోగించి దక్షణపాదముచే భ్రమరకచారి నొనర్చి త్రికమును పరివర్తనముచేసి వామపాదమును వెనుకకు చాయవలయును. ఇట్టిది "అవర్తక" మండల మనబడును.

4. సమోత్సారితము :- మొదట సమపాద స్థానమందు నిలచి హస్తములను చాచవలెను. సన్నిహితములును, ఊర్ధ్వతలములును అయిన ఆ హస్తములతో ఆవేష్టన ఉద్వేష్టనముల నొనర్చి పిమ్మట ఆ హస్తము లను నడుముమీద ఉంచవలెను. మొదట దక్షణహస్తమును, పిమ్మటవామ హస్తమును ఆవర్తనము చేయనలెను. మరల దక్షణహస్తమును కటియం దుంచి వామహస్తమును పరివర్తనము చేయవలయును. పిమ్మట పర్యాయ ముగా ఈ చారితోనే భ్రమర మొనర్పవలయును. ఇట్టిది "సమోత్సారిత" మండల మనబడును.

5. ఏడకా (ఏలకా) క్రీడితము :- భూమిమీదనున్న పాదముతో సూచీవిద్ధ ఏడకాక్రీడితచారుల నొనర్చి త్రికవివర్తనముతో భ్రమరీచారినొనర్ప వలయును. పిమ్మల పాధములను పర్యాయముగా త్రిప్పుచు సూచీవిద్ధ, అప విద్ధచారులను ప్రయోగించవలయును ఇట్టిది "ఏడకాక్రీడిత" మండల మన బడును. దీనికి వేరొక పేరు "ఖండమండల" మనియు గలదు.

6. అడ్డితము :- దక్షణపాదముచే ఉద్ఘట్టితచారి చోనర్చి ఆవర్త నముచేసి అవస్పంజితచారిని ప్రయోగించి వామపాదముచే శకటాస్యచారి నొనర్చవలయును. పిమ్మట దక్షణపాదము వెనుకకుచాచి దానిచే చాషగతిని వామపాదముచే అడ్డతచారిని ప్రయోగించవలయును. మరల దక్షణపాదముచే అపక్రాంతచారిని, వామపాదముచే భ్రమరకచారిని మరల దక్షణపాదముచే ఆస్కందితచారిని గావించి ఆస్ఫోటనము చేయవలయును, ఇట్టిది "అడ్డిత" మండల మనబడును.

7. శకటాశ్యము :- దక్షిణ పాదముచే జనిత-పార్శ్వక్రాంత శకటాస్యచారులను వామపాదముచే అస్కందితచారిని ప్రయోగించవలయును. పిమ్మట రెండుపాదములచే పర్యాయముగా శకటాస్యచారిని ప్రయోగించవలయును. ఇట్టిది "శకటాస్య" మండల మనబడును. ఇది యుద్ధపరిక్రమమందుపయుక్తమగును.

8. అద్యర్థిక (అధ్యర్థము) :- దక్షిణపాదముచే జనిత అస్కందిత చారులను గావించి వామపాదముచే అపసర్పణము ను చేయవలెను. పిమ్మట దక్షిణపాదముచే శకటాస్యచారిని ప్రయోరించి మరల వానినే పర్యాయిముగా ప్రియోగించవలయును. ఇట్టిది "అద్యర్థిక" మండల మనబడును. ఇది యుద్ధ నియుద్ధముల రెండింటియందును ఉపయుక్తమగును.

9. పిష్టకుట్టము :- దక్షిణపాదముచే సూచీచారిని వామపాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలయును. మరల క్రమముగా దక్షిణ-వామ పాదములచే భుజంగత్రాసితచారిని ప్రయోగించవలయును. ఇట్లు భుజంగ త్రాసితచారితో మండలభ్రమణ మొనర్చుట "పిష్టకుట్టమండల"మనబడును.

10. చాషగము :- చాషగతిచారీ పాదములతో మండల పరిక్రమ మొనర్చుట "చాషగతమండల" మనబడును. ఇదియు యుద్ధ నియుద్ధము ముల రెంటికిని ఉపయుక్తము (ఇవియే భౌమమండలములు పది.)

## కరణ లక్షణములు - వినియోగములు

## కరణములు 108

| | |
|---|---|
| 1. పుష్పపుటము | 7. స్వస్తిక రేచకము |
| 2. వర్తితము | 8. మండల స్వస్తికము |
| 3. వలితోరుకము | 9. నికుట్టకము |
| 4. అపవిద్ధము | 10. అర్ధనికుట్టకము |
| 5. సమనఖము | 11. కటిచ్ఛిన్నము |
| 6. లీనము | 12. అర్ధరేచితము |

13. వక్షస్స్వస్తికము
14. ఉన్మత్తకము
15. స్వస్తికము
16. పృష్ఠస్వస్తికము
17. దిక్స్వస్తికము
18. అలాతకము
19. కటీసమము
20. ఆక్షిప్త రేచికము
21. విక్షిప్తాక్షిప్తము
22. అర్ధస్వస్తికము
23. అంచితము
24. భుజంగత్రాసితము
25. ఊర్ధ్వజాను
26. నికుంచితము
27. మత్తల్లి
28. అర్ధమత్తల్లి
29 రేచక నికుట్టితము
30. పాదాపవిద్ధము
31. వలితము
32. ఘూర్ణితము
33. లలితము
34. దండపక్షము
35. భుజంగత్రస్త రేచితము
36. నూపురము
37. వైశాఖ రేచితము
38. భ్రమరకము
39. చతురము
40. భుజంగాంచితము
41. దండక రేచితము
42. వృశ్చికకుట్టితము
43. కటిభ్రాంతము
44. లతావృశ్చికము
45. ఛిన్నము
46 వృశ్చిక రేచితము
47 వృశ్చికము
48. వ్యంసితము
49. పార్శ్వనికుట్టకము
50. లలాట తిలకము
51. క్రాంతకము
52. కుంచితము
53. చక్రమండలము
54. ఉరోమండలము
55. అక్షిప్తము
56. తలవిలాసితము
57 అర్గళము
58. విక్షిప్తము
59. ఆవృతము
60. డోలపాదకము
61. వివృత్తము
62. వినివృత్తము
63. పార్శ్వక్రాంతము
64. నిశుంభితము
65. విద్యుద్భ్రాంతము
66. అతిక్రాంతము
67. వివర్తితము
68. గజక్రీడితము
69. తలసంస్ఫోటితం
70. గరుడప్లుతము
71. గండసూచి
72. పరివృత్తము

73. పార్శ్వజానువు
74. గృధ్రావలీనకము
75. సన్నతము
76. సూచి
77. అర్ధసూచి
78. సూచివిద్ధము
79. అపక్రాంతము
80. మయూర లలితము
81. సర్పితము
82. దండపాదము
83. హరిణప్లుతము
84. ప్రేంఖోలితము
85. నితంబము
86. స్ఖలితము
87. కరిహస్తము
88. ప్రసర్పితము
89. సింహవిక్రీడితము
90. సింహాకర్షితము
91. ఉద్వృత్తము
92. ఆపశ్కృతము
93. తలసంఘట్టిత్తము
94. జనితము
95. అవహిత్థము
96. నివేశము
97. ఏలతా క్రీడితము
98. ఊరుద్వృత్తము
99. మదస్ఖలితము
100. విష్ణుక్రాంతము
101. సంభ్రాంతము
102. విష్కంభము
103. ఉద్ఘట్టితము
104. వృషభ క్రీడితము
105. లోలితము
106. నాగాపసర్పితము
107. శకటాశ్యము
108. గంగావతరణము

1. పుష్పపుటము :- వామభాగమున ప్రక్కగ పుష్పపుటహస్తము నాచరించి, కుడిపాదమును అగ్రతల సంచరముచేసి, నడుమును సన్నముగ నుంచినయెడల పుష్పపుటమగును. ఇది దేవపుష్పాంజలులు సమర్పించు నప్పుడు వినియోగించును.

2. వర్తితము :- చేతులయొక్క మణికట్లు దగ్గరవంచి హస్తములతో వ్యావృత్త పరివృత్తముల నాచరించి అరచేతులను బయటకు త్రిప్పి చేతులను వాల్చినయెడల వర్తితకరణ మగును.

3. వలితోరుఖము :- హస్తములతో సుకతుండ ముద్రలాచరించి హృదయమువద్ద వ్యావృత్త పరివృత్తము లాచరించి, ఊరుభాగములను వలితముగాచేసినచో "వలితోరుఖ" మగును. ఇది ముగ్ధనాయికావస్థయందు చెల్లును.

4. అపవిద్ధము :- శుకతుండ హస్తములు నావృతముగాసల్పి వామ హస్తమును తొడపై భాగమునందుంచి, కుడిచేతిని వక్షస్థలమునందుంచిన యెడల "అపవిద్ధ" కరణమగును, ఇది అసూయ, మత్సరము. కోపములందు వినియోగించును.

5. సమనఖము :- రెండు పాదములు కలిపి సమముగానుంచి, చేతులను వాల్చి సమపాద, సమదృష్టులలో నిలచినయెడల "సమనఖ" మగును, ఇది నాట్యారంభమునందు వినియోగించును.

6. లీనము :- హృదయమువద్ద పతాకాంజలులు హస్తములుంచి మెడను ముందుకుచాచి, తలను పైకెత్తి, రెండుభుజములను ఎత్తివుంచి, తలను ఇరుభుజములపై వ్రాలియుండునట్లు చేసిన "లీనకరణ" మగును. ఇది అభివందనము, నమస్కారము, ప్రార్థనాదులయందు వినియోగించును.

7. స్వస్తిక రేచితము :- హస్తములను వక్షస్థలము దగ్గర రేచితాకృతిలో అవిద్ధముగ నేర్పరచి, తదుపరి కటిప్రదేశమునందుంచిన యెడల "స్వస్తికరేచిత" మగును. ఇది కేవలము నృత్తవిన్యాసములందు చెల్లును.

8. మండల స్వస్తికము :- హస్తములను స్వస్తికాకృతిగాచేసి ముందునకు, పైకి, మండలాకృతిగా క్రమవిన్యాసము సల్పినయెడల స్వస్తిక మగును. దీనినే మండల స్వస్తికమందురు,

9. నికుట్టకము :- హస్తములను, భుజశిరస్సులవద్ద నికుట్టితములుగా నేర్పరచి, పాదములుకూడా నికుట్టితములుగా నేర్పరచినయెడల "నికుట్టిక" మగును, ఇది శరీర వ్యాయామము. నృత్తవిన్యాసములందు వినియోగించును.

10. అర్ధనికుట్టికము :- భుజశిరస్సుల దగ్గర, హస్తముల వ్రేళ్ళను అభిముఖములగునట్లు ఆంచితముగనుంచి, పైని కుట్టకమును అర్ధాకృతిగా నాచరించిన అర్ధనికుట్టకమగును. ఇది మనోభావమును వెలిబుచ్చునప్పుడు వినియోగించును.

11. కటిచ్ఛిన్నము ;- బాహుశిరస్సులకు సమానముగ పల్లవ హస్తములాచరించి, తల, నడుము, హస్తములను గుండ్రముగా త్రిప్పిన యెడల "కటిచ్ఛిన్న" మగును. ఇది ఆశ్చర్యము, అద్భుతము ,అనందాదు లలో చెల్లును.

12. అర్ధరేచితము :- హస్తములను అపవిద్ధములుగాచేసి సూచి ఆకారములోనుంచి, పార్శ్వమును నన్నతముచేసి. పాదములు నికుట్టకముగా చేసినయెడల అర్ధరేచితమగును.

13. వక్షస్వస్తికము :- పాదములను స్వస్తికములుగాచేసి, వక్షస్థలమును ముందునకుచాచి, హస్తములను హృదయమువద్ద స్వస్తికరేచిత విన్యాసము సలిపిన వక్షస్వస్తికమగును. ఇది మానము. అభిమానము, సిగ్గు, అవమానాదులందు చెల్లును.

14. ఉన్మత్తకము :- పాదమును అంచితముగచేసి. హస్తములు రేచితములుగ సలిపిన "ఉన్మత్తకరణ" మగును. ఇది ఉన్మత్తభావము గర్వాదులయందు వినియోగించును.

15. స్వస్తికము ;- హస్తపాదాదులు స్వస్తికాకారముగా చేసిన యెడల స్వస్తికమగును. ఇది ధైర్యోత్సాహములందు వినియోగించును.

16. పృష్ఠస్వస్తికము :- హస్తములను విక్షిప్తాక్షిప్తములుగాచేసి, పాదములు స్వస్తికములుచేసి అపక్రాంత, అర్ధసూచి విన్యాసములు చూపిం

చినయెడల పృష్టస్వస్తికమగును. ఇది జపము. ప్రార్థన, నృత్తవిన్యాసాదు లందు చెల్లును.

17. దిక్స్వస్తికము :- పార్శ్వ అగ్రభాగములందు స్వస్తికములను చేర్చిపట్టి. పాదములు స్వస్తికాకారముగ ఏర్పరచిన దిక్స్వస్తికమగును. ఇది వివిధ దిక్కులందు విన్యాసము సల్పునపుడు వినియోగించును.

18. అలాతకము ;- పాదముతో అలాతకము నాచరించినచో అలాతక మగును. ఇది మండలాకార నృత్తవిన్యాసము. చారిలాస్య నటనము నందు వినియోగించును.

19. కటిసమము :- స్వస్తికాకృతులుగా నేర్పరచిన పాదములను విడతీసి, హస్తములు ఒకటి నాభివద్దను, మరియొకటి కటిభాగమునను, క్రమముగానుంచి ముందునకుపైకి శరీరమును విన్యానము సల్పినయెడల కటిసమమగును. ఇది సూత్రధారాదులుతో వినియోగించును.

20. అక్షిప్త రేచితము :- ఎడమచేతిని, హృదయమువద్దనుంచి కుడిచేతితో అక్షిప్తరేచిత, రేచిత, అపవిత్థ విన్యాసముల నాచరించినయెడల అక్షిప్తరేచిత మగును. ఇది వెనుకకు త్రోసివేయుట, ముందునకు త్రోసి వేయుటలయందు వినియోగించును.

21. విక్షిప్తాక్షిప్తము :- హస్తపాదములు మొదటి విక్షిప్తములు గాను, తదుపరి అక్షిప్తములుగాను ఆచరించినచో విక్షిప్తాక్షిప్తమగును. ఇది లేడిగమనము, ఆలోచనాదులయందు వినియోగమగును.

22. అర్ధస్వస్తికము ;- పాదములు స్వస్తికాకృతులుగాచేసి, కుడి చేతితో కరిహస్త మాచరించి, ఎడమచెయ్యిని వక్షస్థలమువద్ద నుంచినచో అర్ధస్వస్తికమగును. ఇది ''నేనేమి చేయుదును" అను అర్థములందు వినియోగించును.

33. అంచితము :- పైన ఉదహరించిన హస్తములను, వ్యావృత్త పరివృత్తములుగాచేసి నాసికాగ్రభాగమందు అంచితములుగా చేసినచో అంచితమగును.

24. భుజంగత్రాసితము :- ఒకకాలిని కుంచితముచేసి పైకియెత్తి తిగ్మ్రముగ తొడనుచేర్చి కటిప్రదేశమునందు మోకాలిని వివర్తనముగ నాచరించినయెడల భుజంగత్రాసిత మగును. ఇది సర్పాకృతి, పినాకపాణు లందు చెల్లును.

25. ఊర్ధ్వజాను :- కాలిని కుంచితముచేసి, మోకాలిని కటిప్రదేశ మువరకు ఎత్తివుంచి, చేతులను నృత్యోపయోగమునకు వీలగునటుల విశాల ముగ నాచరించినయెడల ఊర్ధ్వజానువగును. ఇది నృత్తవిన్యాసములందు వినియోగించును.

26. నికుంచితము ;- ఒక పాదముతో వృశ్చికకరణ మాచరించి ఎడమచెయ్యి కంఠమునకు ప్రక్కగాను, కుడిచెయ్యి ముక్కు చివరభాగము నందు నికుంచితముగ నాచరించినచో నికుంచిత మగును.

27. మత్తల్లి :- కుడి, ఎడమ పాదములతో జరుపుచు. పాదము లను కలుపుచు, మరల చేర్చుచు, గమనముల నాచరించి హస్తములలో ఉద్వేష్టితాపవిద్ధముల నాచరించినయెడల మత్తల్లికరణ మనుచున్నది. ఇది ఉన్మత్తభావమునందు ఉద్రేకతాండవములందు వినియోగించును.

28. అర్ధమతల్లి ;- పాదములను స్ఖలితాపసృతములుగ నేర్పరచి, ఎడమహస్తము రేచితముగను, సవ్యహస్తమును కటిప్రదేశమందుంచిన అర్ధమత్తల్లి యగును,

29. రేచిక నికుట్టితము :- దక్షణహస్తమును రేచితముగ నాచ రించి వామహస్తము డోలాకారముగానుంచి సవ్యపాదముతో నికుట్టిత

మాచరించిన రేచిక నిక్కుట్టితమగును. ఇది ఊయలనూగుట, వ్రేలాడుట మున్నగువాని అభినయమునందు చెల్లును.

30. పాదాపవిద్ధము :- నాభిప్రదేశమునందెదుట భాగములుగ కటకాముఖహస్తములబట్టి పాదములతో నూచివిద్ధ, అపవిద్ధ క్రమములనాచరించినచో పాదాపవిద్ధ మగును.

31. వలితము :- అపవిద్ధ హస్తమును, సూచిపాదమును ఏర్పరచి వివృత్తత్రిక మాచరించి తిరిగిన వలితమగును.

32. ఘూర్ణితము :- దక్షిణహస్తము వర్తిత ఘూర్ణితముగనుం ఎడమచెయ్యి డోలాకృతిగవుంచి పాదములతో స్వస్తికాపసృతముల నేర్పరచినచో ఘూర్ణితమగును.

33. లలితము :- వామహస్తముతో కరిహస్తమును. దక్షిణహస్తమును అపవర్తితముగ నాచరించి పాదమును కుట్టితము చేసినయెడల లలితకరణమగును. ఇది శృంగార నటనమునందును, లాస్యపాత్రాభినయనము లందును వినియోగింనును.

34. దండపక్షము :- లతాహస్తముల నాచరించి, ఊర్ధ్వజానుకరన్యాసము చేసినచో దండపక్షమగును.

35. భుజంగత్రస్త రేచితము :- హస్తములతో భుజంగత్రాసితమును. రేచితముగ నాచరించి హస్తమును వామపార్శ్వముగ నుంచినయెడల భుజంగత్రస్త రేచితమగును.

36. నూపురము :- లతాహస్తములు రేచితములుగాచేసి త్రికవలతములో నాచరించి పాదములు నూపురముగ నుంచియున్న నూపురకరణమగును.

37. వైశాఖ రేచితము :- వైశాఖ స్థానములోనుండి హస్తపాద, కటి, గ్రీవములను రేచితములుగ చేసినయెడల వైశాఖరేచితమగును. ఇది ముందునకు నడచుట. నృత్తవిన్యాసాదులయందు వినియోగించును.

38. భ్రమరము :- పాదములను అక్షిప్తస్వస్తికములుగ నేర్పరచి. హస్తములను ఉద్వేష్టిత రేచితముగ నేర్పరచి, వలనములో త్రికము నాచరించినచో భ్రమరకరణము వచ్చును. ఇది భ్రమరీ నృత్యము, భృంగ నాట్యములందు వినియోగించును.

39. చతురము :- వామహస్తము అంచితముగను, దక్షిణహస్తము చతురముగనుచేసి, దక్షిణపాదముతో కుట్టినమాచరించియెడల చతురమగును.

40. భుజంగాంచితము :- పాదమును భుజంగత్రాసితముగ నాచరించి దక్షిణకరమును చతురముగచేసి వామకరమును లతాకృతిగచేసినచో భుజంగాంచితమగును. ఇది అధికోత్సాహము, విదూషకపాత్రలందు వినియోగమగును.

41. దండక రేచితము :- హస్తపాదములను విక్షిప్తములోనికి విడివిగ నాచరించిన తరువాత హస్తములను రేచితములుగ నాచరించిన యెడల దండకరేచిత మగును.

42. వృశ్చికకుట్టితము :- పాదములతో వృశ్చికవిన్యాస మొనర్చి రెండు హస్తములతో నికుట్టిత మాచరించిన వృశ్చికకుట్టిత మగును.

43. కటిభ్రాంతము :- దక్షిణపాదముతో సూచివిన్యాసము సల్పిన తరువాత అపవిద్ధము నాచరించి, కటిప్రదేశము రేచితములుగ నాచరించిన యెడల కటిభ్రాంతమగును.

44. లతావృశ్చికము :- కుడిపాదము వెనుకకువంచి, కుడిచెయ్యి

అభయహస్తముగబట్టి, ఎడమచెయ్యి పైకెత్తి, చేతి వ్రేళ్ళనువంచి, లతా హస్తముగ విన్యాసము సల్పిన లతావృశ్చిక హస్తమగును.

45. భిన్నము :- వైశాఖ స్థానములోవుండి కటిభాగమందు అల పద్మ హస్తముల నాచరించి, విన్యాసము సల్పినయెడల భిన్నకరణమగును,

46. వృశ్చికరేచితము :- పాదముతో వృశ్చిక విన్యాసమొనర్చి ఇరు హస్తములతోను స్వస్తికమాచరించిన తరువాత విప్రకీర్ణ హస్తములను రేచికములుగ సల్పిన వృశ్చికరేచిత మగును. ఇది ఆకాశగమనాభినయమందు వినియోగించును.

47. వృశ్చికము :- బాహుశిరో ప్రదేశములందు హస్తములను వంచి, దక్షిణపాదమును వెనుకభాగమునకు కొద్దిదూరముగవంచిపట్టినయెడల వృశ్చికకరణ మగును.

48. వ్యంసితము ;- ఆలీఢ స్థానములోనుండి. హృదయము దగ్గర హస్తములు రేచితముచేసి, ఊర్ధ్వాధోభాగంబులకు విన్యాసము సల్పినచో వ్యంసితమగును.

49. పార్శ్వనికుట్టితము :- హస్తములను పార్శ్వభాగములందు స్వస్తికములుగచేసి పాదములు నికుట్టితముగ విన్యాసముసల్పిన పార్శ్వనికుట్టిత మగును. ఇది గమన ప్రసారాదులయందు ఫలహార స్వీకరణము చెల్లును,

50. లలాటతిలకము :- పాదములతో వృశ్చిక మాచరించి పాదాంగుష్టముతో లలాటమునందు తిలకధారణ మాచరించిన లలాటతిలకమగును. ఇది ఊర్ధ్వార్ధము. పరలోకము, బ్రహ్మజ్ఞానములందు వినియోగించును.

51. క్రాంతకము :- పృష్టభాగమును కుంచితముచేసి అతిక్రాంత కరణ మాచరించి, హస్తములతో అక్షిప్తవిన్యాసములు సల్పిన క్రాంతక మగును.

52. కుంచితము :- దక్షిణపాదములు వెనుకకువంచి, దక్షిణ హస్తము కుంచితముచేసి, వామహస్తమును ఉత్తానవంచితముగా నొనర్చిన కుంచితకరణ మగును.

53. చక్రమండలము :- హస్తములు ప్రలంచితముచేసి శరీరమును అభ్యంతరాపవిద్ధములుగా చేసినచో చక్రమండలమగును.

54. ఉరోమండలము :- పాదములను స్వస్తికాపసృతములుగ చేసిన తరువాత అపవిద్ధక్రమము నాచరించి హస్తమును ఉరోమండలముగ నాచరించినచో ఉరోమండలమగును.

55. అక్షిప్తము :- హస్తపాదములతో వేగముగ అక్షిప్త మాచరించినయెడల అక్షిప్తకరణ మగును.

56. తలవిలాసితము :- పాదముల మునివ్రేళ్ళపై నిలువబడి మడములను పైకెత్తి హస్తములను చాచి పతాకము అరచేతిపైపు బట్టినయెడల తలవిలాసిత మగును.

57. అర్గళము :- ఒక పాదమును వెనుకనుండి ముందునకు రెండు న్నరజానల ప్రమాణదూరముగచాచి, హస్తములను పాదానుసార విన్యాసం సల్పిన అర్గళడాగును.

58. విక్షిప్తము :- హస్తపాదములను విక్షిప్తముగ వెనుకకుపంచి. ప్రక్కలనుంచి విన్యాసము సల్పిన విక్షిప్తకరణ మగును.

59. ఆవృతము :- కుంచిత పాదములను ప్రసారితము చేసిన తరువాత ఆవృతముగ సలిపి హస్తముగుండా పాదక్రమము నాచరించినఆవృత మగును.

60. డోలపాదకము :- పాదమును కుంచితముగచేసి తరువాత

పైకెత్తి పార్శ్వభాగములకు విన్యాసములను సల్పుచు, హస్తములు పాద క్రిమముల ననుసరించిన డోలాపాదకకరణ మగుచున్నది.

61. వివృత్తము :- హస్తపాదముల నక్షిప్తములుగా నొసర్చి, త్రికమాచరించిన తరువాత హస్తములతో రేచిత విన్యాసము సల్పినచో వివృత్తమగును. ఇది నృత్తము నల్పునపుడాగరించు ప్రధాన విన్యాసము.

62. వినివృత్తము :- పాదముతో సూచివిద్ధము నాచరించి లినివృత్త ముగ త్రికముసల్పి రెండు హస్తములును రేచితములు సల్పిన వినివృత్త కరణమగును. ఇది పైన ఉదహరించిన కరన్యాసమునకు విపర్యాసము యగును.

63. పార్శ్వక్రాంతము :- పార్శ్వక్రాంత క్రమములో పాదమును ముందునకుత్రోసి, నేలపై మోపి, హస్తములను పాదగతి ననుసరించిన యెడల పార్శ్వక్రాంతమగును.

64. నిశుంభితము : పాదమును పృష్టభాగమునకు కుంచితముచేసి, వక్షస్థలము ఉన్నతముగబట్టి, హస్తముతో తిలకధారణ మాచరించిన నిశుం భితమగును. ఇది శివతాండవములందు వినియోగించును.

65. విద్యుద్భ్రాంతము :- వెనుకభాగమునకు పాదమును వలిత ముగ నాచరించి, శిరస్సునకుపైగా ప్రసారముచేసి శరీరమును మండలాకార అవిద్ధముగ నేర్పరచిన విద్యుద్భ్రాంతమగును.

66. అతిక్రాంతము :- అతిక్రాంతక్రమము నాచరించి పాదము ముందునకు చాచి, హస్తముకూడా పాదగతి నాచరించినయెడల అతిక్రాంత మగును,

67. వివర్తితము :- హస్తపాదముల నక్షిప్తములుగా నాచరించి వివర్తితముగ త్రికముసల్పి వామహస్తము అంచితముగచేసిన వివర్తిత మిగును.

68. గజక్రీడితము :- వామహస్తమును చెవికి సమీపముగవుంచి దక్షిణహస్తముల తాకృతినల్పి డోలాపాదము నాచరించినచో గజక్రీడిత మగును.

69. తలసంస్ఫోటితము :- కాలు పైకియెత్తి త్వరగా ముందునకు వేసి, హస్తములు తలసంస్ఫోటితములు నాచరించిన తలసంస్ఫోటితమగును.

70. గరుడ ప్లుతకము :- పాదములను వెనుకకుచాచి వక్షస్థలమును విశాలముచేసి, హస్తములతో లతారేచితములు సల్పిన గరుడప్లుత మగును. ఇది గరుడుని గమనమునందు వినియోగపడును.

71. గండసూచి :- సూచిపాదము నాచరించి. పార్శ్వమును పైకి చాచి, ఒకహస్తము వక్షస్థలముకు దగ్గరగావుంచి, మరియొక చెయ్యి గండ భాగమున అంచితముగ సల్పినచో గండసూచి యగును.

72. పరివృత్తము :- చేతులను ఊర్ధ్వాపవేష్టితములుగ సల్పి పాద మును, సూచిపాదముగ త్రిప్పి పరివృత్తముగ త్రికముగా నాచరించిన పరివృత్త మగును.

73. పార్శ్వజానువు :- ఒకపాదము సమముగనుంచి. రెండవ పాదము ఊరుపృష్టభాగములుగనిల్పి, ముష్టిహస్తములు నాచరించిన పార్శ్వ జానుకరణ మగును.

74. గృధ్రావళీనకము :- పాదమును వెనుకభాగమునకు చాచి, మోకాలిని కొంచెము అంచితముగచేసి హస్తములను ప్రసారితములుగ సల్పిన గృధ్రావళీనక మగును. ఇది గరుడపక్షియందు చెల్లును.

75. సన్నతము :- పాదములపై ముందునకు దుమికి. స్వస్తికము లుగ సల్పి, డోలాహస్తములు నాచరించిన సన్నతమగును. ఇది లేడిగమన మునందు వినియోగింపబడును.

76. సూచి :- పాదమునువంచి ముందుకుదుమికి హ_స్తములుకూడా అదే విధముగ విన్యాసము సల్పినయెడల సూచికరణమగును.

77. అర్ధసూచి :- అలపద్మ హ_స్తములను శిరోపై భాగమున నుంచి, దక్షిణపాదమును సూచిపాదముగ సల్పినచో అర్ధసూచికరణ మగును.

78. సూచివిద్ధము :- ఒకపాదమును మడమపై మోపి రెండవపాద మును సూచీపాదముగ, ప్రథమ పాదముయొక్క మడమదగ్గర నిలబెట్టి, హ_స్తములు పాదములువద్ద, నడుమువద్ద విన్యాసము సల్పినచో సూచీవిద్ధ మగును.

79. అపక్రాంతము :- మడమలను వలితముగసల్పి పాదములచే నవక్రాంతముల నాచరించి హ_స్తములు పాదగతి ననుసరించినయెడల అప క్రాంత మగును.

80. మయూర తిలకం :- పాష్ణమును వృశ్చికవిన్యాసముగ చేసి, హ_స్తములును రేచితములుచేసి గుండ్రముగా తిరుగుచు విన్యాసము సల్పిన మయూరతిలక మగును.

81. సర్పితము :- పాదములు అంచితములుగసల్పి అపసృతము లుగనుంచి శిరస్సును పరివాహితముగ నాచరించి హ_స్తములు రేచితములు చేసినచో సర్పితమగును. ఇది వెనుకకు త్వరగనడుచు విన్యాసమందు చెల్లును.

82. దండపాదము :- పాదములు నూపురములుగసల్పి దండపాద ముగ ప్రసారముచేసి, హ_స్తములు వెంటనే ఆవిద్ధములుగ సల్పినచో దండ పాదమగును.

83. హరిణప్లుతము :- అతిక్రాంతక్రమము నాచరించి ముందునకు దుమికి మోకాలిని వంచిపట్టినచో హరిణప్లుతమగును. ఇది హరిణచారి యందు వినియోగించును.

84. ప్రేంఖోలితము :- దోలాపాదము నాచరించి సమముగదుమికి పరివృత్తక్రమము నాచరించినయెడల ప్రేంఖోలితమగుచున్నది. ఆకాశచారీ లందిది చెల్లును.

85. నితంబము :- హస్తములను భుజములకుపైగ. ప్రేష్య అభి ముఖములుగ నుండునట్లుపట్టి బద్ధచారీలో విన్యాసము నాచరించినయెడల నితంబకరణమగును.

86. స్ఖలితము :- దోలపాదక్రమము నాచరించి హస్తములుకూడా పాదగతి ననుసరింపజేయుచు, రేచిత, ఘూర్ణిత విన్యాసములు సల్పిన స్ఖలితకరణమగును.

87. కరిహస్తము:- వామహస్తమును, స్థిరహస్తముగచేసి, దక్షిణ హస్తమును ద్వేష్టితముగ నాచరించి, పాదములు అంచితములుచేసినచో కరి హస్తకరణ మగును,

88. ప్రసర్పితము :- ఒక హస్తమును రేచితముగ నాచరించి, రెండవ హస్తమును లతాకారముగవుంచి, పాదములతో ప్రసర్పిత మాచరిం చిన ప్రసర్పితమగును.

89. సింహావిక్రీడితము :- దక్షిణపాదముచే అలాతము నాచరించి, వామ పాదమును త్వరగ కదుపుచు హస్తములు పాదగతి ననుసరింప చేసిన సింహావిక్రీడిత మగును.

90. సింహాకర్షితము :- పాదమును వెనుకకుచాచి, హస్తములు నికుంచితములుగచేసి, పర్యాయములుగ విన్యాసములు సల్పిన సింహాకర్షిత మగును. ఇది సింహాదులందు, భయావహమునందు వినియోగించును.

91. ఉద్వృత్తము :- శరీర హస్తపాదముల నాక్షిప్తములుగ నాచ

రించి, తదుపరి శరీరము నుద్వృత్తముగ నాచరించినయెడల ఉద్వృత్త మగును.

92. అపక్రృతము :- ఒకపాదము నాక్షిప్తముగ నాచరించి, హస్త మును పాదగతి ననుసరింపజేసి శరీరముతో విన్యాసము సల్పినచో అపక్రృత మగును.

93. తలసంఘట్టితము :- దోలపాదక్రమము నాచరించి హస్తములు తలసంఘట్టితములుగ నాచరించి తరువాత వామహస్తముతో రేచితము నాచ రించినచో తలసంఘట్టిత మగును.

94. జనితము :- ఒక హస్తమును హృదయమువద్దనుంచి రెండవ హస్తము ప్రలంబితముచేసి, పాదాగ్రభాగమున నిలచిన జనిత కరణ మగును.

95. అవహిత్థము :- జనితకరన్యాసము నాచరించి హస్తముల వేళ్ళ నభిముఖములుగా చేసిన తరువాత క్రిందకువాల్చిన అవహిత్థకరణ మగును. ఇది విచారము, ఆలోచన, బలహీనతయందు చెల్లును.

96. నివేశము :- హస్తములను వక్షస్థలముపైనుంచి. ఛాతీని విశా లముగసల్పి మండల స్థానములో నున్నయెడల యది నివేశమగును. ఇది గజావరోహణాదులందు చెల్లును.

97. ఏలికా క్రీడితము :- పాదాగ్రభాగములపై దుమికి సమముగ నిలబడి, పార్శ్వభాగము సన్నతముగసల్పి, నడుమును గుండ్రముగ విన్యా సము సల్పినచో యేలికాక్రీడిత మగును. ఇది అధమ పాత్రాభినయము లందు చెల్లును.

98. ఊరుద్వృత్తము :- హస్తముతో నావృత్తము సలిపి ఊరు భాగమునందుంచి, జంఘమును వంచి, ఉద్వృత్తముగ సల్పినయెడల ఊరు ద్వృత్తమగును.

99. మదస్ఖలితము :- హస్తములను ప్రలంబితముగసల్పి శిరస్సును పరివాహితముగచేసి, కాళ్ళనువంచి, వలితావిద్ధముగ నాచరించినయెడల మద స్ఖలితమగును.

100. విష్ణుక్రాంతము :- ఒకపాదము కుంచితముచేసి మరియొక పాదమును గగనోన్ముఖముగసల్పి ప్రసారముచేసి, హస్తములు రేచితము లుగా నాచరించినచో విష్ణుక్రాంతకరణ మగును.

101. సంభ్రాంతము ;- హస్తములు ఆవృతములుగ సలిపి ఊరు భాగమును, పృష్టభాగమునకు తాకునట్లుగాచేసి అవిద్ధక్రము నాచరించిన సంభ్రాంతమగును,

102. విష్కంభము :- హస్తమును అపవిద్ధ సూచిక్రమముగ నాచ రించి, పాదముతో నికుట్టితముసల్పి వామహస్తము వక్షస్థలముపై నుంచిన విష్కంభమగును.

103. ఉద్ఘట్టితము :- పాదములతో ఉద్ఘట్టితములు నాచరించి హస్త ములు తలసంఘట్టితములుగచేసి పార్శ్వమును నితంబముగ సల్పినయెడల ఉద్ఘట్టితమగును. ఇది అధికాశ్చర్యము. ఆధిక సంతోషాదులయందు విని యోగించును.

104. వృషభ క్రీడితము :- అలాతచారి నాచరించి, రెండు హస్త ములను రేచితములుగసల్పి, కుంచితముచేసి వంచినయెడల వృషభక్రీడిత మగును.

105. లోలితము ;- హస్తములును, రేచితము, అంచితములుగ సల్పి వర్తితశిరస్సును ఇరుపార్శ్వములను లోలితములో నాచరించిన లోలిత మగును.

106. నాగాపసర్పితము :- పాదములను స్వస్తికాపసృతములుగ సల్పి పరివాహిత శిరస్సు నాచరించి. హస్తములు రేచితములుగ చేసిన యెడల నాగాపసర్పిత మగును.

107. శకటాస్యము :- శరీరమునువంచి పాదములు నగ్రతల సంచారములుగ ప్రసారితముచేసి ఊరుభాగమును విశాలముగ సల్పిన శకటాస్య మగును.

108. గంగావతరణము :- పాదములి ప్రేళ్ళు పై భాగములకు వచ్చునటుల ఊర్ధ్వముగ విన్యాసముసల్పి, త్రిపతాక హస్తముల నధోముఖము లుగచిసి, శిరస్సు సన్నతముగ సల్పిన గంగావతరణ మగును.

## 33. సంచారీ భావముల లక్షణములు - వినియోగములు

శ్లో॥ నిర్వేదగ్లాని శంకాఖ్యా । స్తదానూయామదశ్రమః
ఆలస్యంచైవదైన్యంచ । చింతామోహస్మృతి ర్ధృతిః
వ్రీడాచపలహర్ష । ఆవేగ జడతా తథా ।
గర్వోవిషాదమౌత్సుక్యం । నిద్రాపస్మార ఏవచ ॥
సుప్తిర్విభోధామర్షశ్చ । వ్యవహిత్థాతతోగ్రతా ।
మతిర్వ్యాధి స్తదోన్మాదం । స్తదామరణమేవచ ॥
త్రాసశ్చైవ వితర్కంచ । విజ్ఞేయ వ్యభిచారిణః ।
త్రయస్త్రింశదమిభావా । రసవ్యసహకారిణః ॥

తా॥ నిర్వేదము, గ్లాని. శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యం, దైన్యము, చింత, మూహము, స్మృతి, వ్రీడ, చాపల్యము, హర్షము, ఆవేగము, జాడ్యము, గర్వము, విషారము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారం, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత,

మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము యని, సంచారి-వ్యభిచారి భావములు ముప్పదిమూడవి యెరుంగవలయును.

పై ముప్పదిమూడు సంచారీభావములు వరుసగా నెరింగించెదను.

1. నిర్వేదము
2. శ్రమము = ప్రయాసము
3. దైన్యము = దీనత్వము
4. జడత - వ్యాధి = మాంద్యము
5. గ్లాని = పీడ
6. త్రాసము = భయము = సంత్రాసము
7. శంక = సంశయము
8. ఆర్తి = జ్వరము = వ్యాధి = రోగము
9. రోషము - అమర్షము = క్రోధము
10. గర్వము = దర్పము
11. ఆవేగము
12. ధృతి = ధైర్యము
13. స్మృతి = జ్ఞాపకము
14. చాపలము = చపలత్వము = చాపల్యము = చపలత
15. ఉగ్రత
16. అవహిత్థ = అంగగోపన
17. త్రప = వ్రీడ = లజ్జ = సిగ్గు
18. విషాదము = ఖేదము
19. మదము
20. ఔత్సుక్యము = ఉత్సుకత = ఉత్సాహము
21. మతి
22. నిద్ర
23. మోహము = వలపు = మూర్ఛ

24. విబోధము = బోధము = ప్రబోధము
25. మరణము = అంతము = మృతి = శరీరత్యాగము
26. ముదము = హర్షము
27. అలవ్యము = అరతి = మాంద్యము = జాగు
28. వితర్కము = సంశయము = ఊహ
29. సుప్తి
30. అసూయ = అసహత = ఈర్ష్య
31. ఆధ్యానము = చింత
32. ఉన్మాదము = చిత్తవిభ్రమము =విస్మయము = భ్రమ
33. అపస్మృతి = అపస్మారము

యని సంచారీ భావములు ముప్పది మూడుగా చెప్పియుండిరి.

1. నిర్వేదము :- దుఃఖము, ఈర్ష్య, తత్వబోధవల్లను సర్వము నిష్ఫలము గావించుట నిర్వేద మనబడును.

తత్వజ్ఞానము, పేదరికము. సంకటము, వియోగము, దుఃఖము మొదలగువానిచే గలుగు భవాభావమతి నిర్వేదమనబడును నిరాశ చేసుకొనుటయే నిర్వేదమనబడును. గత శోకకృత్యములును తలచినప్పుడు పుట్టునది.

నిర్వేదము అభినయించవలసిన పద్ధతి :-

విచారము, కన్నీరు విడచుట, నిట్టూర్పు అనగా నిశ్వాసయును, దైన్యమున్ను పట్టవలయును.

దైన్యములో పట్టవలసినది :-

బలము విడచుట, అతిశయమును అణచుకొని యుండుట, మాటల యందు, ముఖమందు, నేత్రములయందు, పేదరికము కనబరచుట, శరీరమును కుంచుకొనుట, నమస్కరించుట, వేడుకొనుట యీ మొదలైనవి పట్టవలయును.

ఇ వి :-

కన్నీటితో నడ్డగింపుటచేతను, ధ్యానముచేతను, నిట్టూర్పుచేతను, తన్నుతానవమానపరచుకొనుటచేతను. దైన్యముచేతను, డగ్గుత్తుక అనగా గద్గద స్వరముచేతను, వన్నెమారుటచేతను. అభినయించేది, ఇష్టార్థము యొక్క లేమిచేతను, క్రోధముచేతను, తాడనముచేతను, ఆపేక్షచేతను, పరులవృద్ధిని చూచుటచేతను. నిందచేతను, అపవాదముచేతను, మోసము చేతను కలిగెడి నిష్ఠురత్వబుద్ధి "నిర్వేద" మనబడును.

నిర్వేదము :- కరుణారసమునందును. భీభత్సరసమందును బుట్టును.
కరుణారసము :- దుఃఖమువల్ల బుట్టును.
భీభత్సరసము :- విచారము వలన బుట్టును.

2. శ్రమము :- అనగా ప్రయాసము. ఇందువలన "స్వేదము. కలుగును. త్రోవనడచుట, నృత్తమాడుట, క్రీడ మొదలగు వ్యాపారము లచే గలుగు మానసఖేదము "శ్రమ" మనబడును.

వేట, జగడము, గుఱ్ఱము నెక్కుట, శస్త్రాస్త్ర వ్యాపారము ఇవి మొదలగువానిచేత గలుగునది "శ్రమము."

శ్రమము అభినయించే పద్ధతి ఎట్లనగా :-

1. చెమట బిందువులు తుడుచుకొనుట, 2, శరీరము నల్చుకొనుట, 3. నీడయందు నిల్చుట, 4. విసరుకొనుట, 5. అర్ధనిమీలనము (సగము కన్నులు మూయుట.)

మరియొక పద్ధతి :-

అంగమర్దనము, నిట్టూర్పు, కాళ్ళుపిసుకుట, ఆవలింత, మందముగా నడచుట, ముఖము కన్నులు వంకర చేసుకొనుట, చీత్కారము చేయుట (అనగా చెలిమివల్లనైన నిరాకారము). ఈ అను భావములు కలుగును.

శ్రమాను భావములు :-

నిట్టూర్పు, చెమట, చీత్కారము (చెలిమివల్ల నిరాకారము), ముఖ నేత్రములు సంకోచించుట (ఇముడ్చుట), చలిగాలి (నీడ, నీళ్ళ వీనియం దపేక్ష), అంగమర్దనము, దేహముడుగుటయు ఇవి శ్రమాను భావములు.

హాస్యరసమునందును, కరుణారసమునందును, భయానక రసమం దును "శ్రమము" బుట్టును.

3. దైన్యము = దీనత్వము :- బలముచెడి శత్రువునకు దయవచ్చు నట్లుగ బల్కుట, కనకు బబముచాలక కార్పణ్యముచేతను ఆడుకొనుటే "దైన్యము"

మనస్సుకు ఉత్సాహము లేకుండుట :-

దుఃఖము, మనోవ్యధ, రోగము, దారిద్ర్యము, మనస్సు వ్యాకుల పడుట వీనిచే గలుగును.

దైన్యము అభినయించే పద్ధతి :-

ఖలమును విడుచుట, అతిశయమును అణచుకొనుట, మాటలయందు, ముఖమునందు, నేత్రములయందు, పేదరికమును కన్పరుచుట, శరీరమును కుంచుకొనుట, నమస్కరించుట, వేడుకొనుట, ఇందు మాలిన్యదేహస్థంభా ద్యను భావములు కలుగును.

దైన్యము లో :-

అంగములు, శిధిలములవుట (వదులవుట), అలంకరించుకొనకుం డుట, ముఖమున కన్నీరు పట్టులుండుట (పట్టు అనగా యెండిన నీటిపక్కు), హీనస్వరము మున్నగునవి కలుగును. కరుణారసమందును, భీభత్సరసమం దును, ఈ దైన్యము బుట్టును.

మాలిన్యమనగా :- మకిల శరీరముగా నుండుట.

స్తంభనమనగా :- కదలకుండుట, ఇది సాత్విక భావములోనిది.

4, జడత = జాడ్యము = వ్యాధి = మాంద్యము :- మనస్సు మొంద యిన కోరికచే కూరినప్పటికి అలవు యెరుంగకుండా యుండుట, ఇష్టార్థము, అనిష్టార్థము. వీని వినికివలనగాని, వర్షమువలనగాని. విరహము మొద లైన వానివలనగాని కలుగు అజ్ఞానము "జడత" అనబడును. ఇష్టజ్ఞానము చేతనైనా కార్యం మందపడుటే.

ఇష్టమునుగాని, అనిష్టమునుగాని చూచుట మొదలైన వానిచేత నొడలు మరచుట. రెప్పపాటు లేకయుండుట, చెవులు వినకయుండుట, ఊరకయుండుట మొదలగు చేష్టలు కలుగును,
మరియొక పద్ధతి :- రెప్పపాటువేయక చూచుట, ఊరికేయుండుట, (అనగా చెలికత్తియలు దగ్గరయుండుటచే కల్గిన సిగ్గువల్లను, ప్రియుడు వచ్చుటచే కలిగిన సంతోషమువల్లను, చేయవలసినపనులు చేయకయుండుట), భయా నకరసమందును, భీభత్సరసమందును. శృంగార రసమందును, కరుణారస మందును ఈ "జడత" పుట్టును.

5. గ్లాని = పీడ = అనగాబాధ = దుఃఖము :- తనకుండే సామ రస్యము చెడి ఆయాసముచే హడలుతూ వుండుట, మనోవ్యాధి, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము, సురతము ఇది మొదలువానిచే గల్గు దౌర్బల్యము, బలిమితగ్గుటే "గ్లాని".

ఇందు దేహము చిక్కుట, సన్నని పలుకులు, మెల్లన పనులు, సకల విషయములయందు ఉత్సాహము లేకయుండుట, దేహవైవర్ణ్యము (అనగా వెలవెలబోవుట), ఇవి మొదలైన వికారములు గలుగును. మరియు ఆకలి దప్పికలవలన లేక రతి మొదలైన వానివలన గల్గిన ఆయాసముచేత సంభవించిన బలహీనతను కనపర్చవలసినది. భయానక రసమందు, కరుణా రసమందు, శృంగార రసమందు, హాస్యరసమందును ఈ "గ్లాని" పుట్టును.

6. త్రాసము = భయము :- ఆకస్మికముగా బుట్టిన భయముచేతను, మనస్సు తడబాటునొందుట, ఉన్నట్లేయుండి దిగులుపడుటే "త్రాసము"

మెరుపు, రాక్షసులు, ఉరుము, పిశాచము, సర్పము మొదలైనవానిచేగలుగు చిత్తచాంచల్యము "త్రాసమనబడును".

ఇందు :- ఉత్కంపము, దేహసంకోచము (అనగా యిముడ్చుట), రోమాంచము, స్తంభము, గద్గదము, అడుగడుగునకు రెప్పపాట్లు. భ్రమ (అనగా లేనిదితోచుట తిరుగుట పిచ్చి), ప్రక్కనుండువారిని పట్టుకొనుట మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి :-

శరీరము వణకుట, శరీరము ముణుచుట, రోమకూపములునిక్కుట, చిత్తభ్రాంతిని బొందుట. కన్నులు చికిలించుట, కాళ్ళు తడబడుట, ప్రియుని కౌగలించుకొన్నట్లు కనపరచుట మున్నగునవి.

భీభత్సరసమునందును, భయానక రసమునందును, శృంగార రసము నందును ఈ "త్రాసము పుట్టును.

7. శంక = సంశయము :- తనకు యిష్టముగాదేమోయని సందేహించుట, అరిష్టమైన సంగమమును ఉత్ప్రేక్షించుటే. చౌర్యాపవాదులచేదనక పాతము నుత్ప్రేక్షించుట.

ఇందు ;- వర్ణము మారుట, గద్గదిక (అనగా స్వరభంగము), దిక్కులుచూచుట, అద్దము మొదలైనవి చూచి చంద్రునిగా నూహించుట, మనస్సులోనున్న అనురాగము వెల్లడైనదని సందేహించుట.

ఇందు :- మాటిమాటికి పార్శ్వములచూచుట, మోమును దాచుకొనుట, ముసుకిడుట. వైవర్ణ్యము (వెలవెలబోవుట), కంఠ గద్గదము మొదలైన చేష్టలు గలుగును. ఈ "శంక" ఆత్మోత్థశంకనియు, పరోత్థశంకనియు నిరుతెరగులు యగును. స్వకార్యమువలన గలుగునది "ఆత్మోత్థ శంక" యగును. ఇంగితములు, రెప్ప, కనుబొమ్మను, నల్లగ్రుడ్లు, చూపు వీని

యందు కలుగు వికారమును ఇతరుల ఆకారములవలన కలుగు చెమట. "పరోత్థశంక" యనబడుచున్నది.

వరుసగా నాకారచేష్టాదులచే ఈ రెండు విధముల శంకను ఊహింప వచ్చును.

ఆకారము, సాత్త్వికము, చేష్టలు, అంగప్రత్యంగములయందు గలుగు క్రియాభేదము.

శృంగారరసమందు, కరుణారసమందు, భీభత్సరసమందును ఈ "శంక" జనించును,

N. B. శంకయనగా దనక సమ్మతము గలుగునేమోయని తలంపు. దొంగతనము, రాజాపరాధము మొదలగువానివలన పట్టుబడుట దీనికి కారణము.

ముఖము వెల్లబారుట, నెలవులు నాకుట. ఒకరినొకరు చూడబూనుట, మాటిమాటికి దిక్కులుచూచుట ఇవి దీనికను భావములు.

ఆర్తి - వ్యాధి - రోగము :- హృదయమందైన తాపము గెట్టించి బహిర్వ్యాపకమైనదై యెల్లప్పుడు శరీరపీడ "ఆర్తి" యనబడును. "ఆర్తి" మరణాదులచేత సంభవించునది. రోషోద్రేకముచేతను వియోగాదులచేతను గలుగు జ్వరము.

ఇందు :- దేహము స్తంభించుట, అంగముబిగి తగ్గిపోవుట, అరచుట, ముఖము వంకరబోవుట, వ్యర్థమగు అంగవిక్షేపములు చేయుట, నిట్టూర్పు మొదలగునవి కలుగును. ఈ జ్వరము శీతజ్వరమని, దాహజ్వరమని రెండుతెరంగు లగుచున్నవి.

శీతజ్వరమందు :-

తాపము, దేహము చిక్కుట, చెక్కిళ్ళు చలించుట, కన్నీరునించుట,

సర్వాంగమును వణకుట. అరచుట, మోకాళ్ళు వణకుట. పులకరింప, ముఖమువాడుట మొదలైనవి గలుగును.

దాహజ్వరమందు :-

చల్లని పూలదండ మొదలైనవానిని ధరించుకొనుట, చేతులు కాళ్ళు ఎత్తెత్తివేయుట, ముఖము వాడిపోవుట మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి :-

చల్లని వస్తువులయందు, చల్లని ప్రదేశములయందు, ఆపేక్ష కలుగకుండుట, వేడివస్తువులయం దాపేక్ష గలుగుట.

ఈ "ఆర్తి" కరుణారసమునందు, శృంగారరసమునందునుజనించును.

8. రోషము - అమర్షము - క్రోధము :- ఎక్కడను అపరాధము చేసినవారియందు మనస్సు ప్రజ్వరిల్లగా యది "రోష" మనబడును. తక్కువచేయుట, అవమానముచేయుట మొదలైనవానిచేతగలుగు క్రోధము "అమర్ష" మనబడును.

ఇందు :- చెమట గలుగుట. తలపంకించుట, చింతించుట, (అనగా ఆలోచన) ఉపాయమును వెదకుట, ఉత్సాహపడుట, తర్జనభర్జనలు కనపరచుట.

మరియొక పద్ధతి :-

స్వేదము, శిరఃకంపము, తలవంచుకొనుట, చింతించుట, ఉపాయములను వెదకుట, ఉత్సాహము, వ్యవసాయము మొదలైనవి గలుగును. ఈ "రోషము" వీరరసమందును, రౌద్రరసమందును జనించును.

9. గర్వము - దర్పము :- పరులను నిందచేసి తనను నుతిచేసుకొనెడు అతిశయమైన ఘనత్వము "గర్వమగును".

ఐశ్వర్యము, రూపము, గర్వము, యవ్వనము, కులము, విద్య, బలము, ఇష్టలాభము మొదలైనవానిచేత నొరుల నవమానించుట "గర్వ" మనబడును.

ఇందు :- బలమువల్ల అన్యుల ధిక్కరించుట, ఐశ్వర్యమువల్ల అన్యులను తక్కువగా చూచుట, తనది మంచికులమనిన్ని తనయందు చక్కదనమున్నదనిన్ని, వయ్యారములను శరీరమును చూచుకొనుటను కనపర్చవలయును.

మఱియొక పద్ధతి :-

అహంభావము, ఆజ్ఞోల్లంఘనము, అనుగ్రహ ప్రదానము, మోము త్రిప్పుకొనుట, మాట్లాడకయుండుట, పరుషముగా మాట్లాడుట, చూడక యుండుట, తన అవయవములను చూచుకొనుట, ఒడలు విరచుకొనుట మొదలైన యనుభావములు కలుగును.

వీరరసమునందును, రౌద్రరసమునందును, శృంగారరసమునందును, హాస్యరసమునందును "గర్వము" జనించును.

ఆవేగము :- క్రమముగా ఇష్టము, అయిష్టము రావడమువల్ల బుట్టిన మనస్సుయందైన తొందర, "ఆవేగ" మనబడును. మనస్సుయొక్క తడ బాటు. (ఇష్ట అయిష్ట జ్ఞానమువల్ల బుట్టిన భ్రమతోటి దురుసే.) కార్యము చేతనైన త్వర, ఉత్సాహముచేతను, వాతముచేతను, వర్షముచేతను, నిప్పు చేతను, గుఱ్ఱముచేతను, మదపుటేనుగుచేతను, ప్రియాప్రియములు వినుట చేతను గలుగు సంభ్రమము.

ఇందుకో :- ఇష్టప్రాప్తివల్ల గలిగిన మనస్సుయొక్క తొందరల యందు హర్ష త్వరలలున్ను, అనిష్టప్రాప్తివల్ల గలిగిన తొందరయందైతే శోక స్తంభములున్ను పట్టవలయును, ఒకకంటికే కాటుక, ఒకకాలికే పారాణి అలంకారములున్ను నగలను వ్యత్యాసముగా ధరించుట అనగా కంఠమందు

వణ్ణమును, నడుముకు ముత్యాలహారమున్ను, చెవికి ముక్కమిన్నిన్ని, ముక్కుకు భాలిలీలున్ను ధరించుట ఇవి యిష్టప్రాప్తియందు జరుగులివి, కనుక ఈలాగున బట్టవలయును.

## ఎనిమిది విధముల ఆయావేగములు :-

ఉత్పాతావేగము, ఆగ్న్యావేగము, ప్రియశ్రవణావేగము, వాతావేగము, మత్తకుంజర దర్శనావేగము, అప్రియశ్రవణావేగము, వర్షావేగము, శాత్రవ వ్యసనావేగము యని యెనిమిది విధములు కారణానుసారముగా నున్నవి.

1. ఉత్పాతావేగమునందు గలుగు చేష్టలు :-

కొండ మొదలైనవి కదులుట, ధూమకేతు ఉదయమగుట మొదలైనవి ఉత్పాతములగును. దీనివలన గలిగిన సర్వాంగవిస్రంసము, వైమన్యము, అపసర్పణము ఇవి ఉత్పాతావగమగును.

2. వాతావేగమందు గలుగు చేష్టలు :-

వేగముగా నడచుట, వస్త్రము తీసికొనుట, వస్త్రములను కప్పుకొనుట, కన్నులను తుడుచుకొనుట మొదలైనవి. పెద్దగాలిచేగలుగు క్రియలు వాతావేగ చేష్టలు.

3. వర్షావేగమందు గలుగు చేష్టలు :-

గొడుగును గ్రహించుట, దేహము చిన్నదగుట, చేతులను భుజమూలములందు చేర్చుట, పరుగెత్తుట, గుప్తస్థలము వాశ్రయించుట (మరుగు) మొదలైనవి నర్షావేగముచేత గలుగు క్రియలు,

4. ఆగ్న్యావేగమందు గలుగు చేష్టలు :-

వీజనము, అంగధూననము, వ్యత్యాసములుగా నడుగులుంచుట. నేత్రసంకోచము ఈ మొదలైన చేష్టలు గలుగును.

5. మత్తకుంజర దర్శనావేగమందు గలుగు చేష్టలు (ఏనుగులచే)

త్వరగా పరుగెత్తిపోవుట, వెనుకప్రక్క తిరిగి తిరిగి చూచుట, భయము, వణకు మొదలైనవి మత్తకుంజర దర్శనావేగమందలి క్రియలు.

6. ప్రియశ్రవణా వేగమందు గలుగు చేష్టలు :-

అభ్యుత్థానము, ఆలింగనము చేసుకోనుట. ప్రీతిపురస్సరముగా వస్త్రాభరణాదుల నిచ్చుట, ప్రియమైనవాక్యము, రోమాంచము మొదలైనవి ప్రియశ్రవణావేగమందు గలుగు క్రియలు.

7. అప్రియ శ్రవణావేగమందు గలుగు చేష్టలు ;-

ఏడుపు, పొరలాడుట, మొరబెట్టుట, క్రిందబడుట. నాలుగు ప్రక్కల దిరుగుట మొదలైనవి అప్రియశ్రవణావేగమందలి క్రియలు.

8. శాత్రవ వ్యసనావేగమందు గలుగు చేష్టలు :-

కవచము ధరించుట, ఆయుధము మొదలైన వస్తువులను ధరించుట, ఏనుగునెక్కుట, అశ్వమునెక్కుట, రథమునెక్కుట, త్వరగా విశ్రమించుట మొదలైనవి శాత్రవవ్యసనా వేగమందలి క్రియలు.

N. B. ఇవి ఉత్తమాదులకు యథోచితముగా గలుగును. అద్భుత రసమందును, వీరరసమునందును, శృంగారరసమందును ఈ "ఆవేగము" జనించును.

ధృతి = ధైర్యము :-

మనస్సు కృతార్థత్వమును పొందగా గలుగునది. అభీష్ట జ్ఞానము చేతను, మనస్సుకు ధైర్యము నుచ్చుకొనుట, మోక్షవిషయజ్ఞానము, శాస్త్ర జ్ఞానము, గురుభక్తి, నానావిషయములసిద్ధి, సిగ్గు మొదలైనవానిచేత మనస్సుకు ఇచ్ఛలేకయుండుట.

ఇందు :- లభించినదానిని అనుభవించుట, పొందబడని విషయములు వీనికిగాను మనస్సున చింతలేకయుండుట, నష్టవిషయములు వీనికిగాని మనస్సున చింతలేకయుంతుట. కడచిన విషయములు వీనికిగాను మనస్సున చింతలేకయుండుట మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి :-

ధైర్యమును, సంతోషమును కనపర్చవలయును. వీరరసమందును, శృంగార రసమందును ఈ "దృతి'' జనించును.

స్మృతి = జ్ఞాపకము :- పూర్వమందు అనుభవించిన వాటిని స్మరణ చేయుట "స్మృతి" యగును. గతమనుభవించిన నాయకుడు తన ఇచ్ఛగా పీధ్రిరాగా చూచి వీడు పూర్వము అనుభూత నాయకుడని జ్ఞాపకము తెచ్చుకొనుటే "స్మృతి'' యనబడును.

స్మృతియనగా జ్ఞాపకము :-

మనోభ్యాస బలముచేతను, తనంతటను సమాస వస్తువుల చూపు మొదలైనవానిచే గలుగు పూర్వానుభూతార్థ జ్ఞానము.

ఇందు ;- కనుబొమలు యెగురవేయుట, తల ఆడించుట మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి :-

శిరస్సును ఆడించుట, ఊచుట, కనుబొమ్మలు విక్షేపములు మొదలైనవి గలుగును, అద్భుతరసమందును, కరుణారసమందును "స్మృతి" జనించును.

చాపలము = చపలత్వము = చాపల్యము = చపలత :- రాగము అనగా ప్రేమ, ద్వేషము వీటివల్ల పుట్టిన చేష్టలు మొదలైన వాటియొక్క

ఆస్థలేకుండుట "చాపల్య" మనబడును. రాగద్వేషములకల్ల నిలకడలేని జ్ఞానమే "చపలత్వ" మనబడును. అసద్వేషము మొదలైనవానిచే మనస్సులో గలుగు లాఘవము.

ఇందు :- చెలులను దండించుట, చెలులను కఠినములాడుట. చేయు పనులియందు స్వతంత్రమును కనబరచుట, దృష్టిని చంచలము చేయుట, విశాలమైన చిరునవ్వు నవ్వుట, ముత్యాలహారములను కదల్చుట, కంఠాభరణములను అంటుకొనుట మున్నగు క్రియలయందు చోకదానియందైనను, క్షణమైనను నిలకడలేకయుండుట "చాపల" మగును.

మరియొక పద్ధతి :-

యోచింపక కౌగలించుకొనుట, చూచుట, వెఱ్ఱిపనుట, కఠినపు మాటలు, కొట్టుట, ఆజ్ఞాపించుట మొదలైన చేష్టలు గలుగును.

రౌద్రరసమునంచును, శృంగారరసమందును ఈ "చాపలము" బుట్టుచున్నది.

15. ఉగ్రత :- ఎగ్గుపుట్టగా మిక్కిలి చండత్వము "ఉగ్రత" యనబడును. అపరాధము, అవమానము, దొంగతనము, నిగ్రహము. అసత్ప్రలాపము మొదలైనవాటిచే చేయబడిన త్వర "ఉగ్రత" యనబడుచున్నది.

ఇందు :- ఘడిపించుట, చెయ్యివిసరుట, కొట్టుట, కట్టుట (బంధించుట), హద్దుమేరుట (ఉన్నస్థితిని మీరుట), కళ్ళు యెర్రజేయుట మొదగునవి కలుగును.

మరియొక విధము;- కన్నులు, ముఖము, నెరనౌట బంధనముచేయుట, కొట్టుట, తలయాడించుట, చమటపోయుట: బెదరించుట మొదలైనవి గలుగును. వీరరసమునందు, రౌద్రరసమందును ఈ "ఉగ్రత" జనించును.

16. అవహిత్థ = అంగగోపన :- ఆకారమును రహస్యము చేయుట "అవహిత్థము" వెరపు, సిగ్గు మొదలగువానిచేత నాకారగోపనముచేయుట, ధైర్యము, ప్రాభవము, నీతి, సిగ్గు, సాధ్వసము, దాక్షిణ్యము, ప్రాగల్భ్యము, అపజయము ఇవి మొదలైనవానిచే గలుగు ఆకారగుప్తి "అవహిత్థ" లేక "అంగగోపన" యనబడును. (సాధ్వసము = భయము.)

ఇందు :- వేరుగా చెప్పుట, అబద్ధపు (ధైర్యము, మరియొకప్రక్క చూచుట, కథాభంగము మొదలైనవి.

మరియొక విధము :- ఊరితే మరియొకలాగు చెప్పుట, (అనగా బొంకుట), ఉశక్కి ధైర్యము కనపరచుట ధైర్యమున్నట్లు నటించుట), కాలి బొటనవ్రేలితో లేక కాలితో తలవంచుకొని నేలఁవ్రాయుట, వేరొక విధమున బల్కుట, మరియొకప్రక్క చూచుట, మరియొకప్రక్క నుండుట మొదలైనవి గలుగును. శృంగారరసమందును, హాస్యరసమందులు "అవహిత్థము జనించును.

17. త్రప = వ్రీడ = లజ్జ = సిగ్గు :- మనస్సు ముణిగియుండుట 'త్రప' యనబడును. అకార్యముచేయుట, అవమానము, స్తోత్రము, నూతన సంగమము, ప్రతీకారక్రియ మొదలైనవానిచేత అతిదారుఢ్యము లేక యుండుట.

ఇందు ;- మరుగుగా మాట్లాడుట, తలవంపు యోచించుట, బయట రాకుండుట. దూరముగానే ముసుగిడుట, గోళ్ళుగిల్లుట, నేలగీరుట మున్నగునవి కలుగును.

మరియొక విధము ;- ముఖము మళ్ళించుకొనుట, ముఖము వెలవెలబోవుట, ముఖమును క్రిందుచేయుట, చూపునందు విశేషముగా రెప్పపాట్లు తెచ్చుకొనుట, చూపును మళ్ళించుకొనుట మొదలైనవి గలుగును. ఈ "త్రప" శృంగార రసమందు బుట్టును.

18. విషాదము = ఖేదము :- బుద్ధికి అనేకవిధములయొక్క భావములు మొదలైనవాటికి యెల్లప్పుడు భంగము కలుగుట "విషాద" మనబడును. ఉపాయమువల్ల మనస్సునకు కలిగే భంగమే "విషాదము" తానారంభించిన పని సాగకుండా ఇష్టార్థప్రాప్తి. విపత్తు. ఇప్పునేరగుట వీనివలనగలుగు ననుతాపము "విషాద" మనబడును.

ఇందులో :- ఏమిచేయనుయని ఉపాయము వెతకుట, చేతులు పిసుక్కొనుట, మనస్సు మనస్సులో లేకుండుట (అనగా చేతులు పిసుక్కుంటూ ఇటూనటూ చూస్తూ తిరుగుట), ముఖము విచారమును బొందినట్లు కనపరచుట మొదలైనవి గలుగును. ఈ "విషాదము" ఉత్తమ, మధ్యమ, అధమముల యాశ్రయమువలన మూడుతెరంగులది యగుచున్నది.

ఉత్తమ విషాదమున :- సహాయమును వెదకుట, ఉపాయచింత మొదలైన వ్యాపారములు గలుగుచుండును.

మధ్యవిషాదమందున :- ఉత్సాహము లేకయుండుట. మిక్కిలి చింతించుట, భ్రమించుట (అనగా భ్రమనుపొందుట), మొదలైన క్రియలు గలుగును.

అధమ విషాదమందున :- రోదనము, నిట్టూర్పు, ధ్యానము(అనగా మనస్సునిలిపి దేవుని చింతించుట), ముఖము వంకరచేయుట మున్నగునవి కలుగును. ఈ విషాదము భీభత్సరసమందును, శృంగార రసమందును జనించును.

19. మదము :- మద్యపానము చేయుట మొదలైన వాటియొక్క సంతోష మోహాతిరేకము "మద" మనబడును. మధూపానాదులచేత మిక్కిలి హర్షమును బొందుటే 'మద' మనబడును. మద్యము మొదలైన వానిచేగలుగు ఆనంద సమ్మోహములయొక్క సంభ్రమము.

ఇందు :- మాటలయొక్క తొట్రుపాటు (తడబడుట, శరీరము తూలుట, నవ్వు (అనగా పెద్దగా నవ్వుట). ఏడుపు, ఉత్తముడు నిద్రించుట, మధ్యముడు నవ్వుట, పాడుట, అధముడు గరిసములాడుట ఏడ్చుట, ఈ మదములు ముత్తెరంగులుగా నున్నవి.

1. తరుణమదము, 2. మధ్యమ మదము, 3. అపకృతమదము,

1. తరుణమదమందున ;- గర్వపు చూపు (అనగా నిర్లక్ష్యముగా పెడముఖముపెట్టి చూడవలయును.) ముఖమందు మెరుపు, చిరునగవు, చేతుల నాడించుట, ఒయ్యారపు నడక ఈ మొదలగు చేష్టలు కలుగును.

మధ్యమ మదమునందు ;- వాక్కున తడబాటు, గుడ్లు తిరుగుట, వంకరగా నడచుట, చేతుల నాడించుట, వ్రేలవేయుట మొదలైన చేష్టలు గలుగును.

అపకృత మదమందున !- గతిభంగము, మూర్ఛిల్లుట, తెలివితప్పియుండుట, ఉమియుట, ఎక్కిళ్ళు, వాంతి, మొదలగు చేష్టలు గలుగును. ఉత్తమమదము గలవాడు పండుకొనియుండును. మధ్యమమదము కలవాడు నవ్వుచూ పాడుచు ఉండును. అధమమదము కలవాడు క్రూరముగను వికారముగను మాటాడుచును దుఃఖించుచును వుండును. భీభత్సరసమునందును, వీరరసమునందును, రౌద్రరసమునందును, శృంగారరసమునందును ఈ "మదము" జనించును.

ఔత్సుక్యము = ఉత్సుకత = ఉత్సాహము :- హఠాత్తుగా సమయమందు అసమర్థత 'ఔత్సుక్య' మనబడును నిముషమాత్రం ఓర్వలేక త్వరపడే వేడుక. కోరిన వస్తువు లభింపక ముందొకక్షణమైన తాళజాలకపోవుట.

20. ఔత్సుక్యమునకు అనుభావములు;- సంతాపము (అనగా మన్మథ తాపము), మనశ్చింత, నిట్టూర్పు, ఎచ్చటనైన పోచూచుట, అసము మొదలైనవానిచేగలుగు జాగును తాళలేకయుండుట "ఔత్సుక్య" మనబడును. (ఔత్సుక్యము = ఉత్సాహము.)

ఇందులో :- మనస్సు కాకజెందుట, త్వర, నిశ్వాసము, నిద్ర, తాళ లేకపోవుట, కాలమును సహించక తొందరపడుట (అనగా లభించుటకు ఆలస్యమైనప్పుడు తొందరపడుట), చింతచేత ఏమియు తోచక యుండుట, శరీరభారము కనబరచుట, శయనించుటయందు అభిలాషపడుట మొదలగునవి గలుగును.

మరియొక పద్ధతి :- వేగముగా నడచుట, పడకనుండి లేచుట, చింతించుట, శరీరము బరువగుట మొదలైనవి గలుగును. భీభత్సరసము నందును, రౌద్రరసమునందును, శృంగారరసమునందును ఈ "ఔత్సుక్యము" జనించును.

21. మతి;- మనస్సుయందు అర్థమును నిర్ణయించుట "మతి" యన బడును. అనేక శాస్త్రార్థములను చెప్పుటవలన గలుగు అర్థనిర్ణయము.

ఇందులో :- బోధనచేయునట్లు కనపర్చుట, సంశయనివారణమైనట్లు కనపర్చుట, తెలిసి వ్యవహరించుట, సంతోషమును కనబర్చుట.

మరియొక పద్ధతి :- యుక్తమగు పనులను చేయుట, సంశయమును బోగొట్టుట, శిష్యోపదేశము, కనుబొమ్మల నాడించుట, ఊహాపోహములు మొదలైనవి గలుగును. ఈ "మతి" భీభత్సరసమందు జనించును.

22. నిద్ర :- మనస్సు ముకుళించియుండుట. వివక్తమందు, పరావ లోకనముచేతను. మనస్సు ముకుళితపర్చుకొనుటే. మందస్వభావము, వ్యాయామము, నిశ్చింతత, సమాధి వీనిచేతగలుగు మనోనిమీలనము 'నిద్ర' యనబడును.

ఇందులో :- ఒళ్ళు విరుచుకొనుట, ఆవలించుట, కన్నులుమూయుట, పైటచెంగుగాని, కొప్పుగాని, ధరించిన హారాదులుగాని, తొలగిపోయినప్ప టికి తెలియకుండుట, నిద్రలో వట్టిఆకాశమును కావలించుకొనుట (అనగా

స్వప్నమందు ప్రియునిచూచి చుంబనాలింగనాదులు తాను జరిగించుచున్నట్లు కనపరచుట.)

మరియొక పద్ధతి :- ముఖగౌరవము, కన్నులు జులాయించుట, అంగముల పరివర్తనము, ఉశ్వాసనిశ్వాసములు దేహమందు చెమట పోయుట, నేత్రములు మూతబడుట. దేహసంకోచము. తెలివిలేకయుండుట (మూర్ఛ) మొదలగునవి గలుగును. శృంగారరసమందు, హాస్యరసమందు, ఈ "నిద్ర" జనించును.

23. మోహము = వలపు = మూర్ఛ:- మూర్ఛనుపొందుటే మోహ మనబడును, సంతోష, భయ, దుఃఖ, చింతలచేత మూర్ఛిల్లుటే. ఆపత్తు, భయము, వియోగము మొదలగువానిచే మనస్సున కేమియు తెలియక పోవుట.

ఇందులో:- భయపడుతూ మూర్ఛనుపొందుట, దుఃఖమునుపొందుచూ మూర్ఛనుపొందుట, మలయానిలము చంద్రుడు కోకిలల పలుకులు, చిలుకల పలుకులు మొదలైనవాటిని తాళలేక మూర్ఛను పొందుట.

**N. B** ;- మూర్ఛయనగా నిద్రజెందినవానివలే నుండుట, గ్రుడ్లు తేలవేయుట (దేహము మరచియుండుట), శరీరము పడిపోవుట, కళ్ళు మూసుకొని తల వాళ్ళు త్రిప్పుట, దేహము మరచియుండుట, సొక్కియుండుట.

మరియొక పద్ధతి :- ఇంద్రియములు శూన్యముగా నుండుట, చేష్టలు లేకయుండుట (చేష్టలనగా కాలు చెయ్యి మొదలైనవి కదలుట), దేహము విరగుట, పడుట, గ్రుడ్లు గిరగిరలాడుట ఇవి మొదలైన క్రియలుగలుగును. అద్భుతరసమందును, వీరరసమందును ఈ "మోహము" జనించును.

24. విబోధము = బోధము = ప్రబోధము ;- ఎరుకను జెందియుండుట. ఆత్మ మనస్సు సంయోగమై ఆవలింతలతోగూడా కళ్ళునలుపుకుంటూ మేలు కొనుట "విబోధ" మనబడును. నిదురమేలుకొనుటయే 'విబోధ'మనబడును.

ఇందులో :- భుజములు పైకిఆడించుట, చిటికెలు వేయుట, ఒళ్ళు విరచుకొనుట, కన్నులు నలుచుకొనుట, కన్నులు క్రమముగా విప్పుట, ఆవలింతలు యివి మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి :- కన్నులు నలుపుకొనుట, పడకను విడచుట, బాహువిక్షేపము, అంగుళీమోటనము, తలగోక్కొనుట, దేహముత్రిప్పుట మొదలైనవి గలుగును. ఈ "విబోధము" వీరరసమందు బుట్టును.

25. మృతి = మరణము = అంతము = చావు = శరీరత్యాగము:- మరణమును బొందుట అంతమనబడును. శరీరత్యాగమే "మరణ" మనబడును. సర్వాంగవ్యాపిగానుండు దనుంజయువుయొక్క నిర్గమము "మరణ" మనబడును.

ఇందులో :- ఎక్కిళ్ళు తెచ్చుకొనుట. శ్వాసలు తెచ్చుకొనుట. వెన్నెలసేవ చేయుట, మలయమారుతమునకు శరీరము అర్పించుట, ఇవి మొదలైనవి గలుగును. ఈ మరణము రెండు విధములు. వ్యాధిజమనియు అభిఘాతజమనియు చెప్పియుండిరి.

వ్యాధిజ మరణమందు :- అసాధ్యమైన హృద్రోగము. విషూచి మొదలైనవానిచేత గలుగును. ఈ వ్యాధిజ మరణమందు కొతుకుచు మాట్లాడుట, దేహకాంతి మారిపోవుట, మెల్లగా శ్వాసమువిడచుట, మాటనిలచిపోవుట. నేత్రమీలనము హిక్క (అనగా ఎక్కిళ్ళు), పరిజనముల నుపేక్షించుట, ఇంద్రియచేష్ట లణగుట మొదలైనవి కలుగును.

అభిఘాతజ మరణమందు :- ఘాతముపడుట, దేహబంధనము, విషము వీనిచే గలుగునది యభిఘాతజ మరణమనబడును.

N.. B అందుఘాతజమందు :- నేలబడుట, ఏడ్చుట మొదలైనవి గలుగును. వసనాభి మొదలైన విషము. పతనాదులైన "అభిఘాతము" వలన గలుగు చేష్టలు.

చికిత్సపోవుట, వణకు, తాపము, హిక్క, ఫేనము, కంధరాభంగము (అనగా కంధరము = కంఠము), జడత (అనగా వడలు విడచుట), మరణము మొదలైన చేష్టలు గలుగును. ఈ "మృతి" భయానకరసమందును, వీరరసమందును, శృంగార రసమునందును జనించును.

26. ముదము = హర్షము :- ఇష్టమైన పదార్థముయొక్క లాభమువల్ల బుట్టిన సంతోషము "ముద" మగును. హర్షద్వేషకంపములచేత ఉత్సాహ ప్రసక్తే "హర్ష" మనబడును. మనోరథము యొక్క సిద్ధియోగ్యమైనవస్తువులయొక్క లాభముచేతను, మిత్రుల సంగమముచేతను. దేవతాదులప్రసాదముచేతను గలిగింపబడిన మనఃప్రసాదము "హర్ష" మనబడును. గురువుయొక్కయు. దేవతయొక్కయు. రాజయొక్కయు ననుగ్రహముపలనను ప్రియసంగమమువలనను కోరబడిన వస్తువు లభించుటవలనను గలుగు మనోవికాసము "హర్ష" మనబడును.

లక్షణం :- ముఖనేత్రములు వికాసముచేతను, ప్రియపుమాటలు వినుటచేతను, పులకలు పుట్టుటచేతను, గాత్రము బుక్కుటచేతను, చెమట చేతను తెలియబడునని లక్షణము.

ఇందులో :- కన్నులయందున్నూ, ముఖమందున్నూ, వికాసము గను పరచుట, ఒళ్ళు గరిపొడుచుటయును, శరీరము ఉప్పొంగించుటయును, కళ్ళు ముఖముగాక ఇతర స్థలములయందు చెమటకలిగియున్నట్లు కనుపర్చుట.

మరియొక పద్ధతి :- ముఖము, కన్నులు వికసించుట, ప్రియభాషణము, ఆశ్లేషము, పులకరింపు. చెమట గలుగుట, చేతులు తట్టుట మొదలైనవి కలుగును. ఈ "ముదము" అద్భుతరసమందును, వీరరసమందును రౌద్రరసమందును జనించుచున్నది.

ఆలస్యము = మాంద్యము = జాడ్య = అరతి :- చేయదగిన కార్యమందు మందగొడితనముగల ఉద్యోగము చేయవలసిన కార్యములయందు మందపడుటయే "ఆలస్య"మనబడును. (అలస్యమనగా మాంద్యముజాగు=) స్వభావము. భయము, తృప్తి. గర్వము, భయము లేకయుండుట మొదలగు వానివలన విళంబనముగ పనులను యత్నించుట "ఆలస్య" మనబడును.

ఇందులో :- వొళ్లు విరచుకొనుట, ఆవలించుట, కార్యముచేయుట యందు బద్ధకము కనపరచుట, పడకటింటిలో సువాసనరచన, చాందినీకట్టుట, కస్తూరి పూసుకొనుట, పువ్వులు ముడుచుకొనుట (లేకదండలు మెడలోవేసు కొనుట), మకరికాపత్రములను రచించుట, ఈ మొదలైన వాటియందలి యత్నముయొక్క "మాంద్యము"ను కనుపరచుట, ఇందు శ్రమ, గర్వము, మొదలగు రెండు సంచారీలలో తెనిపిన విధమునుకూడా పట్టవలయును.

మరియొక పద్ధతి ;- అంగభంగము. క్రియాద్వేషము. ఆవలింత, నేత్రములు నలుపుట, పండుకొనుటయందు ముఖ్యముగా ప్రియముగలుగుట, కన్నులు మూతలుపడుట, నిదుర మొదలైన క్రియలు గలుగును. ఈ ఆలస్యము శృంగార రసమునందును, అద్భుత రసమునందును, కరుణారసము నందును బుట్టును.

27. వితర్కము = సంశయము = ఊహ :- సందేహముచేతఅనంతములైన కల్పనలు గల్గుట, సందేహమువల్ల అనేక విధములుగా కల్పించుట "వితర్క" మనబడును. సందేహము, నిశ్చయము మొదలైనవానిచే గలుగు ఊహాత్మకమగు సత్యానత్య నిర్ణయము "వితర్కము".

దీనిలో ;- కనుబొమ్మలు యెగురవేయుట, తలయాడించుట, మొదలైన యనుభావములు గలుగును.

మరియొక విధము :- కనుబొమలు యెత్తుట, తల ముందుకు

యూహించుట, ఆలోచిస్తూయున్నట్లు కనుపరచుట మొదలైనవి కలుగును, ఈ "వితర్కము" వీరరసములో బుట్టును.

28. సుప్తి :- మిక్కిలి నిద్ర "సుప్తి". స్వప్నముతేని నిద్ర సుప్తి. నిదురయొక్క ఆధిక్యమే సుప్తి.

ఇందుతో :- ఉశ్వాస నిశ్వాసలు కనుపరచుట, ఇంద్రియములయందు నిశ్చలత్వమును కనుపరచుట, కన్నులు మూసుకొనుట,

మరియొక పద్ధతి :- ఇంద్రియములు ఉపరతిని పొందియుండుట, కన్నులు మూసియుండుట, గాత్రము ప్రసన్నమైయుండుట, కలగనుట. దీర్ఘకాలము కదలకయుండుట, ఉశ్వాసనిశ్వాసలు మొదలైనవి కలుగును. ఈ "సుప్తి" హాస్యరసమందు బుట్టుచున్నది,

29. అసూయ = ఈర్ష్య = అసహ్యాతి :- పరులయొక్క అతిశయమును సహించకబోవుట "ఈర్ష్య" యనబడును. పరులయొక్క వృద్ధియమును సహించకుండుటే "అసూయ". అసూయ యనగా ఓర్వలేనితనము, ఇతరుల సౌభాగ్యము, సంపత్తి, విద్య, కులము, శౌర్యము మొదలగుహేతువులచే గుణమందుకూడా దోషారోపణచేయుట "అసూయ" యనబడును.

ఇందులో :- మోముత్రిప్పుట. నిందించుట, ఉపేక్ష, భ్రూభేదము ఈ క్రియలు కలుగును.

మరియొక పద్ధతి :- గర్వము. దౌర్జన్యము, కోపము వీటివల్ల ఇతరోత్కర్షను సహింపకబోవుట, నిందించుట, తిరస్కరించుట. బొమముడివేయుట (అనగా కనుబొమలు, ముఖము లేక నొసలు చిట్లించుట), ఈర్ష్య, సుగుణాలనైనను సహింపబోవుట. ఈ "అసూయ" వీర రౌద్ర శృంగార హాస్య రసములయందు జనించును.

30. ఆధ్యానము = చింత :- ఇష్టమైన వస్తువు చేకూరకపోయినప్పుడు మిక్కిలి చింతించుట "ఆధ్యాన" మనబడును. ప్రియవస్తువులు లభింపమి వలన ఐశ్వర్యభ్రంశనము మొదలైనవానిచే గలుగు ధ్యానము "చింత" యన బడును,

ఇందులో :- మేనుచిక్కుట, తలవంపు (అనగా అవమానము), సంతాపము (తాపము), నిట్టూర్పు మొదలైనవి గలుగును.

మరియొక విధము :- శూన్యత్వము (లభించక పోవుట), నిశ్వాస ములు (ఊర్పులు). తాపము మున్నగునవి కలుగును. ఈ "ఆధ్యానము" కరుణ శృంగార భయానక రసములయందు జనించును.

31. ఉన్మాదము :- విస్మయము, భ్రమ, చిత్తవిభ్రమ, ఇది దశావస్థలులోనిది. ఉన్మాదమనగా వెర్రితనము.

ఎల్లప్పుడు చేతన వస్తువులయందు సమానమైన మనస్సునందు భ్రమపడుట "ఉన్మాద" మనబడును. స్థావర జంగిమాదులయందు సమత జెందుటే "ఉన్మాద" మనబడును. ఉన్మాదమనగా చిత్తవిభ్రమ. వెర్రి తనము, వియోగము, ఇష్టనాశము వీనివల్లగలుగు చిత్తవిభ్రమము.

ఇందులో :- నిమిత్తములేని నవ్వు, సంబంధములేని వాగుడు, హేతువులేకయే పరుగెత్తుట, కూర్చుండుట, లేచుట, ఏడ్చుట, జీవముగల మనుష్య పశుపక్ష్యాదులయందున్నూ. జీవములేని చెట్లుగట్లు మొదలగువాటి యందున్నూ, సమముగా ప్రవర్తించుట (అనగా గోడతోటి, మనుష్యుల తోటి సమానముగా మాట్లాడుట మొదలైనవి.

ఉన్మాదములు రెండు రకములు 1. వియోగజోన్మాదము, 2. ఇష్ట నాశోన్మాదము.

1. వియోగజోన్మాదము :- పరుగెత్తుట, పరివేదనము (విలపించుట), (తలచుచు తలచుచు ఏడ్చుట), సంబంధములేని పలుకులు పలుకుట, పండుకొనియుండుట, త్వరగా లేచుట. ప్రాణము లెనివానితో మాట్లాడుట, కారణములేక నవ్వుట మొదలైనవి గలుగును.

2. ఇష్టనాశోన్మాదమందు :- భస్మము మొదలైనవానిని బూసుకొనుట, నృత్తము గీతము మొదలైనవి చేయుట, తృణము మొదలైనవాని దండలను ధరించుట, ఇవికాక వియోగజోన్మాదమందలి కలుగు క్రియలు గూడా యిందు గలుగును. ఈ "ఉన్మాదము" కరుణ హాస్యరసములయందు జనించును.

32. అపస్మృతి = అపస్మారము :- ఇంద్రియములయొక్క చలనము అపస్మార మనబడును. మోహ మూర్ఛలచేతను తను తాపకారణ ఆవేశమే "అపస్మృతి" లేక "అపస్మారము" యగును వాత పిత్త శ్లేష్మ ధాతువుల హెచ్చుతక్కువ దోషము. దయ్యముసోకుట మొదలైనవానిచేత చేయబడిన మనస్సుయొక్క క్షోభము "అపస్మృతి" లేక "అపస్మారము.

ఇందులో :- వణకుట, పరుగెత్తుట, పడుట, స్తంభము (కదలకుండుట), తిరుగుట, నేత్రముల విక్రియస్ఫోటము, పల్లుకొరుకుట, చేతులు విసరుట, నోట చొల్లుగార్చుట, నురుగు గల్గుట మొదలైనవి గలుగును.

మరియొక విధము :- భూమియందు పడుట, తిరుగుట, దండచెయ్యి చరచుకొనుట, వెర్రిమాటలాడుట, చొంగనురుగు నోటివెంట తెచ్చుకొనుట, వెర్రిచూపులు చూచుట, పరుగెత్తుట, చిందులుత్రొక్కుట, ఊగిసలాడుట, మొదలైనవి గలుగును. ఈ "అపస్మృతి" భయానక భీభత్సరసములయందు జనించును.

## నవరసముల లక్షణ వినియోగములు :-

"శృంగారహాస కరుణారౌద్రవీర భయానకాః ।
భీభత్సాద్భుత శాంతస్యరసాః పూర్వేప్రకీర్తితాః ॥

శృంగారము, వీరము, కరుణ, అద్భుత, హాస్య, భయానక, భీభత్స, రౌద్ర, శాంతరసములని తొమ్మిది విధములుగా తెలియవలెను.

శృంగారరస లక్షణము :-

ఇది "రతి" యనెడి స్థాయిభావమునుండి జనించును, ఉజ్వలవేషము కలిగియుండును. లోకమందు ఏదేని శుచిగా మేధ్యము (పవిత్రము) గా ఉజ్వలముగా ధర్శనీయముగా వున్నదో దానిని "శృంగార"ముతో ఉపమింతురు. ఉజ్వలవేషయుతుడు, శృంగారవంతుడనబడుచున్నాడు. గోత్ర - కుల - ఆచారముల ననుసరించికాని, పెద్దలమాటల ననుసరించిగాని, లోక ప్రసిద్ధి ననుసరించిగాని, పురుషులకు నామము లేర్పడుచున్నట్లే- ఆచారము ననుసరించియు, పెద్దలమాటల ననుసరించియు, రసములు, భావములు మొదలగు నాట్యాశ్రితములగు అర్ధములకుకూడా నామములు ఏర్పడుచున్నవి. హృద్యమును, ఉజ్వలమునుఅగు వేషము కలదనుటవలన "శృంగార"రసమను నామము ఆచారసిద్ధమైనది. ఈ శృంగారరసము నిండుయవ్వనములో వున్న ఉత్తమ స్త్రీ పురుష ప్రకృతులకు సంబంధించియుండును. ఇట్టిశృంగారము, సంభోగము, విప్రలంభము అను భేదములచే రెండు అవస్థలను కలిగియుండును.

సంభోగశృంగారము :-

వసంతాది ఋతువులు, పుష్పహారములు, కామోద్దీపకములైన గంధము మొదలగువాని పూతలు, నగలు, విదూషకుడు మొదలగు ఇష్టజనుల సహవాసము, గీతాదులు, శ్రేష్టములైన భవనమును, వానియందలి నివాసములు, ఉద్యానవన విహారములు, లేదా వానినిగూర్చిన ప్రశంసలు, కామోద్దీపకములైన చిత్రాదులు, ఉత్తమజనుల అనుకరణము, జలక్రీడ మున్నగు విభావముల వలన "సంభోగ శృంగారము" గలుగును. కనులను, కనుబొమలను చతురతతో త్రిప్పుట, కడగంటి చూపులను ప్రసరింపజేయుట, లలితములైన

అంగాహారములను ప్రదర్శించుట, మధురములైన వాక్యములను బల్కుట, మున్నగు అనుభావములచే ఈ సంభోగ శృంగారమును అభినయించవలయును. ఆలస్యము, జుగుప్స, ఉగ్రత అనుమూడునుతప్ప తక్కినవన్నియు ఇందు వ్యభిచారీభావము లగుచున్నవి.

ఇందు సంచారీ భావములు :-

దైన్యము, జడత, గ్లాని, శంఖ, త్రాసము, గర్వము, ఆవేగము, ధృతి, స్మృతి, చాపలము, అవహిత్థ, వ్రీడ, ఔత్సుక్యము, మతి, నిద్ర. మోహము, విబోధము, ముదము, వితర్కము, సుప్తి, అసూయ, ఆఖ్యానము మొదలగు "సంచారీ" భావములు వచ్చును.

విప్రలంభ శృంగారము :-

ఈ విప్రలంబ శృంగారమందు గ్లాని, నిర్వేదము. శంక, అసూయ, శ్రమ. చింత, ఔత్సుక్యము. నిద్ర, స్వప్నము, ప్రబోధము, వ్యాధి, ఉన్మాదము, అపస్మారము. జాడ్యము, మోహము, మరణము మొదలగు అనుభావములచే అభినయించవలయును. సుఖప్రాయములగు ఇష్టజనులతో కూడిన వాడును, ఋతు - మాల్యాదులను అనుభవించువాడును, ప్రమదాసక్తుడును, అగు పురుషుడు "శృంగార" పదవాచ్యుడగును. ఋతు-మాల్య - అలంకారములు విదూషకాది ప్రియజనులు గీతాదిహృద్య విషయములు, కావ్యశ్రవణ-పఠనములు, ఉద్యానవనగమన విహారములు అనునవి శృంగార సముద్భవమునకు హేతువులు. నయన-వదన ప్రసన్నతలు, స్మితము, మధురవాక్కులు. ధృతి, ప్రమోదము, మధురములైన అంగాహారములు అనువానిచే శృంగారరసమును అభినయించవలయును.

హాస్య రసము :- హాస్యము : "హాస" మనియెడి స్థాయి భావము నుండి జనించును. వికృతములైన పరవేష - అలంకారములు, నిర్లజ్జత, లవుల్యము (విషయములయందు అనియతత్వము), కుహకము

(చక్కలిగింతలు పెట్టుట), అసత్ప్రలాపము, అంగవికలులను చూచుట, అసిమిత్తభయాదులును, అకార్యకరణములను, వికృతవేషాదులను వర్ణించి చెప్పుట మున్నగు విభావములవలన "హాస్యరస" ముత్పన్నమగును. పెద వులను, ముక్కులను, చెక్కిళ్ళను స్పందింపచేయుట, కనులను కొలదిగా మూయుట, విప్పారజేయుట, స్వేదము, ముఖరాగము, రెండుచేతులతో తన ప్రక్కలను పట్టుకొనుట అనెడి భావములచే ఈ "హాస్యము"ను అభిన యించవలెను. అవహిత్థము, తంద్ర (మోహము), నిద్ర, స్వప్నము, ప్రబోధము అసూయ మొదలగునవి "హాస్య" మందు, వ్యభిచారీభావము లగును. ఈ హాస్యరసము ఆత్మస్థము: పరస్థముయని రెండు విధములు.

తానే నవ్వినచో యది ఆత్మస్థమగును. ఇతరులను నవ్వించుట పరస్థమగును. విపరీతములైన అలంకారములు, వికృతములైన ఆచార ములు, నామములు, వేషములు, వికృతములైన అంగవికారములు అను వీనిచే జనులు నవ్వుదురు. కాన యిది "హాస్య" మనబడినది. స్త్రీ, నీచ ప్రకృతులందీ రసమధికముగా కన్పట్టును. ఇందు ఆరు విధములు గలవు.

షడ్విధ హాసభేదములు ;-

స్మితమథహసితం విహశిత ముపహసితం చాపహసిత
మతిహసితమ్ । ద్వౌద్వౌ భేదాస్యాతా ముత్తమమధ్యాదమప్రకృతౌ॥

స్మితము, హసితము, విహశితము, ఉపహాశితము, అపహాశితము, అతిహాశితము వీనిలో మొదటి రెండుభేదములును, ఉత్తమ ప్రకృతులయం దభివ్యక్తములగును. ఇంక మధ్యవిరెండును, మధ్యమ ప్రకృతులయందు చివరి రెండును నీచప్రవృత్తులయందును అభివ్యక్తములగును. వీని స్వరూ పములు ఈక్రింది విధముగా నుండును.

స్మితము :- చెక్కిళ్ళు కొంచెము వికశించవలెను. కడగంటిచూపులు సౌష్టవయుతములుగావలెను. పలువరస కదలకుండ గంభీరముగ నవ్వవల యును. ఇట్టిది "స్మిత" మనబడును.

హసితము :- చెక్కిళ్ళు వికశించవలెను. కనులును, ముఖమును బాగుగా విప్పారవలెను. పనువరస కొంచెము కనబడునట్లు నవ్వవలయును. ఇట్టిది "హసిత" మనబడును.

మధ్యమ ప్రకృతులం దభివ్యక్తములగునవి :-

విహశితము :- కనులను, చెక్కిళ్ళను కొంచెము ముడువవలెను. ఉచితసమయమందే నవ్వురావలెను. ముఖము కొంచెము యెరుపెక్కవలయును. నవ్వు మధురమును సస్వనమును కావలెను. ఇట్టిది "విహశిత" మనబడును.

ఉపహశిత :- ముక్కుపుటములు విప్పారవలెను. చూపులు వక్రముగా నుండవలెను, అంసములను శిరమును ముడుచుకొనవలెను. ఇట్టిది "ఉపహశిత" మనబడును.

నీచ ప్రకృతులయం దభివ్యక్తములగునవి :-

అపహశితము :- అస్థానమందు (శోకాది సమయములందు) నవ్వు వచ్చును. కనులనుండి అశ్రువులు గారును. అంసక-శిరములు పైకెగురుచుండును. ఇట్టిది "అపహశిత" మనబడును.

అతిహశితము :- కనులు తొట్రుపాటుతో కూడినవై అశ్రుసహితములు గావలయును. స్వరము శృతి కటువుగా ఉద్దతముగా ఉండవలెను. నవ్వునపుడు చేతులతో తన ప్రక్కలను బట్టుకొనవలెను. ఇట్టిది "అతిహశిత" మనబడును.

పైన పేర్కొనిన విధముగా ఈ ఆరు భేదములును నాటకమున అయా కార్యములవలన జనించిన ఆయా హాస్యస్థానములలో ఉత్తమ - మధ్యమ-అధమ ప్రకృతులయం దభివ్యక్తము లగుచుండవలెను. ఆత్మసముత్థ, పరసముత్థ భేదములచే రెండువిధములైన ఈ హాస్యము ప్రకృతిత్రియగతమై అవస్థాత్రయమును కలిగియుండును.

కరుణరసము :- ఇది "శోక" మనెడి స్థాయిభావమునుండి జనించును. శాపమువలన క్లేశము, ఇష్టజననాశమువలన "కరుణ"రస ముత్పన్నమగును. కన్నీళ్ళుకార్చుట, పరివేదనము చేయుట (తన్నుగాని దైవముగాని ఇతరులనుగాని ఉపాలంభించుట), నోరెండిపోవుట, శరీరముయొక్క రంగు మారుట, అంగములు వ్రేలాడుట, ఉచ్ఛ్వాస-నిశ్వాసములు అధికమగుట, మరపు(దీనిచే స్తంభ-ప్రలయములు సూచితములు) మొదలగు అనుభావములచే కరుణరసము అభినయించవలెను. నిర్వేదము, గ్లాని, చింత, ఔత్సుక్యము, ఆవేగము, భ్రమ, మోహము, శ్రమము, భయము, విషాదము, దైన్యము, వ్యాధి, జడత, ఉన్మాదము, అపస్మారము, త్రాసము, ఆలస్యము, మరణము, స్తంభము, వేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, స్వరభేదము మొదలగునవి ఇందు వ్యభిచారీ భావములు.

ఇష్టజనుల వధను చూచుటవల్లగాని, అనిష్టములైన వాక్యములను వినుటవలనగాని, ఇట్టివేయగు ఇతర భావవిశేషముల వలనగాని కరుణరసము సంభవించును. గట్టిగా ఏడ్చుట, మూర్ఛాదులనొందుట, పరివేదనము చేయుట, విలపించుట, ఆయాసపడుట, గుండెలు బాదుకొనుట యనెడి అనుభావములచే కరుణరసము అభినయించవలెను.

రౌద్రరసము :- రౌద్రము : ఇది క్రోధమనెడి స్థాయభావమునుండి జనించును. ఇది రాక్షసుల దానవుల ఉద్ధత మనుష్యుల ప్రకృతులకు సంబంధించియుండును. సంగ్రామమువలన జనించును. క్రోధము. అధర్షనము (ఇతరుల భార్యలను చెరచుట), అధిక్షేపము, దేవజాతి - అభిజన-విద్యా-కర్మలను నిందించుట), అవమానము, అసత్యవచనము, ఉపఘాతము (పనివారల బాధించుట), వాక్పారుష్యము (కొట్టుదును చంపుదును యని భయపెట్టుట). అభిద్రోహము, (చంపదలంచుట), అసూయ మొదలగు విభావములచే "రౌద్ర" రస ముత్పన్నమగును. కొట్టుట, విరచుట, మర్దించుట, నరకుట, ఆయుధమును గ్రహించుట, శస్త్రములను ప్రయోగించుట,

రక్తమును స్రవింపచేయుట మొదలగునవి ఇందలి అనుభావములు మరియు ఎర్రకన్నులు, చెమట, బొమముడివేయుట. పళ్ళుకొరకుట, పెదవులదరుట, చెక్కిళ్ళు అదరుట, అరచేతుల నొండొంటితో రాయుట మొదలగు అనుభావములచే రౌద్రరసమును అభినయించవలెను. సంమోహము. ఉత్సాహము, ఆవేగము, ఆమర్షము, చపలత, ఉగ్రత, గర్వము. స్వేదము, వేపథువు. రోమాంచము, స్వరభేదము మొదలగునవి ఇందు వ్యభిచారీ భావములు.

వీరరసము ;- వీరము : ఉత్సాహము, ఉత్తముల స్వభావము, ఉత్సాహాత్మకముగాన వీరముకూడ ఉత్తమప్రకృతకము. అసమ్మోహము, (కలతచెందకుండుట), అధ్యవసాయము (పట్టుదల). నయము (సంధివిగ్రహాదుల ప్రయోగము), వినయము (ఇంద్రియ జయము), బలము (చతురంగబలము కలిగియుండుట), పరాక్రమము (శత్రుమండలాదుల నాక్రమించుట), శక్తి (యుద్ధాదులందలి సామర్థ్యము), ప్రతాపము (శత్రువులకు సంతాపము కలిగించు ప్రసిద్ధి), ప్రభావము (అభిజన-ధనమంత్రి సంపద) మొదలగు విభావములవలన "వీర''రస ముత్పన్నమగును.

స్థైర్యము, ధైర్యము, శౌర్యము, త్యాగము (దానాదుల నొసంగుట), వైశారద్యము (సామాదులను నేర్పుతో ఉపయోగించుట) మొదలగు అనుభావములచే దీనిని అభినయించవలెను. ఇందు ధృతి, మతి, గర్వము, ఉగ్రత, అమర్షము, స్మృతి, రోమాంచము, ప్రతిబోధము మొదలగునవి సంచారీభావములు. ఉత్సాహము, అధ్యవసాయము అవిషాదము, అవిస్మయము, అసమ్మోహము అనువానివలనను ఇట్టివేయగు ఇతర అర్థవిశేషములవలనను వీరరసము పుట్టుచున్నది. స్థైర్యము, ధైర్యము, వీర్యము, గర్వము, ఉత్సాహము, పరాక్రమము, ప్రభావము, ఆక్షేపపూర్వకములైన వాక్యములనెడి అనుభావములచే వీరరసమును అభినయించవలయును.

భయానక రసము :- భయానకము : ఇది భయమనెడిస్థాయి భావముువలన జనించును. వికృతరవము వినుట, పిశాచదర్శనము, నక్కల, గుడ్లగూబల అరపులు. ఇతరుల త్రాసమును ఉద్వేగమును చూచుట, శూన్య గృహమునకుగాని, అరణ్యమునకుగాని వెళ్ళుట, స్వజనవధ-స్వజనబంధనములను చూచుట, వినుట, వధాదులకు సంబంధించిన కథలు చెప్పుట, మొదలగు విభావములవలన "భయానక"రస ముత్పన్నమగును. కంపించుచున్న కర-చరణములు, చలించుచున్న కనులు, పులకలు, ముఖ్యవైవర్ణ్యము, స్వరభేదము మొదలగు అనుభావములచే "భయానక" రసము అభినయించవలెను. స్తంభము, స్వేదము, గద్గదము, రోమాంచము, వేపథువు, స్వరభేదము, వైవర్ణ్యము, శంక, మోహము, దైన్యము, ఆవేగము, చపలత, జడత, త్రాసము, అపస్మారము, మరణము మొదలగునవి ఈ రసమునకు వ్యభిచారీ భావములు, విక్రతరవము, సత్త్వదర్శనము. సంగ్రామ-అరణ్య-శూన్యగృహ గమనములు, గురు-నృపులయెడ కావించిన అపరాధము అనువానివలన "భయానక"రస ముత్పన్నయగును. స్వభావజ, కృతకయని రెండు విధములు భయములు యిందుగలవు.

స్వభావజమైన భయము :- గాత్ర-ముఖ-దృష్టులయందలి వైపరీత్యము, ఊరువులు స్తంభించుట, శూన్యముగా చూచుట, చలించిపోవుట, అంగములు జారుట. నోరెండిపోవుట, హృదయము కంపించుట, పులకలు మొదలగు అనుభావములచే భయమును అభినయించవలెను. ఇది "స్వభావజమైన భయము".

కృతకభయము :- ఈ కృతకభయమును సత్త్వసముద్భవముగా అభినయించవలెను. ఇందు చేష్టలు మృదువుగా నుండవలెను. పై అనుభావములచేతనే నిదియును అభినయించవలెను. కర-చరణ-కంపన-స్తంభనములు, గాత్రప్రకంపము. హృదయకంపనము, ఎండిపోయిన పెదవులు, తాలువులు, కంఠము అనువానిచే రెండురకముల (కృతకసహజ), "భయానక" రసమును అభినయించవలెను.

భీభత్సరసము :- భీభత్సము : ఇది జుగుప్సయనెడి స్థాయిభావము నుండి జనించును. అహృద్యములు అప్రశస్తములు, అప్రియములు, అచోక్షములు (సహజముగా శుద్ధపదార్ధములైనను, మలాదులచే దూషితములు), అనిష్టములును, అయిన వస్తువులను, చెప్పుట, చూచుట, వినుట మొదలగు విభావములవలన "భీభత్స"రస ముత్పన్నమగును. శరీరమును పిండీకృతము చేయుట, ముఖసంకోచనము, ఉల్లేఖనము (వాంతి చేసుకొనుట), ఉమ్మివేయుట, గాత్రమును ఎగురవేయుట మొదలగు అనుభావములచే దీనిని అభినయించవలెను. ఇందు అపస్మారము, ఉద్వేగము, ఆవేగము, మోహము, వ్యాధి, మరణము మొదలగునవి సంచారీభావములు. అభిమతము కానివానిని దర్శించుటచేతను. దుష్టములైన గంధ-రస-స్పర్శశబ్దముల చేతను, వివిధములైన ఉద్వేజనములచేతను, భీభత్సరస ముత్పన్నమగును, ముఖ-నేత్రములను సంకోచింపచేయుట, ముక్కుమూసుకొనుట, ముఖమును వంచుట, ఎత్తెత్తి నేలకు అంటీఅంటకుండా అడుగులువేయుట అనెడి అనుభావములచే "భీభత్స" రసము అభినయించవలయును.

అద్భుతరసము :- అద్భుతము : ఇది విస్మయమనెడి స్థాయిభావము నుండి జనించును. దివ్యజన దర్శనము, ఈప్సిత మనోరథము సిద్ధించుట. ఉద్యానవనములకు, దేవాలయములకు వెళ్ళుట, సభా-విమాన - మాయా- ఇంద్రజాలాదులను సందర్శించుట మొదలగువానివలన అద్భుతరసముత్పన్నమగును. విస్ఫారిత కనులు, రెప్పపాటులేని చూపు, రోమాంచము, అశ్రుపాతము, స్వేదము. హర్షము, సాధువాదము, అధికదానము, హాహాకారము, బాహువులను, వదనములను, అంగుళులను వస్త్రములను ఆడించుట. మొదలగు అనుభావములచే అద్భుతరసము అభినయించవలయును.

స్తంభము, అశ్రువు, స్వేదము, గద్గదము, రోమాంచము, ఆకాశము సంభ్రమము, ప్రహర్షము,చపలత, ఉన్మాదము, ధృతి, జడత, ప్రళయము, మొదలగునవి ఇందు వ్యభిచారీభావములు. అతిశయార్ధయుక్తములైన కావ్యములు, ప్రశస్త కరాత్మకమైన శిల్పములు అత్యుత్కృష్టములైన రూపము

లను "అద్భుత" రసమునకు విభావములని తెలియవలెను. స్పర్శము, గ్రహణము, ఉల్లుకసనము, (శరీరమును అహ్లాదపూర్వకముగ ఊర్ధ్వముగా కంపింపజేయుట), హాహాకారము సాధువాదము, వేపథువు-స్వేదము, గద్గదవచనము మొదలగువానిచే "అద్భుత" రసమును అభినయించవలెను.

శాంతరసము ;- శాంతము : ఇది "శమ" మనెడి స్థాయిభావము నుండి జనించును. మోక్షమునందు ఆశక్తిని కలిగించును. తత్త్వజ్ఞానము. వైరాగ్యము, ఆశయసిద్ధి మొదలగు విభావములవలన "శాంత" రసము జనించును. యమ-నియమములు-అధ్యాత్మ-ధ్యాన-ధారణ-ఉపాసనములు, సర్వభూతదయ, వైరాగ్య చిహ్నములు ధరించుట మొదలగు అనుభావములచే "శాంత" రసము అభినయించవలెను. ఇందు నిర్వేదము, స్మృతి, ధృతి, సర్వాశ్రమశౌచము, స్తంభము, రోమాంచము మొదలగునవి వ్యభిచారీ భావములు. మోక్షము, అధ్యాత్మము (ఆత్మవిషయక జ్ఞానము), అనువాదివలన శాంతము జనించును. తత్త్వజ్ఞానము హేతువుగాగలదియు, మోక్షోపదేశకమును అగునది "శాంత"మని తెలియవలెను. ఈ రసము బుద్ధీంద్రియ కర్మేంద్రియ సంయమము. పరమాత్మయందు మనస్సును కలుగజేయుట అనువానితో కూడినదై సర్వప్రాణి సుఖహితరూపముగా వుండునని తెలియవలయును.

ఎందు దుఃఖముగాని, సుఖముగాని, మాత్సర్యముగానిలేదో, ఎందు సర్వభూతములయందును సమత్వమేగలదో అయ్యది "శాంత" రసము. ఇత్యాది భావములనెడి వికారములకు శాంతము ప్రకృతి (ఉత్పత్తిస్థానము) దానినుండి జనించిన వికారములు మరల అందేలీనమగును. ఆయా నిమిత్తములవలన రత్యాదిభావములు "శాంతము" నుండి జనించి ఆ నిమిత్తములు నశింపగనే తిరిగి శాంతమునందే లీనమగును. ఇట్లు లక్షణాన్వితములైన నవరసములు తెలుసుకొనవలెను. ఇందు నవరసములు సమాప్తము.

## వృత్తుల ఆవిర్భావము :-

"భారతీ-సాత్వతీచైవ-కైశికీకార్యభటీతథా ।
చతస్రో వృత్తయోహ్యేతాయాసునాట్యం ప్రతిష్ఠితమ్ ॥

భారతి, సాత్వతి, కైశికి, ఆరభటి ఈ నాలుగు వృత్తులయందే నాట్యము ప్రతిష్ఠితములై యున్నది. వృత్తుల ఆవిర్భావము లెట్లు జరిగె ననగా !

కృతయుగారంభమందు జగత్ప్రభువులైన విష్ణువు జగత్తునంతటిని ఏకార్ణముగచేసి లోకములనెల్ల మాయచే సంక్షిప్తమొనర్చి నాగపర్యంక మందు శయనించెను. అప్పుడు అధిక బలోన్మత్తులైన మధు-కైటభులను రాక్షసులు యుద్ధకాంక్షులై వాసుదేవుని యుద్ధమునకు పిలచిరి. వారు తమ తమ జబ్బలను చరచుకొనుచు, అక్షయుడును. ప్రభువునునైన ఆభూతభావ నుని దరిజేరి జానువులచే, ముష్టులచే పొడుచుచు యుద్ధము చేసిరి. అనేక ములైన పరుషవాక్యములతో విష్ణువు నెదిరించుచు పెక్కువిధములగు అధి క్షేప వాక్యములచే సముద్రమును కంపింపజేయుచున్నట్లు కన్పట్టిరి.

నానాప్రకారములైన ఆ మధు-కైటభుల పరుష వాక్యములను విని ంచిబడినవాడై బ్రహ్మ విష్ణువుతో యిట్లు చెప్పెను.

ఉత్తరప్రత్యుత్తర రూపములైన మాటలతో ఈ "భారతీ" వృత్తి కొనసాగుట ఎందులకు ? ఈ ఇరువురిని జంపుము. పితామహుని వాక్యము లను విని "ఒకానొక కార్యముకొరకు" అనగా "భారతీ" వృత్తి నిర్మా ణముకొరకు ఈ వాగ్యుద్ధము నింతవరకును సాగించినాను, వాక్యబహుళ మగు ఈ భారతివృత్తి వక్తలకు (కవులకు) ఆశ్రయముకాగలదు, ఇంక వీరిని చంపుదును అని మధుసూదనుడు ప్రత్యుత్తర మొసంగెను.

ఇట్లు చెప్పి శుద్ధములును· అవికృతములును, అంగాహార సహితము లును, అయిన అంగములతో (అనగా అంగికాభినయముతో) ఆహారి, యుద్ధ

మార్గవిశారదులైన ఆ రాక్షసు లిరువురితోడను తీవ్రముగా యుద్ధముచేసెను. ఆ సమయమున వాసుదేవుని పదన్యాసములచే భూమికి "భార" మధికమాయెను. ఇట్టి "భారము"చే జనించినదగుటవలన ఈ వ్యాపారము "భారతీ" వృత్తి అనబడినది. ఆ సమయమున తీవ్రములును. తొట్రుపాటులేనివియును, సత్త్వప్రధానములునుయైన శార్ఙ్గధనస్సుయొక్క వల్గితములవలన (వ్యాపార విశేషముచే) "సాత్వతీ" వృత్తి నిర్మితమైనది.

పిమ్మట విచిత్రములగు అంగాహారములు ప్రదర్శించుచు వాసుదేవుడు విడిపోయిన తన కేశపాశమును, సవిలాసముగ ముడివేసుకొనెను. ఆవిలాచేష్టనుండి "కైశికి" వృత్తి నిర్మితమైనది.

సంరంభ :- ఆవేగసమన్వితములును, అనేక చారీప్రయోగసహితములును, చిత్రకరణ సంయుక్తములును అగు బాహుయుద్ధమువలన 'ఆరభటీ' వృత్తి ప్రవర్తితమైనది.

భారతీవృత్తి :- భారతీవృత్తి : వాగ్వ్యాపారము ప్రధానముగా గలది, "భారతీవృత్తి" అనబడును. దీనిని ప్రయోగించుటకు పురుషులే సమర్థులు. దీనిని స్త్రీలు ఆచరింపరాదు. సంస్కృత పాఠ్యమును ఇందు ఉపయోగించవలెను, స్వనామధేయులైన భరతులచే (నటులచే) ఇది ప్రయుక్తమగును. ఇట్టిది 'భారతీ" వృత్తి యనబడును. ప్రరోచన-ఆముఖము. వీధి ప్రహసనము అను భేదములచే భారతీవృత్తి నాలుగు విధములు.

1. ప్రరోచన :- జయమును, అభ్యుదయమును, సూచించునదియును, మంగళావహమును, విజయప్రదమును, సర్వపాపప్రశమమును, పూర్వరంగమందు ప్రయుక్తమగునది "ప్రరోచన" అనబడును.

2, ఆముఖము :- నటిగాని, విదూషకుడుగాని, పారిపార్శ్వకుడుగాని, సూత్రధారునితోగలసి ప్రస్తుత కార్యమునకు సంబంధించిన చిత్రవాక్యములకో, వీధ్యంగములతో స్పష్టములైన ఉక్తి-ప్రత్యుక్తులతోచేయు సంలా

పము "ఆముఖ" మనబడును. దీనికే "ప్రస్తావన" అనియుపేరు. ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము. ప్రవృత్తకము, అవలగితము అను భేదములు వివరింతును,

ఉద్ఘాత్యకము :- ఆదర సహితములును, ప్రశ్నరూపములును అను పదములకు తత్పర్యాయములైన పదములలో సమాధానము చెప్పుట 'ఉద్ఘాత్యక' మనబడును. కాగా ఉద్ఘాత్యకము ప్రతివచనాత్మకమని తెలియవలెను,

కథోద్ఘాతము :- సూత్రధారుడు ప్రయోగించిన వాక్యమునుకాని, ఆవాక్యార్థమునుగాని గ్రహించి పాత్రరంగస్థలమందు ప్రవేశించుట "కథోద్ఘాత" మనబడును.

ప్రయోగాతిధియము :- నాట్యమునకు సంబంధించిన వస్తువును సూత్రధారుడు ప్రస్తావనమందు ప్రయోగింపగా దానిననుసరించి పాత్రప్రవేశించుట "ప్రయోగాతిశయ" మగును.

ప్రవృత్తకము :- సూత్రధారుడు కాలప్రవృత్తిని (ఏదేని ఒక ఋతువును) ఆశ్రయించి వస్తువర్ణనముచేసినచో తదనుగుణముగ పాత్ర ప్రవేశించుట "ప్రవృత్తక" మనబడును.

అవలగితము :- ఒక విధమగు ప్రశ్నకొనంగబడిన సమాధానము మరియొక కార్యమును (అర్థమును) సాధించుట "అవలగిత" యగును.

సాత్త్వతీవృత్తి :- సాత్త్వతీవృత్తి : న్యాయములతోను. ఉచితములగు ఇతర వ్యాపారములతోను కూడినదియు హర్షభావ మధికముగా కలదియును, శోకభావములేనిదియును అగు మానసవ్యాపారము "సాత్త్వతీ వృత్తి" అనబడును.

సత్వజన్యములగు వాక్యములందు సాత్వికాభినయ మధికముగాను, వాచిక-ఆంగికాభినయములు అల్పములుగాను వుండును. వీర-అద్భుతరౌద్ర

రసములయందు ఇది ప్రయుక్తమగును. ఇందు శృంగార-కరుణ-నిర్వేదము లుండవు (అల్పముగా నుండునని శాస్త్రకారులు పాఠాంతరమందు తెలిపిరి.) ఉద్ధతులైన పురుషుల పరస్పరాధర్షణములందిది అధికముగా ప్రయుక్తమగును. ఇట్టి "సాత్త్వతీ" వృత్తిభేదములు నాలుగు కలవు, 1. ఉత్థాపకము, 2. పరివర్తకము, 3. సల్లాపకము, 4. సంఘాత్యము యని నాలుగు విధములు.

1. ఉత్థాపకము :- మానసిక సంఘర్షమును సూచించు వ్యాపారము "ఉత్థాపక" మనబడును. అనగా "ఇదిగో నేనుకూడా సిద్ధముగానే వున్నాను లెమ్ము నీ శక్తిని చూపుము" అనెడి సంఘర్ష సముత్థములైన వాక్యములతో కూడినది 'ఉత్థాపక' మనబడును.

2. పరివర్తకము :- హృదయ సంఘర్షకముచే చేయదలచిన కార్యమును విడిచి కారణాంతరముచే వేరొక కార్యమును నాచరించుట 'పరివర్తక' మనబడును.

3. సల్లాపకము :- (సంలాపకము) అధర్షణ సహితముగాకాని, అధర్షణ రహితముగాగాని, ఇతరుల నధిక్షేపించి మాట్లాడుట 'సల్లాపక' మనబడును.

4. సంఘాత్యము :- సామాద్యుపాయ శక్తిచేగాని, అర్థశక్తిచేగాని. దైవవశమునగాని, ఆత్మదోషమువలనగాని, సంఘాతము ఛేదింపబడుట "సంఘాత్య" మనబడును.

కైశికీవృత్తి :- కైశికీవృత్తి : సుకుమారవస్త్ర - మాల్యాదులచే చిత్రమైనదియును, గీత-నృత్తబహులమును, స్త్రీలచే ప్రయోగింపబడినదియును, కామోపభోగముచే (రతిచే) జనించునదియు అగు వ్యాపారము 'కైశికీవృత్తి' యనబడును. ఈ కైశికీవృత్తియందు నాలుగు భేదములు

గలవు. అవి నర్మము, నర్మస్ఫుంజము, నర్మస్ఫోటము, నర్మగర్భము యని నాలుగు విధములు.

1, నర్మము :- వీరరస రహితమై విశుద్ధవ్యాపారములతో, శృంగారమును స్థాపించు హాసప్రధానమగు వచనము 'నర్మ' మనబడును ఇందు ప్రయుక్తమగు హాసము మూడువిధములుగా నుండును, ఈర్ష్య నుగాని, క్రోధమునుగాని, సూచించునది, పరులను ఉపాలంభించుటలో కూడినది వంచనాపూర్వకముగా పరులహృదయమును గ్రహించుట ప్రయుక్తమైనది.

2, నర్మస్ఫుంజము :- ప్రేయసీ-ప్రియులు అన్యోన్యానురాగము ను వ్యక్తముచేయు వాక్యములతోను, వేషములతోను, తొలినారిగా కలుసుకొనియు (ఇది నవసంగమ సంభోగమనబడును) పూర్వనాయిక వలన భయముచే వెంటనే విడిపోవుట 'నర్మస్ఫుంజ' మనబడును.

3. నర్మస్ఫోటము :- భయ—హాసాది వివిధ భావములయొక్క రతి స్థితియందలి అంశములచే శృంగారము వైచిత్ర్యసహితమగుట 'నర్మస్ఫోట' మనబడును.

4. నర్మగర్భము :- శృంగారోపయోగులగు విజ్ఞాన-రూప-శోభా - ధనాదిగుణములను కార్యవశమున రహస్యముగావుంచి నాయకుడు ప్రచ్ఛన్న రూపుడై వ్యవహరించుట 'నర్మగర్భ' మనబడును. ఇట్లు కైశికీవృత్తి ప్రయుక్తమగును.

ఆరభటీ వృత్తి :- ఆరభటీవృత్తి - ఆరభటులయొక్క క్రోధ - ఆవేగాది గుణములు, వివిధములగు కపటములు, వచనములు. దంబములు, అనృతవాక్యములు కనిగి దీప్తరసములగు రౌద్రాదులయందు ప్రయుక్తమగునది "అరభటీ" వృత్తి యనబడును. ఈ ఆరభటీ వృత్తియందు నాలుగు భేదములు గలవు. అవి ఏవనగా ;

సంక్షిప్తకము :- అన్వర్థములైన శిల్పములు, విపులములగు పుస్తకములు, విచిత్రమగు నేపథ్యము మున్నగువానిచే సంజ్ఞామాత్రముగా వస్తువులను సూచించుట "సంక్షిప్తక" మనబడును.

అవపాతము :- అధికమగు హర్షముచేగాని, భయముచేగాని, శీఘ్రముగా పాత్రల ప్రవేశ-నిర్గమములు జరుగుట, విద్రవముచేగాని. వినిపాతముచేగాని ఆవేగప్రధానమగు చేష్టచేయుట 'అవపాత' మనబడును,

వస్తూత్థాపనము :- సర్వరసములును (వివిధములగు స్థాయి-వ్యభిచారి భావములను) సంగ్రహముగా నిబంధించుటచేతనుగాని. అగ్నిప్రమాదులతోగాని, అవిలేకుండగాగాని, భావివస్తువును హృదయగోచరముచేయుట 'వస్తూత్థాపన' మనబడును.

సంఫేటము :- సంభ్రమముచే ప్రయుక్తమగునదియు అనేకవిధములగు యుద్ధ-నియుద్ధ-కపటాదులతో కూడినదియును. శస్త్రప్రహారములతో నిండినదియును 'సంఫేట' మనబడును. ఇవి నాట్యసంశ్రయములగువృత్తుల స్వరూపములు.

## ప్రవృత్తుల లక్షణములు :-

"అవంతీ దాక్షిణాత్యాచ తథా - చైవోఢ్రమాగధీ ।
పాంచాల మధ్యమాచేతీ విజ్ఞేయా స్తుప్రవృత్తయః ॥

అవంతి, దాక్షిణాత్య, పాంచాలి (పాంచాల మధ్యమ), ఓఢ్రమాగధి యని నాలుగు ప్రవృత్తులు నాట్యప్రయోక్తలు చెప్పియుండిరి. ప్రవృత్తి యనగా వివిధదేశమందలి వేషభాషా-ఆచార-వార్తలను బాగుగా తెలియజేయునదిగాన, ఇది ప్రవృత్తి యనబడినది. వృత్తి-ప్రవృత్తి యను పదములకు 'నివేదనము' (సంపూర్ణముగా తెలియజేయుట = ప్రసిద్ధి) అని యర్థము. ప్రవృత్తియనగా 'వేషవిన్యాసక్రమము' (ఆహార్యాభినయము) అని స్థూలముగా చెప్పవచ్చును. అంతియేగాదు, ఆచార-వార్తలకు కూడా

ఆది సంబంధించియున్నది. మరియు నిది వృత్తినికూడ నాశ్రయించి యున్నది.

దాక్షిణాత్య ప్రవృత్తి :- దాక్షిణాత్యులు, బహునృత్త-గీత-వాద్య ప్రియులును, సుకుమారమగు కైశికీవృత్తియే ప్రధానముగా గలవారును, చతురములును, లలితములును. మనోహరములును యగు ఆంగాభినయములు కలవారను అయివుందురు. మహేంద్రము, మలయము, సహ్యాము, మేకలము, పాలమంజరము అను పర్వత సమీపములందున్న దేశములు దక్షిణాపథమునకు చెందినవి. కాగా దక్షిణ సముద్రమునకును. వింధ్యపర్వతమునకును మధ్య నివసించు కోసల-తోసల-కళింగ-యవనఖన - ద్రమిడ - ఆంధ్ర-మహారాష్ట్ర-వైణ్ణ-కృష్ణా-పినాకిని మధ్యప్రదేశము.) వనవాసాది దేశములందలివారు ఈ దాక్షిణాత్య ప్రవృత్తినే ఎల్లప్పుడును అవలంభించి యుందురు

అవంతిప్రవృత్తి :- అవంతి - విదిశ - సురాష్ట్ర - మాలవ-సింధు-సౌవీర4ఆనర్త-అర్బుద-దశార్ణ-త్రిపుర-మృత్తికావతీ దేశస్థులు నిత్యమును ఆవంతీప్రవృత్తిని అవలంభించియుందురు, మరియు ఈ దేశస్థులు సాత్త్వతీ కైశికి వృత్తులను ఆశ్రయించియుందురు. కావున ప్రయోక్తలు వీరినిట్లే ప్రదర్శించవలయును.

ఓఢ్రమాగధి :- తూర్పునవున్న ఆంగ-వంగ-కళింగ-పత్స-ఓఢ్ర-మగధ-పుండ్ర-నేపాల-అంతర్గిర-ప్లవంగమ-మలద-మల్లవర్తక-బ్రహ్మోత్తర-భార్గవ-మార్గవ-ప్రాగ్జ్యోషిత-పుళింద-విదేహ-తామ్రలిప్త దేశస్థులు ఈ ఓఢ్రమాగధి ప్రవృత్తిని అపలంభించియుందురు. పురాణములలో ప్రాచ్య దేశములుగా పరిగణింపబడిన యితర దేశమందున్నవారుకూడ ఓఢ్రమాగధి ప్రవృత్తినే అవలంభించవలయును.

పాంచాల మధ్యమ :- గంగానది ఉత్తరదిశయందున్నవియును. హిమాలయమును అంటియున్నవియును అగు పాంచాల శూరసేన-కాశ్మీర-

హస్తినాపుర-బాహ్లీక-శకల-మద్రక-ఉశీనతర దేశములందలివారు "పాంచాల మధ్యమ" ప్రవృత్తి నవలంభించియుందురు. పాంచాలమధ్యమ ప్రవృత్తి సాత్త్వతీ-ఆరభటీ. వృత్తులకు సంబంధించినదిగాన, ఇందుగానము, అల్పము గాను (అనగా కైశికీవృత్తి లేశమాత్రమును నుండును.) గతి ప్రచారము రము అవిద్ధముగాను ఉండునని తెలియవలయును.

## సిద్ధి - లక్షణములు :-

వాకీ - మనో - అంగ సముద్భవమును, నానాభావసముద్ధితమును, అయిన 'సిద్ది' దైవ-మానుష-(దైవీ-మానుషీ) భేదములచే రెండువిధము లని తెలియవలెను. ఇందు మానుషసిద్ధి దశాంగయుక్తము. ఇంక దైవ సిద్ధి రెండు విధములు. ఈ దైవసిద్ధి సత్త్వాశ్రయముగా వుండును. మరి మానుషసిద్ధి శారీర-వాఙ్మయిరూపముగా నుండును.

మానుషసిద్ధి-వాఙ్మయసిద్ధి :- 1. స్మితము, 2. అర్థహాశితము, 3. అతిహాసితము, 4. సాధు-అహో-కష్టమ్-అనుమాటలు, 5. ప్రబద్ధ నాదము అను ఈ అయిదున్నూ వాఙ్మయసిద్ధియొక్క అంశములు (సశబ్ద ముగా వాక్కులతో సిద్ధిని వ్యక్తముచేయు విధానమిది.)

స్మితము :- శిష్టమైన హాస్యరసము నర్తకులచే కొంచెముగాప్రయుక్తమైనప్పుడు దానిని ప్రేక్షకులు 'స్మితము'చే ప్రతిగ్రహించవలెను. ఇట్టిది 'స్మిత' 'సూచితసిద్ధి' యనబడుచున్నది.

అర్థహాస్యము ;- కించిద స్పష్టహాస్యము లేదా అట్టి అస్పష్టహాస్య వచనము నటులచే ప్రయుక్తమైనప్పుడు దానిని ప్రేక్షకులు నిత్యమును 'అర్ధహాస్యము'చే గ్రహించవలెను, ఇట్టిది "అర్ధహాస్య సూచితసిద్ధి" అన బడును.

అతిహాస్యము :- విదూషకచ్ఛేదకృతము (ఛేదము = వంచనభంగి

లేదా ఏదేని శిల్పకృతముయైన దానిని ప్రేక్షకులు నిత్యమును 'అతిహాసము'చే గ్రహించవలెను. ఇట్టిదీ "అతిహాస్య సూచితసిద్ధి" యనబడును.

అహో :- ధర్మపద సంయుక్తము లేదా అతిశయ సంభవముఅయిన విషయము ప్రయుక్తమైనప్పుడు ప్రేక్షకులు 'అహో' కారము లొనర్చ వలయును.

సాధు :- విస్మయావిష్ట భావములందు లేదా ప్రహర్షార్థములందు 'సాధు' శబ్దమును ప్రేక్షకులు ప్రయోగించవలయును.

కష్టమ్ ;- కరుణమునందు కన్నీటిలో "కష్టమ్" అను శబ్దమును ప్రేక్షకులు ప్రయోగించవలయును.

ప్రబద్ధనాదము :- విస్మయార్థములందు నిత్యమును ప్రేక్షకులు ప్రబద్ధనాద మొనర్చవలయును. (ఎడతెగకుండ కేకలు వేయుట, చప్పట్లు కొట్టుట.)

శారీరసిద్ధి ;- పులకలు (జలదరింపు) రోంమాచము (గగుర్పాటు) అభ్యుస్థానము (లేచినిలుచుట), చేలదానము (వస్త్రములు దానమిచ్చుట), అంగుళీక్షేపము (వ్రేళ్ళను, చేతులను ఆడించుట) అనునవి ఈఅయిదున్నూ శారీరకసిద్ధి చిహ్నములు (అనగా శారీరసిద్ధి వ్యక్తమగు పద్ధతీ ఇది.)

పులకలు :- అధిక్షేపముతో కూడిన వాక్యములు ప్రయుక్తములైన ప్పుడు 'పులకలు' గలుగును.

బహుమునములు :- కుతూహలము రేకెత్తించినపుడు బహుమతుల నొసంగవలయును.

అభ్యుత్థానము :- రంగము దీప్తప్రదేశమును అందలి కార్యములు ఛేద్య-భేద్య-అహవాత్మకములును, విద్రవ-ఉత్పాత - సంయుక్తములును,

యుద్ధ-నియుద్ధజములును అయినప్పుడు కుశలురైన ప్రేక్షకులు సాస్రముగా అంస-శీర్షములను బాగుగా కంపింపజేయుచు ఆకస్మికముగా లేచి నిలుచుండ వలయును.

పై విధముగతజ్ఞులచే అభివ్యక్తము చేయబడు ప్రోత్సాహముచే సూచితమగు "నటునిసిద్ధి" మనుషసిద్ధి" యనబడును.

దైవసిద్ధి :- దీని లక్షణము :3 భావాతిశయముతో కూడినదై, నత్వ యుక్తమై సహజముగా మొదటినుండియు ఎట్టి విఘ్నములును లేకుండ దైవకృతమగు సిద్ధి అని ప్రేక్షకులు తెలియవలయును.

ఒకవేళ విఘ్నములు జనించినను ఆవి దైవాపర పర్యాయమగు ఆదృష్టముచే లేదా పురుష ప్రయత్నముచే నశించి, శబ్దముగాని, క్షోభము గాని. ఉత్పాతముఖగాని లేక రంగమండలము ప్రేక్షకులతో నిండియుండుట కూడా "దైవసిద్ధి" యని యెరుంగవలయును.

## వేషములు :-

నానాప్రయోజనములైన వేషములను మూడు విధములుగా ఉండునని తెలిపిరి.

1. శుద్ధము, 2. మలినము, 3. విచిత్రము వీని వినియోగములు తెల్పుదును.

1. శుద్ధము :- దేవాభిగమన-మంగళ-నియమ-తిథి-నక్షత్ర-యోగ వివాహకరణ-ధర్మ-ప్రవృత్త కర్మలయందు, స్త్రీ-పురుష వేషము శుద్ధముగా (తెల్లని వస్త్రములతో కూడినవిగా) ఉండవలయును. ఇట్లే ప్రాయత్నికుల (వినీతుల) వేషమును శుద్ధమే. మరియు వృద్ధ-బ్రాహ్మణశ్రేష్ఠి-అమాత్య పురోధస-వణికి-కంచుకి-తపస్వి-విప్ర-క్షత్రియ-వైశ్య - స్థానీయమునవుల నాటకాశ్రయమైన వస్త్రవిధి శుద్ధముగనే యుండవలయును,

2. చిత్రము :- దేవ, దానవ, యక్ష, గంధర్వ, ఉరగ, రక్షో, నృప, కర్కశుల, (కాముకుల్నని పాఠము), వేషము "చిత్రము"గా నుండ వలయును.

3. మలినము : ఉన్మత్త, ప్రమత్త (త్రాగుబోతులు), అధ్వగ (బాటసారులు), వ్యసనోపహతుల వేషము "మలినము"గా నుండవలెను. శుద్ధ-చిత్రవేషములలో వస్త్రములు. ఉత్తరీయములుకూమి శుద్ధములుగాను, రక్తవిచిత్రములుగాను కల్పింపబడవలెను. అట్లే మలినవేచములందును అన్నియును మలినముగానే ఉండవలెను. నాట్యతత్వజ్ఞులు వీనిని చక్కగా సంయోజనము చేయవలెను.

ముని, నిర్గ్రింధ (జైనులు), శాక్య (బౌద్ధులు)), యతి, పాశు పత, త్రిదండి (సన్యాసి), శ్రోత్రియులకు లోకస్వభావము ననుసరించి వృత్తానుసారమైన "వేషమును" కల్పించవలెను. తాపసులకు చీరె (స్థూల మైన వృక్షచర్మము), వల్కల (భూర్జరపత్ర చర్మము), చర్మము. (మృగచర్మము)లు, అర్ఘ్యములు, 'పాశుపతులకు' నానాచిత్ర వస్త్రములు తగును, "కుజాతులకు" (కులజులకు కాశీపాఠం) యదార్థములైన వస్త్రము లను కల్పించవలయును. అంతఃపుర రక్షణమందు వినియుక్తులు యథా విధిగా కాషాయకంచుకమురను ధరించవలెను.

అవస్థాంతరములందు పురుషుల, (స్త్రీల యని కాశీపాఠం) వేషం క్రిందివిధముగా ఉండవలయును.

శూరులు సంగ్రామయోచితవేషులై విచిత్రశస్త్ర, కవచులును, బద్ధ తూణీరులును, ధనుర్ధరులును గావలయును. నృపులవేషము నిత్యమును చిత్రముగా నుండవలయును. కాని నక్షత్రోత్పాత ప్రశమనార్థమైన మంగళ మందు (ఇది నైమిత్తికశ్రాద్ధ-దేవతార్చనాదుల కుపలక్షణము) మాత్రము కేవలము శుద్ధముగానే యుండవలెను.

ఇట్లు దేశ-జాతివయోనుసారముగ ఉత్తమ, మధ్యమ, అధములైన స్త్రీ-పురుషులకు, వేషములను కల్పించవలెను, నాటకాశ్రయమైన ప్రయోగ మందు శుభ, అశుభ, కృత్రిములైన వివిధావస్థలను పొందెడివారికి పై విధముగ వస్త్రవిధిని నిర్వహించవలెను.

## రసదృష్టులు - కాంతాదృష్టి లక్షణ వినియోగములు

"హర్షోత్పన్నా ప్రసాదోత్థా కామంకామ దశావశా ।
శృంగారేఽభిమతాకాంతా భ్రూక్షేపాపాంగ సంగతా ॥

సంతోషముచే, ప్రసన్నతచే జనించినది. కామావస్థకు లొంగినది. బొమముళలాడించుచు, క్రీగంట చూచునదియునైన చూపు "కాంత"యగును. ఇది శృంగారమందును తగియున్నది.

### హాస్యదృష్టి - లక్షణ వినియోగములు

"చిత్రభ్రాంతాల్పతారా దృగాకుంచితపుటాక్రమాత్ ।
కక్షాది స్పర్శపాతాదౌ హాస్యే హాస్యాహి .... ....
(అత్రమహాన్ గ్రంధపాతః)

నల్లగ్రుడ్డును వింతగా కొంచెముగా త్రిప్పుచూ క్రమముల రెప్పల నించుక ముడుచుచు, చూచుదృష్టి "హాస్య" యనబడును. చక్కిలిగింత, జారిపడుట మొదలగు హాస్యసందర్భములందిది చేయతగినది.

### రౌద్రిదృష్టి - లక్షణ వినియోగములు

"క్రూరారూక్షారుణోద్వృత్తానిష్టబ్ధపుటతారకా ।
భ్రుకుటీ కుటిలాదృష్టిః రౌద్రీ రౌద్రరసే స్మృతా ॥

క్రూరము, కనికరములేనిది, మీదికి క్రిందికి రాచుకొనునది, రెప్పలను, గ్రుడ్డును కదలకుండునది, వంకరబొమలు కలదియువగు దృష్టి రౌద్ర యగును. ఇది "రౌద్రి" రసమునకు తగినది,

### కరుణదృష్టి - లక్షణ వినియోగములు

"పతితోర్ధ్వపుటా సాస్రా మన్యుమంధత తారకా ।
నాసాగ్రానుగతా దృష్టిః కరుణేరసే ॥

మీదిరెప్ప జారి. కన్నీరు కలిగి, శోకముచే నల్లగ్రుడ్లు మెత్తబడగా ముక్కు తుదికిసాగిన దృష్టి "కరుణ" యనబడును. ఇది కరుణ రసమున చేయదగినది.

### వీరరస దృష్టి - లక్షణ వినియోగములు

"దీప్తావికశితాఽక్షుబ్ధా గంభీరా సమచారకా ।
ఉత్ఫుల్లమధ్యాదృష్టిస్తు వీరావీర రసాశ్రయా ॥

దీప్తికలిగి విరివియై కలతలేక గంభీరమై నల్లగ్రుడ్లులు సరిసరసలో నుండి నడిమిభాగము విచ్చుకొనిన దృష్టి 'వీరరస దృష్టి' యగును. ఇది వీరరసమునకు తగును.

### అద్భుత రసదృష్టి - లక్షణ వినియోగములు

"యాత్వాకుంచిత పక్ష్మాగ్రాసాశ్చర్యోద్వృత్తతారకా ।
సౌమ్యా వికసితాంతాచసాఽద్భుతాదృష్టిరద్భుతే ॥

తుదిరెప్ప వెంట్రుకలు కొంచెముగా ముడుచుకొని ఆశ్చర్యముచే నల్లగ్రుడ్లు క్రిందికి మీదికి కదలగా, సౌమ్యమై కనుగొనలు విచ్చుకొన్న చూపు "అద్భుత" రసదృష్టి యనబడును. ఇది అద్భుతరసమందు ప్రయుక్తమగుచున్నది.

### భీభత్సదృష్టి - లక్షణ వినియోగములు

"నికుంచిత పుటాపాంగా ఘూర్ణోప ప్లుతతాకరా ।
సంశ్లిష్టస్థిత పక్ష్మాచ భీభత్సాదృష్టి రిష్యతే ॥

కమరెప్పలును, కనుగొనలును ముడుచుకొని గ్రుడ్లుబొచ్చి తిరుగుడు, పడిరెప్ప వెంట్రుకలు కలసి కదలకయుండు దృష్టి "బీభత్స" రస దృష్టి యనబడును.

భయానక రసదృష్టి - లక్షణ వినియోగములు

"ప్రోద్వృత్త నిష్టబ్ధపుటా స్ఫురదుద్వృత్తతారకా ।
దృష్టిర్భయానకాఽత్యర్థం భీతాజ్ఞేయా భయానకే ॥

రెప్పలు చాలా విరివియై కదలకుండి గ్రుడ్లు అదరుచు రాచుకొనగా మిగుల భయపడిన చూపు "భయానక" దృష్టి యనబడును. ఇది భయానక రసమందు ప్రయుక్తమగును.

## స్థాయిదృష్టులు - యెనిమిది విధములు

స్నిగ్ధ-హృష్ట-దీన-కృద్ధ-దృప్త - భయాన్విత-జుగుప్సిత - విస్మిత అనెడి భేదములచే స్థాయిభావాశ్రములైన దృష్టులు యెనిమిది విధములు.

1. స్నిగ్ధ:- ఇందు మధ్యభాగము విప్పారియుండును. తారకలుచలించవు. భ్రూలిలత ఆనందమును సూచించుచుండును, సాభిలాషమును, మధురమును అగు ఈ చూపు 'స్నిగ్ధ' దృష్టి యనబడును. ఇది రతిభావ సంఘాతము.

2. హృష్ట :- ఇందు తారకలు కొంచెముగా కనుపించుచుండును. రెప్పపాటును, చలనమును, కొంచెము వంకరచూపును కలిగినదై హాసగర్భితమగు ఈచూపు "హృష్ట"దృష్టి యనబడును. ఇది హాసమునందు ప్రయుక్తమగును.

3. దీన :- దిగజారిన పై రెప్పలును, కొంచెముగా ఉబ్బిన తారకలును, కన్నీళ్ళను కలిగినదై మందముగా ప్రసరించెడి చూపు 'దీన'దృష్టి యనబడును. ఇది శోకమునందు ప్రయుక్తమగును.

4. క్రుద్ధ :- కనురెప్పలను తారకలను పైకెత్తి నిశ్చలముగా వుంచవలె యును. కుటిలమైన బొమలుముడి కలిగినదై పరుషముగానుండు ఈ చూపు "క్రుద్ధ" దృష్టి యనబడును. ఇది క్రోధమునందు ప్రయుక్తము.

5. దృప్త ; ఇందు తారకలు చలించవు. చూపు స్థిరముగను, వికసించి నదియునునై బలమును వెల్లడి చేయుచుండును. ఇట్టి ఈ చూపు "దృప్త" దృష్టి యనబడును.

6. భయాన్విత :- రెప్పలు రెండునూ బాగుగా విప్పవలెను. భయ ముచే కంపించుచున్నవై తారకలు ఒకమూలకు వదిగియుండవలెను. ఇట్టి ఈ చూపుగలది "భయానక దృష్టి" యనబడును. ఇది భయమునందు విని యోగించును.

7. జుగుప్సిత :- రెప్పలు, తారకలను సగము కప్పివేయుచుండును. (రెప్పలు కలియరాదు) లక్ష్యవస్తువును చూచుటవలన ఉద్వేగముతో చూపును మరలించవలెను. ఇట్టి ఈ చూపు 'జుగుప్సిత' దృష్టియనబడును. ఇది జుగుప్సయందు వినియోగింపబడును.

8. విస్మిత :- తారకలు బాగుగా పైకెత్తబడగా రెప్పలురెండును నిశ్చ లముగ ఉండవలెను. చూపు సమమును వికశితమును కావలయును. ఇట్టి ఈ చూపు "విస్మిత" దృష్టి యనబడును, ఇది విస్మయమందు ప్రయుక్త మగును.

## సంచారీ దృష్టులు :-

శూన్య. మలిన, శ్రాంత, లజ్జాన్విత, గ్లాన, శంకిత. విషణ్ణ, ముకుల, కుంచిత, అభితప్త, జిహ్మ, లలిత, వితర్కిత, అర్ధముకుల, విభ్రాంత, విప్లుత, ఆకేకర. వికోశ, త్రస్త, మదిర అనెడి భేదములచే సంచారీదృష్టులు ఇరువది విధములుగా నున్నవి.

1. తారకలను, కనురెప్పలను సమముగా నుండవలెను. చూపు నిశ్చల ముగను, లక్ష్యము లేనిదిగను, కృశించినదిగను, బాహ్యవిషయములను గ్రహింపనేరదిగను వుండును. ఇట్టి ఈ చూపు "శూన్యదృష్టి" అనబడును.

2. పక్ష్మములు కదలుచుండును. అంతగా ముకుళించని కనురెప్పలును విభ్రాంతములగు తారకలను, మలినములగు అంతములను కలిగియుండు చూపు "మలినదృష్టి" అనబడును. ఇది నిర్వేద-వైవర్ణ్యములం దుప యుక్తము.

3. శ్రాంత :- శ్రమచే వాడిన కనురెప్పలను ముడుచుకొనిన అంతము లను, దిగజారిన తారకలను, గుంటలుపడిన కనులను కలిగినచూపు 'శ్రాంత దృష్టి' అనబడును. ఇది శ్రమ స్వేదములందిది ప్రయుక్తము.

4. లజ్జాన్విత :- కొంచెముగా వంగిన పక్ష్మముల చివరలను సిగ్గుచే జారిన పైరెప్పలను, త్రపచే అధోగతములైన తారకలను కలిగినచూపు "లజ్జాన్వితదృష్టి" అనబడును. ఇది లజ్జయందు ప్రయుక్తమగును.

5, గ్లాన :- వాడిన కనుబొమలును, కనురెప్పలును, పక్ష్మములను రెప్పలలోనికి చొచ్చుకొనిపోయిన తారకలను కలిగినదై శిధిలమును మంద ముగా ప్రసరించునదియును అగు చూపు 'గ్లాన' దృష్టి అనబడును. అప స్మార-గ్లాని-వ్యాధులందిది ప్రయుక్తమగును.

6. శంకిత :- తారకలు చలితములు కావలయును, చూపుకొంచెముగ చలించినదియును, పిమ్మట స్థిరముగను, కొంచెము పైకి లేచినదియును, తరువాత అడ్డముగా ప్రసరించునదియును, మూఢమును అగుచూపు 'శంకిత' దృష్టి అనబడును, ఇది శంకయందు ప్రయుక్తము.

7. విషణ్ణ (విషాదిని) :- విషాదముచే పెద్దదియైన కనురెప్పలను పర్యస్తములైన అంతములను ఎక్కువ చలనములేని తారకలను కలిగినదై

రెప్పపాటులేని చూపు "విషాదదృష్టి" అనబడును, ఇది విషాదమందు ప్రయుక్తము.

8. ముకుళ :- కొంచెముగా ఒకదానితో ఇంకొకటి కల్సునదై అదరుచున్న పక్ష్మములను ముకుళితములైన కనురెప్పలును, సుఖముచే కొంచెముగాక కన్పట్టుచున్న తారకలను కలిగినచూపు "ముకుళదృష్టి" యనబడును. ఇది నిద్ర-స్వప్న-సుఖములందిది ప్రయుక్తములగును.

9. కుంచిత :- రెప్పలు కొంచెముగా ముడుచుకొనుటచే బాగుగావంగిన పక్ష్మముల చివరలను వెనుకకు లాగబడిన తారకలను, కలిగిన చూపు "కుంచితదృష్టి" అనబడును. ఇది అసూయ-అనిష్ట-దుష్ప్రేక్ష-అక్షివ్యథలందు ప్రయుక్తము.

10. అభితప్త :- రెప్పలు బాగుగా చలించుచున్నను, మందముగా కదలుచున్న తారకలనుకలదై సంతాపమును, వ్యధను సూచించుచూపు "అభితప్త" దృష్టి యనబడును. చింతా-విర్వేద-అభిఘాత-అభితాపములందిది ప్రయుక్తములగును.

11. జిహ్మ :- కొంచెముగా వంగిప్రేలాడుచున్న రెప్పలను మూయబడిన తారకలను కలిగినదై కొంచెము అడ్డముగాను, గూఢముగాను, ప్రసరించుచూపు 'జిహ్మదృష్టి' అనబడును. అసూయ-జడత-ఆలస్యములందిది ప్రయుక్తము.

12. లలిత :- ముడుచుకొనిన అంతములను, ఎగురవేయబడుచున్న కనుబొమలును, కలిగినదై మధురమును. సస్మితమును, మన్మధ వికారోపేతమును అగు ఈ చూపు 'లలితదృష్టి' అనబడును. ధృతి-హర్షములందిది ప్రయుక్తము.

13. వితర్కిత :- వితర్కముచే పైకిలాగబడిన రెప్పలను వికశితము

తైన తారకలను కలిగినదై క్రిందిచూపులతో కూడినది "వితర్కిత" దృష్టి అనబడును. స్మృతి-తర్కములందిది ప్రయుక్తము.

14. అర్ధముకుళ :- సంతోషముతో రెప్పలను సగము మూయుటచే, సగము విడిచిన పక్ష్మములను, కొంచెము చెదరిన తారకలను కలిగినచూపు "అర్ధముకుళదృష్టి" అనబడును. ఆహ్లాదజనకములగు గంధ-స్పర్శములందిది సప్రయుక్తము.

15. విభ్రాంత :4 చలించెడి రెప్పలను తారకలను, విస్ఫారుపచే పెద్దవియైన కనులను కలిగినదై ఆకుటపాటుతోకూడిన చూపు "విభ్రాంతదృష్టి" యనబడును. ఇది ఆవేగ-సంభ్రమ-విభ్రమములందిది ప్రయుక్తము.

16. విప్లుత :- బాగుగా ఆదరుచు పిమ్మట చలనరహితములగుచు, క్రిందకు జారుచునుండెడి రుప్పలను పైకిలాగబడినవియును, మరల కదలుచున్నవియును అగు తారకలను కలిగినచూపు విప్లుతదృష్టి" అనబడును. చపలత-ఉన్మాద-దుఃఖ-ఆర్తి-మరణములందిది ప్రయుక్తము.

17. ఆకేకర :- కొంచెము ముకుళితములైన రెప్పలను. అపాంగములరు, అర్ధనిమేషమును, మాటిమాటికి ప్రక్కలకు పోవుచున్న తారకలను కలిగినచూపు "ఆకేకరదృష్టి" (ఓరచూపు) అనబడును. దురాలోకవిచ్ఛేద ప్రేక్షితముల (అపిఆపి చూచుట) యందిది ప్రయుక్తము.

18. వికోశ ;- విస్ఫారిన రెండురెప్పలను చలించుచున్న తారకంను, కలిగినదై వికశితమును, రెప్పపాటులేనిదియునుఅగు చూపు "వికోశదృష్టి" అనబడును. విబోధా-గర్వ-అమర్ష-ఉగ్రతా-మతులయందిది ప్రయుక్తము.

19 త్రస్త :- త్రాసముచే పైకెత్తబడిన రెప్పలను, ఎక్కువగాకంపించుచున్న తారకలను, సంత్రాసముచే విస్ఫారిన మధ్యములను కలిగినచూపు "త్రస్తదృష్టి" అనబడును. ఇది త్రాసమునంధు ప్రయుక్తము.

29. మదిరదృష్టి :- తిరుగుచున్న మధ్యములను, వాడిన కనుకొలకు లను, వికశితములైన అపాంగములను కలిగినచూపు "మధిరదృష్టి" యన బడును, ఇది "తరుణమద" మందు ప్రయుక్తము. 2. కొంచెముగావంగిన రెప్పలను, కొంచెము చెదరిన తారకలను, చలించుచున్న పక్ష్మములను కలి గిన "మదిరదృష్టి" "మధ్యమమద" మందు ప్రయుక్తమగును. 3. కొంచెము కనుపించు తారకలను, క్రిందిచూపులను కలిగినదై అనిమేషమును సనిమేషమును అగు "మదిరదృష్టి" "అధమమంరు" మందు ప్రయుక్త మగుచు.

## అలంకార భేదములు :-

ఈ అలింకార భేదములలో వక్త్రిజములును, గాత్రజములునుయై యవ్వనమందు స్త్రీలలో స్పష్టముగా కన్పట్టు వికారములు "అలంకారము" లనబడును. వీటిలో అంగజ(గాత్రజ) భేదములైన ఆలంకారములు మూడు విధములు.

స్వాభావికాలంకారములు పది విధములు. ఆయత్నజములైన అలం కారములు ఏడు విధములు. ఇందు స్వాభావిక-ఆయత్నజములు రస-భావోప బృంహితములై యుండును.

## అంగజ వికారములు :-

దేహాత్మకమైన సత్వమునుండి భావమును, భావమునుండి హావమును హావమునుండి హేలయును బయలువెడలును. మరియు సత్వభేదముగల శరీరమున భావ-హావ హేలలు మూడును, దేహాస్పృభావమాత్రాపేక్షములై నను, పరస్పర సముత్థికములుకూడా అగుచున్నవి. (అన్యనాయికాగత హేలా వలోకమున ప్రకృతకుమారియందు భావ-హావములు లేదా హావదర్శనముచే హేలాభావములును జనించును. ఇట్లు భావ–హావ-హేలలు - పరస్పరము సముద్భవ హేతువులగును.)

1. భావము :- వాచిక-ఆంగిక-ముఖరాగాత్మకమైన అభినయముచేతను సాత్వికాభినయముచేతను. ఒకపాత్రయొక్క అంతరభావమును, సహృదయు నకు ప్రకటించు దేహవికారము "భావ" మనబడును.

2. హావము :- శృంగారోచితమగు ఆకారమును సూచించునట్టియును గ్రీవారేచికసహితమును, అక్షి-భ్రూవికార-సంపన్నమును ఆయి స్వయముగా జనించునది "హావ" మనబడును. (భావముచే కేవలము సహృదయులే అంతరభావమును గ్రహింపగలరు. ఇంక హావముచే సహృదయులు, అస హృదయులుకూడా గ్రహింపగలరు. హావము పుట్టి నిలచిపోవుచు మరల పుట్టుచు మరల నిలచిపోవుచు వుండును. అట్లుగాక ఒకసారి జనించి అట్లే ఎడతెగక ప్రసరించుచున్నచో ఆ హావమే హేలయగును.

## స్త్రీలకు స్వభావజములైన అలంకారములు

లీలా, విలాస, విచ్ఛిత్తి, విభ్రమ, కిలికించిత, మోట్టాయిత. కుట్ట మిత, బిబ్బోక. లలిత. విహృతము లనెడు పదివికారములును స్త్రీలకు స్వభాజములైన అలంకారములు. వీటి స్వరూపములు తెల్పుదును.

1. లీల :- ప్రియునియందుగల ప్రీతిచే వానియొక్క వాగంగాలంకార ములను మధురముగను, విశిష్టముగను అనుకరించుట (స్వీయముఏసుగా చేసుకొని ప్రయోగించుట) 'లీల' అనబడును.

2. విలాసము :- శృంగారము ఉద్వేలమగుటచే స్థాన-ఆసన గమనము లందును, హస్త-భ్రూ-నేత్రకర్మలందును, అప్రయత్నముగా కన్పబడెడి విశేషణము "విలాస" మనబడును

3. విచ్ఛిత్తి :- మాలలను, వస్త్రములను, భూషణములను, చందనాదు లను అనాదరముతో స్వల్పముగా ధరించినను అవి అధికమగు శోభను కలి గించుట "విచ్ఛిత్తి" అనబడును.

4. విభ్రమము :- వాక్-అంగ-ఆహార్య-సత్త్వములకు సంబంధించిన వివిధార్థములను మదముచేగాని, హర్షముచేగాని రాగముచేగాని. వ్యత్యస్థముగా నొనర్చుట "విభ్రమ" మనబడును.

5. కిలికించితము :- (కిలికించితము) హర్షమువలన స్మిత-రుదిత-హసిత-భయ-హర్ష-గర్వ-దుఃఖ-శ్రమ - అభిలాషములను మాటిమాటికిని సమ్మిశ్రితములను చేయుట "కిలికించిత" మగును.

6. మోట్టాయితము ;- ఇతరులు ప్రియునివార్తలు చెప్పునపుడుగాని. వానిని స్వయముగా చూచినప్పుడుగాని, రతిభావనచే నాయికయందు లీలా - హేలాదులు జనించుట "మోట్టాయిత" అలంకార మనబడును.

7. కుట్టమితము :- ప్రియుడు కేశములను, లేదా స్తనములను, లేదా అధరమును గ్రహించునప్పుడు అతిహర్ష సంభ్రమము వలన జనించు సుఖము 'కుట్టమిత' మనబడును. ఇది సుఖమే అయినను దుఃఖరూపకముగ (అనగా కృతకకోపాదులతో) వ్యక్తమగును.

8. బిబ్బోకము :- ఇష్టమైన వస్త్రాద్యలంకారములను పొందియు అభిమాన-గర్వములచే స్త్రీలు వానియందు అనాదరము చూపుట "బిబ్బోక" మనబడును.

9. లలితము ;- హస్త-పాదఅంగవిన్యాసములను, భ్రూనేత్ర ఓష్ఠ కర్మలతో సుకుమారముగ నొనర్చుట 'లలిత' మనబడును.

10. విహృతము :- ప్రీతియుక్తములైన వాక్యములు మాట్లాడవలసిన అవసరమువచ్చినను, వ్యాజముచేగాని, స్వభావముచేగాని (సిగ్గుచేగాని) మాట్లాడకుండుట యది 'విహృత' మనబడును.

## అయత్నజములైన స్త్రీల అలంకారములు

శోభా, కాంతి, దీప్తి, మాధుర్య, ధైర్య, ప్రాగల్భ్య, ఔదార్యము లనెడి ఏడును స్త్రీలయందు, అయత్నజములైన అలంకారములు.

1. ఉపభోగములచే (పురుషునిచే ఉపభుజ్యమానములగుటచే) పెంపొంధింపబడిన రూప, యవ్వన, లావణ్యములు అవయవములకు కలిగించు నూతన విలాసము "శోభ" అనబడును.

2. కాంతి :- సంపూర్ణమగు కామోపభోగముతో కూడిన శోభయే 'కాంతి' అనబడును.

3. దీప్తి :- అత్యధికమైన కాంతియే "దీప్తి" అనబడును,

4. మాధుర్యము :- దీప్తములైన క్రోధాదులు, లలితములైన రతి క్రీడాదులు మున్నగు సర్వావస్థలయందును చేష్ట అనుల్బణముగా (మసృణముగా) ఉండుట "మాధుర్య" మగును.

5. ధైర్యము :- ఏ విషయమందును చాపల్యములేక, తన్నుతాను పొగడుకొనక స్వాభావికమగు చిత్తవృత్తిని కలిగించుట "ధైర్య" మనబడును.

6. ప్రాగల్భ్యము :- కామకళాదులందు సాధ్వసము లేకుండుట 'ప్రాగల్భ్యము' అనబడును.

7. ఔదార్యము :- సర్వావస్థలయందును, పరుషములు పలుకకుండుట "ఔధార్య" మనబడును.

లలితాత్మకమగు శృంగార ప్రయోగమునందు, సుకుమారములగు సంభోగ - విప్రలంభాది భేదములన్నింటియందును, ఈ అలంకారములు ప్రయుక్తములగును. ఆ శృంగారమున ఈర్ష్యామర్షాది దీప్తభావములందు

మాత్రము విలాస-లలితములనెడి రెండు అలంకారములు తప్ప తక్కినవానిని ప్రయోగించవలయును.

## పురుషులయందలి సత్త్వభేదములు

శోభా, విలాసా, మాధుర్య, స్థైర్య, గాంభీర్య, లలిత, ఔదార్య, తేజస్సులు యనెడి ఎనిమిదియును పురుషులయందలి సత్త్వభేదములు. (ఇవి ఆయత్నజములైన పురుషుల అలంకారములు.)

1. శోభ :- దక్షత, శౌర్యము, ఉత్సాహము, నీచార్థములందు జుగుప్స, ఉత్తమ గుణములతో స్పర్ధ అనునవి కలిగియుండుట "శోభ" అనబడును.

2. విలాసము :- ధీరముగ ప్రసరించు దృష్టి, వృషభగతివంటి గతి, స్మితపూర్వకమైన ఆలాపము కలిగియుండుట 'విలాస' మనబడును.

3. మాధుర్యము :- అభ్యాసపాటవముచే మహావికారములందుకూడా చేష్టలతో ఉల్బణత్వము చూపకుండుట 'మాధుర్య' మనబడును. (అనగా యుద్ధ-నియుద్ధాది వికారములందు అభ్యాసపాటవముచే కర-చరణాదిక్రియలు అనుల్బణములుగా నుండుట.)

4. స్థైర్యము :- శుభసంకల్పముచేగాని. అశుభసంకల్పముచేగాని జనించిన ధర్మార్థ కామములందలి వ్యవసాయము (పూనిక) స్థిరముగానుండుట 'స్థైర్య' మనబడును.

5. గాంభీర్యము :- హర్ష. క్రోధ, భయాదిభావములందు తత్తదుచితములైన ఆకారములు కన్పట్టకపోవుట "గాంభీర్య" మనబడును.

6. లలితము :- ప్రయత్నములేకయే నిర్వికారమగు స్వభావమునందు జనించిన శృంగారాకార చేష్టలను కలిగియుండుట 'లలిత' మనబడును.

7. ఔదార్యము :- దానమునుకాని, అభయప్రదానమునుగాని. ప్రియ భాషణమునుగాని, శత్రు-మిత్ర భేదములేకయే చేయుట 'ఔదార్యము' యనబడును.

8. తేజస్సు :- శత్రుకృతమైన అధిక్షేపమునుకాని. అవమానమును కాని, ప్రాణాత్యయమందును సహించపోవుట 'తేజ' మనబడును.

## వస్త్రధారణ విధిక్రమము

వస్త్రరూపమగు అలంకారము, నానాదేశసంభవమై, బహువిధములుగా వుండును. (అవి మూడు విధములు.)

అవి మూడు విధములు :- శుద్ధము (తెల్లనిది), రక్తము (రంగు బట్ట). విచిత్రము (బహువర్ణములు గలది.) దివ్యులకు ఈ భూషణ విధి యంతయు నొప్పును. మనుష్యులకు మాత్రము దేశాశ్రయమగు అలంకార పరికల్పనము చేయనగును.

దివ్యాంగనలకు వారివారి భూములకును, అవస్థలకును ఉచితములైన ఆభరణములను, వేషములను సమకూర్చవలెను. విద్యాధర, యక్ష. అప్సరో నాగాంగనలకును, ఋషి-దైవత-కన్యలకును, సిద్ధ-గంధర్వ-రాక్షస - అసుర వనితలకును. దివ్య-వానర-మనుష్యాంగనలకును సంబంధించిన వేషములు నానావిధములుగా నుండవలయును. (అనగా వారి వేషమునుబట్టియె వారు, "ఫలానా" యని గుర్తించవలయును.)

విద్యాధర స్త్రీలకు, ముక్తాభూషితమగు శిఖాబంధమును రచింపవలయును. వారి వేషపరిచ్ఛదము, శుద్ధముగా నుండవలయును. యక్షిణులును, అప్సరసలును. రత్నభూషణోపేతలు కావలయును. వారి వేషములును, సమానములే, కాని యక్షిణులు కేవలము శిఖను ధరించవలెను.

నాగస్త్రీల భూషణములు దివ్యస్త్రీలకువలెనే యుండవలెను. ముక్తావణీలతా ప్రాయములగు ఫణములు (పడగలు) ఉండవలెను.

మునికన్యకల శిరస్సులు ఏకవేణీధరములు కావలెను. వీరికి భూషణ విధిలేదు. వేషము వనోచితముగా నుండవలెను.

సిద్ధాంగనలకు ముక్తా-మరకతప్రాయమైన అలంకారమును పీతవస్త్ర పరిచ్ఛదమును (పరిచ్ఛదము = మేలిముసుగు) సముచితములు. గంధర్వ స్త్రీలకు పద్మరాగమణిప్రాయములైన విభూషణములు, వీణాహస్తము. కౌసుంబ (కనకాంబరపు రంగు) వస్త్రములును రమ్యముగా నుండును.

రాక్షసస్త్రీలకు ఇంద్రనీల విభూషణములు, సితదంష్ట్రిలు, నల్లని వస్త్రి-పరిచ్ఛదములును తగియుండును.

సురాంగనా (దివ్యాంగన)లకు వైఢూర్య-ముక్తాభరణములను కూర్చవలెను. వారి పరిచ్ఛదము శుకపింఛతుల్యములైన, వస్త్రములతో కూడియుండును. దివ్యవానర స్త్రీలకు, పుష్యరాగ మణిభూషణములు లేదా ఒక్కొక్కప్పుడు వైఢూర్య భూషణములు, నీలపరిచ్ఛదమును అర్హములు.

శృంగారిణులగు దివ్యాంగన వేషములు పైనవివరించిన విధముగా నుండును. కాని అవస్థాంతరములందు (శృంగారేతరమైన అవస్థలందు) వారి వేషము శుద్ధముగా (తెల్లగా) ఉండవలయును.

ఇంక మనుష్యస్త్రీల ఆభరణములు, వేషములు వారివారి దేశసముద్భవములుగా నుండవలయును.

అవంతీయువతి అలకలతో (ముంగురులతో) కూడిన లేదా వంకరలు తిరిగిన కుంతలములు కలిగియుండవలయును.

అభీరయువతి రెండుజడలు వేసుకొనును. నీలప్రాయములైన వస్త్రములు ముసుగుగా వేసుకొనును.

గౌడస్త్రీలు అలకలను సశిఖాపాశవేణిక (కొప్పుగా ముడిచిన జడ)ను కలిగియుందురు.

పూర్వోత్తర దేశమందలి స్త్రీలు సమునద్ధ శిఖండకములు (మీదికెత్తి కట్టబడిన జుట్టు) నఖశిఖపర్యంతమైన ముసుగు కలిగియుందురు.

దక్షిణదేశపు స్త్రీలు అవర్తాకారమున నుండు లలాటికము (బొట్టు)ను కుంభీబంధ సంయుక్తమైన ఉల్లేఖ్యమును కలిగియుం డురు.

గణికలు అలంకారము వారిరుచి యిచ్చానుసారముగ నుండవలెను. ఇంక తక్కినవారికి వారివారి దేశ-జాతి విధానములను అనుసరించి వేష, ఆభరణ, క్షురకర్మ, పరిచ్ఛదములను సమకూర్చవలెను.

## కామము - శృంగారము

ప్రాయికముగ సర్వభావములును, కామమునుండియే నిష్పన్నము లగుచున్నవి. ఆకారము ఇచ్ఛాగుణసంపన్నమై (కార్య వ్యాపారాదులకు ఉన్ముఖమైన కోరికతోకూడినదై) బహువిధములుగా నుండును. ధర్మకామము, అర్థకామము, మోక్షకామము, స్త్రీ-పురుషుల యొక్క సంయోగము "కామము" అనబడును.

ఈ కామము సర్వలోకముయొక్క ఇతర సుఖదుఃఖములను కప్పిపుచ్చి అదియే అధికముగ కన్పట్టును. అది వ్యసనమందుకూడా సుఖముగానే యుండును.

రతి సంభోగకారకమైన స్త్రీ-పురుష సంయోగము (అది ఉత్తమ ప్రకృతిగతమైనప్పుడు) "శృంగార" మనబడును. ఇది శుభమును ఉపచార కృతమును అయిఉండును. (ఉపచారమనగా అన్యోన్య హృదయగ్రహణోచితమైన వ్యాపారము. ఉపచారకృతమనగా దానితో పరిపూర్ణమైయుండునది.

## సుఖమునకు స్త్రీలు మూలము

ఈ లోకము ఎల్లప్పుడును అధికముగా సుఖమునే కోరును. ఆ సుఖమునకు స్త్రీరే మూలము. అట్టి స్త్రీలు నానావిధములగు 'శీలములు' కలిగియుందురు.

## స్త్రీల శీల భేదములు

స్త్రీలు దేవ, దానవ, గంధర్వ, రక్షో. నాగ, పక్షి, పిశాచ, యక్ష, వ్యాల, నర, వానర, హస్తి, మృగ, మీన, ఉష్ట్రి, మకర, ఖర సూకర, వాజి, మహిష, అజ శ్వ, గవాదులతో తుల్యమైన శీలములు కలిగియుందురని తెలియవలయును.

దేవశీల :- స్నిగ్ధములైన అంగోపాంగములు, నిలకడ, మందములగు నిమేషములు, ఆరోగ్యము, కాంతి, దాన, సత్వ, ఆర్జవములు, అల్పస్వేదము, సమరతియందు ఆసక్తి, అల్పభోజనము, సురతమునందు ప్రీతి, గంధ-పుష్పములం దిష్టముగలదై మనోహరయగు అంగన "దేవశీల" అనబడును.

ఆసుర (దానవ) శీల :- అధర్మమునందును, శాఠ్యమునందును. అసక్తి, స్థిరమైన క్రోధము. అతిపారుష్యము. మద్యమాంసములయందు ప్రీతి, అతిలోభము, కలహమునందు ప్రీతి, ఈర్ష్యాస్వభావము, చంచలమైన స్నేహముకలదై, నిత్యకోపనయు, అతిఘానపతియు, చపలయు అగు అంగన "అసురశీల" అనబడును.

గంధర్వశీల :- క్రీడియందు ఆసక్తి, సుందరములగు నేత్ర. నఖ, దంతములు, సౌష్టవోపేతములైన అంగములు, స్థిరభాషణములు, అల్పసంతానము, రతియందలి ప్రీతి, గీత-వాద్య నృత్తములందాసక్తి, హర్షము, పరిశుద్ధత, స్నిగ్ధములైన చర్మ-కేశ-నేత్రములు కలిగిన అంగన "గంధర్వశీల" అనబడును.

రాక్షసశీల :- పెద్దవియును, విస్తీర్ణములును అగు అంగములు విస్తీర్ణములైన ఎఱ్ఱని నేత్రములు, ఖరరోమములు, పగటినిద్రయం దాసక్తి ఉచ్ఛభాషణములు, క్రోధ-ఈర్ష్యా-కలహములయందు ప్రీతి. రాత్రులయందు విహరించు స్వభావముకలదై నఖ-దంతక్షతముల నొనరించు అంగన 'రాక్షస శీల' అనబడును.

నాగ (సర్ప) శీల :- కొనదేరిన ముక్కు, వాడియైన దంతములు, అందమైన శరీరము. ఎఱ్ఱనికనులు, నీలోత్పలమువంటి రంగు, అతికోపము, తిర్యగ్గమనము, ఆరంభములందు చాంచల్యము, అధికనిశ్వాసము. అతిమానము, గంధ-మాల్య-ఆసనములందు ప్రీతి, నిద్రయందాసక్తి కలిగిన అంగన "నాగశీల" యనబడును.

శకున (పక్షి) శీల :- ఎక్కువగా ప్రక్కకు తిరిగిన ముఖము, తీక్ష్ణమైన స్వభావము. నదులయందు ప్రీతి, సుర-అసవ క్షీరములందాసక్తి అధిక సంతానము, ఫలములయందు ప్రీతి, నిత్యశ్వాసము, ఉద్యానవనములయందు ప్రీతి. చాపల్యము, ఎక్కువమాట్లాడు స్వభావము. తొందర గలిగిన అంగన "శకునశీల" యనబడును.

పిశాచశీల :- ఎక్కువ తక్కువలుగానున్న వ్రేళ్ళుగల చేతులు, గృహారామ సంచారము, పిల్లలను పీడించెడి స్వభావము, నైచ్యముక్లిష్టములైనమాటలు, సురతమునందున కుత్సితాచారము, రోమశములైన అంగము, మహాస్వనము, మద్య-మాంస-బలులయందు ప్రీతిగలిగిన అంగన "పిశాచశీల" అనబడును.

యక్షశీల :- స్వప్నములో చమర్చు స్వభావముగల శరీరము, స్థిరములైన శయ్యాఆసనములందు ప్రీతి, మేధ-బుద్ధి-మద్య-గంధ-మాంసములయందు ప్రీతి, చాలాకాలము తరువాత చూచినవారిపై సంతోషము, కృతజ్ఞత, తక్కువ నిద్ర కలిగిన అంగన "యక్షశీల" అనబడును.

వ్యాల (క్రూరమృగ) శీల :- మానావమునములందు సమత, పరుషమైన చర్మము, ఖరస్వరము, శాఠ్యము, అనృతము, ఉద్ధత భాషణములు, పింగళవృష్టులు కలిగిన అంగన 'వ్యాలశీల' అనబడుచున్నది.

మనుష్యశీల :- ఆర్జవమునందు నిత్యాసక్తి, దక్షత, ఓరిమి, సమవిభక్తములైన అవయవములు, కృతజ్ఞత, గురు-దేవ-ద్విజులందు ప్రీతి, ధర్మ-కామ-అర్థములందాసక్తి, అహంకారరాహిత్యము, సుహృత్తులందు ప్రీతి, మంచిశీలము కలిగిన అంగన 'మనుష్యశీల' అనబడుచున్నది.

వానరశీల :- కుదింపబడిన చిన్నశరీరము, హర్షము, పింగళ-రోమములు, ఫలమునందలి ప్రీతి, స్వల్పమైన ఉపకారమునుకూడా అధికముగా తలంచుటకలిగినదై బలత్కారరతిశీలయగు అంగన 'వానరశీల'అనబడును.

హస్తిశీల :- పెద్దదవుడలు, నుదురు, బలసిన భరీరము. పింగళములైన నేత్రములు, రోమశములైన అంగములు. గంధ-మాల్య-ఆసనములందలి ప్రీతి, కోపము, చిత్తస్థైర్యము, జల-ఉద్యానవనములందలి ప్రీతి, మధురములగు వాసియందుప్రీతి, రతియందు ఆసక్తికలిగిన అంగన 'హస్తిశీల' యనబడును.

మృగశీల :- స్వల్పమైన ఉదరము, చప్పిముక్కు, సన్ననిపిక్కలు, చాపల్యము, వనములందు ప్రీతి, విశాలములైన చంచల నేత్రములు, శీఘ్రగమనము, పగటివేళల భయము, గీత-వాద్య-రతులయందు ప్రీతి, స్థిరనివాసమునందు ఇష్టము కలిగిన అంగన "మృగశీల" అనబడును.

మత్స్యశీల :- దీర్ఘమును, పీనమును, ఉన్నతమును అయినవక్షము చాంచల్యము. అతినిమేషము, బహుభృత్యులు, బహుసుతులు. జలమునందు ప్రీతిగలిగిన అంగన "మత్స్యశీల" యనబడును.

ఉష్ట్రశీల :- వ్రేలాడుచున్న పెదవి, అధికస్వేదము, వికటగమనము. కృశించిన ఉదరము, పుష్ప-ఫలములందును, ఉప్పు-పులుపు-వగరు

లందును ప్రీతి, వదులుగానుండేపి కటి-పార్శ్వములు పరుష-నిష్ఠుర సంభాషణములు, పొడివైన మెడ, అడవులందు ప్రీతికలిగిన అంతన "ఉష్ట్రిశీల" యనబడును.

మకరశీల :- స్థూలమైన శిరస్సు. వంగినమెడ, తెరచిననోరు, పిట్ట కంఠధ్వని, క్రూరత్వము కలిగినవై మత్స్యగుణపేతయగు అంగన "మకర శీల యనబడును.

ఖరశీల :- స్థూలములైన నాలుక, పెదవులు, దంతములు, పరుష మైన చర్మము, కటుభాషణములు, రతియుద్ధమునందు ఆసక్తి, ధార్ష్ట్యము, నఖక్షత, దంతక్షతములందు ప్రీతి. సవతియందు ద్వేషము, దక్షత, చాపల్యము, శీఘ్రగమనము, రోగము. బహుసంగతి కలిగిన అంగన "ఖరశీల" యగును.

శూకరశీల :- దీర్ఘములైన పృష్ఠ-ఉదర-ముఖములు, రోమశము లైన అవయవములు, బలము, సన్ననినుదురు, కందమూల ఫలములందు ప్రీతి, నలుపురంగు, పండ్లచే వికృతమయిన ముఖము. పొట్టిజుత్తు, హీనమయిన ఆచారము, బహుసంతతి కలిగిన అంగన "శూకరశీల" యనబడును.

హయశీల :- స్థైర్యము, సుభగత్వము, తామసస్వభావము, నిడుపాటి పెద్దజుత్తు, కృశత్వము, చాంచల్యము, వాక్కునందు స్నిగ్ధత, శీఘ్రగమనము, కామము, క్రోధము, సమవిభక్తములైన పార్శ్వ-కటి-ఊరు-పృష్ఠ-గ్రీవములు గలిగిన అంగన "హయశీల"యనబడుచున్నది.

మహిషశీల :- స్థైర్యము, బిరుసైన రోమములు, రౌద్రము, లోక ద్వేషము. రతిప్రీతి, ఉన్నతవక్త్రము, జల-వన-క్రీడలయందు ఆసక్తి, పెద్దనుదురు, అందమయిన పిరుదులు, స్థూలములైన పృష్ఠ-నేత్ర-దంత

ములు. సన్నని పార్శ్వములు, ఉదరము కలిగిన అంగన "మహిషశీల"యన బడును.

అజ (మేక) శీల :- కృశత్వము, సన్నని భుజములు, ఉరము, నిశ్చలములు, స్థిరములు అయిన నేత్రములు. పొట్టికాళ్ళు చేతులు, సూక్ష్మములైన రోమములు, భయము, నీటిని చూచినచో భయము, బహుసంతతి, వనములందు ప్రీతి, చాంచల్యము, శీఘ్రగమనము గలిగిన అంగన "అజ శీల" యనబడును.

శ్వ (కుక్క) శీల :- గాత్రలాఘవము, నేత్రపాటవము, ఒడలు సాగదీయుట, పొడవైన చిన్నముఖము, పొట్టి కాళ్ళుచేతులు, ఉచ్చస్వనము, తక్కువనిద్ర, క్రోధము, మంచిపనులందు ప్రీతి, హీనమయిన ఆచారము, కృతజ్ఞత, కలిగిన అంగన 'స్వశీల' యనబడును.

గో-శీల :- స్థూలములు, పీనములు, ఉన్నతములు అగు పిరుదులు, సన్నని జంఘలు, సుహృత్తులందు ప్రీతి, పొట్టి కాళ్ళుచేతులు, ప్రయత్నమందు దార్ఢ్యము, ప్రజాహితకారిత్వము, పితృదేవతార్చనములందు ప్రీతి, సత్య-శౌచములందు, గురువులందు ప్రీతి, స్థయిర్యము, క్లేశమునందు ఓరిమి కలిగిన అంగన "గోశీల" యనబడును.

## ఉపచారము :-

పై విధముగా స్త్రీలు నానావిధములగు స్వభావములును, కలిగియుందురు. ఆయా స్వభావములనెరింగి తదనుగుణముగ కామోపచారమునోసర్చవలయును. శీలానుసారముగ స్త్రీలయెడ గావింపబడిన ఉపచారము అతిస్వల్పమైనను వారికి హర్షదాయకమగును. వారివారి శీలములను గుర్తించక కావించెడి "ఉపచారము" ఎంతగొప్పదైనను, వారికి తుష్టికరముకానేరదు. కోరిన దానినిపొందుటచే 'రతి' జనించునుగదా ! స్త్రీ-పురుషులయందు పరస్పరము

రతి జనించుటకు ఉపచారము అవశ్యకము. (ఉపచారమనగా అన్యోన్య హృదయ గ్రహణోచితమైన వ్యాపారము.)

## విద్యార్థులకు ఉపకరించు వ్యాయామము

1. దండెములు — (3 రకములు)
2. బస్కీలు — (3 రకములు)
3. గుంజీలు — (2 రకములు)
4. కాలిసాము
5. కుప్పీలు — (పైకి ఎగురుట)
6. మొగ్గలు — (2 రకములు)
7. వాలుమొగ్గలు
8. మండూకప్లుతము — (కప్ప దుమికినట్లు)
9. కుక్కుట గమనము — (కోడి నడక)
10. పాము నడక
11. హరిణప్లుతము — (లేడి పరుగు నడక)
12. మయూరప్లుతము — (నెమలి నడక)

(పై వ్యాయామములు అన్నియు, విద్యార్థి, విద్యార్థినులు తప్పని సరిగా చేసినచో శరీరము చక్కని వంపులు తిరిగి బాగుండును )

మెళ్ళాయిలు (4 రకములు)

## సూర్య నమస్కారములు :-

(శరీరము వంపులు తిరుగుటకు చేయువిధి)

1. నమస్కారము (నిలబడి) శిరముపైన.
2. పాదములు అందులాగున కాళ్ళు వంచకుండా వంగుట.
3. పాదముల బొటనవ్రేళ్ళను చేతులతో తాకుట ఎడమ.

4. కాలు రెండుచేతులమధ్య ఉంచి, కుడికాలు వెనుకకు.
5. చాచి పైకిచూచుట, మరల యెడమకాలుకూడా పోనిచ్చి సూర్యుని చూచుట.
6. సాష్టాంగ నమస్కారముతో తల ఇరుప్రక్కలకు త్రిప్పుట.
7. కుడికాలు మరల ముందుమాదిరిగా యథాస్థానమునకు తెచ్చుకొని పైకిచూచుట.
8. ఎడమకాలుకూడా యథాస్థానమునకు తెచ్చుట.
9. సమముగా నిలబడుట.

(పై విధముగా సూర్యనమస్కారములు చేసినచో శరీరము ఆరోగ్యము, వంపులు తిరుగును.)

## కూచిపూడి నృత్యాంశములు (ప్రాక్టికల్సు)

వినాయక ప్రార్థన, ఆదితాళము. నాటరాగము

ప :- మహాగణపతిం మనసా స్మరామి ॥
అను :- వశిష్ఠ వామదేవాది వందిత మనసా స్మరామి ॥మ॥

1. మహాదేవసుతం గురుగుహానుతం
మార కోటిప్రశాంతం శాంతం
మహాకావ్య నాటకాది ప్రియం....
మూషికవాహన మోధకప్రియం ॥మ॥

అంబ ప్రార్దన — మోహనరాగం - మిశ్రచాపు

ప :- అంబా పరాకు దేవీ పరాకు
మమ్మేలు మా....శారదాంబ పరాకు ॥అం॥
వాణి పతాకు శార్వాణి పరాకు
వాణీ చక్కని నీలవేణి పరాకు ॥అం॥

సరశిజలోచన చెల్లెలవై మమ్ము
కరుణించు బంగారుబొమ్మ పరాకు ॥అం॥
అరువీధుల నడుమ శేగమైన ఆలం
పూరిలో వెలసె జోగులాంబ పరాకు ॥అం॥
కనకాంబ్రమ జలధిలో జలకము లాడుచు
కులుకుచు తిరిగేటి కలికి పరాకు ॥అం॥
అప్పడంబులు వడపప్పు సునకములు
వొప్పుగ దెప్పింతు కుప్ప పరాకు ॥అం॥
తకిట తాంతాం తాంతాం తాతైయ్యా యనుచును
తాండవమాడిన తరుణి పరాకు ॥అం॥
కుంభికుంభయ కుంభపయోధరి
కంబుకంధరి మహాగౌరీ పరాకు ॥అం॥
ఓంకారి కౌమురివారాహి శార్వాణి
శంకరి వాలోకశక్తి పరాకు ॥అం॥
మూడుమూర్తులకు మూలమైన
కూచిపూడిలో వెలసిన బాల పరాకు ॥అం॥
ఈ రీతిగా మిమ్ము కోరినవారిని
కాపలె కనకదుర్గాంబ పరాకు ॥అం॥

## గురుస్తుతి (సిద్ధేంద్ర) హిందోళం రాగము, ఆది

(కూచిపూడి నృత్య ప్రాక్టికల్ అయిటములు)

శ్లో॥ ఆంగికం భువనం యస్యా
కాచికం సర్వవాఙ్మయమ్
ఆహార్యం శ్చంద్రతారాదితం
వందే సాత్వికం శివం ॥

శ్లో॥ గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరం బ్రహ్మ
తస్మై శ్రీ గురువేనమః ॥

శ్లో॥ సముద్రవసనే దేవీ
పర్వత స్థనమండలే
నాట్యంకరిష్యే భూదేవి
పాదతాడక్షమస్వమే ॥

శ్లో॥ సభాకల్ప తరుర్భాతీ
వేదశాఖోప శోభితః
శాస్త్రపుష్ప సమాయుక్తం
విద్వద్భ్రమర సంయుతః ॥

## గురుస్తుతి :- హిందోళంరాగం, ఆదితాళం (దీక్షితకృపం)

అంజలులు నటశేఖరా, మా
అంజలులు గైకొమ్మ సిద్ధేశ్వరా.... ॥అం॥

1. చిన్నారి పొన్నారి చిరువటువుల గాంచి
చిరుత ప్రాయమునందే శిరిగల మోమంచు
తరిత తత్తధీంత తత్తాళజ తులతో
నర్తిపజేసిన నాట్యాధినేత ॥అం॥

2. సరస సంగీతాది నృత్యస్రష్టలజేసి
కరణ అంగాహార విధమెల్ల తెల్పియు

కరుణాది రసముల న_ర్తన రీతుల
కరమొప్పజెప్పిన కుచేల పురవాస ॥అం॥

3. సంగీత జ్ఞానులకు నృత్యాంజలి
సాహిత్యవే_త్తలకు నాట్యాంజలి
సురభరత మునులకు దివ్యాంజలి
సర్వజనావళికి భ_క్త్యాంజలి ॥అం॥

(కూచిపూడి నృత్య సాంప్రదాయములో ప్రచారములోనుండి పలువురు నాట్యాచార్యులు నేర్పి ఆడించుచు, పదుగురు న_ర్తకీమణులు ప్రదర్శించుచున్న నాట్యాంశములు.)

## ప్రార్థన - శ్లోకములు

శ్లో॥ అగజానన పద్మార్కమ్, గజానన మహర్నిశమ్
అనేకదంతం భ_క్తానాం, ఏకదంత ముపాస్మహే ॥

శ్లో॥ ఆంఘికం భువనం యస్యా
వాచికం సర్వవాఙ్మయమ్
ఆహార్యం శ్చంద్రతారాదితం
వందే సాత్వికం శివమ్ ॥

శ్లో॥ కస్తూరి తిలకం లలాటపలకే వక్షస్థలే కౌస్తుభమ్
నాసాగ్రే నవమౌ_క్తికమ్, కరతలేవేణుం కరేకంకణమ్
సర్వాంగే హరిచంద నంచకలయమ్, కంఠేచము_క్తావళి
గోపస్త్రీ పరివేష్టితో, విజయతే గోపాలచూడామణి ॥

శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే

పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణ హస్తే
నమస్తే జగదేకమాతః ॥

శ్లో॥ వేణీమూలే విరచిత ఘనశ్యామ పింఛావచూడో
విద్యుల్లేఖ వలయుతయుపస్నిగ్ధ పీతాంబరేణ
మామాలింగం మరకత మణిస్తంభ గంభీరబాహు
స్వప్నేకృష్ణస్తరుణ తులసీభూషణో నీలమేఘః ॥

శ్లో॥ ఏకాశ్యంతు చతుర్భుజం త్రినయనం వామేతు దుష్టూరగమ్
చంద్రం పత్ర శిఖి ప్రసారితకరం. ఊర్ధ్వంపదం కుంచితమ్
సర్వే స్వస్తికమండలం డమరుకం గంగేజటే బిభ్రతమ్
వందే కీర్ణజటాన్నటేశ అనిశాపస్మార దేహేస్థితమ్ ॥

శ్లో॥ కాంతోయాశ్యతి దూరదేశమితి మే
చింతాపరం జాయతే
లోకానంద కరోహి చంద్రవదనే వైరాహితే చంద్ర
మాః । కించాయం వితనోతి కోకిల కలాలాపోవి
లాపోదయమ్ । ప్రాణాన్నైవ హరంతిహంత సితరాం
దూరామమంచానిలా ॥

## (అధ్యాత్మ రామాయణ కీర్తనలు)

(రచన :- సుబ్రహ్మణ్య కవి)

## ధన్యాసిరాగము, ఆదితాళము

ప :- నమశ్శివాయతే - నమోభవాయ
అ :- సమానాధిక రహితాయ శాంతాయ స్వప్రకాశాయ
ప్రమోద పూర్ణాయ భక్తౌఘపాలనాయ ॥ఓం నమో॥
గర్వితాదానావలోక ఖండనాయ శ్రీరజితాయ

పర్వతాగ్ర నిలయాయ పావనాయ
సర్వలోక పాపపుంజ నిర్వాపణాయ శర్వాయ
ఉర్వీకర భూషణాయ సర్వోత్తమా....య ॥ఓం॥

2. అణ్డజాధిపవాహనాయ, కాణ్డాయ మేరుశైలకో
దణ్డాయ శితికంఠాయ పండితాయ
మండిత త్రిపురరాజయోద్ధంద తాండవాయ
బ్రహ్మాండ నిలయాయ, మహామాయాతీతాయ ॥ఓం నమో॥

3. మందహాస వదనారవింద సుందరాజయోగి
బృందానందాయ, శత్రుభీకరాయ
ఇందు సూర్యాగ్ని నేత్రాయ, వందిత ప్రథమగణాయ
నందివాహనాయ పోషిత, బృందారకాయ ॥ఓం నమో॥

4. నిరుపమనందఘన నిశ్చితాయ శాశ్వతాయ
వరదా భయంకరణాయ గిరీశాయ
తరుణేన్దు శేఖరాయ పరమ పురుషాయ
భవహరణాయ శ్రీకాళహస్తీశ్వరాయ ॥ఓం నమో॥

5. గఙ్గాభఙ్గ తరఙ్గసఙ్గతాయ జటాజూటాయ
సంగీతలోల శుభసంగతాయ
అఙ్గజాన్తరఙ్గ మదభఙ్గాయ స్ఫటికోప
మాఙ్గాయ శేషశైలానిశమిత్రాయ ॥ఓం నమో॥

—*—

# అధ్యాత్మ రామాయణ కీర్తన
## సురటరాగం, ఆదితాళం

ప :- చేరి వినవె శౌరి చరితము గౌరి, సుకుమారి గిరివర
కుమారి. వినవే ॥

అను :- వారిజాక్షుండంతటను శ్రీమీరి వేడ్కతో అయోధ్యకు
గోరిపోవు దారిలో నృపవైరియైన పరశురాముడు
కారుమొగులు కరణిచాపధరుడై కాలమృత్యువో
యనగ పంక్తిరధుకేరి హరి యెదుటను నిలచి పలికెను వీరా
ధి వీరుడని యెరుంగక ॥చేరి॥

1. బెండువంటి విల్లు నడిమికి రెండుచేసె ఫెల్లు, పొంగెదు కొండ
నెనయుజెల్లు నా విలుదండివైరులకు మల్లు, కడుగండు మిగిలి దీని
నెక్కుబెట్టినగాని రాముడనన నిన్ను నటుగాకుండిన జంపుదునన
రాముడతని కోదండము గొని చక్కనెక్కెడియఖాండ. శుకముందగ
తోడిగెదెగనిండ, దిగిచిభార్గవుడ నిను ఖాండ, హతశరణుచేసె
నృపఖాండాభిరాముడ వాదువనిన పుండరీకలోచనుండితండని, పూర్వ
కాల సంస్మృతి పొడమి పొగడి. ఖండన ప్రచండ పండితుండప
జాండాధిపతివవ్యయుండవనె ॥చేరి॥

2 బాల్యమునను నేను ఘోరతపంబు చేయుచును, హరివాత్సల్యమొప్ప
గాను, వేగప్రసన్నుడై బల్కె తాను, సాఫల్యమయ్యె నీ తపమును
జనసమ్మతము నుచ్చవంశయుతుడవగు సాఫల్యబలుడవగుచు బిత్రు
హననుడగు, కార్తవీర్యు గెలచి ఖలనృపులవై కల్యాత్మకుల జంపి
శమదమ ముల్యార్థితుడవగుమునే కౌసల్యాగర్భమున రాముడన,
గల్యాణధాయినై జనించి యహల్యనతి పవిత్రజేసి సీతను కల్యాణమై

నీకు దరిశనము, తుల్యముగనొసగుదునని చనిదయతో, నాహరియు నీవని చనియే ॥చేరి॥

3. స్వామి నేను మించి హేహయ వంశజులనువ్రంచి శాంతుడనై ముదము తలంచి చెలగేద నీ మహామహిమనుంచి, ఖగగామినీ బలంబు నీవు గొంటివిగాన నేను ధన్యతముడనైతిని నీ మహనీయ దరిశనముగల్గె, పితామహాదుల కగోచరుడవు శ్రీరామా ! మనోహరుడవగు రఘురామా ! ప్రకృతికంటె పరుడవు కామాద్యదివర్గ దూరుడవహోమా ధవభవరహితుండవు కామకర్త గుణవర్జితుడవు నుదకమున, ఫేనజాలములు, ననలమున ధూమమెటులనటులనే యఖిలమును, నీ మాయచే కల్పితంబనె ॥చేరి॥

4. ప్రీతుడయ్యె చాల దశరథ విభుడంతట వీలా గుణములచే తనలరి శీలా, తగపురిచేరి చక్రియావేళ్ళ, భూజాతనెనసి తనరె ననుజులును నిజసతుల రతులనే లరతుల విభవసమేతుడు జగత్ప్రభుడు ప్రథిత గుణజాతు డవ్యయానందమూర్తి సంగీతానంతకీర్తి సుగుణాభూతా ద్యఖిలసాక్షి మాయాజాతా, ఖిలఖలుషహరుడె సాకేతధిపుడై యుండె, హరిదయాతిశయతనిదియు జెప్పె సుబ్రహ్మణ్యకవి శేషగిరీశుపేర విఖ్యాతిమీర నద్యాత్మరామాయణాఖ్యానమున బాలకాండమిది ॥చేరి॥

## అధ్యాత్మ రామాయణ కీర్తన
### సావేరి, మిశ్రచాపు

ప :- ఇంతి చెంగల్వబంతి మేల్బంతి గుణముల దొంతి వినవే ॥

అను :- కాంతుడుగాకున్న ఖరదూషణాదుల అంతలోపల జంప యెంతవారు

నరులని చింతించె దశకంతు డసురుల శిక్షింపచక్రి ఇనకులమునవంతు కెక్క జనించె శ్రీ రామాఖ్య బ్రహ్మాదినుతుడనె ॥ఇం॥

1 ఐనగానిమ్మ శ్రీహరిచేత బొరిసితె, మానుగవైకుంఠ మందిర మేలుదు, నేనతని గెలచి నేనీ రాక్షసరాజ్యమీనేలగలదనుక నేలుదు నని తలచి ధానునిభమగు రథమెక్కి విధిపూని ప్రేరేప దుర్మతి వైరానుగత హృదయుడై చనియె రావణుడు మారీచునింటికి ॥ఐం॥

2. వచ్చినదనుజేను చెచ్చెర పూజించివచ్చినపని తెల్పవలెనన్న మారీచు మచ్చికచేసి రావణుడు బల్కె రాముడు హెచ్చికానకు దశరథేసుడు బంపగ, వచ్చి మునులకునెల్ల అభయంబిచ్చి మనఖరదూషణాదుల ద్రవచ్చినాడట, రాముని సతిని దెచ్చి నేలుదునన నతడనియె. ॥ఐం॥

3. రాముడు నరుడని రావణ తలచేవు, శ్రీమహావిష్ణువు సీతామహా లక్ష్మి, ఈ మేను బూనినాడిచట నిను బొరిగొనయమ్మహాత్మ జనకు డడియె మృత్యువు । విను విశ్వామిత్రుని క్రతువునను సుబాహుని జంపి రఘుపతి నన్ను శరమున ఈ మహోదధివైచె బ్రతికితినేమి సుకృతము కతననోయన ॥ఇంతి॥

4. హరి నన్ను బొరియింప అవతరించినట్లైతె, వెరచితె జంపక విడు తున రేలెమ్మ. మెరసి నీవు మాయమృగమై రాఘవుల సత్వర ముగ భ్రమియింపు ధరణీజనదెత్తు । మరు మాటలాడక నిను జంపు దున. రావణుండన వెరచి హరిచే తెగినమోక్షము వీనిచే పడనేల నని కడలె ॥ఐం॥

5. పదియారు వన్నెల బంగారువలె తనువు పొదలమేనిపై వెండి పువ్వులవలె చుక్కలు, గుదిగొన మణిరుచుల కొమరారుకొమ్ములు కొదుమ రత్నములనగ గొరిశెలుదనరంగ నుదుట నీలములవలె గన్గవయొప్ప మారీచు లేడియై కదలె శేషగిరీశుడగు రాఘవుడున్న పంచవటి చేరెను. ॥పది॥

## తరంగములు  మోహనరాగం, మిశ్రచాపు

శ్లో॥ యజ్ఞపత్న్యర్థ మీశానాం, లీలాగోపాల విగ్రహమ్
ప్రసాదయంతియంవేదః తాత్పర్యేణ ఆమనంతితే ॥

ప :- బాలగోపాలమాం ముద్ధరకృష్ణ । పరమకళ్యాణ గుణాకర । నీరద నీల కళేబర కృష్ణ నిరుపమ కౌస్తుభ కంధర । నందనందన భక్త చందన సుర బృందార్చిత బహువందన । మందస్మితా సుందరాననా కోటి మదనసుందర జగన్మోహన ॥
ఇందిర మందిర భక్తసుందర హృదయారవింద భృంగ భక్తి మక రంద నందిత గోపికబృంద ॥

(చతురశ్ర త్రిపుటలో ఇందిరామందిరా పాట జతులలో నాట్య మాడుట.) (పళ్ళెంలో నిలబడి. తలపై నీళ్ళచెంబు వుంచి ఆడుట.)

జతి :- ధిత్తా తదిగిణతొం — 3 సార్లు (ఇందిరా)
కిటతక తదిగిణతొం — 3 సార్లు (ఇందిరా)
ధిత్తా ధిమితా కిటతక తళంగు తకధికితక తదిగిణతొం 3 సార్లు (ఇందిరా)

తోధిక్కిణాకిణతోధిమ్మి రేతక్క
తోధిమ్మి ధిమికిట తోధిమ్మి రేతక్క
తొదిగిణంగంగిణం తొంగదృగుడు
తదృగుడు తత్తొంగ తెరిమిళంగ తిరుత్తొం
గ దృగుడు తధిమితకిటతదిగిణత ॥బాల॥

(మొదటి చరణం ప్రదర్శించవలయును.)

## తరంగము  హిందోళరాగం, ఆదితాళం

ప :- కృష్ణం కలయసఖి  సుందర-బాల
అను :- కృష్ణం గతవిషయ  తృష్ణం-జగత్ప్రభు॥

1. నృత్యంత మిహాముహుః రత్యంతమ పరిమిత
భృత్యానుకూలమఖిల సత్యం సదా-బాల ॥కృ॥

2. ధీరం భవజలధి పారం సకలవేద
సారం సమస్తయోగి తారం-సదా-బాల ॥కృ॥

3. శృంగార రసభర సంగీత సాహిత్య
గంగాలహరిఖేల సంగం-సదా-బాల ॥కృ॥

4. రామేణ జగదభి రామేణ బలభద్ర
రామేణ సహావాప్త కామేన-సదా-బాల ॥కృ॥

5. రాధా రుణాధర సుధాపం సచ్చితానంద
రూపం జగత్రయ భూపం-సదా-బాల ॥కృ॥

6. దామోదరామఖిల నామాకరంఘన
శ్యామాకృతి మసుర భీమం-సదా-బాల ॥కృ॥

7. అర్ధం శిథిలీకృత నర్ధం శ్రీనారాయణ
తీర్ధం పరమపురు షార్ధం-సదా-బాల ॥కృ॥

## తరంగము మోహనరాగం, ఆదితాళం

నీలమేఘ శరీర నిత్యానందం దేహి
బాల ॥ గోపాలకృష్ణ పాహి, పాహి ॥

1. కలభ సుందరగమన కస్తూరి శోభితనన
నళినదళయత నయన నందనందనా
మిళితగోప వధూజన మీనాంకకోటిమోహన
దళిత సంసారబంధన దారుణవైరీనాశన ॥బాల॥

2. యజ్ఞయజ్ఞ సంరక్షణ యాదవ వంశాభరణ
యజ్ఞఫల వితరణ యతిజన శరంణ్యా

అజ్ఞానఘన సామిరాణ అఖిలలోక కారణ
సుజ్ఞానదళితవారణ వేదాంతవాక్య ప్రమాణ ॥వా॥

3. వెత్యస్తా పాదారవింద విశ్వవందితా ముకుంద
సత్యఖండ బోధానంద సద్గుణబృందా
ప్రత్యస్తామిత భేదాఖండ పాలితసందసూనంద
నిత్యదా నారాయణతీర్థ నిర్మలనందా గోవింద ॥వా॥

## తరంగము బిళహరిరాగం, ఆదితాళం

ప :- పూరయామమ కామం గోపాల-పూరయ మమకామం ।
అ :- వారం వారం వందనమోస్తుతే, వారిజదళనయన గోపాల ॥పూరయ॥

1. మన్యేత్వామిహ మాధవదైవం
మాయాస్వీకృత మానుషభావం
ధన్యైరాధృత తత్త్వస్వభావం
ధాతారం జగతామతి విభవం ॥పూ॥

2. బృందావనచర బర్హావతంస
బద్ధకుంజవన బహులవిలాస
సాంద్రానందసముద్గీర్ణహాస
సంగతకేయూర సముదితదాస ॥పూ॥

3. మత్స్యకూర్మాదిదశమహితావతార
మదనుగ్రహోదవ మదనగోపాల
వాత్సల్యపాలిత వరయోగిబృంద
వరనారాయణతీర్థ వర్ధితమోద ॥

## అష్టపదులు మోహనరాగము, ఆదితాళము

చందనచర్చిత నీలకళేబర, పీతవసన వనమాలి
కేళిచలన్మణికుండల మండితగండయుగస్మితశాలి ॥చ॥

హరిరిహముగ్ధవధూనికరే, విలాసిని విలసితకేళిభరే ॥
పీనపయోధర భారభరేణ, హరింపరరభ్య సరాగం ॥చం॥

1. కేళికళాకుతుకేనచకాచి అముం యమునాజల
కూలే. మంజులవంజుల కుంజగతం. విచకర్ష కరేణదు కూలే ॥చం॥
శ్రీ జయదేవ ప్రణీతమిదమాద్భుత
కేశవకేళి రహస్యం బృందావననివినేలలితం
వితనోతు సుభాని యశస్యం । చం॥

## అష్టపది హిందోళరాగం, ఆదితాళం

నాదహరే జగన్నాధహరే
సీదతిరాధావాసగృహే ॥నా॥

1. త్వదభిసరణరభసేనవలంతీ
పతతివదాకినియంతి చలంతీ ॥నా॥

2. విహిత విశదబిసకిసలయవలయ
జీవతి పరమిహ తవరతి కలియ ॥నా॥

3. శ్లిష్యతిచుంబతి జలధరకల్పమ్
హరిరుపగత ఇతి తిమిరమనల్పమ్ ॥నా॥

4. శ్రీ జయదేవ కవేరిద ముదితమ్
రశికజనం తనుతామతిముదితమ్ ॥నా॥

## అష్టపది బిళహరి రాగము, ఆదితాళము

సావిరహే తవదీనా కృష్ణా
సావిరహే తవదీనా ॥

1. మాధవా మనసిజ విశిఖభయాతివ
పావనియాత్వయిలీనా ॥

అవిరళనిపతిత మదనశరాదివ
భవతవనాయ విశాలం
హే ! స్వహృద మర్మణివర్మకరోతి
సజల నళినీదళజాలం ॥

1. కుసుమ విశిఖశర తల్పమనల్ప
విలాసకళా కమనీయం హే
వ్రతమివతవ పరిరంభసుఖాయ
కరోతికుసుమ శయనీయం ॥సా॥

2. శ్రీ జయదేవ భణితమిద మధికం, యది
మనసా నటనీయమ్
హరివిరహాకులవల్ల యువతి సఖీవచన పఠనీయమ్ ॥సా॥

తుంగతుర్తి వారి రచన, జావళి :- (పదము)

## కాంభోజి రాగము, ఆదితాళము

వింతాలు వింటివా యేశోదా
నీ తనయుడు చేయు ॥విం॥

అను :- కాంతుడు నేనుగూడి ఏకాంతములాడు
చుండగాను, అంతలోనె చాటునపొంచి యెం
త పనిచేసే నోయమా ॥విం॥

1. సుందరులందరు మందిరమందున అందరికందరు ముచ్చటలాడుచు
తొందరపడుచుండగ నీ నందను డందరిలోదూకి కొందరి వస్త్రము
లందరుచూడగ ముందరగలాగి నందరిలో చిందరవంద జేసినప్పుడు
నీ ముందరగానే పాయెగదమ్మా ॥విం॥

2. అండజాక్షి మా యింటిలొ మెండైనట్టి పాలు పెరుగు కుండల కెగ
బాడి గ్రోలుచుండగ తాను దండిగ మా చెల్లెలు నేనుద్ధండముగ

లోపలికి పొగమెండుగ వెన్న ఇద్దరిమోమునిండ బూసి పాయెగ
దమ్మ ॥ ॥విం॥

3. ఉత్తమాటలు గావమ్మ మా అత్తవారింటికి అర్ధరాత్రివేళ్ళ వచ్చి
సందుల మొత్తలనుండగా ఇత్తరి మావారవతలికొచ్చి బిత్తరిబిత్తరి
చూపులు చూడగ । ఇత్తరిలోపల వున్నానాయని చిత్తరిగోడకుపత్తె
గదమ్మా ॥విం॥

4. దొడ్డెదొర కొడుకు మా బిడ్డ
చెడ్డకోపదారి దాని
వడ్డరించుకపోయి పైన చెడ్డపనియాని
దిడ్డి తలుపునవచ్చి ఆడబిడ్డచాటున పొంచియట్టి
వడ్డరించుపోయి పైన పడ్డడటమ్మ నీబిడ్డ ॥విం॥

5. బాలికామణి మా యింటిలో మావారు లేకుండచూచి
లాలించి మదనుని కేళికి రా, రమ్మనెనే ।
మేలూగ శ్రీ తుంధితుర్రి బాలకృష్ణు నేలినస్వామి
ఈవేళ్ళ వద్దనగ నన్ను తాల్తాల్మని ఏమోచేసె ॥విం॥

## క్షేత్రయ్య పదములు
## శంకరాభరణ రాగము, మిశ్రచాపు

ఎవ్వడేవాడు ఓ భామ వాడెవ్వడే వాడు ।
అను :- ఎవ్వడే నేను పవ్వళించినవేళ్ళ
పువ్వుబాణము వేసి రవ్వచేసి పాయె -ఎ॥

1. పట్టపగలు వాడు వచ్చి బలు
దిట్టడై నాయిల్లు జొచ్చి, వా

దట్టై నన్ను చెట్టపట్టి కౌగాలించి
ఘట్టిగ నామోవి గంటుచేసి పాయె ॥ఎ॥

2. వెన్నతిన్న పిన్నతనమో గొల్ల
కన్నెల వలబట్టినతనమో
కొన్న మగనివలె కొంగుబట్టి లాగి
చన్ను లొడిసిబట్టి చలమేటికని పాయె ॥ఎ॥

3. పేదసాదల కిదియూరా
ఇందు పిన్న పెద్దలు యెవరులేరా.... ఈ
వీదివారంత వింతగ చూచేరు
దాదు పిర్యాదేమిలేదాయె తరుణిలే ॥

4. నీలమేఘ శ్యామలాంగుడు
మేలు పీతాంబరదారుడు వాడు
లీల పదియారువేల గోపస్త్రీ లోలుడు
మువ్వగోపాలుడని పాయె ॥ఎ॥

## దీక్షితకృతము

### కీర్తన  కమాచిరాగం, ఆదితాళం

ఆడెను గిరికన్యకా. ఆ నటరాజు యెదుట -
నాట్యమాడెను గిరికన్యకా .... ॥ఆ॥

అ :- ఆడుచుపాడుచు ఆనందమున తేలి
వేడుకమీరగ వేల్పులచ్చరువంద ॥ఆ॥

1. వారిజాసనసుడునుడు భరతము కొనగొలువ

జతి :- తాకిటతక తాకిటతక తాకిటతకతో
తత్తకిటతక తత్తకిటతక తత్తకిటతకతో

తాకిటతక తాకిటతకతో, త త్తకిటతక

త త్తకిటతకతో, తాకిటతకతో. త త్త

కిటతకతో, తదింగిణత, తకతదింగిణత

తకధికు తదింగిణత ॥

వారిజాసనుడు భరతము కొనగొలువ

వారిజాసనుడు వంతగానము శేయ

వారిజాసనురాణి, స్వరము వీణపై మీట

గా, మా, గపమగరిగరి సనిదగాగ గరిగ

సాసనిదానిసాస మగగరిసగాగ గరిస

నిసరిరిరిసనిదనిసాస, సనిదపమపాప

దనిసరిగరిసా,

రిసనీ సనిదా నిదపధసమగమా.

నిదని పదాసని దనిసా, గరిసనిదా

రిసని దపాసని దపమ. గరిసనిద,

రిసనిదప సనిదపమ యనును

వారిజాసనురాణి స్వరము వీణపై మీటు

వారిజోదరు మృదంగ వాద్యముతో

జతి :- తఝ్ఝోంఝోం తరిత, తఝోంఝోం తరిత

తఝోంతరిత, తఝోంతరిత ఝోంతరిత

తాంత త్తదింద. త త్తదింద, తాంత త్త

దింద, త త్తదింద, తజ్జణు తకఝోణు

తకతదింగిణత, తఝోణు తకఝోణు

తకతదింగిణత, తదిగిణత

తదిగిణత, తదిగిణత యనుచు

వారి జోదరు మృదంగ వాద్యముతో ॥ఆ॥

జావళి :-

తత్తార పడనేల తాళతాళర సామి
అత్తింటి కోడలరా ॥త॥

అం :- కొత్తగ నేవచ్చి కొన్నినాళ్ళాయెరా
పొత్తుగడియ మరచిపోరు మావారు
చిత్తమున కోపముంచకుర. చీకటివేళ గాదుర
అత్తగారింట లేకున్నపుడైన రావైతివిర సామి ॥ద॥

1. మక్కువ చెక్కిలినొక్క రాకుర సామి
నొక్కులెక్కడ దాతురా
అక్కడనున్నది అదిగో ఆ, ఆడబిడ్డ
ఇక్కధలెరిగిన యెగిరి పైబడుర సామి.

మిశ్ర 1 నిక్కముగ నీకెదక్కితిర రేపు మాపటికిరా పోర
పక్కనే పంచాదిగది వెలుపలి తలుపు మూయకుంచెదరా ॥త॥

2. కౌగిట కిది వేళ్ళకాదుర నీకింత కక్కుర్తిపని ఏలరా
బాగుబాగు రెవికపట్టి నీ గోళ్ళతో
లాగిన పిగిలె ఏమాని బొంకుదసామి.

మిశ్ర 1. కాగలదు నీవుకోరిన యాకార్యమని ఒక జాములోపల
రాగదర మాపటికి మాదొడ్డి పడమటి దిడ్డిదారి ॥త॥

3. వల్లగాదుర తోట్లవల్లూరి వేణుగో
పాల తగదు తగదురా.

మిశ్ర 1. సల్లలిత దాసురామునికవి యుల్లసిల్లెను రామునిమన
మల్లకుంతలెవార లెరిగిన అల్లరికి
మూలముర సామి ॥త॥

# అ న్న మా చా ర్య కీ ర్త న లు

## మధ్యమావతిరాగం, ఆదితాళం

అదిగో అల్లదిగో, శ్రీహరివాసము
పదివేల శేషుల పడగలమయము ॥అ॥

1. అదె వేంకటాచల మఖిలోన్నతము
అదిగో బ్రహ్మాదుల కపురూపము
అదిగో నిత్యనివాస మఖిల మునులకు
అదె చూడుడదె మ్రొక్కు ఆనందమయము ॥అ॥

2. చెంగట నల్లదిగో, శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదిగో మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహుబ్రహ్మమయము ॥అ॥

3. కైవల్యపదము శ్రీవేంకటనగ మదిగో
శ్రీ వేంకటపతికి శిరులైనదీ
భావింప సకల సంపద రూపమదిగో
పావనములకెల్ల పావనమయము ॥అ॥

అన్నమాచార్య కీర్తన - హిందోళరాగం, ఆదితాళం

తెప్పగామరాకుమీద తేలాడువాడు
ఎప్పుడు లోకములెల్ల యేలేటివాడు ॥తె॥

1. మోత నీటిమడుగులలో ఈతగరచినవాడు
పాతగిరి నూతిక్రింద బాయనివాడు ॥తె॥

2. మూతి దోసిపట్టి మంటిముద్ద పెల్లగించువాడు
రోతయైన పేగులు పేరులుగా గలవాడు ॥తె॥

3. కోడికూత నోరివాని కుత్రతమ్ముడైనవాడు
బూడిద బూసినవాని బుద్ధులవాడు ॥తె॥

4. మాడవన్నె లేడివెంట మాయలో బడినవాడు
దూడల నావులగాచి దొరయ్యైనవాడు ॥తె॥

5. ఆకశాన బారెపూరి అతివల మానములు
కాకుచేయువాడు తురగమువాడు ॥తె॥

6. ఏకమై వేంకటగిరి ఇందిరరమణిని గూడి
ఏకాలముబాయని యెనలేనివాడు ॥తె॥

అన్నమాచార్య కీర్తన - కాంభోజిరాగం, ఆదితాళం

ఆలరులు గురియగ ఆడినదే
అలకల గులుకుల అలమేలుమంగ ॥అ॥

1. అరవిరిసొబగుల అతివలు మెచ్చగ
అరతేరమరుగున ఆడినదే
వరుసగ పూర్వదువాళపుతిరుపుల
హరికరగింపుచు అలమేలుమంగ ॥అ॥

2. మట్టపుమలపుల మట్టెలకెలపుల
తట్టెడి నడకల ఆడినదే
పెట్టిన వజ్రపుపెండెపు తళుకుల
ఆట్టిటుజిమ్ముచు అలమేల్మంగ ॥అ॥

3. చిందుల పాటల చిరిపొలయాటల
అందెలమ్రోంల ఆడినదే
కందువ తిరువేంకటపతి మెచ్చగ
అందపు తిరుపుల అలమేల్మంగ అ॥

త్యాగరాజస్వామివారి కీర్తన - అఠాణరాగం, ఆదితాళం

బాలకనకమయచేలసుజనపరి
పాల శ్రీరమాలోల విధృతశర
జాలశుభద కరుణాలవాల ఘన
నీల నవ్యవనమాలికాభరణ
ఏలా నీదయ రాదు, పరాకుచేసే
ఏలా సమయముగాదు ॥బా॥

1. రారా దేవాదిదేవా
రారా మహానుభావా
రారా రాజీవనేత్రా, రఘువర పుత్రా
సార తరసుదపూర హృదయపరి
వార జలధిగంభీర దనుజ సం
హార దశరధకుమార బుధజన వి
హార సకల శృతిసారనాగుపై ॥ఏలా॥

2. రాజాధిరాజ మునిపూజిత పదారవింద
రాజాలోచన శరంణ్యా, అతిలావణ్యా
రాజధరనుత విరాజతురగ సురరాజ
వందిత పదాబ్జజనక, దిన రాజకో
టి నమతేజ దనుజగజ । రాజనిచ్ఛయ
మృగరాజ నాదుపై ॥ఏలా॥

3. యాగారక్షణ పరమ భాగవతార్చిత
యోగీంద్ర సుహృద్భావితా ఆద్యంతరహిత
నాగశయనవర నాగవరద పుం
న్నాగ సుమధుర సదాఘమోచన స
దాగతి జధృత పదాగమాంతచర
రాగరహిత శ్రీ త్యాగరాజనుత ॥ఏలా॥

## రామదాసుగారి కీర్తన, ఆదితాళం

ప :- చరణాములే నమ్మితి, నీదివ్య ॥

అ :- నమ్మితి, నమ్మితి, రామ.
నమ్మితి, నీదివ్య ॥చ॥

1. వనమున రాతిని, వనితగ జేసిన రామ !
శరణం, శరణం. శరణం, నీదివ్య ॥చ॥

2. ఆదిశేషా నను అరమరశేయకు । రామ
అయ్యా ! అయ్యా ! అయ్యా ! నీదివ్య ॥చ॥

3. వారధిగట్టిన, వరభద్రాచల రమ రామ,
వరదా ! వరదా ! వరదా ! నీదివ్య ॥చ॥

4. బాగుగ నన్నేలు భద్రాచల రమ, రామ ।
దాసుడు, దాసుడు, రామదాసుడ నీదివ్య ॥చ॥

## క్షేత్రయ్య పదం - శంకరాభరణం, త్రిపుటతాళం

ప :- ఇంతమోహమేమిరా ఇందరికంటె నింతి
చక్కనిదేమిరా ॥ఇం॥

అ :- సుంతసేపు దానిజూడకుండగలేవు
అంతరంగము దెలుపవదియేల, మువ్వగోపాల ॥

1. నీకెదురుగ వచ్చునా ? నెనరూరగ,
నిండుకౌగిట చేర్చునా ?
ఆకుమడుగు లిచ్చునా ? తనచెలిమి
కైనవాడని మెచ్చునా ? తమిహెచ్చునా ?
ఏకచిత్తమున మీరిద్దరు, నింపుసొంపుగనున్న ముచ్చట
నాకు వినవిన వేడుకయ్యెరా ! ఇపుండానతీర ॥ఇం॥

2. మోవి పానకమిచ్చునా ?
కొసరికొసరి ముద్దులాడవిచ్చునా ?
తావిపువ్వులు దెచ్చునా ? తన సొగసుకు
తగినవాడని మెచ్చునా ? మనసిచ్చునా ?
దేవరే మగడు కావలెనని,
భావజుని పూజలొనరించిన
యా వనిత పేరేమి ? సెలవీర ? సిగ్గేలలేరా ॥ఇం॥

3. సంతోషముగ నాడునా, తంబురమీటి
సంచుపాట పాడునా ।
వింతరతుల గూడునా ? ఆ సమయమున
విడువాకుమని వేడునా, కొనియాడునా,
సంతతము నన్నేలుకొని యా
కాంతపై వలచినపుడె ఇక
కొంతయున్నదో మువ్వగోపాలా ।
గారడమేలా ॥ఇం॥

## పుష్పబాణ విలాసం, శ్లోకము

శ్లో॥ కాంతొయాశ్యతి దూరదేశమితిమే
చింతాపరంజాయతే
లోకానంద కలోహి చంద్రపదనేవైరా
యితే చంద్రమాః కించాయం వితినోతి
కోకిల కలాలాపో విలాపోదయం
ప్రాణాన్నేవహరంతిహంతనితరాం మారామమం చానిలా ॥

## శ్లోకార్థము - పదవి భాగము

కాంతః = భర్త
దూరదేశం = దూరదేశం గురించి
యాశ్యతిజ= వెళ్ళుతాడని
ఇతి = ఇప్పుడు
మే = నాకు
పరం = మిక్కిలి
చింతా = దుఃఖమును
జాయతే = పుట్టుచున్నది
చంద్రవదనే = చంద్రునివంటి ముఖముగల చెలి
చంద్రమాః = చంద్రుడు
లోకానంద కరోహి = లోకమును ఆనందింపచేయువాడైనను
మే = నాకు
వైరాయితే = విరోధమును
కించా = ఇంతేగాదు
అయంకోకిల కలాలాపః = అవ్యక్తమధురమైన ధ్వనులుచేత
విలాపోదయం = దుఃఖమును
వితనోతి = చేయుచున్నది
ఆరామ మందానిలాః = ఉద్యానవనమునందు మలయమారుతము
నితరాం =ఎల్లప్పుడు
ప్రాణాన్నేవ = ప్రాణమును
హరంతి = పోగొట్టుచున్నది
హంతా = ఎంతకష్టమా

## పదవిభాగం - ప్రతిపదార్థము

### అభినయములో పాడుపద్ధతి

కాంతః - దూరదేశం-యాశ్యతి-ఇతి-మే-పరం-చింతా-జాయతే

చంద్రవదనే - చంద్రమాః - లోకానందకరోహి-మే - వైరాయితే-
కించా-అయంకోకిలకలాలాపః - విలాపోదయం - వితనోతి - అరామ
మందానిలా-ప్రాణాన్నేవహరంతి-నితరాం-హంతా ।
(నాయిక ప్రవత్స్యత్పతిక, నాయకుడు అనుకూలుడు)
(విప్రగల్భ శృంగారం, కరుణారసం, శోకస్థాయి)

## పదము - కాంభోజిరాగం, మిశ్రచాపు (దీక్షితకృతం)

ప :- మాట నిలకడలేని, నీబోటి మగవాని
ఏబోటి వలచునురా, మనసిచ్చున ॥మా॥

అ ;- నేటికి తెలవైని మూడుపూటలు జరిగె
ఇదె వత్తునని ఏగి ఈనాటికొచ్చిన ॥మా ।

1. రతిబంధ మెరిగిన, రతిరాజు నీవాని
రమణులందరు యెంతో, రంజిల్లుచుండగ
రేవిభుడు నన్జేరి, రాపాడునుండెర,
రారయని బిల్వ రవ్వేలశేసేవు ॥మా॥

2. పన్నగశయననే, నిన్నె నమ్మియుంటి
కన్నెనుగాదుర కనికరింలెరసామి
గున్నమామిడిచెంత పొన్నమల్లెలు పరచి
చెన్నుమీరగ చేరి నన్ను చేపట్టర ॥మా॥

3. సరసుడేయని సరివారందరు నన్ను
పరిహాసములుచేయ పలుక సిగ్గాయెనే
మరియొక యువతిపై మరులుగొంటివో ఎమో
మరియాదగాదిది నన్మరచి ఈ విధిశాయ ॥మా॥

4. మరులు గొనియుంటిర మన్మధకార
మదనకేళిలో నన్ను మరిపింపరావేగ

మరియాదగాదు రమా సుందరకార
మావారులేరింక మదనగృహము నీదె ॥మా॥

5. కులుకు గుబ్బలనంటి గృమ్మర వేవేగ
పలుకు తేనియలిచ్చి పరవశింనగ చేయి
తళుకు చూపులతోడ తడయాక ననుగూడి
సోలింపచేయర, కుచేల పురవాస ॥మా॥

## కాఫీరాగం, ఆదితాళం, పదము దీక్షితకృతం

ప :- అలసిపోతిని చాలుసామి నీ చాతుర్య రతికి ॥అ॥

అ :- పలుకరింపకు నన్ను పన్వళింపనిమ్ము నేటికి ॥అల॥

1. చేరరమ్మని పిలచి, చెక్కిలిముద్దాడి
సురతకేళుల దేల్చి సొలియజేసితివెంతో
సరసాలరాయుడ సరిలేరు నిసాటి
ధీరుడ సమరతులింకేల చాలునుపోర ॥అ॥

2. సరిరారు నీసాటి సొగసైన ఈ సురతి
సరసుడ చాలించు తాళగలేనుర
మారసుందరకార మరుని తూపులనోప
మారాములేలింక రేపె మరలరార ॥అ॥

3. బడలికగల్గె నీ పనితనమునకెంతో
సడలింపకుము నీవీ బంధము సరసుడ
విడదీయబోకు బిగిముడినున్న కంచుకము
పొడియారె కనుమిదెనా. కెమ్మోవిపానక మానకు ॥అ॥

4. మగతనమునకేంతో, మది పంతసించితిని
మగువల మనసూల రంజింప నీవేర

వేగబంధనలెల్ల వేవేగ సల్పుకున్న
ఆగలేనిక నేను కుచేల పురవాస ॥అ॥

## పదము - మిశ్రచాపు, దీక్షితకృతం

ఒకసారికే ఇంత మోమాటమియైతే
వలపులేమిక తీరురా ॥

అ :- వగకాద నిన్నే, నే వలచియుంటిర సామి
వలపోర్వజాలర, వలదందువేర ॥

మి :- తాపమాపగ లేనురా, నీ పలుకుతేనె లొ
సంగర, పలుమారు రతుల పెనగొని
పరవశింపగ చేయరా ॥వ॥

2. సొగసుకాడావని, చొరవ చేసితిగాని
నలుగురు నవ్వేనురా
తగుతగులేర, ఈ తరుణమింకనురాదు
తలరుబోణులుజూడ తంటాలు వచ్చుర

మి :- తేరిపారగ జూతువేమిర, మారసుందరకార
ధీరసరగున సమరతులు సల్ప నరసకిక చేరర వేగ

3. మరుకేళి సుఖమొక్కమారు నీవెరిగితే
మనసు పట్టగలేవుర
సరిసరిలేర ఈతరి యెన్నడూరాదు. వెల
వెల బోయేవు తరుణులు గూడుట

మి :- త్వరగ కౌగిటచేర్చి సమరతి, గబ్బిగుబ్బల
నంటిపట్టి, అధరసుధల నొసంగి నన్నిక అలా
రింపగ జేయలేవ ॥వ॥

4.　సొక్కి సోలెదవేమి కుచేల పురవాస, చక్క
ని రతులేవిరా, మక్కువదీర్పవ మరులు
గొనియుంటిర, మదనకేళులలోన మరపించ మరివేరె

మి :- దిక్కు లేదుర మాంధీర, మదనతాపము నోపజా
ల, హారాములు మానుమింక మరుని శరముల తాళగలనా ॥వ॥

## అఠాణారాగం - ఆదితాళం, జతిస్వరం

ప :- తా, ఆ....రి ఝం....తగణం....తరి
తకుం....దా, రి....దాంధణాతాఝణు
తఝం తరుం తకుంతరిత దిగిణత ॥తా॥

అ :- ఝంతరుంతకిణతారిఝం తరిత
తఝంతరితధణఝణుత తకుందరిత
తఝంతరిత ధణతఝణుత తకుందరి
త .... రిదాం, ధణత, తదిగిణత ॥తా॥

1.　దాపామపాదనిసనిప దాపదని సరిస
మరిస నిరిసని పదనిస పదమ పరిమస
రిసపమ ధపసనిరి సమరిసరిసని తకిట
తదిగిణత ॥తా॥

2.　సప్సనిప దాపదాప మరీమపమాదా
తరితధణత, మపగమ పమధప మరిస
తగణజగణ ధపసనిరిసజగకిణాం
తరిత దనిసరి సనిపదాంధణత, గమ
పమధప తరిధణత. సరిసమరితకుంద
రికుందరితనిసరిసమరిసని తకిటతది
గిణత, తగిట తదిగిణత, తకిట తదిగిణత ॥తా॥

(జతులు, నాట్యములో కలుపుకొనవచ్చును.)

## అఠాణరాగం - ఆదితాళం, జతికట్టు

ప :- తాం, ధణ తాం, కిటతక ధీం, ధి మితా ॥

తకుం, తరీ ధణా, కిణా ॥ ఝొణూ, ధణ -

ఝొణు కిణ । తఝొం తరి ॥తాం॥

జతి :- తక్కిణాంత, కిణ్ణాత్తఝొం, తాకిటతకఝొకిట

తక. తాకిటతక ఝొం, తాకిటతక ఝొం, కిట

తక ఝొం, తాంత త్తదింద, తదీంగిణతతా

తాంత త్తాదింద, తదీంగిణతతా, తాందతదీందింద తదీందం

గిణతతా ॥తా॥

(ఈ జతికట్టును కొన్ని అడవులు, కొన్నిజతులు కూర్చుకొని చాలా సేపు ఆడవచ్చును.)

## కానడరాగం - ఆదితాళం, జతికట్టు

ప :- ధీంతన దిననాం । తనదిననాం ॥ తనదిరనాం

దిర । తనంత దిరనాం ॥దీం॥

(నాట్యాచార్యులు తమయొక్క అభిప్రాయానుగుణ్యముగా జతులు, అడుగులు కొన్నింటిని ఈ జతికట్టుకు చేర్చుకొని ప్రదర్శించవచ్చును.)

## మోహనరాగము, ఆదితాళం

నెం 1 శబ్దములు, తుళువ రాజేంద్రశబ్దము

ధాకిట కిటఝొం తద్దితకిటఝొం ।

తధీతకిటఝొం తకా । ధికీ ॥

ఝొణో తారితారిఝొం తరికిటతక తాధికిటతక ॥

తదిగిణతోం.-, తై హిద త్తత్తాం ॥

రాజశ్రీ భోసలకుల చంద్రా ।

రతిపతి సుందరరాజ నరేంద్రా ॥

రాజతుళజ మహారాజ తనుబజ ।
ప్రతాపసింహ సూత్రామాసలాం ॥
తాకుధణకుఝెంతా-, కిటతక
తదితది తదితది తది తది దిందక్కాత్తాం ॥
ధణకు కిణకుఝెంతా-, కిటతక ।
తదితది తదితది తది దిందకయత్తాం ॥
తాకుధణకుఝెంతా, తఝెంతరి ।
ధణకుకిణకుఝెంతా, తఝెంతరి ॥
తాకుధణకుఝెం ధణకుకిణకుఝెం ।
తాతాతాతధి, తధితాధి ॥
తాతాతాత తధి, తధితాధి ।
తాతాతాధి. తధితాధి ॥, తాతాతాధి తధితాధి
తదిగిణత, తదిగిణత తదిగిణత ॥

## తుళువ రాజేంద్రశబ్దము - ఆదితాళం, మోహనరాగం

ఝెణుతా, ఝెణుధణాంత ధిమికిట ।
కిణతా, కిణథణకు ధిమాంధిమి ॥
జగతా । జకణకు తకణకు ।
తద్దణత ఔరౌరా ॥
ధణధణత సరసు డౌరౌర
నాదగు కవికృతి గై కోర
ఈ భువి నీసరి యున్నార
రూపమున మన్మధుడవేర
శిబికర్ణులమించు ఉదార
సరసాద్భుత కవితాసార
సంగీతము నీ సొమ్మేర

గుణనిధి నీవని విన్నార
నరసీరసదసమ గంభీర
రణరిపుణ విజయబళ్ళార
ప్రతాపసింహేంద్ర కుమార
శ్రీ వెలసిన తుళజ వజీర
భళిభళిరా, సేభాసుర, చలమేలర, దయచూ
డర, నీదానర, నన్నేలుకోర భోసలాధీశ్వరా....

తా ధణాంధణ, ధిమీం. ధిమి ।
కిణాంకిణ తలతది తతతది ॥
(2 సార్లు)

తాకిటతక ధీకిటతక దాధాకిటతక ధీధీకిటతక ।
తాకుడు త త్తకిటతకతక్క,తదిగిణత ॥
తాకుడు త త్తకిటతకతక్క, తదిగిణత ।
రాకుడు త త్తకిటతకతక్క తదిగిణత ॥

## తుళువ రాజేంద్రశబ్దము - మోహనరాగం, ఆదితాళం

తాతాతదిందా తాతాతదిందా ।
తా తదిందా తాతదిందా తదిందా ॥
ధి త్తధి త్తతదిందా ధి త్తధి త్త తదిందా ।
ధి త్తదిందా ధి త్తదిందా తదిందా ॥
ధిత్తోంకిటతక ధిత్తోంకిటతక ధిత్తోంకిటతక తదిగిణతోం ।
తకతదిణతోం తకతదిగిణతోం ॥
అదిరాచాలమదించి, వసన ।
శత్రులబట్టి వధించి. నలు ॥
దిక్కులనెల్ల జయించి, నీవు ।
మిక్కిలికీర్తి వహించి వివ ॥
రించి దయవుంచి భువి ।

తో యేలితివార అంతటి జా
ణ అంగజరూపాదందాం దిందిం।
దిందిం దందాంతకధికి అందరుదొర ॥
లా.. ఇపుడందరు దొరలా ।
అది ఆటులుండగ అతిశయమని జను ॥
లందరు పొగడగ ప్రతాపరాముని ।
భజన శేయుచును ధర్మము జయమని ॥
తప్పకనప్పుడు కొలచేటల్లే ।
తోధిమి ధిమిధిమి ధిమిరత దృగుడుతక్క ॥
భోసల కులచంద్రుడవై వెలసిన ।
భోగసురేంద్రా బుధజవనసాంద్ర ॥
భళిర భళిలర తుళజేంద్రణతనయా ।
ధణాకు కిటతక ధణాకు తౌతదరికిటతక

---

ధణాకు ధణేకున త్తారి నచ్చాంగు ।
నచ్చోంగు తళంగు తళంగు కిణంగు ॥
దేహిణ్ణంతరి కిణ్ణగ జగజగ ప్రకింజా కిటతక దెగతక ।
తకిటా ధికిటా, తకతదిగిణతొం తకిటా, ధికిటా, తకతదిగిణతొం ॥

---

## తంజపురి ప్రతాపరామస్వామిః శబ్దము
## మోహనరాగం, ఆదితాళం

తగణం తరితగజగణం తతకిట
తఝేకిణంతరి ధణాధణా ॥
తఝొంత తరూంత గధీంత రితాంత ।
తాతైయ్యా తైహిదత్తతాం ॥
నిరంతరము ఈధరం తంజపుర

వరంబేలుయానదీశ్వరా ॥
వగరం వెలసిన పరంబులనికని ॥
కరంబుతోడుత పరాకులేకను ॥
నొసగుచు ప్రజలకు ప్రతాపరామ ॥
స్వామి నీకే పరాకు పరాకు ॥
తకధికి తకతక తదిగిణతొంతక ।
తదిగిణతొం తకతదిగిణతొం ॥

## దామెర్లవారి శబ్దము - ఆదితాళము, మోహనరాగం

తద్ది, తకతధిమిత కిటతక ।
ఝొంత. జగతతోంగ దృగుడుతక ॥
ఝంత, దృగుడు జంజం కిణకిణజగ ।
ణంత, తకణంతక-తక ॥
ఝంతక తకఝొంతక కిటతక ।
తకణం తకఝం తకుందరి కిటతక ॥
తారిత తరితధిమి తాధికిటతక కిటతక కిటతక ।
తా-. త్రైహిద త్తత్తాం ॥
రార, దామెర తిమ్మేంద్ర కు ।
మార, శతకోటి మన్మథా ।
కార, భాసుర భుజబలరణ ।
శూర, నారీజన మానస ॥
చోర, మహమ్మేరు సమాన ।
ధీర, కవిటన పోషక మం ॥
దార, పరరాజ శత్రుసం ।
హార, భరతశాస్త్ర విధి నీ
వేర, పెదవేంకటేంద్రహం ।

వీర, సరసతగల దొరనీ ॥
వేర. మము కరుణ చూచుటకు ।
వేళ్ళర ఇది వేళ్ళర, చల ॥
మేలర, మది బూనరనీ ।
దావర, నన్నేలుకోర భో ॥
సలా, ధీశ్వరా-. । ....
తాధణాంధణ-ధిమీంధిమి । | 2 సాప్లు
కిణాంకిణ-తతత్తదిత తత్తది॥ |
తాకిటతక ధీకిటతక తాతాకిటతక ధీధీకిటతక ।
తాకుడు త త్తకిటతక తకతక తదిగిణత ॥ 3 సాప్లు

## చిన్న రామాయణ శబ్దము - ఆదితాళం, మోహనరాగం

తధణాంత ధణాంత ధణతా ।
ధణధణాంత కిణాంత జగతా ॥
జగజగాంత కిణాంత కిణాంత తరూం
తతరూంత గిరిసమధీరా ॥
శ్రీదశరధ రాజకుమార ।
శతకోటి మన్మధాకార ॥
రత్నాకర సమగంభీరా ।
శ్రీకర భక్తజనోద్ధారా ॥
కరుణాకరనుత మంజీర ।
ధరణీతనయ మనోహార ॥
శాస్త్రపురాణా సమసారా ।
మారీచ సుబాహువిదార ॥
ఖరదూషణాది సంహార ।
సుగ్రీవాంగద పరివార ॥

లంకేశ్వర బలాపహార ।
నారణ కవి వినుతోధార ॥
ప్రతాపరామా బలశూర ।
అవుకారమేల్మేఖాషుపరాక్ ॥
తళంగు తకధీకి తకత దిగిణతోం ।
తకత దిదిణతోం తకతదిగిణతోం ॥

## పెద్దరామాయణ శబ్దము - ఆదితాళము, మోహనరాగం

దంధణా, దింధిమీ, ధిమితధీకు ।
తద్దికుతకు తకుంద త్తతారి తారిత ॥
త్తారితకుం త త్త త్తారి కిణనగత ।
క్కిణాంగి కిటతక తక్కిణాంగి త త్తదిద్ది ॥
నంగుకు త త్తకణంతం తరిఝొంతరికుందరి కిటతక
తదిగిణతోం
తాకిటతక తదిగిణతోం త త్తకిటతక తదిగిణతోం ॥
దశరధవర, కుమారుడవైతివి ।
ఘనకౌశికు యాగము గాచితివి ॥
పేర్మిజానకిని పెండ్లాడితివి ।
రవికులమున బలవంతుడవైతివి ॥
ఝొంతకణాదిరిజాజాగధిధిం ।
అంతట వనవాసము చేసితివి ॥
ఆడిన మాయమృగ వెంబడిబోతివి ।
చింతితమిది విధివశమనుకొంటివి ॥
ధీనుధణాంతకధి త్తకణంతరి ।
జటాయు తెల్పగ వినుమని అతనికి ॥
చెడని పదవిగా నొసగివవెను । కా....॥

తతైతై హి త్తతాం తతైహి త్త తదిగిణతోం ।
హనుమంతునిచే అభయ మొసగితివి ॥
ఆల సుగ్రీవుని ఆదరించితివి ।
తధరి తరితకిణ తరిత తరితఝం ॥
జయముగ వృక్షముచాటున నుంటివి ।
శరమున వాలిని కూలనేసితివి ॥
హుం తకణం తకహుం తణాంతతక ।
వానరసేనలదండు గూర్చితివి ॥
వారధి ఘట్టిగ బంధించితివి వీ....
డాగధిగధిధిండాడాగధిధిం ।
శరణవచ్చినవాని గాచేతివి ॥
హరిహరియని రణబిరుదు గట్టితివి ।
తక్కిట కిటతక ధాకిట కిటఝం ॥
ఆసురుని కులమెల హతము చేసితివి ।
అరయగ తమ్ముని కభయ మొసగితివి ॥
దందం ధణధణతాణు ధణాంధణ ।
లంకకెక్కియా లంక గూల్చితివి ॥
అగ్గళించి రావణుత్రుంచి । వీ....॥
తధీమితకిటతకఝణు తరికిటతక ।
పట్టముగట్టి విభీషణు లంకలో ॥
పెట్టివెడలె మీసీత సమేతుడ । వై.... ॥
అట్టి అయోధ్యా పట్టణమున మరి ।
పట్టభద్రుడై ప్రబలిన రా । మా.... ॥
దిట్టముగ పెరుందేవిని గూడుక ।
ఘట్టిగ భక్తులపట్టి సుఖములను ॥
కట్టడిచేసిన కరివరదా ।
పెట్టెద పదివేల సాష్టాంగదండము ॥

పెంపుగ చూడుము వరాకుబహూ ।
పరాకురామ వరాకులే కను ॥
నాదిరి దిరిదిరి నన్నం దిరిదిరి ।
తాతా దిరిదిరి తకతదిగిణతోం ॥

## శివశబ్దము - ఆదితాళము, మోహనరాగము

రచన : దీక్షితులు

తాకుకు ఝుకుకు ఝుకుకు ఝుణకుకు ।
ఝుఝుఝుణకుక్కుందరి కిటతక ॥
కుకుంతగుంతరుంతక-, తాకిటతక ।
తా, తకధిత్త దిగిణతోం ॥
రార, శ్వేతాచలేశవి ।
హర, కాలాగ్నిరుద్రావ ॥
తార, యమ నియంబులకా ।
ధార, సద్భక్తకోటిమం ॥
బార, సకల శాస్త్రాదినమ ।
సార, మునిజన సమానసం ॥
చార. ఘనఉరగేంద్రామణి ।
హర, భస్మోద్ధూళితశ ॥
రీర, నటనటన నాట్యాధి ।
కార, సృష్టిస్థితిలయాధి ॥
కార, ప్రమధగణంబుల పరి ।
వార, శూలాయుధాధికర ॥
ధార, అభయంకరమా ।
హేశ్వర. కరుణింపర, దయ ॥
చూపర, నెనరుంచర, చల ।

మేలర, మంత్రోవవయ్య కూచి ॥
పూడివాసా రామలంగేశా । నమో....॥

| తా. ధణాంధణ—, ధిమీంధిమి ।—,
| కిణాంకిణ తతతది తతతది ॥ 2 సార్లు

తాకిటతక ధీకిటతక దాధా కిటతక ధేధి కిటతక ।
తాకుడు త త్తకిటతికతిక తదిగిణత ॥
తాకుడు త త్తకిటతక తదిగిణత ।
తాకుఝు త త్తకిటతక తదిగిణత ॥

## పరశురామ శబ్దము - మిశ్రచాపు, మోహనరాగము,

తాకుఝ్ఝుకుకు ఝ్ఝుకురేకిణ
సారెసారెకు పరశురాముని
సన్నుతించెనీరజాక్ష వినవయా....॥
ఘోరతపములు మిగులచేసిన
వీరరావణ కుంభకర్ణాదుల జయించిన దేవరా!
కీర్తి యయ్యె తీగెలు
మేరువయ్యె చెట్టుపై
నెట్టెట్టు కదలక చుట్టుకున్నవి చిగురువిడిచి
తాకుఝ్ఝుకుకు తఝ్ఝుఝ్ఝుంతరి
మేఘమండలమనే పందిరి
మీదచాల విశాలమాయర
అదిర తారాగణములెల్లను
విదియచంద్రుడు పిందలాయెర
పిందకాయై నాటినాటికి
పండుపండిన పండురీతిని
నిండుపున్నమ వెన్నెలాయెర మన్నెధీరా...

రతిరతాంతరి తాకుతకణక
ఝేకిణంతరవికులాంబుధి
సోమదశరథ రామచంద్రా-,
శ్రీరామచంద్రా ఖళిర మేల్మేభాసురే
పరాకురే-, రికుందకుకుందరి కుకుందజగధరి
ధరికు ధరిధరి తహతత దిగిణతోం-, ధి త్తకిటతక
తదిగిణతోం-, త త్తకిటతక తదిగిణతోం ॥

## అహల్యా శాపవిమోచన శబ్దము - మిశ్రచాపు

తఝేకు ఝెంకిణకు కిటతక ఝెంతఝెంతారి
కిటకిటత డెగడెగతతాహ త్త కిటతక ఝెంత
క్షీరాబ్ధిశయనురే శృంగారకారురే
కరుణాంతరంగురే కౌసల్యతనయురే
తక్కిట ధిక్కిట కిణకి ఝేకి ఝెణకి
తర్రంగి తగణంగి తోధిమితకేటకి
తాటకీమర్దన కౌశికాయాగ సంరక్షణ
నంగిటతక దిద్దికిటతక డిఢిక్కుకుంతారి
కుంతారి డిఢిక్కు అహల్య శాపవిమోచన
అరచాపదండనా ఖండనామండనా
జానకీకల్యాణ జమదగ్ని రామానుభంగా
త త్తకిటతక కిటతక ఝెంత
సాకేత పట్టణావాసానుతీశా-
చదరంగ రణభీమ పట్టాభిరామావతారా....
తాకిటతక తాకిట కిటతక ఝెకిటతక ఝెకిటకిటతక
ఝెకిటకిటతక తరికిటతక తద్దరికిటతక
తళంగు తక తదిగిణతోం 3 సార్లు

# తంజపురి రాజుపై కాశినాధుని రచన

## శబ్దము, మిశ్రచాపు

తాకిణం తరిఝేకిణంతరి
పాలనేత్రుని పాదపద్మము
చాలనమ్మిన స్వామినీవని
తెలసిమన్యులు దొరలు మంత్రులు
దివ్యసింహాసనముపైని ఆరదుగ
పట్టాభిషేకము గరిమెతోడుత గట్టినపుడా
తత్తరికుంజరి భేరివాద్యము
నృత్యతాళము మ్రోయగా
సత్యసంధుడ వీవెయౌనని
సకల జనులు నుతింపగా
దిక్కుదిక్కుల రాజరాజులు
మ్రొక్కి నీకు పరాకుదెల్పగా...
ధిమిత ధిమికిట తఝెఝెుంకిట
అమృత కవిజను లవుధువవునని
సాటిలేకను తెలసెనౌరా
మేటి తుళజేంద్రుని సహోదర
నాటినేటికి నిన్నె నమ్మితి
నటన కాశీనాధ వందిత
చెలువు తంజాపురిని వెలసిన
ఛళిర మేకనృపాల తనయా
భోజరాజ సమానురే. శరభోజరాజ మహేంద్రుతే
వరభోసలాంటుధి చంద్రులే శహజానురే
పరాకులే, దాకిటతక ధాకిటకిబతక ఝెకిటతక

ఝెకిటకిటతక తరికిటతక తద్ధరికిటతక
తళంగుతకతదిగిణతొం 3 సార్లు

## కాశినాధ శబ్దము, మిశ్రచాపు

తత్తరేరేరే కిణంత
నృత్తకాశినాధ వందిత
చిత్తజునికి సమానుడై
మదహస్తిపై నీఠీవితో నీవురాగా....
నిన్నుజూచిన కన్నెలకు పోకముడి వదలెను
శత్రులకు చేకత్తిజారెను భళిర నీ కోపాగ్నిచేతను
పారిపోయ్యేషున వారధిని బడబాగ్ని నడిగెనూ....
పురుషసింహము నీవెయని
కేసరివిరచి ఘనఅడవి జొచ్చిన
మోముజూచి విచారమొందిన
సోముడీశను జడలు దాల్చిన
అందచందము చూచి అంగజుడనగు డాయెనూ.... ॥
రికుంద కుకుందరి కుకుంధజగధరి ధరికుధరిధరి
తహత తదిగిణతోం, ధిత్తకిటతక తదిగిణతొం, తత్తకిటతక
తదిగిణతొం ॥

## ప్రహ్లాద పట్టాభిషేక శబ్దము, మిశ్రచాపు

ధణత దిద్దిమి తహతకిణనగ
తాకుఝెకు ధణేకు కిటతక
అతరిత తధిమి ధిమిత కిటతక
రాములున్నపురం బయోధ్యను
భూమినున్న జనంబు పల్కర

వచ్చి అచ్యుతపురములో బహు
ముచ్చటైన నవ మంటపంబున
నిండుకొలువున నుండెనూ.... ॥
కోదండపాణి జయంతి దినమున
సముఖమందున సుముఖులై
బహుప్రముఖ విద్వజ్జనము ప్రక్కన
తక్కతో తకధిక్కతోయని
చక్కగా, ఎంతో చక్కగా,
నవమిక్కిలి నవరసముతోనూ....
హరికథ ప్రహ్లాద చరితము
అభినయంబని వేడ్కగానే
హరిని గర్వము అణచవలెనని
అజునికోరి హిరణ్యకశిపుడు
పగలు రాత్రాకాశ భూమియు
మృగమనుష్యుల ఇండ్ల బయలున
ఆయుధంబున చావులేదని
హామికై వరమడిగి చేకొని
దేవబ్రాహ్మణ ఋషులనూ....
అనుదినము బాధలు చేయుచు
నా పుత్రునకు నా శత్రువే హరి
మిత్రుడయ్యె విచిత్రమేమని
పాముచే గరపింపుమనగ
పాము నెత్తుకపోయె గరుడుడు
కాలకూట విషంబు విప్పగ
పాలుగానవి పచ్చమాయెనూ....
జట్లయుద్ధము శేయువారల

పెట్టపోగుల బడినటుండగ
సాగరంబున వేయగ, అతివేగమె దరిగట్టు జేర్చక
గిరిని పైనెక్కించి త్రోయగ,
హరిసతియు వచ్చాగుకొానెనూ....
ఎందునా .... ఓరెందునా ....
నీకెందునా భయమింతలేదుర
ఏమిరా ప్రహ్లాద నిన్నేమందురా
హరి ఇందునా నాముందర ఈ సముఖమందున
ఎందుచూచిన ఆందుగలడన
గడగడంబున పుడమి వణకగ
కొడుకు తండ్రికి వాదమై
ఒక ఘడియలోనే మడియగొాట్టెద
సుడియ హరినిట చూపమనగా....
ధగధగధగధగధగ యని
ధరణిమండగ పగలునిండగ
ధరణి వర నరసింహ- స్తంభమున-ఆవిర్భవించెనూ....
హుగ్రమై-సారెగోరాయుధముతోనే
సంధ్యవేళ్ళల హిరణ్యకశిపుని
డిడికు ఢిండిం ఢింకుఢింకుకు
తద్దణాంధిమి కడుపు చించియు
వేగవేగమె కడగ జ్జింర్యుముగా ధరించెనూ....
గార రక్తము గిరిగోరుల
మీరి వడివడి కేకలేయుచు
లోకమెల్లను ఏకమై కోపాగ్ని నిండెనూ....
హరిహరి శరణంచు ప్రహ్లోదు డెదరి నమస్కరించెనూ....
లక్ష్మివచ్చి శేవించెనూ-, తన వనస్థలమున నుంచెనూ....

ఓ పరమ భాగవతుండనేసి
భక్తికిప్పుడు మెచ్చితిమ్మని
వరములిచ్చెను కరుణతోడుత
ధరణినేలు వెయ్యేళ్ళు యనుచును
సురులు అందరు పొగడగా
ప్రహ్లాదునకు పట్టంబుగట్టేసు....
గరిమెతో నరహరి., వైకుంఠపురమును చేరెసు....
ధాకిటతక ఝాకిటకిటతక ఝెుకిటతక ఝెుకిటకిటతత
తరికిటతక తత్తరికిటతక తళంగుతక తదిగిణతోం
తళంగుతక తదిగిణతోం తళంగుతక తదిగిణతోం ॥

## మహిషాసుర మరని శబ్దము, మిశ్రచాపు

రచన : దీక్షితులు

తాకిణం తరిఝె కిణంతరి
ధణధణాంధణ ధణతధీనుత
తరికిటతక తకధిమితరికిటతక తద్దరికిటతక
జాగధీంత జగగధీంత
తాకిటతక తకధిమి తాకిటతక తదిగిణతోం
తాకిటతక తకధిమి తాకిటతక తదిగిణతోం
తాకిటతక తకధిమితాకిటతక తధిగిణతోం ॥
మేదినీ పురమందు రంభుడు
అగ్నినడుమను అధిష్ఠితుడై, తపము శాయగా....
దోకిటతక దోద్దోకిటతక
దిక్కుదిక్కులు పిక్కటిల్లగ.
అగ్నిహోత్రుడు అవతరించియు

ఆలసింపగ అశతెల్పుము
అభయమిచ్చెద అందుకొనమనెనూ....
తాకుధ్ధుకుకు తధ్ధుంధ్ధుంకిట
అపుత్రశ్చ గతిర్నాస్తి పుత్రుకొరకై మిమ్ము వేడితి
దేపదానవ పురుషగణములో
మృత్యుభయమును చేసి పుత్రుని ప్రసాధింపుమూ....
రతిరతాంతరి తాకుతకణక
వల్లెయని యా అగ్నిహోత్రుడు అదృశ్యమాయెనూ....
పీరరంభుడు సంతసింపగ
అమృతఘడిన మహిషిపత్నికి మహిషపుత్రుడు జనమం
దెనూ....తగ్గథీం తరితగగథీంతరి
వరము గర్వముచేత మహిషుడు
ధరణి ప్రజలను బాధపెట్టుచు
ఋషులు ద్విజులను హింసపెట్టుచు
అమరులకు సందేశమంపెనూ....
తరికిటతక త త్తరికిటతక తరికిటతక తదిగిణతోం

అమరపురమును ఆశ్రయించక
అరణ్యసీమల ఆలుబిడ్డతో అరగుమానెనూ....
మహిషవాక్యం మహేంద్రుడు విని
మాటలేటికి మాయదూత
మహిషగర్వం అణచుకొరకై
మందబుద్ధిని మాన్పుటకునే
మహిషుపై పోరునకు వచ్చెద
మాటలేటి మరలుమనెనూ....
ధణతదంధం ధణతదాందాం
రణభేరి మ్రోగింపుచు

రండి రండి దైత్యులార
దేవసైన్యము నుగ్గడింపను
ఖడ్గహస్తులు మీరుకండని
చక్షురుడు ధనాధ్యక్షుడు
అసిలలోమ బిమలభాష్కల-
త్రినేత్రులగు ఈ మంత్రివరులతో
కొదమసింగములాగ మహిషుడు
కదనరంగముపైన దుమికెనూ....
ధాకిటతక ధాకిటకిటతక ధాకిటతక తదిగిణతోం

---

దేవదానవ సైన్యములకును
దివారాత్రులు తెలియకుండగ
యుద్ధమాయెనూ....
మహిషమరణం మాయచేతనె
మహావిష్ణువు మాటతెల్పిన
తద్ధణాంధిమి తహంతధీధిమి
నమస్తే దాక్షాయణి, నమస్తే దుష్టశిక్షణి
నమస్తే శిష్టరక్షణి, నమస్తే విశ్వరూపిణి ।
నమస్తే-నమస్తే-నమస్తే యని
అమరముఖ్యులు ఆదిశక్తిని కొలువగా....
ధణధణాంధణధణత ధణధణ
పెళపెళార్భటులతోటి
శివుని తేజము దేవిముఖమై
యముని అంశము కేశవర్ణము
అగ్ని తేజము త్రినేత్రములు
విష్ణుఅంశన సహస్రబాహులు
సకల అంశతో అబలతానై

అదిశక్తిగ ఆవిర్భవించెనూ...
తాహాతద్ధిమిత తహాతతాధిమి,
మహిషమరణం నిక్కువంబని
మాటయిచ్చియు మాయాశక్తి
హేమాద్రిపైన నిలచెదూ....
మహిషగర్వం మాన్పుటకునై
ధన్ ధన్ ధన్ ధన్ ధనాయని
ధిమిధిమిద్ధిమి ధిమితధీధిమి
వీరశక్తితో పోరుచుండగ
ఆశ్వీజశుద్ధనవమిని, ఆ మహిషుడు అంతమందెనూ....
మహిష సంహారముచేతనె
మహిషసురమర్దని పేరున మహిలో వెలసెనూ....
ధాకిటతక ధాకిటకిటతక ధాకిటతక తదిగిణతోం
ఝకిటతక ఝకిటకిటతక ఝకిటతక తదిగిణతోం
ధాకిటతక తదిగిణతోం, ఝకిటతక తదిగిణతోం
తతతత ఝం, తతతత ఝం, తతతత ఝం ॥

## వినాయక - కౌతము, ఆదితాళము

తాదిగిదిగిత్తై దిద్దిత్తై ।
దిత్తై డత్తడి దత్త్తాహం ॥
నుతకిణకిణతోంగ డికుతోంతోంగ ।
నంగిటకిటతక నంఢిటకిటతక నంగిటకిటతక దీందా ॥
నుతకిణకిణతోంగ డికుతోంతోంగ ।
తాహాంఝుత్తం ఝుకిటతక ధిక్కు ॥
తా-, తత్తా, డృగుడు దందం దందందారి ।
ధక్కుజకిటతక ధిక్కుతోంగ, హరిజన కరిముఖ ॥

విఘ్నవినాయక వేనుకటి హరలవ ।
గణపతి ఝెఝెఝెక్కిటనుతరిత ॥
ఝెం, కిణ్ణం, ఝెఝెఝెక్కిట ।
నుతరితఝెం.కిణ్ణం తధిక్కు ॥
తధిక్కు అనదికౌతం ధక్కిట కిటతక ।
ధిక్కితొంగ దేవరగణపతి ధిక్కిటకిటతక ॥
ధిక్కితొంగ గణపతికౌతం కత్యో ।
ర్వినయు. దృగుడు దాం తృగుడు దీంతాక్కు ॥
ధీక్కు, తక్కిటతుంగిట కిటతకధే, ।
ణ్ణ, తంఘికిటతక ధిక్కితా ॥

## శివకౌతము, ఆదితాళము

ధక్కిటకిటతక ధిక్కిటకిటతక తాండవినోది ।
ధిక్కిటకిటతక ధరిగిటకిటతక త్రిశూలఢమరు ॥
ధిమిధిమితధిమిత త్రినేత్రశంకర ।
త్రిపురసంహార, దృగుడు దృగుడు దృగుడుదాం ॥
నందివాహన, నాగభూషణ ।
ఛేకుకు ఛెకకుకు ఛెకకుకు ధింకుకు ॥
పార్వతి రమణ భక్తవత్సల ।
పరమపురుష గంగాధర శంకర ॥
ధక్కిట కిటతక ధిక్కిట కిటతక తాకిణ్ణఝెకిణ్ణతక్కు ।
ముగురు రాజుల పూజలింగమ ॥
మల్లిఖార్జున నెల్లొహత్త ।
తక్కిటకిటతక దిక్కిటక్కటతక తొంగిటకిటతక నంగిటకిటతక ॥
తాక్కుధీక్కు తక్కిట తుంగిట కిటతక ।
ఢే, ణ్ణ, తంఘికిటతకి ధిక్కిత్తా ॥

# కృష్ణ శబ్దము, ఆదితాళము

తద్ది, తకతధిమితకిటతక ।
ఝొంత, జగతతోంగ దృగుడుతక్క ॥
రుంత, దృగుడు జంజం కిణజగ ।
ణంత. తకణంతక-, తక ॥
రుంతక, తకఝొంతక - కిటతక ।
తకణం తకరుంతకుందరి కిటతక ॥
తరిత తరిత ధితద కిటతక ।
తా-, త్రైహిద త్తత్రాం ॥
రార. యదువంశ సుధాంబుది ।
చంద్రా, రత్నాకర సమగం ॥
ధీరా, శతకోటిమన్మథా ।
కార, భాసురభుజబలరణ ॥
శూర, నారీజన మానస ।
చోరా, మహామేౄరు సమానా ॥
ధీరా. కవిజన పోషకమం
దార, పరరాజ శత్రునం
హార. భరతశాస్త్రనిధిని ।
వేర, సరసతగల దొరనీ ॥
వేర, మము కరుణ చూచుటకు ।
వేళ్కర, ఇది వేళ్కర, ఛల ॥
మేలర. మదిధూపర. నీ ।
దానర, నన్నేలుకోర శ్రీ ॥
ద్వారకాధీశ్వరా ।.... ॥

| తా ధణాంధణ-దిమీంధిమి ।
| కిణాంకిణతతతది తతతది ॥ 2 సార్లు

తాకిటతక ధీకిటతక తాతాకిటతక ధీధీకిటతక ।

తాకుడు త త్తకిటతక తక తదిగిణత ॥

తాకుడు త త్తకిటతకతక తదిగిణత ।

తాకుడు త త్తకిటతకకక తదిగిణత ॥

## తంజపురి ప్రతాపరామస్వామి శబ్దము, ఆదితాళము

డాగధి గధిజగ తతగధిగధిజగ ।
ధి త్తాహతగధి డాగధిడాగధి ॥
ధి త్తఝెంఝెం తధణాంతధణాం ।
తఝెంఝెంతకక, తద్దీదీద్దితక ॥
వగపగగా సొమ్ములు ధరించుకొని ।
సొగసుగ కస్తురిబొట్టు బెట్టుకొని ॥
నిగనిగమని తనుకాంతులు మెరయగ ।
ఘుగఘుగమని వాసనలు చెలంగగ ॥
జగతిని తంజాపురమున వెలసిన ।
ప్రతాపరామస్వామి పరాక్ ॥
తళంగు తకధిమి తకత దిగిణతోం ।
తక తదిగిణతోం, తక తదిగిణతోం ॥

## శబ్దము :- ఆది, నడతతిశ్ర

తక్కిణాం కిణ్ణ త్తఝెం ।
తాహ త్త కిణ్ణ త్త కిణ్ణ త్తఝెం ॥
తాకిణ్ణ ఝెకిణ్ణ ఝెకిణ్ణ తాఝెణ్ణు ।
తాఝెంత ఝెంతారి తాఝెంతరేకిణ్ణ ॥
నీ యందచందంబు నీ ఈవి నే ఠీవి ।
నీచెల్వమును జూచి నిన్నె వలచితిరా ॥

రాజదొరవౌరా, రాజగంభీరా ।
శ్రీయుతుడవౌరా, చిత్తజాకారా ॥
తక్కిట ధిక్కిట తొంగిట నంగిట ।
తద్దింద తకదింద తకదిందతొం ॥
తద్దింత తకధింత తకధింతతొం ।
తద్ధింత తకధింత తకధింతతొం ॥

## మండూక శబ్దము - మిశ్రచాపు

తద్ధణాంధిమి, తహతఝొంతరి
ఝొంత జగందరి, చిగందకుకుందరి
కుకుంద తకుందరి, తకుందకిణధరి
తా-, తైహిధత్తతాం ।
తన్ననంతా, తాజగంతరి
పొన్నమల్లెలు, బొతడపువ్వులు
సన్నజాజుల్యం, పెంగలున్....
చెన్నుమీర చెలంగువనములో
టాకుపెకణకుదేకుకమల
తటాకమున మండూక శబ్దమూ....
ణగణ, ణగణగ, ణగణ, ణగణగ, ణగణ, ణగణగ, ణగాం
కిటతక, డెగడె, డెగడెగ, డెగడె, డెగడెగ, డెగడె, డెగడెగ, డెగం
కిటతక జగజ, జగజగ. జగజ, జగజగ, జగజ, జగజగ, జగం
తగ, ణ, గణ, ణగణగ, ణగం-.
డెగడె, గడెడెగ, డెగ, డేగం-,
జగ, జగజ, జగ, టగ, జగం-,
తగ, ణగణగ, ణగణగ, ణణణగ, ణగణగ, ణగణగ
డెగ, డెగడెగ, డెగడెగ, డెగడెగ, డెగడెగ, డెగడెగ

జగ, జగజగ, జగజగ, జగజగ, జగజగ, జగజగ

తగం-ణగం-డెగం-జగం

తగణ-, ణగణగ, డెగడె, డెగడెగ, జెగజ, జగజగ

బాధతో-, ఎంతో, బాధతో, గజేంద్రుగని

ఈలాగునను మండూకములు ఘోషింపగా....

తధ్రఘ్రట ఘ్రటాకుకు

ధాకుధేకుకు ధేకుధింకుకు

ఉగ్రశాపముతో గజేంద్రుడు

బద్ధుడై బల్మకరిచేతను, కావలేనను శ్రీహరీయని

ఆర్తుడై కడు మొరలుబెట్టగ

తాకిటతక తత్తధిమి తతతతఝెం

భక్తసులభుడు, భక్తునింగని

బిరబిరను యా వనము జేరియు

నంగిటతక దిద్దికిటతక

చేత చక్రముబట్టి మకరిని సంహరించిన మహిమనూ....

ధీనుతాంహత తకిటతకుందరి

జానకి కళ్యాణ శ్రీరఘురామ

భుజబల భీమ, జగదభిరామ-,

-, కోధండరామా పరాక్,

ధాకిటతక ధాకిటకిటతక

ఝెకిటతక ఝెకిటకిటతక

తరికిటతక తత్తరికిటతక

తళంగుతక తదిగిణతొం 3 సార్లు

# శిద్ధేంద్ర శబ్దము - విశ్వచాపు

రచన : వేదాన్తం పార్వతీశం

తత్తధింకుకు ధణతధీనుత
తద్ధిమిధిమి తహతఝొంతరి
ఝొంతజగందరి జగందకుకుందరి
కుకుందతకుందరి తకుందకిణధరితాం
తైహిద త్తతాం
కృష్ణప్రాగ్దిశ భూములందున
శిష్టజనసామాశ్రయంబగు
స్రష్టనిలయము బ్రాహ్మ్యవాటిని
త్వష్టనిర్మిత దేవళంటున
తిష్టవేసె శిద్ధేంద్రు డొకనాడు....
తారితారిత జగకిణాంతరి
సామగానము వల్లెవేయుచు
శిష్యులెల్లరు వెంటరాగా
సోమయాజి వినమ్రుడైతా
స్వామినటభిక్షకై పిలచెనూ....
ధోకిటతక దొద్దొకిటతక

---

చిలుకరౌతుల బోలుశిష్యుల
కాకవీధ్వని పలుకులనుమవి
మొలకలెత్త సిద్దేంద్రునికి నిధి
తద్దణాంధిమి తహతఝొంతరి
బిరబిరను భిక్షకై నేగెనూ....
అమృతమస్తని ఆపోసనంబిడ
అనంగీకృతుడాయె యతి
అంతటను ఆ విప్రవర్యులు

అపచారమె కలిగె ననుచును
తరితతతతకీణ, తరితతకతక
చెదరి చెదరిన హృదయుడై యా
సోమయాజియు నెంతొ వేడగ
నాదురచనగు, భామకలాపంబుమీరును
వీధివీధిని వాడవాడల, ఆటపాటలు
ఆడుమనగా....
తాకిణంత ఝెుకిణంత
వేదవాక్కులు బల్కు విప్రులు
వేషభాషలు వెలయనౌన
విలయతాండవ మాడదే భువి
విప్రవంశము భ్రష్టమౌనన
రికుంద కుకుందరి కుకుంద తకుందరి
కోపఘూర్ణితలోచనుండై
శాసమితైని పెరవు గొల్వగ
తాద్దిగిద్దిగి ద్ధిగిద్ధిగిద్ధిగి
విదివిధంబని విప్రులెల్లరు వల్లె యనగా....
తద్ధణా, తఝెుణుత తద్ధిమీ,
తద్ధిమిత కిటతక
బాగుబాగని వటువులకు తానడవసాముతో
భామంలాపమును నేర్చెనూ....
తత్తద్రుగుడుత ద్రుగుడుత తతకిణ

---

పెరవు జెందెదరే లరయమో
విప్రులారా ! లెండు వేగమె
శంకరాచార్యు కడకేగగ
వినియు కనియును స్వామి

పంచమ వేదమనుచును సనదులిచ్చెనూ....
తహాతఝోంతరి ఝోంతజగందరి
జగంద కుకుందరి కుకుంద తకుందరి
నాటి నేటికి నాట్యసూచగ
వాడవాడలు పెడలుచుండగ
వర్షభుక్తికై తానీషా అగ్రహార మొసగెనూ....
డిడికుడింధిం ధింకుధింకుకు
విప్రులారా ! వినుడి నానుడి
విశ్వమంతయు నుండువరకును
నాట్యపీఠమై కూచిపూడియు
భారతావని వెలయగలదిక
నాదు దీవెన మీకు శుభమగు
బిడ్డపుట్టిన నాధుపేరున
ముక్కుగుట్టుకు వెలయగలరిక
కీర్తికాంతుల భుక్తిముక్తుల
రక్తులై చిరంజీవులగుచునూ....
ధాకిటతక ధాకిటకిటతక

ఝోకిటతక ఝోకిటకిటతక

తరికిటతక త త్తరికిటతక

తత్తదిగిణత, తత్తదిగిణత, తత్తదిగిణత ॥

## దశావతార శబ్దము - త్రిపుటతాళము

రచన : అన్నాబత్తుల వీరాస్వామి, పెదపులివర్రు

తగ్గధీంత తాంహాత్తధీనుత
తధీనుత తాంఝుధణాంధణ
తఝోంతరితతఝోం ఝోంతరిత

తఝంతరిత ఝంత కుఱేకిణ
తడికు డిడికు డిడిడికు ఢింకుకు
తక్కిః నగతకుందరి కిటతక
తకుంద ధికుంద దికుందక్క తకుందక్క
మచ్చరమున మహార్ణవములో
జొచ్చియున్న సోమకు త్రుంచియు
విచ్చలవిడి వేదములజునకు
ఇచ్చితివా మత్స్యావతారా....
తధిమిధిమిత తాంహా త్త కిటతకతక్క
దృగుడు తతకిటఝంతరి కిటతకతక్క
క్ణాం కిటతకతక్క క్ణాం కిటతక ఱేకిణ

తఝణుతాతగ్ధి తకుందరి
పలుమరు మిము ప్రస్తుతిచేయగ
చెలగి సురులు జలధి మథింపగ
కలిమి బలిమి యెలమితో నొసగిన
కులగిరిధర కూర్మావతారా....
తాతై తై త త్త త్తాం కిటతక
తాతై తై ద త్తతాం
తధిమిత కిటఝణుతరి కిటతక
కుకుందరికిట ధరికిట కిటతక
స్థిరముగ ధరనురువడి చేకొని
ఉరగపథము ఇరువుకు జొన్పిన
హిరణ్యాక్షు బరిమార్చితివా
వరసుగుణా వరాహరూపా....
తక్కిటకిట ధణుకు ధి త్తాత
తకధిమి త త్తళాంగు తకతది

గిణత తదిగిణత తదిగిణత । గిణత
దందంధణతాణుతఢీం కుకు జంభారి
సురప్రముఖక । దంబంబులు రక్షింపంగ
స్తంభంబున వెడలియుధానవ
డింభకుగాచితివో నరసింహా ....
తద్ధిత్తాకిటతక ధిమిధిత్తా
కిటతకధిమి తద్ధిత్తా తగిదిణతోం
కిటతక తదిగిణత తదిగిణత
తద్ధణాంత తాంహాతఝెంతరి
మానితముగ ముల్లోకంబులు
తానొప్పగ కాపాడంగా
మానుగ మూడడుగులు బలిచే
దానముగొను వామనరూపా ॥
తాకిటతక తాకిటతక ధిమికిటతక
తాకిటతక తాకిటతక ధిమికిటతక
తాకిటతక ధిమితాకిటతక ధిమికిట
తరిత తరిత దృగుడు తక్కిణనగ
తరమి తరమి ధరణీపతులను
పరశువుచే నురుమాడితివో
వరవీర పరాక్రమమును ధర
బరగితివో భార్గవరామా ....
ధిత్తాత, ధిత్తాత, కిటతక కిటతక
ధిత్తాత, ధిత్తాత, కిటతక కిటతక
ధిత్తాత, ధిత్తాత, తదిగిణతోం
ధిత్తాత, ధిత్తాత, తదిగిణతోం
ధిత్తాత, ధిత్తాత, తదిగిణతోం

జకజకణక జకణక రేకిణ
దశరధ తనయుడవై సురులకు
వశముగాని దశముఖు త్రుంచియు
విశదముగ-నయోధ్యకు సీతతో-వేం
చేసితివౌ-రఘురామా....
తద్ధిత్తా తదిగిణత ధి । త్తా తదిగిణత
తాతదిగిణత, తదిగిణత. తదిగిణతి
తదిగిణత, తాకుధణకుతధింకుఝెకుకు
యాదవ వంశాబ్ధి సుధాకరు
ఆదిదేవు దనుజుడుగా ఇల
బాధపెట్టు ఖలులమ త్రుంచియు
మేదిని భరముడిపిన బలరామా....
ధణతక తొంతొం తద్దిందా
ధిమితద్ధిమి ధిమిత త్తద్ధిమి
కిటతకధాతక తదిగిణతొం
తక తదిగిణతొం తదిగిణతొం
తకుంతరిత ఝంతకరేకిణ
అంగనలను శిగ్గడవించెడి
అంగజ సమరూపముతో
రంగుగ పురకాంతల వ్రతములు
భంగపరచు బౌద్ధవతారా....
తగణం తరితగణం తతకిట
తకతళాంగు త త్తాకిటతక
తాతళాంగు తకధరి కిటతక
కిటతకదెగ క్రిరట కిటతక
ఘాటపు కలిబాధల మాన్పగ

సీటుగ కరవాలం భూనియు
ఘోటకమున నెక్కి దురాత్ముల
ఘీటడచెడి కల్క్యవతారా....
జకకుణకకు ఝుఝుఝుకకెణ
సురలేమ్మెలని పొగడగ
నిరతము నీ దాసుల బ్రోవను
పరగ వ్యాఘ్రపురమున వెలసిన
వరదరాజదేవా ఆశ్రిత
సురభోజా పరాక్ పరాక్
తకధికి తకతక తదిగిణతోం
దృగుడు తత్తకిటఝుంత. తరి
ధణత ధణాంధిమి తధణాంధిమి
దృగుడు తత్తకిట తకతత కిటతక 2 సార్లు
దృగుడు తత్తకిట-తక తదిగిణత 3 సార్లు

## కౌతము - ఆదితాళము

డికుందరి టెకుందరి - ఉమయాత్రయముఖ।
టెకకు టెకకుటెక అంబకళంబ ॥
టెకటెకుందరి టెకటెకుందరి టెకుందరి।
కిణ్ణం కిటతక రేతకరికుకు రికుకుతక ॥
హేళమికత్త వినాయకతాళం।
తోళ్ళరినాళం తొళుతొళుమనవి ॥
తొళ్ళుంమనవి తక్కిటకిటతక ధిక్కిట కిటతక।
తొంగిట కిటతక నంగిట కిటతక తాక్కు-ధీక్కు, త ॥
క్కిట, తొంగిట కిటతక, ధే....ణ్ణ।
తంఫీ కిటతక ధిక్కిత్తాం,-, ॥

## కౌతవము - ఆదితాళము

త త్తదిద్దితొంతొంనన్న అసురుటమాళవి ।
అమర వినాయకగీతం ॥
పౌసగిత వసగిత మమగిత సమగిత।
వృషభరంజితా త్రిభిన్నతాళ ॥
అడవరంజితానొక్కటి, తంఘి ।
కిటతక కిటతక ధిక్కి త్తా-, ॥

## చిదంబర కౌతవము - ఆదితాళము

ధీంధీం తకధిమి ధిమిత ధిమిత తక ।
దృగుడు దృగుడు దృగుడు దృగుడు ధరికిట కిటతక ॥
తధీం, ధీంధీంత శంభోమునిజన ।
సకల సురాసుర సన్నుతపాద ॥
కింకిణి ఝుంఝుం ఝుణఝుణఝుణఝుణ ।
నూపుర లయగతి ఘణఘణఘణఘణ ॥
తాకు్క ఛీకు్కతక విధిహరిశేవిత ।
తాంతాం తకధికి తాండవినోదా ॥
వ్యాఘ్రమశంకర ధిక్కిట కిటతక తరికిట కిటతక ।
త్రిశూలహస్తా నంగిట కిటతక నన్నంకిటతక ॥
నందివాహనానాథయోగా ।
జగం జగగ జగజగం జగంతరి ॥
తద్దిక్కు-జయజయ శశిర, విభూషణ ।
రూపభయంకర డమరుకహస్తా ॥
తృతీయ సహస్ర దీక్షితపాద ।
చిదంబర నాయక నటరాజేశ్వర ॥
తాకు్క-ధీకు్క తక్కిట తుంగిట కిటతక । దే....ణ
తక్కిట తకధిక్కి త్తా ॥

ఓం

పరదేవతాయై నమః



# శివ - మోహిని యక్షగానము
## (అయ్యప్ప జననము)



రచన : హేమాద్రి చిదంబర దీక్షితులు

1. వ ర ం గ ము :-

## శివమోహిని - యక్షగానము

పీ ఠి క :- చాక్షుషమన్వంతరములో. ముక్కోటి దేవతలతో పరివేష్టితుడై యున్న దేవేంద్రుని చూచుటకై. దూర్వాస మహాముని స్వర్గమునకు విచ్చేసెను. ఐరావతముపై అశీనులైన మహేంద్రుడు ఏనుగు దిగి అమిత భయభక్తులతో ఎదురేగి నమస్కరించెను.

ఇంద్రుని వినయమునకు మహర్షి సంతసించి మహిమోపేతమైన పారిజాత పుష్పమాలను బహూకిరించెను. ఇంద్రుడు అపరిమిత ఆనందముతో సంతృప్తిజెంది దూర్వాసమహర్షి యిచ్చిన మాలను ఏనుగు కుంభస్థలముపై నుంచెను.

పారిజాత పుష్ప పరిమళమునకు తుమ్మెదలు మూగి ఏనుగుమ ఇబ్బంది పెట్టసాగినవి. ఏనుగు తొండముతో పూలదండనులాగి క్రిందపడవైచి కాలితో త్రొక్కి నలిపివేసినది. ఈ దృశ్యమును గాంచిన దూర్వాస మహాముని కోపముతో మండిపడి దేవేంద్రుని క్రూరముగా శపించెను.

వారి సంపదంతయు సముద్రముపాలైనది. శ్రీమన్నారాయణుని మాటతో సముద్రము మధించిరి. ఆ సమయమున మహావిష్ణువు మోహినిగా అవతరించెను.

ఒక్కనాటి సమయమున పరమేశ్వరుడు మోహినిని గాంచనెంచి మహావిష్ణువును కోరెను. శివుని మాటమేరకు విష్ణువు మోహినిగా మారగా, ఆ అద్భుత సౌందర్యవతిని గాంచగానే పరమశివుడు పరవశించి ఆలింగనమొనర్చెను. అ శివమోహినుల సంయోగ ఫలమే మన అయ్యప్ప జననం.

## మోహిని ప్రవేశ దరువు, ఆరభిరాగం ఆదితాళం

ప :- వెడలే మోహినీ సభకూ, వేడూకలంజల్ల ॥వె॥

అను:- వెడలె మోహిని సొగను గొల్పుచును, చెలులగూడి
కడురయమున సభకును ॥వె॥

1. మెండూగ రత్నాహారముల్, మెడనిండ దూగాడ
దండిగా పుష్పామాలలు, కురులందు వెల్గుచును
నిండుగాను నిటలాక్షుని కనుగొన
వేడ్కతోడ శ్రీహరి మోహినియై ॥వె॥

(తెరపడును)

## శివుడు ప్రవేశ దరువు, అసావేరిరాగం ఆదితాళం

ప:- వెడలే పరమపావనుడు మన శివుడు
—శూలాయుధకరుడై ॥వె॥

అ :- వెడలె ఈశుడు వేడుకతోడుత
వెండికొండ దిగి రయమున సభకును ॥వె॥

1. ఫాలనేత్రుడు, పన్నాగధరుడు,
నీలకంఠుడు, నిర్వికారుడు,
శూలాయుధుని సురులు గొల్వగను
నీలవేణి జగన్మోహిని చెంతకు ॥వె॥

## మోహిని దరువు, శ్యామరాగం ఆదితాళం

ప :- అందచందము చూచి, డెందముప్పొంగదె

అ :- ఇందు సూర్యులైన, బ్రహ్మాది ఋషులైన ॥అ॥

1. తనుసైగ చేసిన కై మోడ్పు లివ్వరే
చనువిచ్చి పలికితే చెంతచేరగరారే

చెన్నుమీరగ నాడు చస్గవణు గాంచిన
వినమ్రములై రారే విరహార్తులై పోరే ॥అ॥

2. పైటజార్చుచు నడచి మైమరపు గల్పింతు
మాటిమాటికి నాపై మోహమందగజేతు
సూటిమాటలతోడ చుక్కలకెక్కింతు
బోటులంటే నేటిమేటి కళలధాటి ॥అం॥

## శివుని ప్రవేశము :- మాట

ఆహా ! ఏమా సౌందర్యము. సురాసుర యక్షగరుడ గంధర్వ కిన్నెర కింపురుష కాంతల మేల్సొగసులగేల్సేయు మదన మనోహర మత్తకాసినియా ? మోహినియా ?

## శివ :- ఉత్సాహ సరళి

అడుగులు తడబడ బెదరు చూడ్కులతో పదపడి పరుగిడు హంసవో రాయంచవో.

1. ఒప్పుచున్న కీల్కొప్పువాల్జడల గప్పుగొన్న కొంగ్రొత్త మల్లియల మెప్పువడయ ఓ మోహినీ ! ఓ కామినీ !

2. వలపులొలుకు నీ చిలిపి తలపులను, తెలిపి నిలుపు నయనాల
సుందరీ మోహినీ ॥
డెందమలర నీ కుందరదనముల ఆదరు అధరముల
కెంపు కింపొదవు యక్షిణీ, కమలేక్షిణీ ॥

4, అబ్బయబ్బరే గబ్బిగుబ్బలును నిబ్బరంపు రతనాల
సంబరపు రుచులతేల్చు ఓ మోహినీ హృద్గామినీ ॥

## శివ - మధ్యమావతి, ఆదితాళము

ప:- లలనా ఓ వనధామిని
అతిలోక జగన్మోహినీ ॥

1. ముదమార రతుల నర్తమిదీర దేలింపు 2
అధరాధరమిచ్చి జతచేరు తమిదీర 2
మధురస్మృతుల జూపి సురతకేళిలో దేల్చు 2
వదనపద్మము నాన్పవే....
వదనపద్మమునాన్పు, విశాల కపోల విలాసినీ ॥ల॥

2. ఆరావళీ పర్వతా శిఖరాగ్రాన
మారాము లికమాని మరునిబాధను మాన్పు 2
కోరితినే నిన్నె కీరవాణీ రావె 2
చేరితినీ చెంతకూ....
చేరితినీ చెంత, విశాల విలోల సులోచనీ ॥ల॥

మిశ్రం:- కమనీయరూప కనకాదిచేల
కల్యాణబాల వనభామినీ
తరుణీసుగంధ అమితానుబంధ
రమణీమరంద రసభాసినీ ॥
లలిత లలిత లావణ్యలాస్య
అనురాగవాహినీ మోహినీ
రాగరమ్య అనురాగరాగిణీ రాగమంజరీ రంజనీ
నవనవోన్మేష నవరస సుందర
నాట్యకళాధరి ప్రణయినీ
మధుర మధుర మధురానువర్తినీ
నిరుపమాన సౌదామినీ 2
కలనినాద కాదంబినీ
మంజుల మనోజ్ఞభాషిణీ 2

చెలియై, సఖియై, జతయై, హితయై,
జలజల ఘలఘల, ఘలఘల జలజల
గజ్జలరవళితో రావే,
మిలమిల తెలుపుల, తళతళ వలపుల, వలపు
తలపులతో రావే, రావే, రావే, రావే ॥ల॥

## కాంభోజి, మిశ్రచాపు - మోహిని-శివ పాట

మో :- ఎవరండీ ఎవరండీ ఎవరూ మిరెవరండీ
ఎవరికొరకు మీరు అరుదెంచితిరి ఇటకు ॥

అను :- శిరమున గంగ యాగళమున యురగము
హారుని బోలియున్న యెవరన్న మీరన్నా ॥ఎ॥

శి:- పతమశివుడను నేను పంతమేలనె ఇంక
పరువమునిండిన పణతీ నీవేగాద,
మరులుగొని వచ్చితిని పరుగుడీయుట మేల 2
భరియింపలేనే నే వలపోర్వజాలనే ॥

మో:- మాటలతో నన్ను మభ్యాపెట్టాకయ్యా
బోటూలంటే నీకు మాటలనుకొంటివా
నీటుగాడ నీదు కులగోత్రము దెలిపి 2

శి:- మాపెరిగి తెలుసుకో బాపెరిగి మసలుకో ॥ఎ॥
వలపోర్వజాలనె చిలుకలకొలికీరో
కలికీరో నికనైన కౌగలియ్యగరావే
కలకాలము నన్ను కాంతుకేళిలో దేల్చు
లలనా ! జాగేల ! నే శివుడనె వగలాడి ॥

మో;- ఎగ్గు సిగ్గులేక మగువల దరిజేర
సిగ్గైన లేదేమి సొగసరి వగకాడ

మొగము మోగమునాన్చి ముద్దాడబోవుట
మగువల మనసెరిగి మసలుకొ మొనగాడ ॥ఎ॥

శి:- వలచి నె వచ్చితినే వయ్యారిమోహిని
వలపుల తేలించు వగలాడి భామినీ
అలసింపగ నీదు అధరామృతము నిచ్చి
సొలియజేయగరాదె సొగసరి మోహిని ॥

మో:- మోముమోమునజేర్చి ముద్దాడపలెనన్న
కోమలి మెచ్చెటి నృత్త-నృత్య-నాట్య
మోమాటమేలేక నవరస భ్రూకటుల
మేమరక తెల్పుము వేడ్కతొ వగకాడ ॥ఎ॥

## శివ మాట :-

అహో ! మోహినీ ! సంగీత-నృత్త-నృత్య-నాట్యములు కరణ-అంగాహార-పిండీబంధంబులు-దృష్టి-గ్రీవ - శిలో - కటి-హస్త భేదాదులు, వేయేల ! చతుషష్టి కళాకోవిదుడనే మోహినీ ॥

## శివ-మోహిని కంబైండ్, ఆదితాళం

(చెట్టులెక్కగలవా వరసు)

మో:- నటన మాడగలవా, శంకర నాట్యమాడగలవా ॥
నటన నాట్యములునట్టువాంగములు తెలిపి చూపగలనే ॥
శి:- నటనమాడగలనే మోహిని, నాట్యమాడగలనే
నటన నాట్యములు నట్టువాంగములు తెలిపిచూపగలనే ॥

మో:- భూది వీడగలవా, పుర్రెల హారమీడగలవా
అందమైన నీ స్మశానవాటిక ముందువీడ్వగలవా ॥

భూది పీడగలనే పుర్రెల హారమీడగలనే
ముదమునొందు నా స్మశానవాటిక ముందువీడగలనే ॥

నందిపీడగలవా. ఓ శంకర భృంగివీడగలవా
నందిభృంగి యా ప్రమథగణంబుల ద్రెంచివేయగలవా ॥

నంది వీడగలనే ఓ మోహిని, భృంగి వీడగలనే
నందిభృంగి యా ప్రమథగణంబులు ద్రెంచివేయగలనే ॥

జడలు వీడగలవా, దర్వీకరము వీడగలవా
జడలువీడి మణిమణులుదాల్చి మంచికురులు బెంచగలవా ॥

జడలు వీడగలనే, దర్వీకరము వీడగలనే
జడలువీడి మణిమణులుదాల్చి మంచికురులు పెంచగలనే ॥

గంగ వీడగలవా, శంకర గౌరి వీడగలవా
గంగాగౌరుల జతనువీడి నా చెంతచేరగలవా ॥

గంగ వీడగలనే, ఓ మోహిని, గౌరి వీడగలనే
గంగాగౌరుల జతనువీడి నీచెంత చేరగలనే ॥

నృత్తమాడగలవా, శంకర నృత్యమాడగలవా
నృత్తనృత్యలాస్యాధి భేదములు తెలియజెప్పగలవా ॥

నృత్తమాడగలనే, ఓ మోహిని నృత్యమాడగలనే
నృత్తనృత్యలాస్యాధి భేదములు తెలియజెప్పగలనే ॥

**శబ్దము, ఆది, మోహిని, మోహన, ఆది**

తత్తోంతక తోంతకుందరి కిటతక
తో, ధి, తతైహి త్తతో 2

తత్తోం తకతొంతకుందరి కిటతక 2
తరికిటతకతా, తరికిట తకత్తై, కిటధరి కిటతక

తదిగిణత, తదిగిణత, తదిగిణత
రారా .... .... తదిగిణత ½ ఆవృతము
రారా .... .... తదిగిణత ½ ఆవృతము
రారా, నినువలచి వేచియున్నారా 4 S. T.
నరసాలరాయ నికరారా 2 S. T.
మరుబారికే తాళలేరా 2 S. T.
విరహార్తి దీర్ప వేగరారా 2 S. T.
సరసాలలోన తేలింపరార మురిపింపరార
దరిజేర రార చలమేర రార మరియాదసేర
తమిదీర్ప రార సిగ్గేల రార అధరంబుగ్రోలి
నన్బ్రోవ వేగరారా ........

తాధణాంధణ, ధిమింధిమి, కిణాంకిణ
తతతది తతతది 2

తాకిటతక, ధీకిటతక, దాధాకిటతక
ధీధీ కిటతక
తాకుడు తత్తకిటతకధీం తదిగిణత 3

శి_మో:_ తద్ధి ధణ్ణ త్త ఝణు 2

శిశిమో:_ తధణా, తఝణు, తధిమీ, తకిట
తకా, ధికీ, ఝణు తదిగిణతొం 2

శి_మో:_ ధణాం ధణత తణత తధిగిణతొం 2
శి_మో:_ తాంతకిటతాం, తనేంగిణత 2
శి_మో:_ తాంత తకఝణు తకధిమి తకఝణు 2
శి_మో:_ తాంత తకుఝణుతాం తదిగిణత 2

శి-మో:- తరితధణత, ఝెణుతధిమిత, తఝెంధణాం | 2
దృగుడు తత్తరిటతక తదిగిణతొం |

శి-మో:- తద్ధిత్తా, తదిగిణతధిత్తా | 2
తదిగిణత, తదిగిణత, తదిగిణత |

## సంధ్యా వచనము :

ఈ ప్రకారంబుగా శివ-మోహినులు అమందానంద కలిత హృదయారవిందులై, కేళీవినోదంబులం దేలుచున్న సమయంబున, నొక్క శుభ ముహూర్తంబున హరిహరపుత్రుం డుదయించెను. వానికి ధర్మశాస్త్రయని నామకరణంబిడి, ఒకనాటి సమయంబున పరమేశ్వరుడు పుత్రునిగాంచి జన్మరహస్యం బెరిగించు విధం బెట్టిదనినా ....

## శివ కీర్తన, ఆదితాళం, మోహనరాగం

శాస్తా—ఓ ధర్మశాస్తా 2
ఆదిదంపతుల అనుంగుబిడ్డవు ॥శా॥

1. భూతలమందున మనుజులు
వెతలు నొందుచునుండిరి.
చింతబాపుటగు తరలుము. స
ద్గతులు జూపి నిక మరలుము
చెంతచేరి యా ధరణి ప్రజలను
చింతదీర్చి సద్గతులు జూపుము
వింతయైన నీ జన్మరహస్యము
చింత తెల్పెదను శాంతముతో విను ॥శా॥

1. క్రూర రక్కసిని మహిషిని
బరిమార్చుటకై నిక తరలుము.
ఘోరతపంబున బ్రహ్మచే

కరుణతో బొందెను వరములు
ఘోరమైన యా మహిషి రక్కసిని
తరిమి చంపుటకు ధరణిలో వెలువుము
పరమభక్తుడగు పందళరాజుకు
తిరిగి జన్మింపు శిశువై సుతువై ॥శా॥

## సంధ్య వచనము

ఈ విధంబుగా హరిహరపుత్రుండు, పరమేశ్వరుని ఆజ్ఞానువర్తుడై భూతలంబున పందళరాజుకు పుత్రుడై ద్వాదశవర్ష ప్రాయుండై యుండగా—

## మహిషి - దరువు, త్రిశనడక, కామవర్ధని

ప:- వెడలె మహిషి వేడ్కతోడను, శబరీగిరికి ॥వె॥

అ :- వెడలె మహిషి వేడ్కతోడ, రక్కసులను వెంటనంటి
అండపిండ బ్రహ్మాండము దద్దరిల్ల బొబ్బలిడుచు ॥వె॥

1. లంబకర్ణ దీర్ఘఉదరులు, దైత్యాధములతో
బొబ్బలిడుచు, గంతులేయుచు, మదమెక్కియుండి
తబ్బిబ్బుగ మాటలాడి తగవులాడి దైత్యనారి
శబరిగిరిపై తిరుగుచుండె, క్రూరమహిషి, దైత్యనారి ॥వె॥

## సంధ్య వచనము

ఈ విధంబుగా లోకభీకర వికటాట్టహాసంబులు చేయుచున్న మహిషిని సంహరించుటకు దేవతల ప్రేరణతో స్వర్గలోకంబునకుం బోయి, వారి వారి ఆశీస్సులంబొంది, దుష్టరక్కసియైన మహిషిని సంహరింప, శబరిగిరికిం బోయి మహిషిని గాంచి—

## ధర్మశాస్త - కందార్థము

ఊరకె ఏలనె ఊసులు
వెర్రెత్తిన మహిషినీవు వేగమె వినుమీ
కుర్రాడవనియు కూయకు
పోరున నినుజంపి నేడు, పుడమినిగాతున్
మరణమె నీకు ధర వ్రాసియుండెన్
కారుకూతలు క్రూరచేతలు
నీరుజేతును నీక్షణంబున
పేరులేకనుజేతు నిన్నిక
మారుబల్కక పోరుమింకను ॥మరణ॥

## భుజంగ ప్రయాతము, మహిషి

కుర్రకుంకవైన నీకు కూతగొప్పదుందిలే
గాచుకొనుము నుగ్గడించి గర్వమణచివేసెదన్
మహిషి యనగ తెలియరాద మాటలేల బాలకా
పోరునల్ప వేగరార పుడమిదొల్లి చేసెదన్ ॥

## హరిహర పుత్రుడు, భుజంగ ప్రయాతము

జాలమేలరావె వేగజత్తువింక నిప్పుదే
నాడు శస్త్రఘాతతోడ నుగ్గడింతు వేగమే
నరులు, సురులు మెచ్చవేగ నుర్విభారమింకను
లేకజేతు నిన్నుజంపి లోకమెల్ల గాచెదన్ ॥

## ధర్మశాస్త - మహిషి - సంవాద దరువు, ఆది

ధర్మ:- గాచుకొమ్మికనూ, పురహర నురగాస్త్రము
అ :- గాచుకొమ్మ నీ వెచ్చుటదాగిన గృచ్ఛిచీల్చి
నీమచ్చర మణచును ॥గా॥

మహి:- పోర ఓరి డింభకా, పురహర సుపుత్రుడ
పురహారాస్త్రము పుడమిదొల్లి నది
పోరుమాని నీ పురమున కేగుము ॥పో॥

శాస్తా:- పచ్చి-చూడుమా, హరిహర పుత్రాస్త్రము
వచ్చిచూడు వీ వెచ్చటికేగిన, చీల్చి ఛెండు
నీ మస్తకంబు నిక ॥వ॥

## సంధ్యవచనము

ఈ విధంబుగ క్రూరరక్కసిని మహిషిని సంహరించి శబరిమల యందు పరశురామునిచే ప్రతిష్టింపబడి భక్తుల కోర్కెలుదీర్చు విధం బెట్టి దనినా——

## మాండ్, ఆది గ్రూప్ డాన్సు

ఆయ్యప్పస్వామికి హరిహర పుత్రునకు
కర్పూరహారతు లివ్వరండీ, మీరు కర్పూరహార-
తులివ్వరండీ, ఇక కర్పూరహారతు లివ్వరండీ ॥అ॥

1. హరిహర పుత్రుడే తానంటా
ధరణిలో వెలసిన స్వామియంటా
పంబానదీతీర వాసెంటా
పందాళరాజుకే దొరికెనంటా
కోరిన కోర్కెలు దేర్చునంటా
కారుణ్య సాగరుడు స్వామియంటా ॥అ॥

2. శబరీమలవాసి స్వామియంటా
కులమత భేదంబు లేదంటా
శరణాగతత్రాణ బిరుదంటా
శంకరపుత్రుడే తానంటా

కైలాసనివాసి తానంటా
పండాళరాజుకే పుత్రుడంటా ॥అ॥

3. భక్తుల బ్రోచేటి స్వామియంటా
పన్నగశయనుని బాలుడంటా
పరమ పవిత్రుండు స్వామియంటా
పిత్రూవాక్య పరిపాలుడంటా
తల్లి బాధదీర్ప తానంటా
తరలేను పులి పాలకోసమంటా ॥అ॥

4. క్రూరారాక్షసిని మహిషినంటా
క్రూరాతి క్రూరముగ జంపెనంటా
మార్గాయానముబోవ తానంటా
మహేంద్రపురమునకు బోయెనంటా
పూజింపవచ్చిన ఇంద్రుడంటా
పురుషోత్తమునిగానెంచె నంటా ॥అ॥

5. ఇంద్రుండు వ్యాఘ్రమై వచ్చెనంటా
వ్యాఘ్రవాహనుడు మణికంఠుడంటా
సర్వదేవతలు అనుచరులంటా
కదవీరిస్వామితో వారంటా
చేరిరి పందళరాజ్యమంటా
నిలచిరి శబరిగిరి ఇంటా ॥అ॥

6. చక్షులెన్నియున్న చాలవంటా
దీక్షతో స్వామిని చూడాలంటా
మోక్షమిచ్చెస్వామి తానెయంటా
సాక్షీభూతుడిక తానంటా
కషికార్పణ్యాలు లేవంటా
దీక్షితు బ్రోవంగ వచ్చెనంటా ॥అ॥

స మా ప్త ము

శివ - మోహిని యక్షగానము

ఓం



# భక్తమార్కండేయ - యక్షగానము




రచన :

నాట్యరత్న, నాట్యశాస్త్రధురీణ, నాట్యకళా పితామహ,
నాట్యకళా విశారద, పండిత, నాట్యాచార్య,

హేమాద్రి చిదంబర దీక్షితులు,

కూచిపూడి.

## భక్త మార్కండేయ - యక్షగానం
## ఆసావేరిరాగం, ఆదితాళం

ప;-వెడలే మృకండు మహాముని సభకు
విశ్వేశుని గొల్చుచు ॥వె॥

అను:- దండిపండితుడ ఖండతేజితుడు
మెండుగాను శివస్మరణ సల్పుచును ॥వె॥

1. ఆదిదేవుని ఆత్మలో తలచుచు
వేదమంత్రములు పఠించి గొల్చుచు
ముదముతోడ ముక్కంటిని మనమున
ముద్దులొల్క మదనారిన్పూజింపుచు ॥వె॥

2. కపర్ది ఖండపరశుశూలిః
కపాలధరు వామదేవులంగని
అపుత్రుడన్నుతు నొసంగి బ్రోవవ
అప్రమేయ కైలాసవిభోయని ॥వె॥

## మృకండ మహాముని, శంకరుని ప్రార్థన

డమడమ డమరుక నాదశుభంకర
హిమశైలాగ్రనివాస విభో
జయజయహే కైలాసపతే హర
పాలయమాం పరిపాలయమాం ॥

2. హాలాహలధర శూలాయుధకర
జ్వాలాకరయుత గౌరివిభో
జయేజయహే కైలాసపతే హర
పాలయమాం పరిపాలయమాం ॥

3. నటన మనోహర నాట్యనటేశ్వర
నటితనమోద్భవనచలపతే
జయజయహే కైలాసపతే హర
పాలయమాం పరిపాలయమాం ॥

4. ఈశమహేశ సురేశ గిరీశః
ఈశ్వరి గౌరీః ప్రాణపతే
జయజయహే కైలాసపతే హర
పాలయమాం పరిపాలయమాం ॥

5. శ్వేతచలేశ విహారధురీణ
అతీత అచంచల ఆత్మవిభో
జయజయహే కైలాసపతే హర
పాలయమాం పరిపాలయమాం ॥

ఓం నమశ్శివాయ 3 సార్లు

తె ర వా లు ను.

తెర లేచుసరికి

ద్వి తీ యా ం శ ము :

## శంకరాభరణము, మిశ్రచాపు, శంకరుని దరువు

దరువు:- వెడలె విశ్వనాధుడు ప్రమధగణముతో ॥వె॥

అను :- కడుముదంబున సురులు తపసులు
కైమోడ్పు లందచేయగ ॥వె॥

1. బాలచంద్రుని శిరమున ఫాలనేత్రుడు
కాలకూటము గళమున, కాలాగ్నిరుద్రుడు
కోళములు మెడనిండవెల్గ కపాలములు
హారముల నొప్పగ ॥వె॥

2. ధరను కుచేలపు మున వెలుగొందు
శ్రీరామలింగని మనమున, సతతము గొల్చె
ఆర్తుడగు మృకండు కడకును
పరమశివుడు, పార్వతీశుడు ॥వె॥

(తెరవాలును)

తృ తీ యాం శ ము :

మృకండుడు శివలింగమువద్ద కూర్చుని ఓం నమశ్శివాయ జపం చేయుచుండును.

(తె ర లే చు ను)

శం :- భక్తా ! మృకండా ! ఏమి నీ మనోవాంఛితము.
మృ:- శంకరా ! ఆదిమధ్యాంత రహితా !
నీ దర్శన భాగ్యముచేతనే సకల కోరికలు తీరినవి అయినను,

కందార్థము - మృకండుడు :

మృ:- చింతలు బాపుము శంకర
పంతము నీకేలనయ్య పార్వతినాథా !
సంతోసగి వేగ[బ్రో]వుము
సంతసమున నొసగు సుతుని సర్వేశుడ నేడున్
చింతనుబాపి గావుము నన్నున్
పంతమేలర పార్వతీశుడ సుతుని నొసగియు వేగ[బ్రో]వుము
సుంతయైనను జాలిచూపవ సుందరేశ ఇందు శేఖర ॥

## మృ క ం డు మా ట

మృ:- శంకరా ! "అపుత్రస్య గతిర్నాస్తి" పుత్రులులేకున్న పున్నామనరక మని గదా, నార్యోక్తి.

## శంకర - కందార్థము

మెచ్చితినయ మృకండుడ
ఇచ్చితినిక ఇష్టార్థమేమి ఇంపుగ తెల్పుమ్
సచ్ఛీలుడైన సుతుడా ?
మచ్చరితుడు. దుండగీడు, ధూర్తుడు సుతుడా ?
ఇచ్ఛతొ తెల్పుము స్వేచ్ఛగానిత్తున్
సచ్చరంజేలేని సుతునకు పదియారు వత్సరములే
తుచ్ఛగుణునకు దీర్ఘాయువు
నిచ్చెదను నేదొకటియైనను, ఇచ్ఛతో॥

మృకండుని మాట :-

శంకరా ! తుచ్ఛుడు, గుణహీనుడు. ధూర్తుడుయైన పుత్రుడు నాకేల నయ్యా ! సద్గుణవంతుడు, సకల విద్యాపారంగతుడువైన పుత్రునే ఇమ్మ శంకరా !

శంకరుని మాట :

తథాస్తు ! అట్లే యగుగాక.

తెరవాలును. —— తెరలేచును.

### సంధ్యవచనము :

ఈ ప్రకారంబుగా, శంకరునివద్ద మృకండ మహాముని వరములం బొంది, అమితోత్సాహవంతుడై యుండగా, కొంతకాలమునకు సకల లక్షణ లక్షితుండైన పుత్రుఁబడసి, అమందానంద కందళిత హృదయారవిందుండై పుత్రునకు జాతకర్మ, నామకరణ, అన్నప్రాసన, చౌలోపనయనంబులు, విధివిధంబుగా గావింప, అంత మార్కండేయుడు పదిహేను సంవత్సరముల వాడై నిత్యసత్యవ్రత దీక్షాపరుండై, ఆదిదేవుని మనోవాక్కాయ కర్మల చేత పూజించువిధం బెట్టిదనినా ॥

# మార్కండేయ కీర్తన, ఆది మోహన

ప :- అంజలులివె గొను ఈశ మహేశ
భక్త్యాంజలు లివె పరమేశా ॥

అ :- సకలచరాచర సన్నుతవందిత
సద్గుణ స్వరూపధీశా, మహేశా ॥అం॥

1. భక్తవ శంకర పన్నగభూషణ
గజచర్మాంబర గౌరీశా
ఆశ్రిత రక్షక ఆనందరూప
అగణిత గుణగణధీశా, పరేశా ॥అ॥

2. గంగాజలమును ఘనముగ జటలతో
బంధించిన ఓ పరమేశా
దీనజనోద్ధర దీక్షితపాలిత
భూది విభూషణ భూషాభూతేశా ॥అం॥

మిశ్రం:- డండం డమరుకనాద శుభంకర
గజచర్మాంబర గౌరీశా
ధింధిం ధిమికిట ధీంధీం ధిమికిట
తకతకఝొంతరి తద్దింతా
నర్తన సుందర నాగవిభూషణ
నటరాజేశ్వర నచలపతే ॥

జతి /- ధీంతధీంత, తధీంత, ధీంతతక
ధీంతధీంత, తధీంత, ధీంతతక
ధీంతధీంతధీం, ధీంధీం తరికిటతొం 3 సార్లు
తదిగిణత, తదిగిణత, తదిగిణత
అద్భుత విగ్రహా అమరాధీశ్వర

ఆశ్రితపోషక అమృతశివా
ఈశ, మహేశ, పరేశ, సురేశ, గిరీశ
సు సద్గుణ భూతేశా ॥
కావగరావా పరమేశా | 2 సార్లు
ఆశ్రితరక్షక మహేశా |
మాహేశా, మాహేశా, మాహేశా ॥

సంధ్య వచనము :

ఈ ప్రకారంబుగా మార్కండేయుండు అనవరతము. ఈశ్వరపూజా దురంధరుండై యుండ, నారదుండు ఏతెంచువిధం బెట్టిదనినా ॥

## ఆరభిరాగం, ఆదితాళం - నారదుండు

నారద దరువు :

నారదఋషీ వెడలే, దివినుండి భువికిని ॥నా॥
అ :- ధీరతముగ దండకమండలములు
బాగుమీర హరినామ స్మరణతో ॥నా॥

1. అందమలర భుజమందు వీణ
ఇంపొందు గుల్కుచుండా మనమున
భ్రాంతినొంది భూలోకమునకు జని
వింతనొందుచుండా.... ఏదో
సంగతివిని మృకండుఋషిని గన
ఆత్మనందు తలచీ.... తన
అంతరమున మార్కండేయుని గని
ఆనందింపుచు హరిని స్మరింపుచు ॥నా॥

2. బాలుడైన మార్కండేయుని గని
ఆత్మ సంతసింపా....తన
ఆలోకమున శుభలక్షణములు
భావముప్పతిల్లా....ఎంతో
మేలనివటుగని ఆయువు స్వతివిని
ఈశ్వరేచ్ఛ నెంచి ॥అల॥
కాలుడు ఘనుడో కాలమె ఘనమో
గరళకంఠుడే గావగ నెంచుచు ॥నా॥

మృ క ం డు మా ట ;

నారదమహర్షికీ నా నమోవాకములు

నా ర ద మా ట :

ఆభీష్ట సిద్ధిరస్తు మృకండ మహాముని ? అట్లు విచారగ్రస్థులై యుంటిరి ?

మృ క ం డు మా ట :

నారదా ! నీకు తెలియనిదేమున్నది. ఈశ్వర వరప్రసాదియైన మత్పుత్రునకు నేటితో పదియారు వత్సరములు నిండినవిగదా ?

నా ర ద మా ట !

అటులనా ! నారాయణ, నారాయణ, సకల లక్షణ లక్షితుడు, సకల విద్యాపారంగతుడు, అనవరత శివపూజా దురంధరుడు, ఈతడు అల్పాయుష్కుడా ? మృకండా ! ఇందులో ఏదో దేవరహస్యమున్నది. నేడు నా తండ్రి చతుర్ముఖుడు, ముక్కోటి దేవతలు, కశ్యపాది మహర్షులు కలసి పరివేష్టించియుందురు. ఈ చిన్నవానిని సత్యలోకమునకుం గొనిపోయి బ్రహ్మ ఆశీస్సులందింపచేసెద.

(మార్కండేయుని వెంటనిడుకొని నారదుడు నిష్క్రమించును)

తెరవాలును. — తేరలేచును.

## బ్రహ్మ దరువు, అరభి అదితాళం

వెడలె హిరణ్యగర్భుడు, చతుర్వేదములుగా గొని ॥వె॥

అ :- వెడలె విధాత, వేదమంత్రములు వివిధరీతులతో
విందొనర్చుచును ॥వె॥

వేదాతీతుడు ఘనుడూ, వేదశాస్త్ర రహితుడు
విధాత పితామహుడూ, సుర....శ్రేష్టుడు,
వేదమయుడు చతురాననుడప్పుడు ॥వె॥

## మార్కండేయుడు - కందార్థము

కందా;- మ్రొక్కితినిక కమలోద్భవ
మ్రొక్కెను మృకండుసుతుడు, ముదముతొ నేడున్
మ్రొక్కితినే మార్కండేయుని
గ్రక్కున దీవించి వేగగావు మునివుడున్.

బ్రహ్మమాట ;- దీర్ఘాయుష్మాన్ భవ

నారదుని మాట :- తండ్రీ ఏమి ఈ వైపరీత్యము. ఈశ్వర వరప్రసాద
జనితుడైన, ఈ మార్కండేయునికి పదియారు వత్సరములేగదా
ఆయుర్దాయము.

బ్రహ్మ మాట :-

ఆ ! అటులనా ! అట్లయిన నావాక్కు లసత్యములగునా ? అసంభవము. నేను మనోవాక్కాయ కర్మలచేత అసత్యము పలుకనివాడనై, అనవరతము ఈశ్వరభక్తుండవైతినేని, ఈ కుఱ్రవాడు సప్తకల్పాంతరముల జీవించియుండగలడు.

తెలవాలును. —— తెలలేచును.

## సంధ్య వచనము :

ఈ విధంబుగా మార్కండేయుండు చతుర్ముఖునిచేత దీవనలంబొంది అమితోత్సాహంబుతో నున్నసమయంబున సూర్యపుత్రుండైన సమవర్తి మార్కండేయుని ప్రాణములం గొనిపోవ భూలోకమునకుం వచ్చువిధం బెట్టిదనినా....

### యమధర్మరాజు, అరభి, ఆది, దరువు

వెడలె సూర్యపుత్రుడు, భానుతేజయుతుడై

అ :- దడదడ దడయని ధరణి వడంకగ ధర్మమూర్తి
మహిష వాహనుండై ॥వె॥

1. మేలూగ రత్నహారముల్ మెడనిండ తూగాడ
కాలాపాశము గైకొని కడుమోదంబున
బాలుడైన మృకండు సూనుగన రయమున
భూలోకమునకు వడివడి ॥వె॥

## సంధ్య వచనము :

ఈ ప్రకారంబుగా యమధర్మరాజు మార్కండేయుని జీవంబులం గొనిపోవనెంచు సమయంబున మార్కండేయుండు శ్రీ రాజరాజేశ్వరి సోమ లింగేశ్వరులను పూజించువిధం బెట్టిదనినా...

### మార్కండేయ, సురటు, ఆది, కీర్తన

శ్రీ శివశంకర గిరిజాధీశ పాహిమాం
శిష్టజనాధార శివశక్తి రక్షమాం ॥

1. మదన గర్వభంగ మహాదేవ పాహిమాం
క్రూరచిత్త దక్షమఖవినాశ రక్షమాం
సురముని సన్నుతభవహర పాపమోచనా
మారహరణ మాహేశ్వర మాంపాహి మాంపాహి ॥

2. చంద్రమౌళి జటాజూట శంకర మాంపాహిమాం
ఇంద్రాదులు సురులు మునులు భక్తకోటు లందరున్
అర్థింతురు ఆదిపురుష అర్ధనారీశ్వరా
అర్థింపగ ఆరుదెంచితి ఆయుర్దాయము నొరగుము ॥

3. పరప కూచిపూడి పురనివాస పాహిమాం
ఆర్తుని నన్నాదరించి కనికరించవా
గౌరీపతి మాహేశ్వర కావగరావా
శరణంటిని కరుణింపుము శంకర పరమేశా ॥శ్రీ॥

(శివలింగమువద్ద కూర్చుని ఓం నమశ్శివాయ యని అనుచుండవలెను.)

## యమధర్మరాజు, వసంత, ఆది, దరువు

కదలుమా కదలుమా
కదలిరావ జాగేలర డింభక ॥క॥

1, అంబాపతి నన్నడ్డగించినను
ఆగదు పాశము బాలకా
అంబుధులింకిన నిర్జరులడ్డిన
కాలపాశమిదె గాచుకో ॥

### యమధర్మరాజు - భుజంగ ప్రయాతము

రార జాగుశేయనేల రార వోరి డింభకా
లేర ఈశుచెంతనుండి లేచిరార బాలకా
ఘోరమైన నాదు పాశబంధనంబు నందునా
మారకంబు నీకునిపుడు మరణమింక తథ్యమే ॥

### మార్కండేయ - భుజంగ ప్రయాతము

మారహరణ కాలకంఠ మందహాస నిన్నునే
చేరి ప్రస్తుతింతునయ్య చేరరావ నాదరిన్

క్రూరుడైన యముని బాధకోర్వలేను శంకరా
చేరదీసి కావుమయ్య చెల్వమీర నన్నికన్ ॥

## యమధర్మరాజు, వసంత, ఆది

కదలుమా - కదలుమా 2
కదలిరావ - జాగేలర డింభకా ॥

2. మర్త్యలోకమున మానవాళులకు
మరణము తధ్యము బాలకా
మృత్యువు నిను కబళింపబూనగా
మృత్యుంజయు డేమిశేయురా ॥క॥

మార్కండేయ - భుజంగ ప్రయాతము

దాసుడన్ శుభంబొసంగు దాతనీవె రూఢిగా
నీ సమానులింకలేరు నిర్జరేంద్ర వందితా
మోసగించబోకు నిన్నె మ్రొక్కితిన్ స్థిరంబుగా
నీసులేక నివ్వవయ్య నిత్యమైన ప్రాణముల్ ॥

## యమధర్మరాజు, వసంత, ఆదితాళం

కదలుమా - కదలుమా 2
కదలిరావ జాగేల డింభక ॥క॥

3. బ్రహ్మవిష్ణు శివకేశవు లడ్డిన
నిలువబోవు నీ ప్రాణముల్
బ్రహ్మమైన పరబ్రహ్మమైన యమపాశము
దాటగ శక్యమా ॥క॥

(యముడు పాశము వేయును.)

# మార్కండేయుడు, వసంత, ఆది, కీర్తన

త్రాహిమాం, త్రాహిమాం
పాహిపాహి మాంపాహి శంకర ॥త్రా॥

1. పాశబంధమున అలమటించితిని
ప్రాణము నిలుపుము భూతేశా
ఈశ, మహేశ, సురేశ, సుసద్గుణ
పాదము విడువను పరమేశా ॥త్రా॥

మార్కండేయుని మాట :

ఓ యమధర్మరాజా ! నీవును ఈశ్వర పూజాదురంధరుడవే? ధర్మాత్ముండవే ? ధర్మకార్యాదురంధరుడవే ? ఈశ్వర పూజయందుగల ప్రేమతో కొంచెము ఆగమని చెప్పితినిగాని, మృత్యువునకు భయపడికాదు.

యమధర్మరాజు మాట ;

ఓరీ ! దుష్టబుద్ధిగల మార్కండేయా ! ఈ గౌతమీనదిలోని, ఇసుక రేణువులు లెక్కపెట్టవచ్చునుగాని, నాచేత యమలోకమునకు తేబడిన బ్రహ్మలు- విష్ణువులు, ఇంద్రాదులు, ఈశ్వరులును లెక్కపెట్టలేరు. బ్రహ్మ, విష్ణు, శివకల్పములు కలవుగాని, యమకల్పము మాత్రములేదు. నీవు శివభక్తుండవు గనుకనే, నీతో ఇంతసేపు మాట్లాడితిని. నీ ఆయువు పూర్తియైనప్పుడు నిన్ను యెవరు రక్షించెదరో చూచెదగాక——

(పాశము విసరి లింగముతోకూడా కలిపి లాగును. రుద్రుండతి భీకరుండై భువనభోంతరములు దద్దరిల్లునట్లుగా ప్రళయతాండవము సల్పుచు ఈశ్వరుడు అవిర్భవించి)

జతి/- తాందిగిదిగి దిగిదిగి దిగిదిగితా
దిగిదిగి దిగిదిగి ధిమ్ధిదిగితై
దిగిదిగితా, దిగిదిగితై

ధింత త్త, ధి త్తక్కు ఝొణ్ణు ధీంతతధిధణతఝణు Any Times

త త్తాం గిటతక తరికిట తకతా, తద్ధిత్తాంగిట

తక తరికిటతకత్తై ॥ త త్తాంగిటతక తరికిటతక

త త్తాం గిటతక తరికిటతక తద్ధిత్తాంగిటతక

తరికిటతక త త్తాం గిటతక తరికిటతక

తద్ధిత్తాం గిటతక తరికిటతక త త్తాంగిటతక తరికిటతక

తదిగిణత, తదిగిణత, తదిగిణత.

1. ఇంత తెంపరిగ యెంతచేసితివి

అంతర మెరుగవ సమవర్తీ

పంతమునను మృధ్భక్తుని ప్రాణము

కాలపాశమున వైతువా ॥

జతి/- ధాడధాఘిణ్ణ ఘిణ్ణ 4 సార్లు

ధాద్దా । ధాద్దా । ధాదాదాదా ।

ధీంత ధీంతతొం, ధీంధీం తరికిటతొం 3 సార్లు

(నృత్యము శంకరుడు చేయుచు యముని కాలితో తన్నును.)

## నారద ప్రవేశం, వసంత, ఆదితాళం

తాళుమా, తాళుమా 2 సార్లు

తాళుతాళు తాల్తాళుము శంకర ॥తా॥

1. ధర్మమూర్తి యమధర్మరాజును

ధరణిలో బ్రోవుము భూతేశా

ధర్మాధర్మ విచక్షణయుతుడవు

కాలుని బ్రోవుము పరమేశా ॥తా॥

నారద మాట :

ఆదిదేవా ! సృష్టి స్థితి, లయాలకు మూలకారకుడవే. నీకు తెలియని

సత్యమున్నదా మహేశా ! మర్త్యలోకమునగల పాపులను శిక్షించుటకేగదా, ఈ యమధర్మరాజును నియమింపచేసిరి, సమవర్తిలేని యమలోక మేము న్నది మహేశా !

శంకరుని మాట :

నారదా ! కపటనాటక సూత్రధారివి. ఇదంతయు నీ వాడిన నాటకమే గదా !

నారద మాట :

శంకరా ! నేనా ! (నమశ్శివాయ)

శంకర మాట :

యమధర్మరాజా లెమ్మి. (లేచును.)

## యమధర్మరాజు, వసంత, ఆదితాళం

కీర్తన:- గావుమా, గావుమా

గావుమయ్య గిరిజాపతే ॥గా॥

రుద్రమూర్తి, లయకర్తవు శంకర నీకిదిన్యాయమ మాహేశా

రుద్రుడై రౌద్రపహ్ని సృష్టిస్తే నిలువము మేమిక భూతేశా॥

యముని మాట :- మహేశ్వరా ! తమ ఆజ్ఞానుబద్ధుడను.

శంకరుని మాట :- తథాస్తు (అభయహస్తం చూపుము)

(మార్కండేయుని చేరి శంకరుడు)

## కందార్ధము :

మెచ్చితినయ భక్తాగ్రణి

నిశ్చలమగు నీదు తపము నిర్మలమధికిన్

ఇచ్చితినయ దీర్ఘాయువు

సుచ్చరితుడ పుడమిలోన సంతసమొందన్ ॥

స్వేచ్ఛతొ ధిరుగుము ధరణిలో నీవున్

ఇచ్ఛతో అల సప్తఋషులు బ్రహ్మదేవుడే దీవించిరి
మచ్చరంబును లేకయుండుము, మృత్యుభయమిక
లేదు నీకిక ॥స్వేచ్ఛతో దిరుగుమ్ ॥

(యమ, నారద, మార్కండేయులు గలసి ఈశ్వరుని స్తోత్రము చేయుట.)

## దండకము :-

శ్రీమన్మహాదేవ దేవాదిదేవా త్రిలోకాధినేతా । విభూతివిలాసా । భుజంగేంద్రభూషా । సుపోషా । సురేంద్రాదిసంశేవితా। నాట్యవేదార్థసంపూర్ణ రూపా । దయాంబోధి చంద్రా । ప్రభో నీవె మృత్యుంజయా । ఆదిమధ్యాంతముల్లేని ఓంకారరూపా । హిమాశైలవాసా । విశేషా । నమో ఆదిదేవా । నమో భక్తపాలా । నమస్తే । నమస్తే । నమస్తే । నమః ॥

## మార్కండేయ స్తోత్రము

చంద్రశేఖర, చంద్రశేఖర, చంద్రశేఖర, పాహిమాం
చంద్రశేఖర, చంద్రశేఖర, చంద్రశేఖర, రక్షమాం.

# మార్కండేయ నృత్తనాటిక
సమాప్తము

రచన :- హేమాద్రి నిదంబర దీక్షితులు.

ఓం

# కూచిపూడి - కళావతంసుల జీవిత చరిత్రలు

## భాగవతుల విస్సయ్యగారు

భాగవతుల విస్సయ్యగారు 1878 సం॥రం॥ వృషభనామ సంవత్స రములో ఫాల్గుణ మాసంలో చిపూడిలో జన్మించినారు.

వీరి తండ్రిగారు బాలింతరామయ్యగారు. వీరు బాలింతవేషంవేసి ఎన్నో ప్రదర్శనలిచ్చి పండిత, పామరులచే కొనియాడబడిరి. అందువల్ల వారికి ఆపేరే స్థిరపడిపోయినది. తల్లి వెంకమ్మగారు.

విస్సయ్యగారిక్ి ఏడు సంవత్సరముల ప్రాయములోనే శిద్ధేంద్ర యోగీంద్రుల భామాకలాపాన్ని రాగ, తాళ. హావ భావాదులతో అభ్యసించి, తండ్రిగారివద్ద భాగవతుల యజ్ఞనారాయణగారివద్ద భరతశాస్త్రాన్ని కూలం కషముగా నేర్చుకొని, పదిసంవత్సరముల ప్రాయములోనే బాలింతవేషము, దాదినమ్మ వేషము, గొల్లవెషము మొదలైనవివేసి, పలుచోట్ల ప్రదర్శన లిచ్చి, సామాజికుల మన్ననలను, బహుమతులను అపారంగా పొందిన కళావేత్త విస్సయ్యగారు. దాదిన, బాలింత వేషములేగాక, ప్రహ్లాదలో లీలావతి, ఉషాపరిణయములో చిత్రలేఖ, ఉషాకన్య, ఇత్యాదిపాత్రలను కూడా ధరించి, ప్రఖ్యాతి వహించారు. సువర్ణఘంటా కంకణములతో, సన్మానములు పొందినారు. తదుపరి నాటకములలో పాత్రలువేయుట విర మించి, నంగిగడ్డ, మేడూరు, ఘంటసాల యను గ్రామములలో కళావంతు లకు గరిడీలునేర్పి (అనగా నాట్యవిద్య) అనేక మేళములును ఏర్పాటుచేసి వారందరిని ఆడించి ఖ్యాతిగాంచిరి. వీరు అభినయమందు కడు సమర్థులని ప్రతీతి. వీరు విళంబినామ సంవత్సర వైశాఖశుద్ధ చతుర్దశినాడు, 1958 సం॥లో దివంగతులై రి. దివిసీమయైన నంగిగడ్డలో జరుగు భాగవత సప్తా

హముకు తిరుపతి వెంకటకవులు, తూర్పుప్రాంతమునుండి వచ్చిన బ్రహ్మం గారు. కొల్లూరు స్వాములవారు తదితరులు ఆనాడు నిండుసభలో అనేక విధములుగ శ్లాఘించిరి.

## వెంపటి వెంకటనారాయణగారు

శ్రీ వెంపటి వెంకటనారాయణగారు ఈశ్వరనామ సంవత్సరములో జన్మించినారు. వీరి తండ్రి కోదండరామయ్యగారు. వీరు బాల్యదశనుంచి విద్యనభ్యసించి. తన తండ్రిగారైన కోదండరామయ్యగారి వద్దనే కూచిపూడి సంప్రదాయ నృత్యరీతులు కూలంకషముగా నేర్చుకొనియుండిరి. వీరి భామ కలాప ప్రదర్శనాలక్షణములు అసమానములు. భామపాత్రలో వీరికి వీరే సాటియని పండిత ప్రకాండులవద్ద మన్ననలనుపొంది "తలియుగ సత్యభామ" యని బిరుదును పొందుటయేగాక, అనేక ఆస్థానములయందు తన విద్యాపాటవముతో ఆనందసాగరమున నోలలాడించి, పండిత సత్కారములును, సింహతలాటములును బొందియుండిరి. వీరు కాలితో నొనర్చు తాళవిన్యాసాదులు "కొనగోలు", కొలిపించుటయందును, సల్లేవి పాడుటయందును. వీరికి వీరే సాటియని పండితప్రకాండులు నుడివియుండిరి. వీరుపండితోద్దండులైన కూచిపూడి నాట్య త్రిమూర్తులలో ఒకరుగా విలసిల్లిరి.

వీరి కుమారుడు కోదండరామశాస్త్రిగారు, వీరుకూడా నాట్యగురువులై వరంగల్లు, ఒంగోలు మొదలైన పట్టణములలో అనేకమంది బాల బాలికలకు నాట్యము నేర్పుచుండిరి. శ్రీ వెంకటనారాయణగారి శిష్యులు, భాగవతుల లక్ష్మీనరసింహశాస్త్రి, భాగవతుల కుటుంబశాస్త్రి, చింతారామమూర్తి, చింతా రాధాకృష్ణమూర్తి, పసుమర్తి కొండలరాయుడు, పసుమర్తి విశ్వనాథం గార్లు, వీరు కొన్ని రచనలు చేసిచట్లుగా తెలియుచున్నవి (ఇవి అముద్రితములు.) 1. చంద్రకాంత, 2. గోపీచందన, 3. జయంత-జయపాలీయం, 4. లంకాదహనము ఇత్యాది యక్షగాన రచనలు రచియించినట్లు వినికిడి.

వీరు భామపాత్ర ధరించి, సభలో ప్రదర్శించుచు. "ఎందుబోతివి" యను దరువు అడుచు, 19-5 సం॥లో భామవేషములోనే, రంగస్థలమునందే దివంగతులైరి. ఆ శ్రీకృష్ణ పరమాత్మలోనే ఐక్యమైరి.

## వేదాంతం రత్నయ్య, లక్ష్మీనరసింహగార్లు

శ్రీ వేదాంతం రత్నయ్యగారు, నరసింహింగార్లు శ్రీ సాంబయ్యగారి కుమారులు. ఈ గ్రంధ రచయితకు గురువులు, వీరితల్లి సీతమ్మగారు. చిన్నతనములోనే తండ్రిగారివద్ద విద్యనభ్యసించి కూచిపూడి నాట్యములో ఎనలేని పేరుప్రఖ్యాతులు గలిగియుండిరి. 1859, 60 ప్రాంతములలో జన్మించిరి. భామ, గొల్ల, దాధిన బాలింత వేషములువేసి పలుచోట్ల ప్రదర్శన లిచ్చి పండిత ప్రకాండులవద్ద సభాసనిపించుకొని, అఖండఖ్యాతి నార్జించుకున్నారు. వీరి శిష్యవర్గము చాలామంది కలరు. వీరు దేవిభక్తులు, ఉపాసకులు, రత్నయ్యగారి కుమారులు, ప్రఖ్యాత నాట్యవేత్తలు. 1. వేదాంతం ప్రహ్లాదశర్మ, 2. వేదాంతం సత్యనారాయణశర్మ, 3. వేదాంతం రాఘవయ్య గారులు. రత్నయ్యగారు 1936, 37 ప్రాంతములో దివంగతులైనట్లు తెలియుచున్నది.

## వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు

వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు 1880లో జన్మించిరి. వీరి తల్లి దండ్రులు రామేశ్వరయ్య. సావిత్రమ్మగార్లు. భరతాచార్యులు, ఆంధ్రనాట్య కళాపితామహులు, కూచిపూడి నాట్యకళానిధియైన శాస్త్రిగారు కూచిపూడిలో జన్మించి, నాట్యప్రపంచములో స్వైరవిహారం జరిపి, అనేక సంస్థానములో ఆదరాభిమానములను చూరగొని, సేతు హిమాచలం తమ యశశ్చంద్రికలను ప్రసరింపచేసిన దరితార్థులు.

సు ప్రసిద్ధమైన భామాకలాపము, గొల్లకలాపము మొదలైన కళారూపాలకు శాస్త్రిగారే ప్రామాణికులు. భామాకలాపములో వారు "భామనే"

అనే దరువును 5, 6 గం॥లు హస్తపాద విన్యాసములతో ఆడి, పాడి అభినయించేవారట, గొల్లకలాపం, దాదినమ్మవేషం మొదలైనవానియందుకృషి సల్పి పండిత పామర రంజకంగా ప్రదర్శించేవారు. వీరి నాట్యకౌసలం గుర్తించి వనపర్తి, జటప్రోలు, గద్వాల, చల్లపల్లి, ఉయ్యూరు మొదలైన సంస్థానములలో వీరి నాదరించి గౌరవించిరి.

మైసూరు రాజావారివద్ద ప్రశంసలు పొందాలనే కోరికతో శ్రీ శాస్త్రిగారు (సంగీత కళానిధి) శ్రీ రాచప్పగారిని ఆశ్రయించిరి. రాచప్పగారు అనాటి ప్రదర్శనలో శ్రీ శాస్త్రిగార్ని ఉద్దేశించి 1,2,3,4,5,6,7,8,9,10 అనే అంకెలిచ్చి పాట రూపములో అభినయించి పాడి చూపమనిరి. శ్రీశాస్త్రిగారు ఒకనిమిషము యోచించి, ఆ అంకెల వేదాంతార్థము, సాహిత్యార్థము జోడించి, మహామనోహరంగా అభినయించి సభాసదులందరికి దిగ్భ్రమ కలిగించి, అర్హగౌరవాదులను పొంధియున్నారు. గర్వకారణమగు కూచిపూడి నాట్యసంప్రదాయమును, ప్రచారముచేసి ఉత్తర దక్షిణములుగ విజ్ఞానతృష్ణతో పర్యటించుచు, అంధ్రుల నాట్యమని చెప్పబడే ఈ కూచిపూడి నృత్యమునకుప్రధమ శ్రేణికి చెందినవారని చెప్పకతప్పదు.

ఉమ్మడి మద్రాస్ రాష్ట్రప్రభుత్వము వీరికి 1948సం॥లో "కూచిపూడి నాట్యకళానిధి" అన్న బిరుదునిచ్చి, స్వర్ణసింహతలాట కంకణం బహూకరించారు. వీరి శిష్య, ప్రియశిష్యులు వేదాంతం రాఘవయ్య, జగన్నాధశర్మ, రామయ్యాపిళ్ళె, వెంపటి సత్యం. హేమాద్రి చిదంబర దీక్షితులు, పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ, తాండవకృష్ణ మున్నగువారెందరో కలరు. ప్రఖ్యాతి అన్నాబత్తుల చిట్టి, పుష్పావతి, బాలసరస్వతి, జగదాంబ, శ్రీ విరాజతం మొదలైనవారందరూ వీరివద్దనాట్యవిద్య నేర్చినవారే, 1957 జూన్ 29 తేదీన వీరు మద్రాసునుంచి హైదరాబాద్ వచ్చి కొద్దిధినములలోనే దివంగతులైరి.

# చింతా వెంకట్రామయ్యగారు

చింతా వెంకట్రామయ్యగారు కూచిపూడి నాటక పితామహులు, నాట్య కళాప్రపూర్ణులు. వీరు 1860 సం॥లో జననమందిరి. తల్లిదండ్రులు శివరామయ్య, అరుంధతమ్మగారలు.

సోదరులందరు ప్రఖ్యాత కళావసంతులుకావటంవల్ల వెంకట్రామయ్యగారికి బాల్యములోనే నాట్యము అబ్బినది. అన్నగారైన రత్నయ్యగారి శిక్షణలో 8వ ఏటనే రంగస్థలం ప్రవేశించగల అభినివేశాన్ని పొందగల్గిరి. బాల్యములోనే సత్యభామ, గొల్లభామ, ఎరుక మొదలైనపాత్రలు ధరించి ప్రజల మన్ననలను పొందిరి. అన్నగారి సూత్రధారత్వమునందు అనేక ప్రదర్శనలిచ్చుటచే "సూత్రధారుని" మెళుకువలుగూడా అవగాహనచేసుకొనియుండిరి. షోడశ వత్సరముల ప్రాయములోనే నాట్యమందు, నాటకమందుకూడా అసమాన పాండిత్యము పొందియుండిరి. వెంకట్రామయ్యగారు 1875 నుండి 1936 వరకు నాట్యమండలిని నిర్వహించి, కూచిపూడి నాట్య నాటకసరులకు కీర్తిప్రతిష్టలు తీర్చి ఇనుమడింపచేయుటయేగాక, అత్యంత సమర్థులైన శిష్యులనుకూడా తయారుచేసిరి. వారిలో వేదాంతం రాఘవయ్య, పసుమర్తి కృష్ణమూర్తి, వెంపటి సత్యం, చింతా కృష్ణమూర్తి, రామమూర్తి, వేదాంతం చిదంబరంగార్లు, అనేకులు వీరి శిష్యరికంలో పేరుప్రఖ్యాతులు గాంచిరి. వీరు 1949 జనవరి 6 వ తేదీన దివంగతులైరి.

# శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులు గారు

అన్నమాచార్యులు మహాభక్తులని వారి రచనలు తెల్పుచున్నవి. ఆంధ్రదేశమున కడప మండలమునగల తాళ్ళపాకయను గ్రామము వీరి జన్మస్థానము.

క్రీ॥శ॥ 1424 నకు సరియగు క్రోధిసంవత్సర. వైశాఖమాసము వీరి జననకాలము. వీరితండ్రి నారాయణుడు, తల్లి లక్కమాంబ. అన్నమాచా

ర్యులవారికి భక్తిజ్ఞాన వైరాగ్యములు జన్మతోనే కలిగినవి. వీరికి గురువు నిమిత్తమాత్రము. గురువుగారు చెప్పిన పాఠము ఏకసంతగ్రాహియై అభ్యసించుచుండెను. పిన్నవయస్సులోనే సర్వవిద్యాపారంగతుడయ్యెను. వీరికి ఘనవిష్ణువను నామముగల ఒక మహనీయుని గురుత్వముకూడా లభించింది.

అన్నమాచార్యులవారికి బాల్యమునందే భక్తాగ్రగణ్యుడను ప్రతీతి వ్యాపించినది, వీరు పదునారేండ్ల వయస్సునందే తిరుమలకుచేరి ఇష్టదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని ఆరాధించుచు ప్రతినిత్యము భక్తిపారవశ్యముచే భజన చేయుచుండెను.

అన్నమాచార్యులకు పాండిత్యముతోబాటు, బాల్యమునందే కవిత్వము కూడా సహజముగనే వచ్చెను. వీరు గోవిందరాజస్వామిని, శ్రీ వరాహస్వామిని, శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించి సహజధోరణితో భక్తిపారవశ్యంబున నానువుగా ననేక కీర్తనలను కల్పించి గానము చేయుచుండెను. ఈ తీరున వారు రచించిన పాటలు, కీర్తనలు ముప్పది రెండువేలుయని (32 000) తెలియుచున్నది.

అన్నమయ్య జాడతెలియక తల్లిదండ్రులు వారిని వెతుకుచు, ఎచ్చటను కనిపించనందున విసుగుజెంది, కొంతకాలమునకు తిరుమలచేరి అచ్చట కుమారునిగాంచ ఆనందభరితులైరి. తల్లితండ్రులు కోరుటవల్లను, తన గురువుగారైన ఘనవిష్ణువుగారి ఆజ్ఞతోను, అన్నమాచార్యులు స్వగ్రామము చేరి శ్రీ వేంకటేశ్వరస్వామిని సేవించి ధన్యతనొందెనని ప్రాజ్ఞులు తెలుపుచున్నారు.

## మునిపల్లె సుబ్రహ్మణ్యకవి 1730-1780

వాగ్గేయకారుడు, పండితుడు, సాహిత్యకళాచార్యులుయైన సుబ్రహ్మణ్యకవి "కాళహస్తిపాలెం" 1780 ప్రాంతమున పరిపాలించిన కృష్ణభూపాలుడు, కృష్ణస్వామి అను రాజులవద్ద పోషితుడైయున్నట్లు చరిత్ర

కారులవల్ల తెలియుచున్నది. దీనినిబట్టి చూడగ సుబ్రహ్మణ్యకవి 1730లో జన్మించియుండవచ్చునని తలచవచ్చును.

సంస్కృతాంధ్రభాషలలోను, సంగీత నాట్యాలంకార శాస్త్రములలోను వేదాంత శాస్త్రములలోను వీరికి అపారమైన పాండిత్యమున్నట్లుగా తెలియుచున్నది. వీరి అధ్యాత్మ రామాయణ కీర్తనలు, సొగసైన తెలుగు భాషలో రచించెను. ఈ కీర్తనలకు ఒక ప్రత్యేకశైలి కలదు. ఈ కీర్తనలు మొత్తం 108 కలవు.

సుబ్రహ్మణ్యకవిగారు అధ్యాత్మ రామాయణ రచనయేగాక, దామెర్ల భూపాలునిపై, దామెర్ల కుమార వేంకటేంద్రుని, అతని కుమారుడైన కృష్ణస్వామిని, కాళహస్తీశ్వరుని, అగస్త్యనాధుని నాయకులుగా చేసుకొని కొన్నిపదాలు వ్రాసినట్లుకూడా తెలియుచున్నది.

## క్షేత్రయ్య (మువ్వగోపాల)

క్షేత్రయ్య 17వ శతాబ్దములోనివాడు. ఇతడు క్రీ॥శ॥ 1633-73 ప్రాంతమున నుండినట్లు తెలియుచున్నది.

కృష్ణామండలమున కూచిపూడికి సమీపమున మొవ్వయను గ్రామమున పుట్టినట్లు తేటతెల్లమైన విషయము. వారు అచ్చటగల గోపాలస్వామి ముద్రతో అనేక పదములు రచించెను, క్షేత్రయ్య సంస్కృతాంధ్రములయందును అసమానమైన పండితుడు క్షేత్రయ్య. సహజకవి, వాగ్గేయకారుడు. ఇతనికి మొవ్వ వరదయ్యయని అసలుపేరు. పండితుడై, దక్షిణ భారతమున వివిధ క్షేత్రములను దర్శించుచు, తంజావూరి రాజగు రఘునాధరాయల ఆస్థానమునకు పోయెను.

పిమ్మట అనేక క్షేత్రములకు వెళ్ళి ఆయా దైవములగు ఆదిరాహవమూర్తి, చెవ్వంది లింగడు. తిల్లగోవిందుడు, కంచి వరదుడు, కడప వేంకటేశ్వరుడు. యదుగిరిస్వామి, శ్రీ వేంకటరమణుడు, హేమాద్రిస్వామి,

వేదనారాయణుడు, ఇనపురిధాముడు. పాలగిరి చెన్నుడు, తిరువళ్ళూరి రామవుడు, శ్రీరంగేశుడు, మధురాపురీశుడు మున్నగు దేవతలపై అనే పదములను చెప్పెను.

క్షేత్రయ్య మధుర తిరుమలేంద్రుని వద్దను రెండువేలు (2,000), తంజావూరి అచ్చుత విజయరాఘవేంద్రునివద్ద వేయిపదములను (1,000), గోల్కొండ పాదుషావద్ద పదకొండు నూర్లను (1,100), మొత్తం నాలుగు వేల వంద 4,100) పదములు చెప్పెనని తెలియుచున్నది. వీటిలో నేడు మూడువందలు (300) మాత్రమే లభించుచున్నవి.

నాయికా భేదములు, వారిగుణములు, చేష్టలు మొదలైన లక్షణములకు, లక్ష్యములుగా క్షేత్రయ్య పదములను రచించెను. వీరి పదములు నాట్యానుకూలములు. ఆంధ్రమున నాట్యమునకు లక్ష్యగ్రంధములను, సలక్షణముగా చెప్పినవారిలో క్షేత్రయ్య ప్రధముడనవచ్చును. వీరి పదములందలి భాష, భావము, అలంకారము, రసము మొదలగునవన్నియును సలక్షములు- అందువల్ల ఇవి పండిత పామరులకు రంజికములుగా నున్నవి.

## సిద్దాబత్తుల వీరరాఘవయ్యగారు

శ్రీ సిద్ధాబత్తుల వీరరాఘవయ్యగారు. పెదపులిపర్రు యను గ్రామమున (గుంటూరు మండలము) జన్మించెను. జననకాలము 1855సం॥రము. వీరు ప్రసిద్ధ నృత్యవిద్యావిశారదులు. భరతోపదేశికులు. వీరు "భరతసారం" ఆంధ్ర వ్యాఖ్యాతయగు కి॥శే॥ లంకా సూర్యనారాయణగారి గురువులైనట్లు తెలియుచున్నది. వీరు 1942 సం॥ ముందున్నట్లు తోచుచున్నది. రంగాదాసుగారు వీరు ఏకగర్భజనితులని తెలియుచున్నధి. వీరుభయులు కూచిపూడి నృత్యకోవిదులకు రెండు అపూర్వకానుక లిచ్చినట్లు, వారు రచించి కూచిపూడివారికి అందించినట్లు తెలియుచున్నవి. వీరి రచనలు (మొదటిది) జతిస్వరం, అఠాణరాగం, ఆదితాళం. (తారిఝెంతరి), (రెండవది) దశావతారములు. మోహనరాగం-త్రిపుటతాళంలో వీరి రచనలుగా తెలియును.

# యోగి నారాయణతీర్థులు 1580-1689

శ్రీకృష్ణ లీలాతరంగిణి, కృష్ణభక్తి రసప్రధానమైన గ్రంథము. దీనిని రచించిన కవి, యోగి నారాయణతీర్థులు, వీరు ఆంధ్రులు. వీరి పూర్వాశ్రమనామము గోవిందశాస్త్రి. వీరిది తల్లావఝ్ఝల వంశము. తండ్రి నీలకంఠశాస్త్రి, అన్నగారు నరసింహాశాస్త్రి, తనతండ్రి నీలకంఠశాశాస్త్రివద్ద సంగీత సాహిత్యములయందు ప్రావీణ్యత సంపాదించి. కంచియందు శివ రామానందుల శిష్యులై సన్యాసాశ్రమము స్వీకరించిరి. నారాయణానందతీర్థు లనే నామము వహించిరి. కాని వీరి గ్రంథములో తరచు నారాయణతీర్థులనే వ్యవహరించుకొనియున్నారు. తరువాత కాశీలో గంగాతీరమున నివసించుచు బహుళముగా బ్రహ్మవిద్యా ప్రచారము గావించిరి. అచ్చట వీరికి అనేక మండలములవారు శిష్యులైరి. అచ్చటనున్నప్పుడు శాండీల్య భక్తిసూత్ర ముల వ్యాఖ్యయు, పూర్వమీమాంస శాస్త్రముపై ఒకగ్రంథము రచించినట్లు తెలియుచున్నది. వీరు కృష్ణలీలా తరంగిణిని ఎచ్చట ప్రారంభించి, ఎచ్చట ముగించిరో తెలియరాదు. "తరంగిణి'' సంస్కృతమున సంగీత రూప కావ్యము; దీనిని గానంచేసి ఆనందించని భారతీయులుండరు. ఇందలి కవితా ధోరణియు. పదలాలిత్యమును, దరువులు, శ్లోకములు, గద్యలు, కీర్తనలు, ఒక యక్షగాన సరళిలో బోలియున్నవి. ఇవిగాక తీర్థులవారు అనేక రచనలు చేసియున్నారు. తెలుగులో పారిజాతాపహరణ యక్షగానము, శాండీల్యభక్తి సూత్రవ్యాఖ్య, భక్త్యధికరణమాల. సాంఖ్యకారికావ్యాఖ్య, సాంఖ్యతత్వ కౌముదివ్యాఖ్య, న్యాయముక్తావళీలిటీక, భాట్టభాషా ప్రకాశము, యోగ సూత్రవ్యాఖ్య, సిద్ధాంతబిందు లఘుచంద్రిక. వేదస్తవటీక, వేదాంతవిభావ నాటీక (పై గ్రంథములలో కొన్ని గ్రంథములు భక్తి సిద్ధాంత. సాంఖ్య సిద్ధాంత, తర్కశాస్త్ర సంబంధములు.)

వీటిలో కొన్ని ముద్రితాలు, కొన్ని అముద్రితాలు. అచ్చుకానివి కాశీవిశ్వవిద్యాలయ గ్రంథాలయములో వున్నవని తెలియున్నది.

ఇవిగాక తీర్థులవారు, హరిభక్తి సుధార్ణవంసురేశ్వరాచార్య విరచిత మైన పంచీకరణవార్త్తికం వివరణ దీపికను సంస్కృతములో రచించినట్లు కూడా తెలియుచున్నది.

వీరు శోభనాద్రి, వేదాద్రి, శ్రీకాకుళం, పూరి, జగన్నాధం మొద లైన క్షేత్రాలను దర్శించి, ఆయా దేవతలపై కొన్ని కీర్తనలను సంస్కృతములో రచించి, కూచిపూడివచ్చి అచ్చటి గానపరులకు, భజనపరులను, గాన, నృత్యములలో శిక్షణ ఇచ్చినారు. తరంగములకు యక్షగానముగ అప్పుడే రూపము కలిగియుండవచ్చును. ఆ తరువాత పరిణామశూల కలిగి తిరుపతి వెళ్ళి వేంకటేశుని దర్శించుకొని, స్వామివారి అనతితో దక్షిణాది కెళ్ళి "వరహూరు"లో ఆలయప్రతిష్ట చేశారు. "జయజయ వరాహపుర శ్రీ వేంకటేశ'' యని ఈయన చెప్పిన కీర్తన ఆదివరాహ క్షేత్రములో (తిరుమల) వెలసిన వేంకటేశునిపై చెప్పినదని ఆంధ్ర, భారతీయులు, వరాహూరులో తీర్థుడు నెలకొల్పిన వేంకటేశుడేయని దాక్షిణాత్యులు అంటారు. కాని, తీర్థలవారి గురువులైన శివరామతీర్థులు "గురుచంద్రిక" అనే సంస్కృతగ్రంధము వ్రాసినారని తెలియుచున్నది. వారికాలం విక్రమ శకం. 1718-30 అనగా క్రీ॥శ॥ 1675 ప్రాంతము. దీనినిబట్టి చూడగా తీర్థులవారు అధమం క్రీ॥శ॥ 1700 వరకు జీవించినట్లు తెలియును. మొత్తా నికి ఆయన సుమారు 1580 ప్రాంతాన జన్మించి, 1614 లోపుగానే జీవించి యున్నట్లు తెల్పుదురు.

శుక్లపక్షం, అష్టమీ, కృత్తికానక్షత్రయుక్త గురువారంనాడు తిరు ప్పందుర్తి గ్రామములో సిద్ధిపొందినట్లున్ను. ఆ గ్రామములో ఆయనప్రతి దినం కూర్చునే మామిడిచెట్టు, ఆయన జీవసమాధికి ఉత్తరదిక్కున ఉన్న దని వరాహూరు వేంకటేశ్వరాలయములో తీర్థులవారి చిత్తరువు నేటికిని ఉన్నట్లు వారు అచ్చట ప్రారంభించిన "శిక్యోత్సవము" (ఉట్లపండుగ) ఇప్పటికిని భాద్రపద మాసంలో జరుపుకొనుచుందురని చరిత్రకారులవల్ల తెలియుచున్నది.

# తాడేపల్లి పేరయ్యగారు

శ్రీ పేరయ్యగారు విరోధినామ సంవత్సరములో 1890లో జన్మమందిరి. చిన్ననాటినుండియు కూచిపూడివిద్య నభ్యసించి, యవ్వనప్రాయములో చంద్రమతి, సీత, ఉష, భామ, గొల్లవేషములను కడుసమర్ధవంతముగ అభినయించి రసజ్ఞుల మన్ననలను పొందుచు, సువర్ణఘంటాకంకణములను కూడా బొందియున్నారు.

వీరు హరికథాగానముకూడా చక్కగా చేయుదురని ప్రతీతి. ముఖ్యముగా వీరు నంగిగడ్డ, ఘంటసాల మొదలైన గ్రామములలో దేవదాసీలకు (కళావంతులు), విద్య (గరిడీలు) ఉచితముగా నేర్పి తమయొక్క ఔదార్యమును చాటి, ముందుతరమువారికి మార్గదర్శకులైనారు. వీరి శిష్యులు వెంపటి చినసత్యం, భాగవతుల రామతారకం, జోశ్యుల సీతారామయ్య మొదలైనవారు ఎందరో గలరు.

# జయదేవ కవి 1116-1160

సేనవంశపు రాజులలో లక్ష్మణసేనుడనేరాజు గౌడదేశమును పాలించెను. ఇతడు కావ్యగీతి ప్రియుడు, కవి, పండిత, గాయకపోషకుడు. స్వయముగా సంగీత. సాహిత్య, పాండిత్యము, ప్రబంధరచనా దక్షతగలవాడు. అట్టి లక్ష్మణసేన మహారాజు ఆస్థానములో శ్రీ జయదేవకవి ఉండేవారు.

శ్రీ భోజదేవ ప్రభవస్య. రామదేవీసుత,<br>
శ్రీ జయదేవకస్య,<br>
పరాశరాది ప్రియవర్గ కంఠే శ్రీ గీతగోవింద<br>
కవిత్వమస్తు.

దీనినిబట్టి జయదేవుని తండ్రి భోజదేవులు, తల్లి రామాదేవి, పరాశరాదులు ప్రాణస్నేహితులని తెలియుచున్నది. గీతగోవిందమును గానం చేస్తూ వుండేవారు.

"బిందు బిల్వసముద్ర సంభవ రోహిణి రమణేన" దీనినిబట్టి బిందు బిల్వము వీరి జన్మస్థానమని తెలియుచున్నది. ఇది కొన్నిచోట్ల "కెందు బిల్వ"మని, "తిందుబిల్వ"మని, కేందుబిల్వమని చెప్పబడియున్నది. "భక్తి మాల" యనే చంద్రదత్తుని గ్రంధములో బిందుబిల్వమనేయున్నది. బిందు బిల్వము ఒరిస్సా రాజ్యములో జగన్నాధ క్షేత్రానికి దగ్గరగాయున్నది. వంగదేశములో బీర్భూంజిల్లాలో "కేందులి" అనే గ్రామమే, ఈ "కేందు బిల్వము" లేక కిందుబిల్వమని వంగదేశీయులంటున్నారు. అచ్చట యేటేటా జయదేవుని జన్మదినోత్సవాలు జరిపి గీతగోవిందం గానం చేస్తుంటారని వినికిడి. ఒరిస్సా రాజ్యములోని కిందుబిల్వమునకు జెందిన కోటీరకృష్ణ పండాజీ అనే ఆయనవద్దనున్న ఒక తాళపత్ర గ్రంధములో ఓఢ్రభాషలో ఇట్లున్నదందురు.

"శ్రీముఖ నామసంవత్సర, మార్గశిరకృష్ణ ఏకాదశినాడు జయదేవ కవి కైవల్యంపొందెనని వ్రాసియున్నట్లు చరిత్రకారులు తెల్పుచుండిరి. అ తేదీ క్రీస్తుశకం 1153, డిశంబరు 28 కి సరిగా సరిపోతుంది. దీనినిబట్టి అంతకుముందు 60-70 ఏండ్లకు ముందుగా జయదేవులు జన్మించియుందు రని తలచవచ్చు. దాదాపు 1090 ప్రాంతమనవచ్చు. జన్మతః ఆంధ్రుడై, తమిళదేశంలో పుట్టిపెరిగి, వాగ్గేయకారుడైన త్యాగయ్యగారివలెనే జయదే వులుకూడా ఓఢ్రుడై వంగదేశములో జీవించి, అచ్చట రాజపోషణము పొంది, ప్రసిద్ధుడై యుంటాడు. గీర్వాణభాషలో "గీతగోవిందం" రసప్రధాన మైన గ్రంధము.

ఈ గ్రంధమునందు సాహిత్యము ప్రధానాంగముగాను, సంగీతము ఉపాంగముగాను వున్నది. ఈ రచన నాట్యప్రదర్శనకు అనుకూలముగా నవరసాలంకారముగ అభినయించుటకు ఎంతో సుందరమైన రచన, ఈయన రాధాకృష్ణుల విషయమును, శృంగాభి లీలావర్ణనమును ఎంతో అందముగా ద్వాదశ సర్గాత్మకముగా "గీతగోవింద" మనే పేరున వెలసియున్నది.

ఓం
శ్రీ పరదేవతాయై నమః

ఇతి, శ్రీ మన్మహా మహేశ్వర కూచిపూడి
బాలాత్రిపుర సుందరీ సహిత శ్రీరామలింగే
శ్వర, అనవరత దివ్యపద పద్మారాధక శ్రీ కూచి
పూడి నృత్యకళావతంస, గార్గేయనగోత్ర
ఆపస్తంభసూత్ర హేమాద్రి వంశపయః
పారావారరాకా సుధాకర యశోద
వేంకటేశ్వర యజ్వ తృతీయపుత్ర
వేదాంతం లక్ష్మీనరసింహ
శాస్త్రి అనుంగు శిష్యుం
డు. శ్రీ పరదేవి కరుణా
కటాక్షుండు, దేవీ
పూజా దురంధ
రుండును,
పండిత,

నాట్యాచార్య, నాట్యశాస్త్ర ధురీణ, నాట్యకళా పితామహ,
నాట్యకళా విశారద, నాట్యరత్న. చిదంబర ధీ
క్షితులుచే సర్వజన రంజకముగ రచింపం
బడిన కూచిపూడి కళాసాగరము
అను మహత్తర సమగ్ర నాట్యగ్రంధము
సర్వము సంపూర్ణము.

—*—

ఓం

## —* సవరణ పట్టిక *—



| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 12 | 4 | ది) | (ది) |
| 18 | 12 | — | తఝెంతక |
| 22 | 7 | శన్ | శ్మ |
| 26 | 3 | లిదియతే | ఖిదియ్యతే |
| 26 | 6 | పుట్టిషది | పుట్టినది |
| 26 | 11 | తత్తవేత్త | తత్త్వవేత్త |
| 29 | 2 | తూత | ఘాత |
| 34 | 7 | దితాతితే | గీతాతీతే |
| 36 | 18 | మంనిగా | మంచిగా |
| 37 | 6 | సర్వేళ్వర | సర్వేశ్వర |
| 37 | 13 | ళివ | శివ |
| 38 | 2 | జాత | విజ్ఞాన |
| 40 | 2 | ధిమిక | ధిమిత |
| 40 | 2 | ధీకదా | దీందా |
| 46 | 8 | గిణాత | గిజ్ఞాత |
| 46 | 12 | తకదిక | తకధిం |
| 46 | 8 | తత్తోంతోంతోం | తత్తోం |
| 47 | 6 | 0— | 0—1 |
| 47 | 13 | 1— —0 | 1—0—0 |
| 48 | 3 | తత్తదిదిగి | తత్తదిగదిగి |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 48 | 11 | (తాతాఝెం) (అవసరంలేదు) | అవసరంలేదు. |
| 49 | 18 | — | ధిమిధిమితధిమిత |
| 56 | 3 | ధాతురన్య | ధాతురస్య |
| 64 | 10 | ప్రపారయే | ప్రసారయే |
| 76 | 13 | విభ్యాత | విఖ్యాతి |
| 87 | 20 | హష్త్రోచ | హస్త్రోచ |
| 88 | 13 | సోలవద్మౌ | సోలపద్మౌ |
| 89 | 2 | గ్రాక్ష | ద్రాక్ష |
| 90 | 11 | శ్మశ్రుభావనే | శ్మశ్రుబావనే |
| 90 | 15 | విశ్చలా | నిశ్చలా |
| 90 | 20 | కరౌభులే | కరౌఫాలే |
| 91 | 9 | షదప్యా | మదస్యా |
| 91 | 21 | కటస్థా | కటస్థౌ |
| 92 | 8 | త్పతాకకా | త్పతాకకౌ |
| 92 | 16 | అమాత | సీమాత |
| 94 | 11 | ఉరశ్శి | ఉరస్సి |
| 95 | 6 | భరతాదగై | భరతార్ధగై |
| 96 | 16 | స్యాత్యాం | స్యాత్పాం |
| 102 | 17 | పుణా | పుణ్యా |
| 110 | 6 | బాతుర్వర్ణ | చాతుర్వర్ణ |
| 112 | 12 | ప్రయుక్తవో | ప్రయుక్తవ్యో |
| 113 | 4 | పకాక | పతాక |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 114 | 2 | చేదహో | చేదధో |
| 114 | 3 | కర॥ | కరః |
| 114 | 4 | మొగము | మొగలో |
| 114 | 12 | సమారవ్య | సమారభ్య |
| 115 | 17 | శ్చవిత | శ్చలిత |
| 119 | 4 | చారీషే | చారీయే |
| 119 | 4 | నజానే | వటనే |
| 119 | 4 | ప్రలాపిది | ప్రలాపకే |
| 119 | 19 | పషవఞ్చత | పక్షవంజ్చత |
| 122 | 27 | ముద్రాభ్యే | ముద్రాఖ్యే |
| 124 | 15 | కకకా | కటకా |
| 148 | 4 | శిరమ్స | శిరస్సు |
| 148 | 20 | యందుది | యందిది |
| 149 | 19 | వర్తించుచు | వర్తించును |
| 150 | 3 | కారణు | కారణా |
| 151 | 10 | శరల్యేచ | శరవ్యేచ |
| 152 | 1 | కఘ్నలు | కన్నులు |
| 157 | 3 | ప్రయుక్త | ప్రయుక్త |
| 157 | 19 | —— | ను |
| 160 | 2 | సర్యతో | సర్వతో |
| 161 | 2 | స్తథు | స్తథా |
| 161 | 12 | గ్రికంసిత | ప్రకంపిత |
| 161 | 20 | వైకెత్త | పైకెత్త |
| 163 | 6 | మందోత్కం | మదోత్కం |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 166 | 15 | తర్మలు | కర్మలు |
| 168 | 16 | చేకులు | చేతులు |
| 168 | 19 | కపోతా | కపోతా |
| 168 | 22 | గుత్వా | గుత్వా |
| 169 | 11 | ఉత్క్షేచ్రభూ | ఉత్క్షేప్రభూ |
| 171 | 12 | సహావ | సహాజ |
| 173 | 3 | వావి | వాని |
| 176 | 22 | దేనతలు | దేవతలు |
| 177 | 13 | దీర్ఘ | దీర్ఘ |
| 178 | 9 | కదిర్వా | కవిర్వా |
| 178 | 11 | నరనే | వర్తనే |
| 179 | 13 | ధాతణ | దారణ |
| 180 | 16 | ష్తుతి | స్తుతి |
| 180 | 20 | స్మృతి | శృతిః |
| 181 | 7 | ధపల | చపల |
| 183 | 14 | కడము | కరము |
| 183 | 19 | హన్త | హస్త |
| 183 | 23 | కళ్ళ | కళ్ళ |
| 185 | 8 | కృత్యం | కృతం |
| 185 | 20 | మినషా | మినహా |
| 186 | 11 | భేద | ఖేద |
| 187 | 4 | యింది | యించి |
| 187 | 23 | షాజాఃస్త | హస్తజాః |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 190 | 13 | బాగులు | బాహాలు |
| 196 | 15 | లతాత్రాయ | లతాప్రాయ |
| 197 | 5 | ప్రకృరుల | ప్రకృతుల |
| 197 | 7 | చబాచర | చరాచర |
| 199 | 11 | ధక్కగా | చక్కగా |
| 199 | 12 | ఛేదింనుట | ఛేదించుట |
| 199 | 16 | నిరంల | చేరంగ |
| 200 | 3 | శోక | లోక |
| 209 | 1 | లవణ | లక్షణ |
| 209 | 6 | నాలుక | నాయిక |
| 209 | 9 | పితృ | పిత్రు |
| 209 | 15 | వరోధ | షరోడ |
| 209 | 16 | సండమ | సంగమ |
| 209 | 19 | గలదిచా | గలదిగా |
| 209 | 20 | చర | షర |
| 210 | 2 | గణితా | గణికా |
| 210 | 3 | లోరే | లోకే |
| 210 | 5 | జ్ఞాక్ | జ్ఞాన్ |
| 210 | 8 | పాగల్భ్య | ప్రాగల్భ్య |
| 210 | 15 | లభణ | లక్షణ |
| 211 | 12 | నోపించు | కోపించు |
| 211 | 14 | నోపము | కోపము |
| 211 | 15 | లడును | బడును |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 212 | 22 | వ్యాంనా | వాగంగా |
| 213 | 16 | రత్యుత్యా | రత్యుత్వా |
| 215 | 19 | స్పమీరితాః, | స్పమీరితాః |
| 215 | 22 | వాముర్త్తై | వాసుర్త్తై |
| 216 | 14 | పరార్ధానాం, | పరార్ధానాం |
| 216 | 20 | చేమ | చేసు |
| 216 | 20 | సల్వాంగ | సర్వాంగ |
| 216 | 23 | భచే | భవే |
| 216 | 23 | క్రోదః | క్రోధః |
| 217 | 1 | మతాః | మతాః |
| 217 | 9 | వారంగ | వాగంగ |
| 217 | 9 | చారికాః | చారిణః |
| 218 | 20 | రధ్ర | రత్ర |
| 220 | 2 | శౌ.ాగ్య | శౌభాగ్య |
| 222 | 5 | నిత్రా | నిద్రా |
| 223 | 2 | అవస్మృతి | ఆపద్భృతి |
| 223 | 4 | నిచ్ఛేష్ట | నిశ్చేష్ణ |
| 223 | 5 | ఆవత్తు | ఆపత్తు |
| 223 | 22 | విషేసా | విషేపా |
| 223 | 24 | జ్ఞాపము | జ్ఞావము |
| 224 | 16 | పరితంబా | పరిరంబా |
| 225 | 5 | ప్రవసాదము | ప్రసాదము |
| 225 | 10 | చేత్తన్య | చిత్తస్య |

| పేజి | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 225 | 18 | యోఽశ్శృతేః | యోఽశ్శ్వృతేః |
| 227 | 8 | యపబడుసు | యవబడును |
| 228 | 6 | ఉరవతి | ఉపరతి |
| 228 | 11 | ఘోక్షణం | మోక్షణం |
| 229 | 7 | కథాభ్రంగా | కథాభంగా |
| 229 | 16 | భర్తృనా | భర్త్వనా |
| 229 | 19 | ఎర్రనేటి | ఎర్రనౌట |
| 230 | 16 | ఉన్మృధ | ఉన్మాద |
| 231 | 7 | సంకోవ | సంకోచ |
| 232 | 4 | వేపసై | లేపసై |
| 233 | 13 | సజ్గిచా | సజ్జకా |
| 233 | 16 | గమప | గమవ |
| 233 | 20 | మూకతిను | దూతికను |
| 234 | 2 | ఆరతిర్వా | ఆరతిర్భా |
| 234 | 4 | నోర్వ్యభ | నోర్వ్యక |
| 234 | 5 | సంతాతము | సంతాపము |
| 234 | 6 | లింమ | లందు |
| 234 | 9 | క్వచిత్సతకేత | క్వచిత్సంకేత |
| 235 | 9 | సాద్వనే | సాద్వపే |
| 235 | 19 | వస్ఖానం | వస్థావం |
| 236 | 6 | యాభిసార | యాభిసార |
| 236 | 8 | అస్యాన్సంతా | ఆస్యాస్సంతా |
| | 8—8 | చితతు | చితమ్ |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 239 | 4 | ఇతిన్మృతాః | ఇతిస్మృతాః |
| 239 | 11 | నిదూష | విదూష |
| 239 | 14 | యుండుశాడు | యుండువాడు |
| 239 | 18 | భానక్తుడు | దాసక్తుడు |
| 239 | 18 | గనబడును | ఉపబడును |
| 239 | 21 | చేష్టీయా | చేష్టాయా |
| 240 | 8 | పిచారము | విచారము |
| 240 | 17 | ప్రియావరాధ | ప్రియావరాధ |
| 240 | 18 | లఘేః | లఘుః |
| 240 | 21 | కుయుహలాద్వవ | కుతూహలాద్యవ |
| 242 | 15 | కోపనేష్ట | కోపచేష్ట |
| 243 | 9 | ప్రళయ | ప్రళయ |
| 243 | 19 | సంకోషము | సంతోషము |
| 243 | 20 | న్కిృషియాం | నిష్కృియాం |
| 244 | 10 | సంతోషము | సంతోషము |
| 244 | 14 | తత్రస్య | తత్రస్య |
| 244 | 15 | డగ్నుత్తిక | డగ్గుత్తిక |
| 244 | 18 | నంత్రాన | సంత్రాస |
| 244 | 20 | వావిచే | వానిచే |
| 244 | 21 | గలుగుఘ | గలుగును. |
| 245 | 16 | ప్రవదా | ప్రపదా |
| 245 | 18 | దర్మితం | దర్శితం |
| 247 | 16 | స్వతోద్య | సర్వాతోద్య |
| 250 | 19 | తాళము | తాళము |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 251 | 10 | చాన్యితమ్ | చాన్వితమ్, |
| 251 | 23 | లలిణం | లక్షణం |
| 252 | 19 | భతింతియత్ | భవంతియత్ |
| 252 | 20 | కాస్తాం | క్తాసాం |
| 253 | 15 | తౌద్ధేన | గతౌయుద్ధే |
| 254 | 17 | స్తథాశ్వాయాః | స్తథాహ్వాయాః |
| 256 | 14 | పిడి | విడి |
| 256 | 14 | అని | అది |
| 257 | 15 | తొడలషు | తొడలను |
| 257 | 18 | స్ఖలత్పాడమని | స్ఖలత్పాదమని |
| 258 | 23 | దముముడిచి | పాదము ముడిచి |
| 259 | 10 | కాని | కాలి |
| 260 | 7 | మూరు | మూరు |
| 260 | 17 | త్రిప్పినగో | త్రిప్పినచో |
| 260 | 21 | తిదల | కదల |
| 261 | 1 | ఉచ్వృత | ఉద్వృత |
| 261 | 9 | గముగే | గముచే |
| 261 | 17 | వామివిద్ధ | వామవిద్ధ |
| 261 | 21 | వారులడు | చారులను |
| 261 | 21 | వారుపాదము | వామపాదము |
| 262 | 1 | భ్రమరీ, | భ్రమరీ |
| 262 | 3 | యే | ఈ |
| 262 | 8 | పాషము | పాదము |
| 262 | 15 | ప్రయోగింగ | ప్రయోగించ |

| పేజీ | పం౹ | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 263 | 10 | వామషాదము | వామపాదము |
| 263 | 13 | దక్షధ | దక్షణ |
| 263 | 15 | దక్షధు | దక్షణ |
| 263 | 23 | రక్షణ | దక్షణ |
| 264 | 11 | నామ | వామ |
| 264 | 16 | వామషాదము | వామపాదము |
| 265 | 12 | ఆస్పందితచాది | ఆస్పందితచారి |
| 267 | 8 | ప్రయోరించి | ప్రయోగించి |
| 268 | 28 | గడుడ | గరుడ |
| 270 | 17 | కటిగ్రదేశము | కటిప్రదేశము |
| 272 | 11 | విన్యానము | విన్యాసము |
| 275 | 4 | న్వస్తికము | స్వస్తికము |
| 278 | 7 | హ ప్తములు | హస్తముల |
| 280 | 13 | వినా-సము | విన్యాసము |
| 280 | 21 | దండసాదము | దండపాదము |
| 284 | 13 | క్రీడా | వ్రీడా |
| 284 | 18 | రసవ్య | రసస్య |
| 284 | 21 | విషారము | విషాదము |
| 285 | 1 | వ్రాసము | త్రాసము |
| 255 | 10 | నంశయము | సంశయము |
| 285 | 16 | స్మతి | స్మృతి |
| 334 | 6 | స్యప్న | స్వప్న |
| 335 | 11 | రుప్పల | రేప్పల |
| 336 | 21 | పరన్పర | పరస్పర |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 336 | 24 | సముబ్భవ | సముద్భవ |
| 345 | 13 | ఉద్యానవలము | ఉద్యానవనము |
| 345 | 24 | శృతజ్ఞత | కృతజ్ఞత |
| 346 | 11 | భరీరము | శరీరము |
| 346 | 18 | రకుల | రతుల |
| 348 | 21 | మగురు | మగును |
| 351 | 3 | శేగమైన | ఆగమైన |
| 351 | 7 | మనక | పానక |
| 351 | 11 | కుయ | కుంభయన |
| 351 | 18 | కాఫౌ | కావౌ |
| 351 | 22 | కాంచికం | వాచికం |
| 352 | 1 | ర్విష్న్ః | ర్విష్ణుః |
| 352 | 13 | దీక్షితకృపం | దీక్షితకృతం |
| 354 | 2 | టగదేక | జగదేక |
| 363 | 3 | స్వహృద | స్వహృదయ |
| 364 | 14 | తుందితుర్తి | తుంగతుర్తి |
| 364 | 15 | పద్జనగ | వద్దనగ |
| 365 | 10 | తురుణిలే | తురుణివీ |
| 365 | 21 | రాంజాసనసుడునుడు | వారిజాసనుడు. |
| 366 | 4 | — | యనుచు |
| 366 | 6 | వారిజాసనుడు, | వారిజాసనసుతుడు |
| 366 | 15 | యనును | యనుచు |
| 369 | 21 | ప్రమోంల | ప్రమోతల |
| 370 | 14 | శృతినాగు ప్తసార | శృతిసోనాదుపై |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
| --- | --- | --- | --- |
| 374 | 13 | సుందేర | చుందేర |
| 374 | 16 | కనికరించెర | కనికరించర |
| 375 | 4 | పరవశింనగ | పరవశింపగ |
| 375 | 14 | సురతి | సురతి |
| 375 | 22 | పంతసించితి | సంతసించితి |
| 378 | 6 | కిట | ఝేకిట |
| 379 | 4 | తది | — |
| 380 | 2 | నరనీరసుదసమ | వరనీరదసమ |
| 381 | 12 | తుళజేంద్రణ | తుళజేంద్రుని |
| 382 | 19 | భాసుర | భాసుర |
| 382 | 22 | కవిటన | కవిజన |
| 384 | 4 | అవుకార | అరురౌర |
| 384 | 25 | నొసగివలెను। | నొసగినవెను।కా |
| 387 | 2 | రామలంగేశ | రామలింగేశ |
| 387 | 7 | — | తక్త |
| 387 | 8 | — | తక్త |
| 388 | 24 | తరికిటతక | — |
| 389 | 24 | లాంటుధి | లాంబుధి |
| 392 | 4 | వచ్చాగు | వచ్చాదు |
| 392 | 26 | వన స్థలము | వక్ష స్థలము |
| 395 | 14 | విష్ణుపు | విష్ణువు |
| 396 | 2 | త | — |
| 396 | 5 | నిలచెదూ .... | నిలచెనూ .... |
| 396 | 10 | శుద్ధ | శుద్ధ |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 396 | 17 | కాతము | కౌతము |
| 396 | 25 | ధక్కిజ | ధక్కిట |
| 398 | 8 | ధితద | ధిమితధిమిత కిటతక కిటతక |
| 398 | 10 | వంళ | వంశ |
| 398 | 22 | ధూపరి | ఘూనరి |
| 399 | 10 | నడతతిశ్ర | నడతఖండ |
| 400 | 9 | చిగంద | జగంద |
| 400 | 13 | బొతడ | బొగడ |
| 400 | 14 | జాజుల్యం | జాజులు |
| 400 | 14 | పెంగటన్ | సంపదల్ |
| 402 | 11 | దేవళంటున | దేవళంబున |
| 402 | 20 | షవి | విని |
| 402 | 21 | నికినిది | మదికిని |
| 402 | 24 | — | ఆ |
| 403 | 2 | తతకీణ | తతకిణ |
| 404 | 4 | సూటగ | మాడుచు |
| 405 | 22 | జొన్చిన | జొచ్చిన |
| 407 | 15 | కిబతక | కిటతక |
| 407 | 18 | శిగ్గడనించెడి | శిగ్గడవించెడి |
| 408 | 7 | వ్రాఘ్ర | వ్యాఘ్ర |
| 408 | 17 | అంఐకళంబ | అంబకళంబ |
| 409 | 11 | మునిజప | మునిజన |
| 411 | 8 | బహూకిరెంచెను | బహూకరించెను |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 411 | 11 | ఏనుగుమ | ఏనుగును |
| 412 | 3 | పొగను | పొగసు |
| 412 | 14 | ఘుస | ముస |
| 413 | 6 | బోకేలంటే | బోటులంటే |
| 413 | 17 | మాహిని | మోహిని |
| 414 | 21 | సవనవో | నవనవో |
| 414 | 11 | సవరససుందర | నవరససుందరి |
| 414 | 14 | లిరుప | నిరుప |
| 415 | 11 | పతమ | పరమ |
| 415 | 18 | తెలునుకో | తెలుసుకో |
| 416 | 18 | చూవగలనే | చూవగలవా |
| 419 | 21 | చింత | సుంత |
| 421 | 17 | వివుదే | విపుదే |
| 421 | 18 | నాడు | నాదు |
| 423 | 4 | శయసుని | శయనుని |
| 423 | 11 | యానము | యాసము |
| 423 | 12 | పునముసకు | పురమువకు |
| 423 | 18 | కదవీరి | కదలీరి |
| 423 | 19 | షు-తా | మంటా |
| 424 | 5 | నాట్వ | నాట్య |
| 425 | 4 | విశ్వేశుని | విశ్వేశుని |
| 427 | 2 | మనమున | మవమున |
| 427 | 17 | మతుని | సుతుని |
| 428 | 5 | మచ్చరితుడు | దుశ్చరితుడు |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 428 | 11 | య్యైచ | య్యైన |
| 431 | 3 | కుభ | శుభ |
| 431 | 5 | స్పతి | స్థితి |
| 431 | 6 | ॥అల॥ | అల |
| 431 | 15 | వత్రపసాది | వరప్రసాది |
| 431 | 22 | నివ్నవానిని | చిన్నవానిని |
| 432 | 2 | గా | — |
| 432 | 5 | ర | — |
| 432 | 8 | ప్రింటులేదు | బుదులగూడి కడు రయమున సభకును |
| 432 | 11 | ప్రమొక్కతి | ప్రమొక్కతి |
| 434 | 4 | నొరగుము | నొనగుము |
| 434 | 5 | పరద | వరద |
| 434 | 17 | ధర్యరాజు | ధర్మరాజు |
| 435 | 20 | పర్బహ్మ | పరబ్రహ్మ |
| 438 | 15 | రౌదవహ్ని | రౌద్రవహ్ని |
| 439 | 15 | నృత్యనాటిక | యక్షగానము |
| 440 | 5 | చిపూడి | కూచిపూడి |
| 440 | 19 | నంగిగత్డ | నంగిగడ్డ |
| 441 | 10 | తలియుగ | కలియుగ |
| 441 | 14 | పశ్లేవి | పల్లవి |
| 441 | 15 | కూవిపూడి | కూచిపూడి |
| 441 | 17 | తూడా | కూడా |
| 441 | 24 | రనవలు | రచనలు |

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 442 | 2 | అడులు | ఆడుచు |
| 442 | 2 | 19-5 | 1935 |
| 442 | 10 | నార్జంచు | నార్జించు |
| 442 | 11 | వస్గము | వర్గము |
| 442 | 20 | సైంరవిహిరం | సైరవిహారం |
| 442 | 22 | చరితార్థులు | చరితార్థులు |
| 443 | 9 | రూవములో | రూపములో |
| 444 | 8 | గొస్లభామ | గొల్లభామ |
| 445 | 4 | లభిచిఁది | లభించినది. |
| 446 | 19 | చక్షిణ | దక్షిణ |
| 446 | 22 | ఆదిరాహవ | ఆదివరాహ |
| 447 | 1 | రామవుడు | రాఘవుడు |
| 447 | 2 | అనే | అనేక |
| 447 | 12 | వ్రధము | ప్రథము |
| 447 | 13 | సలక్షములు | సలక్షణములు. |
| 448 | 10 | గానించిరి | గావించిరి |
| 450 | 2 | 890 | 1890 |
| 452 | 4 | రాఘలింగేశ్వర | రామలింగేశ్వర |
| 452 | 6 | గార్గేయన | గార్గేయస |

